# శంకరగ్రంథరత్నావళి

## శ్రీలలితాత్రిశతీభాష్యమ్

ద్వాదశ సంపుటము



అనువచనము

శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి.



మూల్యము 30/-

శ్రీః

# శాంకర వాఙ్మయ మధుమాలిక

బీజేఽంకురం తరుం తస్మిన్, తస్మిన్ దృష్ట్వా ఫలాదికమ్।
ప్రసాదా చ్ఛంకరగురోః వచ్మి కించిద్ కిమప్యహమ్ ॥

ఏకధా బహుధాచైవ భాసమానం మహేశ్వరం।
శాస్త్రదృష్ట్యా భావయామి పూజయామి యథాతథమ్ ॥

వేదశాస్త్ర పురాణములను బట్టి స్పష్టమైన యీ ప్రపంచమునందు అనేక దేవతలు, గురువులు కన్పట్టుచున్నారు. మూలమునకు పోయినకొలది, 'ఏకో దేవః' యనెడి భావము స్ఫురించును. ఆ దేవుడే గురువు, గురువే దేవుడు.

"శివక్రోధా చ్ఛివస్త్రాతా। గురుక్రోధా చ్ఛివో న చ ॥"

యనుచు పురాణాదులు గురుపారమ్యమును ముక్తకంఠముతో చాటుచున్నవి. దేవీభాగవతము సత్యవ్రతనామము గల వరాహమును గురువని చెప్పుచున్నది. వరాహమునకు తత్త్వజ్ఞాన ముండునా? మంత్రములు గాని, మంత్రబీజాక్షరములు గాని తెలియునా? సత్యవ్రతుడు సారస్వతసిద్ధుడైనాడని దేవీభాగవతమునందు గలదు. దానినిబట్టి శివుడు గురురూపమున వచ్చి చెప్పెననియు, కావుననే కవులందఱు కవిత్వము చెప్పగలుగుచున్నారనియు తెలియును. సాధకునకు

మంచి సమయము వచ్చినపుడు, ఏ గురువు ఉపదేశము చేయుచున్నాడో, ఆ గురువుహృదయమునందు శివుడే యుండి యుపదేశము చేయుచున్నాడని గుర్తింపవలయును. శివు డా యుపాధిలో నుండుటవలన ఆ యుపాధికి గురుత్వము సిద్ధించినది. అట్టి గురువును జన్మాంతరమువఱకు వీడరాదని శాస్త్రములు వాకొనుచున్నవి.

ప్రస్తుతము, కైలాసవాసియైన శంకరుడే సాక్షాత్తు శ్రీశంకరస్వామిగా నవతరించి, భాష్యములు, ప్రకరణగ్రంథములు, స్తోత్రాదులను ముముక్షు జనబోధ కొఱకు వ్రాసి యున్నారు. శ్రీశంకర వాఙ్మయము నంతయు చదివినవారికి వేదశాస్త్ర పురాణములందుగాని, మన మతమునందుగాని సందియము లేవియు నుండవు. ఏ యే స్థలములందు మనకు సందేహము లుత్పన్నము లగునో, అవి యన్నియు శంకర వాఙ్మయమున పరాస్తములై సిద్ధాంతీకరింపబడినవి.

వేదము లన్నియు హార్దాకాశమున నున్నవనియు, హార్దాకాశమే సర్వదేవతానిలయ మనియు, హృదయాకాశము నెఱుగనివాడు వేదాధ్యయన మొనర్చియు నేమిచేయగలడు? (యస్తన్న వేద కిమృచా కరిష్యతి?) అని వేదమాతయే యుద్ఘోషించుచున్నది. అదియే విశ్వరూపము. ఋషులెల్లరు తన్మయీభావముతో నిరంతరము దానినే యనుభవించుచున్నారు. కాని, యది అన్యులకు జూపశక్యము కానిది.

తాదృశ సారస్వత విశ్వరూపమును వలసినప్పుడెల్ల శ్రీకృష్ణ పరమాత్మ యందఱకు ననుభవింపజేయుచున్నాడు గావున, ఆయనను యోగేశ్వరేశ్వరు డనిరి. అంతకన్న మన శంకర గురుచరణుల మహిమ తక్కువ యేమి గలదు ?

ఆ స్వామి యుపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు, భగవద్గీతకు భాష్యములు రచించి సాధకజనులకు మార్గదర్శకులై, శిష్యులచే షణ్మతస్థాపనాచార్యు లని స్తుతింపబడిరి. వేదశాస్త్ర ప్రతిపాదితములైన సర్వమత రహస్యములను సామాన్య జనులకు నయితము సుబోధకముగ నుండునట్లు ప్రకరణ, స్తోత్ర గ్రంథరచన చేసి మహోపకృతి యొనర్చి యున్నారు. ఆయనచే ప్రవర్తితమైన వాఙ్మయమున నెందు జూచినను, అద్వైత తత్త్వమే గోచరించును. అద్వైతభిన్నమైన సిద్ధాంతమెచటను గానరాదు.

దయాసాగరుడైన శ్రీశంకరస్వామి శాక్తమతము సుబోధకముగా నుండురీతి, శ్రీలలితాత్రిశతీ భాష్యమును తత్త్వస్ఫోరకముగా రచించిరి. ఇందులో హ్రీం బీజపారమ్యమును చక్కగా వర్ణించియున్నారు. 'హ్రీం' బీజము నుండి 'హ్రీ' యనెడి శక్తి యుద్భవించినది. 'హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ' యనుచు పురుషసూక్తము ఆ శక్తిని పరబ్రహ్మ నిత్యానపాయినిగా చెప్పుచున్నది. 'హ్రీ'లో నున్న పురుష బీజముతో 'హర' యైనదనియు, స్త్రీబీజముతో 'హరి' యైనదనియు, ఈంకారముతో శక్తిబీజమైన 'హ్రీం' అయినదనియు సంప్రదాయవేత్తల యనుభవము.

వేదములలోని 'హ్రృష్' ధాతువును వ్యాకరణ మనువదించినది గాని, స్వయముగ సృష్టించలేదు. హ్రీంకారేశ్వరియైన లలితాత్రిపురసుందరియే కార్యకారణభేదముల ననుసరించి లలిత, చండిక, దుర్గ మొదలగు ననేక శక్తిరూపములను ధరించినను, చిద్రూపమును విడచి యుండదు. ఈ సత్యమును తెలిసికొనుడనియే శ్రీ శంకరుల యుపదేశము. శక్త్యుపాసన జ్ఞానపర్యవసాయి యనియే శ్రీ శంకరుల యభిమతము, సిద్ధాంతము.

శ్రీ శంకరవాఙ్మయము నంతయు నాంధ్రభాషలో అనువాదరూపమున ప్రకాశితమొనర్చి యాంధ్రులను కృతార్థులను చేయ సంకల్పించిన శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారి ప్రేరణచే, శ్రీ శంకరప్రణీతము, దివ్యరూపమునగు లలితాత్రిశతీభాష్యమును యథామతి ఆంధ్రభాషలో ననువదించితిని. పాఠకులు దీనిలో నేదైన విషయమున్న, పెద్దల వలన గ్రహింపగోరుదును.

వార్ధక్యముచే వ్రాయశక్యము గాకుండుటచే, నేను చెప్పుచుండగ, ఎండనక, వానయనక, నిత్యము కష్టపడి వచ్చి యీ గ్రంథము చిత్తుప్రతిని వ్రాసిన శ్రీ షావుకారు సదాశివశర్మగారిని–

అట్టి చిత్తుప్రతిని ఓర్పుతో సరిచూచి, హెచ్చుతగ్గులనుపూరించి పూర్ణగ్రంథరూపమున సంతరింపజేసిన శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని–

ఈ గ్రంథమును అచ్చొత్తించి వెలుగులోకి తెచ్చి, శంకరభక్తు లందఱకు మేలొనరించిన శ్రీ బులుసు సూర్య ప్రకాశశాస్త్రిగారిని-

ఈ గ్రంథము ముద్రితమై ప్రజోపయోగమునకు ఎప్పుడు వచ్చునా యని యెదురు చూచుచున్న పాఠకోత్తము లను, వారివారి విద్యాబంధువులను, యాన బంధువులను - చిత్ప్రకాశరూపిణి యగు ఆ పరాశక్తి ఐహికాముష్మిక ఫలముల నొసగి సర్వవిధముల ప్రకాశింపజేయుగాక !

ఆ పరాభట్టారిక యనుగ్రహము వలన చి. బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు శంకర వాఙ్మయము నంతయు నాంధ్రభాషలో ప్రకాశింపజేయుదురని యాశంసనము పలుకు చున్నాను.

ఇంతకు మూలమైన శ్రీ కంచి కామకోటి పీఠాధీశ్వ రులు, శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ శ్రీచరణుల యాజ్ఞాప్రసాదమును వేయివిధముల కొనియాడుచు నా మాటలు ముగించుచున్నాను.

"సా హి శ్రీ రమృతా సతామ్"

చందవోలు, ఇట్లు

15-8-88. తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి

# శంకరవాఙ్మయసుషమ

## మాహాత్మ్యము.

"యా మామనంతి మునయః ప్రకృతిం పురాణీమ్
విద్యేతి యాం శ్రుతిరహస్యవిదో వదంతి।
తా మర్థపల్లవిత శంకరరూపముద్రామ్
దేవీ మనన్యశరణ శ్శరణం ప్రపద్యే ॥"

సచ్చిదానందస్వరూపిణియైన పరమేశ్వరియే నిఖిల చరాచర సృష్టికి అధిష్ఠాత్రి. ఆ జగన్మాతయందే సమస్త విశ్వము భాసమాన మగుచున్నది. వాస్తవమునకు నిఖిల ప్రపంచభాసకమైనది నిత్య శుద్ధ బుద్ధ ముక్త జ్ఞానస్వరూపమైన ఆత్మయే. ఆ యాత్మ, సాక్షి యని, బ్రహ్మ యని వ్యవహరింపబడుచున్నది. ఆ బ్రహ్మ స్త్రీ గాదు, పురుషుడును గాదు, నపుంసకము గాదు. అయినను ఉపాధిసంబంధము వలన స్వయంప్రకాశ సచ్చిదానందరూపిణి యగు పరమేశ్వరియే ఆత్మ యనియు, పురుషు డనియు, బ్రహ్మ యనియు శ్రుతులచే పేర్కొనబడినది. ఆ తల్లి నిత్య, అజన్మయయ్యు, దేవతాకార్యసిద్ధ్యర్థము శివ, విష్ణు, గణేశాది నామములతోను, త్రిపురసుందరి, భువనేశ్వరి, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాగౌరి మున్నగు నామములతోను ఆవిర్భవించును.

వేదాంతశాస్త్రమున మాయ, మిథ్యాభూత యని పేర్కొనబడుచుండగా, మాయాస్వరూపిణి యైన పరమేశ్వరికి జగత్కారణత్వము చెప్పుట పొసగదని కొందఱనవచ్చును. కాని, 'కాఽసి త్వం మహాదేవి, సాఽబ్రవీ దహం బ్రహ్మ రూపిణీ, మత్తః ప్రకృతిపురుషాత్మకం జగత్', 'భువనా ధీశ్వరీ భువనాతీతా', 'స్వాత్మైవ లలితా' ఇత్యాది వచనములవలన పరమేశ్వరి తుర్యాతీత బ్రహ్మస్వరూపిణి యని తెలియుచున్నది. పరాభట్టారికయొక్క పరతత్త్వము ఆత్మోపలబ్ధికి విషయ మనియు, 'చితి స్తత్పదలక్ష్యార్థా చిదేకరసరూపిణీ' యను పురాణవచనము వలన చిదేకరస రూపిణి యగు చిచ్ఛక్తియే 'తత్త్వమసి' యందలి 'తత్' పదలక్ష్యార్థ మనియు తెలియుచున్నది.

నిర్గుణ బ్రహ్మవాచక శ్రుతివాక్యములు, మాయా బోధక శ్రుతివచనములు పరస్పరవిరుద్ధములుకావా? యనిన కావనియే సిద్ధాంతము. ఏలన, వేదాంతదర్శనములో మాయ మిథ్యాభూత గదా! మిథ్యాభూతురాలైన మాయ అధిష్ఠాన సత్తయైన బ్రహ్మయందు కల్పితము. కల్పితసత్త, అధిష్ఠాన సత్తాతిరిక్తముగ ఎన్నడు నుండనేరదు. అధిష్ఠానబ్రహ్మసత్త మాయాప్రవిష్టమై యుండును. కావుననే బ్రహ్మలక్షణము లైన స్వరూప, తటస్థలక్షణములు మాయారూపిణియైన పరమేశ్వరి యందనుగతములై యుండును. మాయాస్వరూ పిణియైన శ్రీ లలితామహాత్రిపురసుందరి యుపాసనములో

బ్రహ్మము ఉపాస్య మగును. ఆరీతిగనే నిర్గుణము, రూప రహితము నగుటవలన కేవల బ్రహ్మోపాసనయు పొసగదు; శక్తివిశిష్టబ్రహ్మయే యుపాస్య మగును. వాస్తవమున, మాయకు బ్రహ్మాతిరిక్తమైన సత్తయే యసంభవము. అటులనే, మాయాశబలితము కాని బ్రహ్మకు ఉపాస్యత్వము చెప్పుటయు సంగతము కాదు.

'సదాకారా సదానందా సంసారోచ్ఛేదకారిణీ। సశివా పరమా దేవీ శివాభిన్నా శివంకరీ' అని సూతసంహిత చెప్పు చున్నది. 'నాహం సుముఖి మాయాయా ఉపాస్యత్వం బ్రువే క్వచిత్ । మాయాధిష్ఠానచైతన్య ముపాస్యత్వేన కీర్తితమ్' మున్నగు వచనముల వలన పరమేశ్వరి యనగా మాయా శబలిత బ్రహ్మ యనియే భావించవలయును. సగుణోపాసన మంతయు శక్తివిశిష్టమైన బ్రహ్మోపాసనమే. గుణత్రయ సామ్యావస్థారూపిణియే మాయ. ఆమె కేవల శుద్ధ బ్రహ్మా శ్రితయై యుండును. కావున శ్రీమహాత్రిపురసుందరి యుపాసనలో మాయావిశిష్ట తురీయ బ్రహ్మయే యుపాసింప బడుచున్నాడని తెలియనగును.

అపౌరుషేయమైన వేదము కాండద్వయాత్మకము, కర్మబ్రహ్మబోధకము. వైదిక కర్మయందు ఉపాసన మంత ర్భూతమై యున్నది. కావున, శ్రుతులు కర్మ, భక్తి, జ్ఞానప్రతిపాదకములై మానవులను సంసారబంధవిముక్తులను

గావించుట కవతరించినవి. మంత్ర బ్రాహ్మణములు యజ్ఞ యాగాదిబోధకములు, ఆరణ్యకములు ఉపాసనాప్రతిపాదక ములు, ఉపనిషత్తులు జ్ఞానోద్బోధకములై విరాజిల్లుచున్నవి.

సాయణాది భాష్యకర్తలు మంత్రబ్రాహ్మణారణ్యక భాగములకు భాష్యరచన చేసియున్నారు. అద్వైతబ్రహ్మ తత్త్వ ప్రతిపాదకములైన దశోపనిషత్తులకు శ్రీశంకరభగవ త్పాదులు మహాప్రతిభావైదుష్యములతో భాష్యరచన చేసి యున్నారు.

శ్రీశంకరులు సాక్షాత్తు శంకరావతారమే యనుట నిర్వివాదము. ఆయన కారణజన్ములు. యోగేశ్వరులు, శ్రీవిద్యోపాసక శిఖరాయమాణులు, అద్వయబ్రహ్మాత్మ నిష్ఠులు, షణ్మతస్థాపనాచార్యులు, ఆదృశ మహనీయ మూర్తి ఉపనిషత్, సూత్ర, గీతాప్రస్థానములకు భాష్య రచనలు చేసి, దర్శనాచార్యులుగ ప్రఖ్యాతులైరి. ఈ మూడు భాష్యములు తత్పూర్వమత ఖండనపూర్వకముగ, అద్వైత సిద్ధాంతప్రతిష్ఠాపనకై బయలుదేరినవి. అవి శాస్త్రమర్యాద తో నిండిన గ్రంథరాజములు. అవి అతి గహనములు. భగవత్పాదులు సామాన్యపాఠకులకు ప్రమేయము నుద్బో ధింప, పెక్కు ప్రకరణగ్రంథములను రచించి మహోపకార మొనర్చియున్నారు.

విష్ణుసహస్రనామ, సనత్సుజాతీయ, శ్రీలలితాత్రిశ త్యాదులకు భాష్యరచన చేసిరి. ప్రపంచసారతంత్రము శ్రీ శంకరుల మంత్రశాస్త్రవైదుష్యమును చాటిచెప్పు మంత్ర శాస్త్రగ్రంథరాజము. భిన్నభిన్న శక్తిస్వరూపులైన దేవతల నుద్దేశించి చేసిన స్తోత్రములు అనేకానేకములు. అన్నిట, అద్వైత సిద్ధాంతప్రతిష్ఠాపనమే జరిగినది. ఈ సర్వజగత్తులో నున్నది 'ఏకమేవాద్వితీయ' మైన బ్రహ్మతత్త్వమే గదా!

అద్వైత సిద్ధాంతప్రతిపాదకమైన శ్రీశంకరవాఙ్మయ మును పండితులచే ఆంధ్రభాషలోని కనువదింపజేసి యాంధ్ర పాఠకలోకమున కందింపవలయు ననుసంకల్పముతో 'శంకర గ్రంథరత్నావళి' యను పేరుతో మా సాధన గ్రంథమండలి యిప్పటికి ప్రకరణగ్రంథములను, స్తోత్రములను 11 సంపుటము లుగ వెలుగులోనికి తెచ్చి కృతకృత్యమైంది. శంకరరచితము లైన గ్రంథములను ఆంధ్రభాషలోని కనువదించి యిచ్చిన విద్వద్వరేణ్యులకు మేమెంతయో ఋణపడియున్నాము. వారికి మాహృదయపూర్వకకృతజ్ఞతాంజలులు. అటులనే, వదాన్యులైన శంకరభక్తులు ఎంతో ఔదార్యముతో ఆర్థికసాహాయ్య మందించి చేయూత నియ్యకున్న, మా యీ సంకల్పము కార్యరూపము దాల్చియుండెడిది కాదు. ఆ వదాన్యహృదయులందరకు హార్దిక ధన్యవాదము లర్పించుట మా విధియై యున్నది.

ఈ లలితాత్రిశతీభాష్యానువాదము శంకరగ్రంథ రత్నావళి 12 వ సంపుటముగ వెలువడుచున్నది. ఈ త్రిశతీ భాష్యానువాదమును మహానుగ్రహముతో నందించిన మహనీయులు జగమెఱిగిన విద్వద్వరేణ్యులు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిచరణులు. శ్రీశాస్త్రిగారు వైదిక కర్మానుష్ఠాన నిరతులు, మహాతపస్సంపన్నులు, శ్రీవిద్యోపాసనాసిద్ధులు, నిరంతర యోగసమాధినిష్ఠులు, బ్రహ్మానందరసానుభవాస్వాదనచిత్తులు నయిన ఋషి కల్పులు. అశనాపిపాసాదులను త్యజించి ప్రాతఃకాలమునుండి రాత్రివఱకు 27 మార్లు శ్రీబాలాత్రిపురసుందరి నర్చించి, యీ జగన్మాత యనుగ్రహమునకు, ప్రసాదమునకు పాత్రు లైన శాస్త్రివర్యులు శ్రీవిద్యోపాసకశేఖరీభూతులు 27 మార్లు శ్రీపరాభట్టారిక నర్చించుటయందలి రహస్యము మంత్రశాస్త్రసమధిగమ్యము, తత్కాలమున శ్రీశాస్త్రిపాదుల చిచ్ఛక్తి ఊర్ధ్వభూమికలలో సంచరించిన విధము అనుభవైక వేద్యము.

మహాతపస్సంపన్నులైన శ్రీశాస్త్రిగారి హృదయమున మా సాధనగ్రంథమండలి పట్ల, నాపట్ల యపార కృపావిశేష ముండుట, నా యీ సేవ యమోఘములైన వారియాశీస్సు లనుబడయుట నా పురాకృత సుకృతవిశేషము. కరుణా సముద్రులైన శ్రీశాస్త్రిగారు ఇంతకు పూర్వము శంకరాచార్య కృత స్తోత్రముల నన్నిటిని ఆంధ్రతాత్పర్యసమలంకృత

మొనర్చి దయతో నొసంగినారు. ఆ స్తోత్రములు శి సంపుట ములుగ వెలువడుట శంకర వాఙ్మయపాఠకులకు విదితమే.

శ్రీలలితాత్రిశతీనామములు పంచదశీ మహామంత్రము నందలి బీజాక్షరసంపుటితములు. వీనిలో కొన్ని నామములు శివప్రోక్తములు, మఱికొన్ని శక్తిప్రోక్తములు. హ్రీంబీజ సంపుటిత నామములు శివశక్తిమిథునప్రోక్తములు. బ్రహ్మ వాచకమైన ప్రణవము వలెనే, శక్తిప్రణవమైన హ్రీంబీజము 'తత్' పద లక్ష్యార్థబోధక మని తెలియనగును. శ్రీశంకర భగవత్పాదులు ఇందలి ప్రతి నామముచే చెప్పబడిన లక్ష్యార్థము సచ్చిదానందరూపమైన పరబ్రహ్మమే యని ఔపనిషద మతమును విస్పష్టముగా ప్రతిపాదించినారు.

శ్రీశాస్త్రిగారు ఆ యా స్థలములలో అనేక రహస్య ములను, సంప్రదాయములను తెలియజేయుచు పశ్యంతీ వాగ్భూమికలో దర్శించిన పరమేశ్వర నిత్యానపాయినియైన పరాభట్టారికాతత్త్వమును వైఖరీవాగ్రూపమున ఆంధ్ర భాషలో ననువదించిన యోగిపుంగవులు. కావున, శంకర భాష్యమునకు గల గౌరవము ఈ యనువాదమునకు గూడ గలదనుట నిక్కము, విషయగౌరవము వక్త్రపేక్షితముగదా! 90 సంవత్సరములు పైబడిన శ్రీశాస్త్రిగారు నాపై గల యవ్యాజానురాగముతో శ్రీలలితాత్రిశతీభాష్యానువాద మును మా సాధనగ్రంథమండలికి ప్రసాదించినారు. అట్టి మహాతపస్వికి వినమ్రుడనై యంజలి ఘటించుట దక్క, నేను ఏమీయగలను? వారి యాశీఃపరంపర సదా నా

యందుందుగాక యని శ్రీమహాత్రిపురసుందరిని భక్తిప్రవణ చిత్తముతో ప్రార్థింతును. శ్రీశాస్త్రిగారి యాశీస్సుల వలన బ్ర. శ్రీ హరి సాంబశివశాస్త్రిగా రనువదించిన ఉపదేశ సాహస్రియు, బ్ర. శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే అనువదింపబడిన సనత్సుజాతీయభాష్యము బ్ర. శ్రీ కుప్పా లక్ష్మావధానులుగారిచే అనువదింపబడిన వాక్యవృత్తి తరువాత ప్రస్థానత్రయము క్రమముగా వెలువడనున్నవని తెలియ జేయుటకు సంతసించుచున్నాను.

శ్రీశంకరవాఙ్మయప్రకాశనములో మొదటినుండి నాకు చేదోడువాదోడుగనున్న మిత్రులు, పండితులు నయిన శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి నిర్వ్యాజ సహాకారము అవిస్మరణీయము. ఈ త్రిశతీభాష్యానువాదగ్రంథము ఈ రూపమును సంతరించుకొనుటలో వారొనర్చిన యవిరళకృషి శ్లాఘనీయమగుటయేగాక , తపస్సంపన్నులైన శ్రీరాఘవ నారాయణశాస్త్రిగారి యాశీస్సులను వారు చూరగొనుట, శ్రీదేవీకృపాకటాక్షమునకు పాత్రులగుట నాకెంతయో ముదావహము. వారికి నా ధన్యవాదములు.

ఈగ్రంథప్రచురణమునకు గౌరవపురస్సరమైన సహాకారము నందించిన

శ్రీ పి. వి. ఆర్. మూర్తి దంపతులు – కలకత్తా.

శ్రీ మాగంటి సూర్యనారాయణగారు – విజయవా

శ్రీ గొల్లపూడి వెంకటరామశాస్త్రిగారు-హైదరాబాదు
వారిధర్మపత్ని శ్రీమతి లక్ష్మీసరోజినిగారు
శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు - హైద్రాబాదు
శ్రీ మాగంటి సుబ్రహ్మణ్యంగారు - విజయవాడ
శ్రీ తుమ్మల జగన్మోహనరావుగారు - కూచిపూడి
శ్రీ షావుకారు సదాశివశర్మగారు - తెనాలి
శ్రీ సుంకు సుబ్బలక్ష్మయ్యగారు - మద్రాసు
మిత్రులు శ్రీ వై. వెంకటేశ్వరరావుగారు - తెనాలి

ఇంకెందరో మహానుభావులు - ఈ వదాన్యులందరకు నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఈ గ్రంథమును నయనాభిరామముగ ముద్రించిన శ్రీ తిరుమల ఆర్ట్ ప్రింటర్సు, శ్రీనాథ్ ఆర్ట్ ప్రింటర్సు - తెనాలి, యజమానులకు, అందు పనిచేయు సిబ్బందికి కృతజ్ఞతలు.

"వందే తాం పరమేశ్వరీం
భగవతీం బుద్ధిప్రదాం శారదామ్"

ఇట్లు

విభవ-శ్రావణము
15-8-1988

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుడు.
సాధన గ్రంథమండలి, తెనాలి

# శ్రీ లలితా త్రిశతీ స్తోత్ర ప్రారంభః

శ్లో॥ సకుంకుమవిలేపనా మళికచుమ్బి కస్తూరికాం
సమన్దహాసితేక్షణాం సశరచాప పాశాంకుశామ్ ।
అశేషజనమోహినీ మరుణమాల్యభూషామ్బరాం
జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరే దంబికామ్ ॥

అగస్త్య ఉవాచ :-

హయగ్రీవ దయాసింధో భగవన్ భక్తవత్సల ।
త్వత్తశ్శ్రుత మశేషేణ శ్రోతవ్యం యద్యదస్తితత్ ॥ ౧

రహస్యం నామసాహస్ర మపి తత్సంశ్రుతం మయా ।
ఇతఃపరం చ మే నాస్తి శ్రోతవ్య మితి నిశ్చయః ॥ ౨

తథాఽపి మమ చిత్తస్య పర్యాప్తి ర్నైవ జాయతే ।
కార్త్స్న్యార్థః ప్రాప్య ఇత్యేవ శోచయిష్యా మ్యహం ప్రభో ॥ 3

కిమిదం కారణం బ్రూహి జ్ఞాతవ్యాంశోఽపి వా పునః ।
అస్తి చేన్మమ తం బ్రూహి బ్రూహీత్యుక్త్వా ప్రణమ్యతమ్ ॥

సూత ఉవాచ :-

సమాలలంబే తత్పాదయుగళం కలశోద్భవః
హయాననో భీతభీతః కిమిదం కిమిదం త్వితి ॥ ౫

ముంచ ముంచేతి తం చోక్త్వా చింతాక్రాంతో బభూవ సః ।
చిరం విచార్య నిశ్చిన్వ న్వక్తవ్యం న మయేత్యసౌ ॥ ౬

తూష్ణీం స్థితః స్మరన్నాజ్ఞాం లలితాంబాకృతాం పురా ।
తం ప్రణమ్యైవ స మునిస్తత్పాదావత్యజన్ స్థితః ॥ ౭

వర్షత్రయావధి తదా గురుశిష్యౌ తథా స్థితౌ ।
తచ్ఛృణ్వంతశ్చ పశ్యంత స్సర్వే లోకా స్సువిస్మితాః ॥ ౮

తత్ర శ్రీలలితా దేవీ కామేశ్వరసమన్వితా ।
ప్రాదుర్భూతా రహస్యైవం హయగ్రీవ మవోచత ॥ ౯

శ్రీ దేవ్యువాచ :-

అశ్వాననావయోః ప్రీతి శ్శాస్త్రవిశ్వాసినే త్వయా ।
రాజ్యం దేయం శిరో దేయం న దేయా షోడశాక్షరీ ॥ ౧౦

స్వమాతృజారవద్గోప్యా విద్యైషేత్యాగమా జగుః ।
తతోఽతిగోపనీయా మే సర్వపూర్తికరీ స్తుతిః ॥ ౧౧

మయా కామేశ్వరేణాపి కృతా సా గోపితా భృశమ్ ।
మదాజ్ఞయా వచో దేవ్య శ్చక్రుర్నామసహస్రకమ్ ॥ ౧౨

ఆవాభ్యాం కథితం ముఖ్యం సర్వపూర్తికరం స్తవమ్ ।
సర్వక్రియాణాం వైకల్యపూర్తి ర్యజ్జపతో భవేత్ ॥ ౧౩

సర్వపూర్తికరం తస్మాదిదం నామ కృతం మయా ।
తద్బ్రూహి త్వ మగస్త్యాయ పాత్రభూతో న సంశయః ॥ ౧౪

పత్న్యస్య లోపాముద్రాఽఽఖ్యా మాముపాస్తేఽతిభక్తితః ।
అయం చ నితరాం భక్త స్తస్మాదస్య వదస్వ తత్ ॥ ౧౫

అముంచమాన స్త్వత్పాదౌ వర్షత్రయ మసౌ స్థితః ।
ఏతత్ జ్ఞాతుమతో భక్త్యా హీదమేవ నిదర్శనమ్ ॥ ౧౬

చిత్తపర్యాప్తి రేతస్య నాన్యథా సంభవిష్యతి ।
సర్వపూర్తికరం తస్మా దనుజ్ఞాతో మయా వద ॥ ౧౭

సూత ఉవాచ :-

ఇత్యుక్త్వాఽంతర్దధా వమ్బా కామేశ్వరసమన్వితా ।
అథోత్థాప్య హయగ్రీవః పాణిభ్యాం కుంభసంభవమ్ ॥ ౧౮

సంస్థాప్య నికటే వాచ మువాచ భృశవిస్మితః ॥

హయగ్రీవ ఉవాచ :-

కృతార్థోఽసి కృతార్థోఽసి కృతార్థోఽసి ఘటోద్భవ ॥ ౧౯

త్వత్సమో లలితాభక్తో నాస్తి నాస్తి జగత్త్రయే ।
యేనాగస్త్య స్వయం దేవి తవ వక్తవ్య మన్వశాత్ ॥ ౨౦

సచ్ఛిష్యేణ త్వయా చాహం దృష్టవా నస్మి తాం శివామ్ ॥
యతన్తే యద్దర్శనాయ బ్రహ్మవిష్ణ్వీశపూర్వకాః ॥ ౨౧

అతఃపరం తే వక్ష్యామి సర్వపూర్తికరం స్తవమ్ ।
యస్య స్మరణమాత్రేణ పర్యాప్తి స్తే భవేద్ధృది ॥ ౨౨

రహస్యనామసాహస్రా దతిగుహ్యతమం మునే ।
ఆవశ్యకం తతో హ్యేత ల్లలితాం సముపాసితుమ్ ॥ ౨౩

తదహం తే ప్రవక్ష్యామి లలితాంబానుశాసనాత్ ।
శ్రీమత్పంచదశాక్షర్యాః కాదివర్ణాన్క్రమాన్మునే ॥ ౨౪

పృథగ్వింశతినామాని కథితాని ఘటోద్భవ ।
ఆహత్య నామ్నాం త్రిశతీ సర్వసంపూర్తికారిణీ ॥ ౨౫

రహస్యాతిరహస్యైషా గోపనీయా ప్రయత్నతః ।
తాం శృణుష్వ మహాభాగ సావధానేన చేతసా ॥ ౨౬
కేవలం నామబుద్ధిస్తేన కార్యా తేషు కుంభజ ।
మంత్రాత్మకత్వమేతేషాం నామ్నాం నామాత్మతాఽపి చ ౨౭
తస్మాదేకాగ్రమనసా శ్రోతవ్యం భవతా మునే ।

సూత ఉవాచ :-

ఇత్యుక్త్వా తు హయగ్రీవః ప్రోచే నామశతత్రయమ్ ॥ ౨౮

అస్య శ్రీ లలితాత్రిశతీస్తోత్ర మహామంత్రస్య భగవాన్ హయగ్రీవ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ లలితామహేశ్వరీ దేవతా, ఐం బీజం, సౌః శక్తిః, క్లీం కీలకం, మమచతుర్విధ పురుషార్థఫలసిద్ధ్యర్థే జపే వినియోగః

ఐ మిత్యాదిభి రంగన్యాసకరన్యాసాః కార్యాః ॥

ధ్యానమ్

అతిమధురచాపహస్తా మపరిమితామోదబాణసౌభాగ్యాం ।
అరుణా మతిశయకరుణా మభినవకులసుందరీం వందే ॥

హయగ్రీవ ఉవాచ :-

కకారరూపా కల్యాణీ కల్యాణగుణశాలినీ ॥
కల్యాణశైలనిలయా కమనీయా కళావతీ ॥ ౧
కమలాక్షీ కల్మషఘ్నీ కరుణామృతసాగరా ।
కదంబకాననావాసా కదంబకుసుమప్రియా ॥ ౨
కందర్పవిద్యా కందర్పజనకాపాంగవీక్షణా ।
కర్పూరవీటీసౌరభ్యకల్లోలితకకుప్తటా ॥ 3

కలిదోషహరా కంజలోచనా కమ్రవిగ్రహా ।
కర్మాదిసాక్షిణీ కారయిత్రీ కర్మఫలప్రదా ॥ ౪

ఏకారరూపా చైకాక్ష ర్యేకానేకాక్షరాకృతిః ।
ఏతత్త దిత్యనిర్దేశ్యా చైకానందచిదాకృతిః ॥ ౫

ఏవమిత్యాగమాబోధ్యా చైకభక్తిమదర్చితా ।
ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా చైషణారహితా ధృతా ॥ ౬

ఏలాసుగంధిచికురా చైనఃకూటవినాశినీ ।
ఏకభోగా చైకరసా చైకైశ్వర్యప్రదాయినీ ॥ ౭

ఏకాతపత్రసామ్రాజ్యప్రదా చైకాంతపూజితా ।
ఏధమానప్రభా చైజదనేజజ్జగదీశ్వరీ ॥ ౮

ఏకవీరాదిసంసేవ్యా చైకప్రాభవశాలినీ ।
ఈకారరూపిణీశిత్రీ చేప్సితార్థప్రదాయినీ ॥ ౯

ఈదృగిత్యవినిర్దేశ్యా చేశ్వరత్వవిధాయినీ ।
ఈశానాదిబ్రహ్మమయీ చేశిత్వాద్యష్టసిద్ధిదా ॥ ౧౦

ఈక్షిత్రీక్షణసృష్టాండకోటి రీశ్వరవల్లభా ॥
ఈడితా చేశ్వరార్ధాంగశరీ రేశాధిదేవతా ॥ ౧౧

ఈశ్వరప్రేరణకరీ చేశతాండవసాక్షిణీ ।
ఈశ్వరోత్సంగనిలయా చేతోబాధావినాశినీ ॥ ౧౨

ఈహావిరహితా చేశశక్తి రీషత్స్మితాననా ।
లకారరూపా లలితా లక్ష్మీవాణీనిషేవితా ॥ ౧౩

లాకినీ లలనారూపా లసద్దాడిమపాటలా ||
లలంతికాలసత్ఫాలా లలాటనయనార్చితా || ౧౪

లక్షణోజ్జ్వలదివ్యాంగీ లక్షకోట్యండనాయికా |
లక్ష్యార్థా లక్షణాగమ్యా లబ్ధకామా లతాతనుః || ౧౫

లలామరాజదలికా లంబముక్తాలతాంచితా |
లంబోదరప్రసూర్లభ్యా లజ్జాఢ్యా లయవర్జితా || ౧౬

హ్రీంకారరూపా హ్రీంకారనిలయా హ్రీంపదప్రియా |
హ్రీంకారబీజా హ్రీంకారమంత్రా హ్రీంకారలక్షణా || ౧౭

హ్రీంకారజపసుప్రీతా హ్రీంమతిః హ్రీంవిభూషణా |
హ్రీంశీలా హ్రీంపదారాధ్యా హ్రీంగర్భా హ్రీంపదాభిధా ||

హ్రీంకారవాచ్యా హ్రీంకారపూజ్యా హ్రీంకారపీఠికా |
హ్రీంకారవేద్యా హ్రీంకారచింత్యా హ్రీంహ్రీంశరీరిణీ || ౧౯

హకారరూపా హలధృత్పూజితా హరిణేక్షణా |
హరప్రియా హరారాధ్యా హరిబ్రహ్మేంద్రసేవితా || ౨౦

హయారూఢాసేవితాంఘ్రి ర్హయమేధసమర్చితా |
హర్యక్షవాహనా హంసవాహనా హతదానవా || ౨౧

హత్యాదిపాపశమనీ హరిదశ్వాదిసేవితా |
హస్తికుంభోత్తుంగకుచా హస్తికృత్తిప్రియాంగనా || ౨౨

హరిద్రాకుంకుమాదిగ్ధా హర్యశ్వాద్యమరార్చితా |
హరికేశసఖీ హాదివిద్యా హాలామదాలసా|| ౨౩

సకారరూపా సర్వజ్ఞా సర్వేశీ సర్వమంగళా ।
సర్వకర్త్రీ సర్వధాత్రీ సర్వహంత్రీ సనాతనీ ॥ ౨౪

సర్వానవద్యా సర్వాంగసుందరీ సర్వసాక్షిణీ ।
సర్వాత్మికా సర్వసౌఖ్యదాత్రీ సర్వవిమోహినీ ॥ ౨౫

సర్వాధారా సర్వగతా సర్వావగుణవర్జితా ।
సర్వారుణా సర్వమాతా సర్వాభరణభూషితా ॥ ౨౬

కకారార్థా కాలహంత్రీ కామేశీ కామితార్థదా ।
కామసంజీవినీ కల్యా కఠినస్తనమండలా ॥ ౨౭

కరభోరూ కలానాథముఖీ కచజితాంబుదా ।
కటాక్షస్యందికరుణా కపాలిప్రాణనాయికా ॥ ౨౮

కారుణ్యవిగ్రహా కాంతా కాంతిధూతజపావళిః ।
కలాలాపా కంబుకంఠీ కరనిర్జితపల్లవా ॥ ౨౯

కల్పవల్లీసమభుజా కస్తూరితిలకోజ్జ్వలా ॥
హకారార్థా హంసగతి హాటకాభరణోజ్జ్వలా ॥ 30

హారహారికుచాభోగా హాకినీ హల్యవర్జితా ।
హరిత్పతిసమారాధ్యా హఠాత్కారహతాసురా ॥ 3౧

హర్షప్రదా హవిర్భోక్త్రీ హార్దసంతమసాపహా ।
హల్లీసలాస్యసంతుష్టా హంసమంత్రార్థరూపిణీ ॥ 3౨

హానోపాదననిర్ముక్తా హర్షిణీ హరిసోదరీ ।
హాహాహూహూముఖస్తుత్యా హానివృద్ధివివర్జితా ॥ 33

హయ్యంగవీనహృదయా హరికోపారుణాంశుకా ॥
లకారార్థా లతాపూజ్యా లయస్థిత్యుద్భవేశ్వరీ ॥ ౩౪

లాస్యదర్శనసంతుష్టా లాభాలాభవివర్జితా ।
లంఘ్యేతరాజ్ఞా లావణ్యశాలినీ లఘుసిద్ధిదా ॥ ౩౫

లాక్షారససవర్ణాభా లక్ష్మణాగ్రజపూజితా ।
లభ్యేతరా లబ్ధశక్తిసులభా లాంగలాయుధా ॥ ౩౬

లగ్నచామరహస్తశ్రీశారదాపరివీజితా ।
లజ్జాపదసమారాధ్యా లంపటా లకులేశ్వరీ ॥ ౩౭

లబ్ధమానా లబ్ధరసా లబ్ధసంపత్సమున్నతిః ।
హ్రీంకారిణీ హ్రీంకారాది హ్రీంమధ్యా హ్రీంశిఖామణిః ॥ ౩౮

హ్రీంకారకుండాగ్నిశిఖా హ్రీంకారశశిచంద్రికా ।
హ్రీంకారభాస్కరరుచి హ్రీంకారామ్భోదచంచలా ॥ ౩౯

హ్రీంకారకన్దాంకురితా హ్రీంకారైకపరాయణా ।
హ్రీంకారదీర్ఘికాహంసీ హ్రీంకారోద్యానకేకినీ ॥ ౪౦

హ్రీంకారారణ్యహరిణీ హ్రీంకారావాలవల్లరీ ।
హ్రీంకారపంజరశుకీ హ్రీంకారాంగణదీపికా ॥ ౪౧

హ్రీంకారకందరాసింహీ హ్రీంకారాంబుజభృంగికా ।
హ్రీంకారసుమనోమాధ్వీ హ్రీంకారతరుమంజరీ ॥ ౪౨

సకారాఖ్యా సమరసా సకలోత్తమసంస్తుతా ।
సర్వవేదాంతతాత్పర్యభూమి స్సదసదాశ్రయా ॥ ౪౩

సకలా సచ్చిదానన్దా సాధ్వీ సద్గతిదాయినీ ।
సనకాదిమునిధ్యేయా సదాశివకుటుంబినీ ॥ ౪౪

సకలాధిష్ఠానరూపా సత్త్వరూపా సమాకృతిః ।
సర్వప్రపంచనిర్మాత్రీ సమానాధికవర్జితా ॥ ౪౫
సర్వోత్తుంగా సంగహీనా సద్గుణా సకలేష్టదా ।
కకారిణీ కావ్యలోలా కామేశ్వరమనోహరా ॥ ౪౬

కామేశ్వరప్రాణనాడీ కామేశోత్సంగవాసినీ ।
కామేశ్వరాలింగితాంగీ కామేశ్వరసుఖప్రదా ॥ ౪౭
కామేశ్వరప్రణయినీ కామేశ్వరవిలాసినీ ।
కామేశ్వరతపస్సిద్ధిః కామేశ్వరమనఃప్రియా ॥ ౪౮

కామేశ్వరప్రాణనాథా కామేశ్వరవిమోహినీ ।
కామేశ్వరబ్రహ్మవిద్యా కామేశ్వరగృహేశ్వరీ ॥ ౪౯
కామేశ్వరాహ్లాదకరీ కామేశ్వరమహేశ్వరీ ।
కామేశ్వరీ కామకోటినిలయా కాంక్షితార్థదా ॥ ౫౦
లకారిణీ లబ్ధరూపా లబ్ధధీ ర్లబ్ధవాంఛితా ।
లబ్ధపాపమనోదూరా లబ్ధాహంకారదుర్గమా ॥ ౫౧

లబ్ధశక్తి ర్లబ్ధదేహా లబ్ధైశ్వర్యసమున్నతిః ।
లబ్ధబుద్ధి ర్లబ్ధలీలా లబ్ధయౌవనశాలినీ ॥ ౫౨
లబ్ధాతిశయసర్వాంగసౌన్దర్యా లబ్ధవిభ్రమా ।
లబ్ధరాగా లబ్ధగతి ర్లబ్ధనానాగమస్థితిః ॥ ౫౩

లబ్ధభోగా లబ్ధసుఖా లబ్ధహర్షాభిపూజితా ।
హ్రీఙ్కారమూర్తి ర్హ్రీఙ్కారసౌధశృంగకపోతికా ॥ ౫౪

హ్రీఙ్కారదుగ్ధాబ్ధిసుధా హ్రీఙ్కారకమలేన్దిరా ।
హ్రీఙ్కారమణిదీపార్చి ర్హ్రీఙ్కారతరుశారికా ॥ ౫౫

హ్రీఙ్కారపేటికామణి ర్హ్రీఙ్కారాదర్శబింబికా ।
హ్రీఙ్కారకోశాసిలతా హ్రీఙ్కారాస్థాననర్తకీ ॥ ౫౬

హ్రీఙ్కారశుక్తికాముక్తామణి ర్హ్రీంకారబోధితా ।
హ్రీంకారమయసౌవర్ణస్తమ్భవిద్రుమపుత్రికా ॥ ౫౭

హ్రీంకారవేదోపనిష ద్ధ్రీంకారాధ్వరదక్షిణా ।
హ్రీంకారనన్దనారామనవకల్పకవల్లరీ ॥ ౫౮

హ్రీంకారహిమవద్గంగా హ్రీంకారార్ణవకౌస్తుభా ।
హ్రీంకారమన్త్రసర్వస్వా హ్రీంకారపరసౌఖ్యదా ॥ ౫౯

## ఉత్తరపీఠికా

హయగ్రీవ ఉవాచ :-

ఇతీదం తే మయాఽఽఖ్యాతం దివ్యనామ్నాం శతత్రయం ।
రహస్యాతిరహస్యత్వా ద్గోపనీయం మహామునే ॥ ౬౦

శివవర్ణాని నామాని శ్రీదేవీకథితాని వై ।
శక్త్యక్షరాణి నామాని కామేశకథితాని హి ॥ ౬౧

ఉభయాక్షరనామాని హ్యుభాభ్యాం కథితాని వై ।
తదన్యైర్గ్రథితం స్తోత్ర మేతస్య సదృశం కిము ॥ ౬౨

నానేన సదృశం స్తోత్రం శ్రీదేవీప్రీతిదాయకం ।
లోకత్రయేఽపి కళ్యాణం సమ్భవే న్నాత్ర సంశయః ॥ ౬౩

సూత ఉవాచ :-

ఇతి హయముఖగీతం స్తోత్రరాజం నిశమ్య
ప్రగళితకలుషోఽభూ చ్చిత్తపర్యాప్తి మేత్య ।
నిజగురు మథ నత్వా కుంభజన్మా తదుక్తేః
పున రధికరహస్యం జ్ఞాతు మేవం జగాద ॥ ౧౪

అగస్త్య ఉవాచ :-

అశ్వానన మహాభాగ రహస్య మపి మే వద ।
శివవర్ణాని కాన్యత్ర శక్తివర్ణాని కాని హి ౧౫
ఉభయో రపి వర్ణాని కాని మే వద దేశిక ॥

శ్రీ హయగ్రీవ ఉవాచ :-

ఇతి పృష్టః కుమ్భజేన హయగ్రీవోఽవదత్పునః ॥ ౧౬
తవ గోప్యం కిమస్తీహ సాక్షా దంబాకటాక్షతః ।
ఇదం త్వతిరహస్యం తే వక్ష్యామి శృణు కుంభజ ॥ ౧౭
ఏతద్విజ్ఞానమాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదా భవేత్ ।
కత్రయం హద్వయం చైవ శైవో భాగః ప్రకీర్తితః ॥ ౧౮
శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ఉభయాత్మకః ।
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీవిద్యాజపశీలినః ॥ ౧౯
న తేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతైరపి ।
చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః ॥ ౨౦
నవచక్రైస్తు సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః ।
త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా ॥ ౨౧

చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ వై ।
బిన్దు శ్చాష్టదళం పద్మం పద్మం షోడశపత్రకమ్ ॥ ౭౨

చతురస్రం చ చత్వారి శివచక్రా ణ్యనుక్రమాత్ ।
త్రికోణే బైన్దవం శ్లిష్ట మష్టారేఽష్టదళాంబుజమ్ ॥ ౭౩

దశారయో ష్షోడశారం భూపురం భువనాశ్రికే ।
శైవానామపి శాక్తానాం చక్రాణాంచ పరస్పరమ్ ॥ ౭౪

అవినాభావసంబంధం యో జానాతి స చక్రవిత్ ।
త్రికోణరూపిణీ శక్తి ర్బిన్దురూప శ్శివ స్స్మృతః ॥ ౭౫

అవినాభావసమ్బన్ధ స్తస్మాద్బిన్దుత్రికోణయోః ।
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీచక్రం య స్సమర్చయేత్ ॥ ౭౬

న తత్ఫల మవాప్నోతి లలితామ్బా న తుష్యతి ।
యే చ జానంతి లోకేఽస్మిన్ శ్రీవిద్యాం చక్రవేదినః ॥ ౭౭

సామాన్యవేదిన స్తే వై విశేషజ్ఞోఽతిదుర్లభః ।
స్వయం విద్యావిశేషజ్ఞో విశేషజ్ఞం సమర్చయేత్ ॥ ౭౮

తస్మై దేయం తతో గ్రాహ్యం శ్రీవిద్యాచక్రవేదినా ।
అంధం తమః ప్రవిశంతి యే హ్యవిద్యా ముపాసతే ॥ ౭౯

ఇతి శ్రుతి రపాహైతా న విద్యోపాసకాన్ పునః ।
విద్యాఽనుపాసకానేవ నిందత్యారుణికీ శ్రుతిః ॥ ౮౦

అశ్రుతాస స్స్మృతాసశ్చ యజ్వానో యేఽప్యయజ్వనః ।
స్వర్యన్తో నాపేక్షన్త ఇంద్ర మగ్నిం చ యే విదుః ॥ ౮౧

సికతా ఇవ సంయంతి రశ్మిభి స్సముదీరితాః ।
అస్మాల్లోకా దముష్మా చ్చేత్యపాహారుణికీ శ్రుతిః । ౮౨

యః ప్రాప్తః పృశ్నిభావం వా యది వా శంకర స్స్వయం
తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ ॥ ౮౩

ఇతి తంత్రేషు బహుధా విద్యాయా మహిమోచ్యతే ।
మోక్షైకహేతువిద్యా తు శ్రీవిద్యైవ న సంశయః ॥ ౮౪

న శిల్పాదిజ్ఞానయుక్తే విద్వచ్ఛబ్దః ప్రయుజ్యతే ।
మోక్షైకహేతువిద్యా సా శ్రీవిద్యైవ సంశయః ॥ ౮౫

తస్మా ద్విద్యావిదే దద్యాత్ ఖ్యాపయే త్తద్గుణాన్సుధీః ।
స్వయం విద్యావిశేషజ్ఞో విద్యామాహాత్మ్యవేద్యపి ॥ ౮౬

విద్యావిదం నార్చయే చ్చేత్కోవా తం పూజయే జ్జనః ।
ప్రసంగా దేతదుక్తం తే ప్రకృతం శృణు కుంభజ ॥ ౮౭

యః కీర్తయే త్సకృద్భక్త్యా దివ్యం నామ్నాం శతత్రయం ।
తస్య పుణ్యఫలం వక్ష్యే విస్తరేణ ఘటోద్భవ ॥ ౮౮

రహస్యనామసాహస్రపాఠే యత్ఫల మీరితం ।
తత్కోటికోటిగుణిత మేకనామజపాద్భవేత్ ॥ ౮౯

కామేశ్వరాభ్యాం తదిదం కృతం నామశతత్రయం ।
నాన్యేన తులయే దేత త్స్తోత్రేణాన్యకృతేన తు ॥ ౯౦

శ్రియఃపరంపరా యస్య భావినీ తూత్తరోత్తరం ।
తేనైవ లభ్యతే నామ్నాం త్రిశతీ సర్వకామదా ॥ ౯౧

అస్యా నామ్నాం త్రిశత్యాస్తు మహిమా కేన వర్ణ్యతే ।
యా స్వయం శివయో ర్వక్త్రపద్మాభ్యాం పరినిస్సృతా ॥ ౯౨

నిత్యం షోడశసంఖ్యాకా న్విప్రా నాదౌ తు భోజయేత్ ।
అభ్యక్తాన్ గంధతైలేన స్నాతానుష్ణేన వారిణా ॥ ౯౩

అభ్యర్చ్య వస్త్రగంధాద్యైః కామేశ్వర్యాదినామభిః ।
అపూపైః శర్కరాజ్యైశ్చ ఫలైః పుష్పైస్సుగంధిభిః ॥ ౯౪

విద్యావిదో విశేషేణ భోజయే త్షోడశద్విజాన్ ।
ఏవం నిత్యార్చనం కుర్యా దాదౌ బ్రాహ్మణభోజనమ్ ॥ ౯౫

త్రిశతీనామభిః పశ్చాత్ బ్రాహ్మణాన్ క్రమశోఽర్చయేత్ ।
తైలాభ్యంగాదికం దద్యాద్విభవే సతి భక్తితః ॥ ౯౬

శుక్లప్రతిపదారభ్య పౌర్ణమాస్యవధి క్రమాత్ ।
దివసే దివసే విప్రా భోజ్యా వింశతిసంఖ్యయా ॥ ౯౭

దశభిః పంచభి ర్వాఽపి త్రిభి రేకేన వా దినైః ।
త్రింశత్షష్టిః శతం విప్రాన్ భోజయే త్త్రిశతం క్రమాత్ ॥ ౯౮

ఏవం యః కురుతే భక్త్యా జన్మమధ్యే సకృన్నరః ।
తస్యైవ సఫలం జన్మ ముక్తి స్తస్య కరే స్థితా ॥ ౯౯

రహస్యనామసాహస్రై రర్చనేఽప్యేవమేవ హి ।
ఆదౌ నిత్యబలిం కుర్యా త్పశ్చాద్బ్రాహ్మణభోజనమ్ ॥ ౧౦౦

రహస్యనామసాహస్రమహిమా యో మయోదితః ।
స శీకరాణు రత్రైకనామ్నో మహిమవారిధేః ॥ ౧౦౧

వాగ్దేవీరచితే నామసాహస్రే యద్యదీరితం ।
తత్తత్ఫల మవాప్నోతి నామ్నోఽప్యేకస్య కీర్తనాత్ ॥ ౧౧౨

ఏతదన్యైర్జపై స్తోత్రై రర్చనై ర్యత్ఫలం భవేత్ ।
తత్ఫలం కోటిగుణితం భవే న్నామశతత్రయాత్ ॥ ౧౧౩

రహస్యనామసాహస్రకోట్యావృత్త్యాస్తు యత్ఫలం ।
తద్భవే త్కోటిగుణితం నామత్రిశతకీర్తనాత్ ॥ ౧౧౪

వాగ్దేవీరచితే స్తోత్రే తాదృశో మహిమా యది ।
సాక్షాత్కామేశ కామేశీకృతేఽస్మిన్ గృహ్యతా మితి ॥

సకృత్సంకీర్తనా దేవ నామ్నా మస్మిన్ శతత్రయే ।
భవే చ్చిత్తస్య పర్యాప్తి ర్న్యూన మన్యానపేక్షిణీ ॥ ౧౧౬

న జ్ఞాతవ్య మిత స్త్వన్యన్న జప్తవ్యం చ కుంభజ ।
యద్య త్సాధ్యతమం కార్యం త త్తదర్థ మిదం జపేత్ ॥ ౧౧౭

తత్తత్సిద్ధి మవాప్నోతి పశ్చాత్కార్యం పరీక్షయేత్ ।
యే యే ప్రసంగా స్తంత్రేషు తైస్తై ర్యత్సాధ్యతే ధ్రువమ్ ॥

తత్సర్వం సిద్ధ్యతి క్షిప్రం నామత్రిశతకీర్తనాత్ ।
ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్ ॥ ౧౧౯

విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వప్రదాయకం ।
సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్ ॥ ౧౨౦

సర్వాభీష్టప్రదం చైవ దేవీనామశతత్రయం ।
ఏతజ్జపపరో భూయా న్నాన్య దిచ్ఛే త్కదాచన ॥ ౧౨౧

ఏత త్కీర్తనసంతుష్టా శ్రీదేవీ లలితాంబికా ।
భక్తస్య యద్యదిష్టం స్యాత్తత్తత్పూరయతే ధ్రువమ్ ॥ ౧౧౨

తస్మాత్కుంభోద్భవమునే కీర్తయ త్వ మిదం సదా ।
అపరం కించిదపి తే బోద్ధవ్యం నావశిష్యతే ॥ ౧౧౩

ఇతి తే కథితం స్తోత్రం లలితాప్రీతిదాయకం ।
నావిద్యావేదినే బ్రూయా న్నాభక్తాయ కదాచన ॥ ౧౧౪

న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్ ।
యో బ్రూయాత్త్రిశతీం నామ్నాం తస్యానర్థో మహాన్ భవేత్ ॥ ౧౧౫

ఇత్యాజ్ఞా శాంకరీ ప్రోక్తా తస్మాద్గోప్య మిదం త్వయా ।
లలితాప్రేరితేనైవ మయోక్తం స్తోత్ర ముత్తమమ్ ॥ ౧౧౬

రహస్యనామసాహస్రా దతిగోప్య మిదం మునే ॥
ఏవ ముక్త్వా హయగ్రీవః కుంభజం తాపసోత్తమమ్ ॥ ౧౧౭

స్తోత్రేణానేన లలితాం స్తుత్వా త్రిపురసుందరీం ।
ఆనందలహరీమగ్నమానస స్సమవర్తత ॥ ౧౧౮

ఇతి బ్రహ్మాండపురాణే, ఉత్తరఖండే, హయగ్రీవాగస్త్య
సంవాదే, లలితోపాఖ్యానే, స్తోత్రఖండే
లలితాంబాత్రిశతీస్తోత్రరత్నం

సమాప్తమ్

# శ్రీ లలితా త్రిశతీ నామావళిః

ఓం ఐం హ్రీం శ్రీం
ఓం కకారరూపాయై నమః
కల్యాణ్యై
కల్యాణగుణశాలిన్యై
కల్యాణశైలనిలయాయై
కమనీయాయై
కళావత్యై
కమలాక్ష్యై
కల్మషఘ్న్యై
కరుణామృతసాగరాయై
కదంబకాననావాసాయై ౧౦
కదంబకుసుమప్రియాయై
కందర్పవిద్యాయై
కందర్పజనకాపాంగవీక్షణాయై
కర్పూరవీటీసౌరభ్యకల్లోలిత
కకుప్తటాయై
కలిదోషహరాయై
కంజలోచనాయై
కమ్రవిగ్రహాయై
కర్మాదిసాక్షిణ్యై
కారయిత్ర్యై
కర్మఫలప్రదాయై ౨౦
ఏకారరూపాయై
ఏకాక్షర్యై
ఏకానేకాక్షరాకృత్యై
ఏతత్తదిత్యనిర్దేశ్యాయై

ఓం ఐం హ్రీం శ్రీం
ఏకానందచిదాకృత్యై
ఏవమిత్యాగమాబోధ్యాయై
ఏకభక్తిమదర్చితాయై
ఏకాగ్రచిత్తనిర్ధ్యాతాయై
ఏషణారహితాదృతాయై
ఏలాసుగంధిచికురాయై ౩౦
ఏనఃకూటవినాశిన్యై
ఏకభోగాయై
ఏకరసాయై
ఏకైశ్వర్యప్రదాయిన్యై
ఏకాతపత్రసామ్రాజ్య
ప్రదాయై
ఏధమానప్రభాయై
ఏజదనేజజ్జగదీశ్వర్యై
ఏకవీరాదిసంసేవ్యాయై
ఏకప్రాభవశాలిన్యై ౪౦
ఈకారరూపిణ్యై
ఈశిత్ర్యై
ఈప్సితార్థప్రదాయిన్యై
ఈదృగిత్యవినిర్దేశ్యాయై
ఈశ్వరత్వవిధాయిన్యై
ఈశానాదిబ్రహ్మమయ్యై
ఈశిత్వాద్యష్టసిద్ధిదాయై
ఈక్షిత్ర్యై
ఈక్షణసృష్టాండకోట్యై

ఓం ఐం హ్రీం శ్రీం
ఈశ్వరపల్లభాయై ౫౦
ఈశిత్రాయై
ఈశ్వరార్ధాంగశరీరాయై
ఈశాధిదేవతాయై
ఈశ్వరప్రేరణకర్త్ర్యై
ఈశతాండవసాక్షిణ్యై
ఈశ్వరోత్సంగనిలయాయై
ఈతిభాధావినాశిన్యై
ఈహావిరహితాయై
ఈశశక్త్యై
ఈషత్స్మితాననాయై ౬౦
లకారరూపాయై
లలితాయై
లక్ష్మీవాణీసేవితాయై
లాకిన్యై
లలనారూపాయై
లసద్దాడిమపాటలాయై
లలంతికాలసత్ఫాలాయై
లలాటనయనార్చితాయై
లక్షణోజ్జ్వల దివ్యాంగ్యై
లక్షకోట్యండనాయికాయై ౭౦
లక్ష్యార్థాయై
లక్షణాగమ్యాయై
లబ్ధకామాయై
లతాతనవే

ఓం ఐం హ్రీం శ్రీం
లలామరాజదలికాయై
లంబిముక్తాలతాంచితాయై
లంబోదరప్రసవే
లభ్యాయై
లజ్జాఢ్యాయై
లయవర్జితాయై ౮౦
హ్రీంకారరూపాయై
హ్రీంకారనిలయాయై
హ్రీంపదప్రియాయై
హ్రీంకారబీజాయై
హ్రీంకారమంత్రాయై
హ్రీంకారలక్షణాయై
హ్రీంజపసుప్రీతాయై
హ్రీంమత్యై
హ్రీంవిభూషణాయై
హ్రీంశీలాయై ౯౦
హ్రీంపదారాధ్యాయై
హ్రీంగర్భాయై
హ్రీంపదాభిధాయై
హ్రీంకారవాచ్యాయై
హ్రీంకారపూజ్యాయై
హ్రీంకారపీఠికాయై
హ్రీంకారవేద్యాయై
హ్రీంకారచింత్యాయై
హ్రీం

ఓం ఐం హ్రీం శ్రీం

హ్రీంశరీరిణ్యై ౧౦౦
హకారరూపాయై
హలధృత్పూజితాయై
హరిణేక్షణాయై
హరప్రియాయై
హరారాధ్యాయై
హరిబ్రహ్మేంద్రసేవితాయై
హయారూఢాసేవితాంఘ్ర్యై
హయమేధసమర్చితాయై
హర్యక్షవాహనాయై
హంసవాహనాయై ౧౧౦
హతదానవాయై
హత్యాదిపాపశమన్యై
హరిదశ్వాదిసేవితాయై
హస్తికుంభోత్తుంగకుచాయై
హస్తికృత్తిప్రియాంగనాయై
హరిద్రాకుంకుమాదిగ్ధాయై
హర్యశ్వాద్యమరార్చితాయై
హరికేశసఖ్యై
హాదివిద్యాయై
హాలామదాలసాయై ౧౨౦
సకారరూపాయై
సర్వజ్ఞాయై
సర్వేశ్యై
సర్వమంగళాయై

ఓం ఐం హ్రీం శ్రీం

సర్వదాత్ర్యై
సర్వకర్త్ర్యై
సర్వహంత్ర్యై
సనాతన్యై
సర్వానవద్యాయై
సర్వాంగసుందర్యై ౧౩౦
సర్వసాక్షిణ్యై
సర్వాత్మికాయై
సర్వవిమోహిన్యై
సర్వాధారాయై
సర్వగతాయై
సర్వావగుణవర్జితాయై
సర్వారుణాయై
సర్వమాత్రే
సర్వాభరణభూషితాయై ౧౪౦
కకారార్థాయై
కాలహంత్ర్యై
కామేశ్యై
కామితార్థదాయై
కామసంజీవన్యై
కల్యాయై
కఠినస్తనమండలాయై
కరభోరవే
కళానాథముఖ్యై
కచజితాంబుదాయై ౧౫౦

ఓం ఐం హ్రీం శ్రీం
కటాక్షస్యందికరుణాయై
కపాలిప్రాణనాయికాయై
కారుణ్యవిగ్రహాయై
కాంతాయై
కాంతిధూతజపావల్యై
కలాలాపాయై
కంబుకంఠ్యై
కరనిర్జితపల్లవాయై
కల్పవల్లీసమభుజాయై
కస్తూరీతిలకోజ్జ్వలాయై ౧౬౦
హకారార్థాయై
హంసగత్యై
హాటకాభరణోజ్జ్వలాయై
హారహారికుచాభోగాయై
హాకిన్యై
హల్యవర్జితాయై
హరిత్పతిసమారాధ్యాయై
హఠాత్కారహతాసురాయై
హర్షప్రదాయై
హవిర్భోక్త్ర్యై ౧౭౦
హార్దసంతమసాపహాయై
హల్లీహాలాస్యసంతుష్టాయై
హంసమంత్రార్థరూపిణ్యై
హానోపాదాననిర్ముక్తాయై
హర్షిణ్యై

ఓం ఐం హ్రీం శ్రీం
హరిసోదర్యై
హాహాహూహూముఖ
స్తుత్యాయై
హానివృద్ధివివర్జితాయై
హయ్యంగవీనహృదయాయై
హరికోపారుణాంశుకాయై
౧౮౦
లకారాఖ్యాయై
లతాపూజ్యాయై
లయస్థిత్యుద్భవేశ్వర్యై
లాస్యదర్శనసంతుష్టాయై
లాభాలాభవివర్జితాయై
లంఘ్యేతరాజ్ఞాయై
లావణ్యశాలిన్యై
లఘుసిద్ధిదాయై
లాక్షారససవర్ణాభాయై
లక్ష్మణాగ్రజపూజితాయై
౧౯౦
లభ్యేతరాయై
లబ్ధభక్తిసులభాయై
లాంగలాయుధాయై
లగ్నచామరహస్త
శ్రీశారదాపరివీజితాయై
లజ్జాపదసమారాధ్యాయై
లంపటాయై

ఓం ఐం హ్రీం శ్రీం
లబ్ధైశ్వర్యై
లబ్ధమానాయై
లబ్ధరసాయై
లబ్ధసంపత్సమున్నత్యై ౨౦౦
హ్రీంకారిణ్యై
హ్రీంకారాద్యాయై
హ్రీంమధ్యాయై
హ్రీంశిఖామణయే
హ్రీంకారకుండాగ్నిశిఖాయై
హ్రీంకారశశిచంద్రికాయై
హ్రీంకారభాస్కరరుచ్యై
హ్రీంకారాంభోదచంచలాయై
హ్రీంకారకందాంకురికాయై
హ్రీంకారైకపరాయణాయై ౨౧౦
హ్రీంకారదీర్ఘికాహంస్యై
హ్రీంకారోద్యానకేకిన్యై
హ్రీంకారారణ్యహరిణ్యై
హ్రీంకారావాలవల్ల్యై
హ్రీంకారపంజరశుక్యై
హ్రీంకారాంగణదీపికాయై
హ్రీంకారకందరాసింహ్యై
హ్రీంకారాంబుజభృంగికాయై
హ్రీంకారసుమనోమాధ్వ్యై

ఓం ఐం హ్రీం శ్రీం
హ్రీంకారతరుమంజర్యై ౨౨౦
సకారాఖ్యాయై
సమరసాయై
సకలాగమసంస్తుతాయై
సర్వవేదాంతతాత్పర్యభూమ్యై
సదసదాశ్రయాయై
సకలాయై
సచ్చిదానందాయై
సాధ్వ్యై
సద్గతిదాయిన్యై
సనకాదిమునిధ్యేయాయై ౨౩౦
సదాశివకుటుంబిన్యై
సకలాధిష్ఠానరూపాయై
సత్త్వరూపాయై
సమాకృత్యై
సర్వప్రపంచనిర్మాత్ర్యై
సమానాధికవర్జితాయై
సర్వోత్తుంగాయై
సంగహీనాయై
సద్గుణాయై
సకలేష్టదాయై ౨౪౦
కకారిణ్యై

ఓం ఐం హ్రీం శ్రీం

కావ్యలోలాయై
కామేశ్వరమనోహరాయై
కామేశ్వరప్రాణనాడ్యై
కామేశోత్సంగవాసిన్యై
కామేశ్వరాలింగితాంగ్యై
కామేశ్వరసుఖప్రదాయై
కామేశ్వరప్రణయిన్యై
కామేశ్వరవిలాసిన్యై
కామేశ్వరతపస్సిద్ధ్యై ౧౦౦
కామేశ్వరమనఃప్రియాయై
కామేశ్వరప్రాణనాథాయై
కామేశ్వరవిమోహిన్యై
కామేశ్వరబ్రహ్మవిద్యాయై
కామేశ్వరగృహేశ్వర్యై
కామేశ్వరాహ్లాదకర్యై
కామేశ్వరమహేశ్వర్యై
కామేశ్వర్యై
కామకోటినిలయాయై
కాంక్షితార్థదాయై ౧౧౦
లకారిణ్యై
లబ్ధధియే
లబ్ధవాంఛితాయై
లబ్ధపాపమనోదూరాయై
లబ్ధాహంకారదుర్గమాయై
లబ్ధశక్త్యై

ఓం ఐం హ్రీం శ్రీం

లబ్ధదేహాయై
లబ్ధైశ్వర్యసమున్నత్యై
లబ్ధబుద్ధయే ౧౨౦
లబ్ధలీలాయై
లబ్ధయౌవనశాలిన్యై
లబ్ధాతిశయసర్వాంగ
సౌందర్యాయై
లబ్ధవిభ్రమాయై
లబ్ధరాగాయై
లబ్ధపతయే
లబ్ధనానాగమస్థిత్యై
లబ్ధభోగాయై
లబ్ధసుఖాయై
లబ్ధహర్షాభిపూజితాయై
౧౩౦
హ్రీంకారమూర్తయే
హ్రీంకారసౌధశృంగ
కపోతికాయై
హ్రీంకారదుగ్ధాబ్ధిసుధాయై
హ్రీంకారకమలేందిరాయై
హ్రీంకారమణిదీపార్చిషే
హ్రీంకారతరుశారికాయై
హ్రీంకారపేటకమణయే
హ్రీంకారాదర్శబింబికాయై

ఓం ఐం హ్రీం శ్రీం
హ్రీంకారకోశాసిలతాయై
హ్రీంకారాస్థాన నర్తక్యై ౨౬౦
హ్రీంకారశుక్తికామణయే
హ్రీంకారబోధితాయై
హ్రీంకారమయ సౌవర్ణస్తంభ
విద్రుమపుత్రికాయై
హ్రీంకారవేదోపనిషదే
హ్రీంకారాధ్వరదక్షిణాయై

ఓం ఐం హ్రీం శ్రీం
హ్రీంకారనందనారామ
నవకల్పకవల్లర్యై
హ్రీంకారహిమవద్గంగాయై
హ్రీంకారార్ణవకౌస్తుభాయై
హ్రీంకారమంత్రసర్వస్వాయై
హ్రీంకారపరసౌఖ్యదాయై
౩౦౦

ఓం ఐం హ్రీం శ్రీం
శ్రీమద్రాజరాజేశ్వర్యై
నమః

శ్రీ లలితా త్రిశతీ స్తోత్రరత్న నామావళిః సమాప్తా



శ్రీః

# లలితా త్రిశతీ పూర్వపీఠిక

శ్లో॥ వందే విఘ్నేశ్వరం దేవం సర్వసిద్ధిప్రదాయినమ్ ।
వామాంకగూఢ వామాక్షీకరపల్లవ పూజితమ్ ॥ ౧

తా॥ సర్వసిద్ధి ప్రదాత, వామాంకస్థిత, ముగ్ధ మోహనాకృతియు నయిన లక్ష్మీదేవి యొక్క కరపల్లవములచే పూజింపబడువాడు, స్వయంప్రకాశమానుడు నయిన విఘ్నేశ్వరునకు - లక్ష్మీగణపతికి ప్రహ్వీభావ సంపన్నుడనై నమస్కారము చేయుచున్నాను.

శ్లో॥ పాశాంకుశేక్షు సుమరాజిత పంచశాఖాం
పాటల్యశోభిసుషమాంచిత గాత్రవల్లీమ్ ।
ప్రాచీన వాక్ స్తుతపదాం పరదేవతాం త్వాం
పంచాయుధార్చితపదాం ప్రణమామి దేవీమ్ ॥ ౨

తా॥ జగన్మాత పాశాయుధము, అంకుశాయుధము, ఇక్షు ధనుస్సు, పుష్పబాణములు - వీనిచే విరాజమానమవుచున్న పంచశాఖలు గలది; పాటలవర్ణాంచిత సుషమాశోభితమైన గాత్రవల్లి (లతవంటి సుకుమార శరీరము) గలది, అపౌరుషేయములైన వేదవాక్కులచే స్తుతింపబడిన పాదాంబుజములు గలది, ఆమె స్వయంప్రకాశమాన, పరదేవతాస్వరూపిణి; ఏతాదృశమహాత్మ్యోపేతమైన హే పరమేశ్వరి ! ప్రహ్వీభూతుడనై నీకు నమస్కారము చేయుచున్నాను.

శ్లో॥ లోపాముద్రాపతిం నత్వా హయగ్రీవ మహేశ్వరమ్ ।
శ్రీవిద్యారాజసంసిద్ధికారి పంకజవీక్షణమ్॥ 3

తా॥ శ్రీవిద్యాప్రవర్తకుడు, శ్రీవిద్యాంగదేవత యయిన శ్రీ లోపాముద్రకు భర్త, గురువు, దైవము నయిన యగస్త్య మహర్షికి నమస్కరించి, శ్రీవిద్యామంత్రరాజములైన పంచదశీ, షోడశీ మహామంత్రముల సిద్ధిని భక్తుల కనుగ్రహించు నట్టి పంకజనేత్రుడు, కర్తుం, అకర్తుం, అన్యథాకర్తుంచ (చేయుటకు, చేయకుండుటకు, మఱియొక రీతిగా చేయుటకును) సమర్థుడైన శ్రీ హయగ్రీవస్వామికి గూడ నమస్కరించి —

శ్లో॥ విస్తారితాం బహువిధాం బహుభిః కృతాం చ
టీకాం విలోకయితు మక్షమతాం జనానామ్ ।
తత్ర త్య సర్వపదయోగవివేకభానుం
తుష్ట్యై కరోమి లలితాపదభక్తియోగాత్ ॥ 4

తా॥ సూరిజను లనేకులు ఈ లలితాత్రిశతికి బహువిధములుగ టీకలు రచించిరి. కాని, భక్తజనులు ఆ టీకలను చూచుటకుగాని, యన్వయము చేసికొనుటకుగాని సమర్థులు గాకున్నారు. అట్టివారల సంతుష్టికై శ్రీ లలితాదేవీ చరణ సరోరుహముల యందలి భక్తిసమాశ్రయణము వలన, లలితాత్రిశతి యందలి సర్వపద సంబంధమును వివేచనచేసి ప్రకాశింప జేయుటలో భాస్కర సదృశమైన భాష్యమును రచించుచున్నాను.

# లలితా త్రిశతీ

అగస్త్య ఉవాచ :-

అగస్త్య మహర్షి హయగ్రీవునితో ఇట్లనెను —

శ్లో॥ హయగ్రీవ దయాసింధో భగవన్ శిష్యవత్సల ।
త్వత్తః శ్రుత మశేషేణ శ్రోతవ్యం యద్యదస్తి తత్ ॥ ౧

తా॥ హే హయగ్రీవ ! దయాసాగర ! భగవన్ ! శిష్యవత్సల ! వినదగినదంతయు నీవలన నేను సంపూర్ణముగా విని యుంటిని.

శ్లో॥ రహస్యనామసాహస్రమపి త్వత్తః శ్రుతం మయా ।
ఇతఃపరం మే నాస్త్యేవ శ్రోతవ్య మితి నిశ్చయః ॥ ౨

తా॥ రహస్యనామ స్తోత్రము (శ్రీలలితా రహస్యనామ స్తోత్రము) గూడ నీవలన వింటిని. ఇంతకంటె నధికముగా వినదగిన దేదియు లేదనియే నా నిశ్చయము.

శ్లో॥ తథాఽపి మమ చిత్తస్య పర్యాప్తిర్నైవ జాయతే ।
కార్త్స్న్యార్థః ప్రాప్య ఇత్యేవ శోచయిష్యామ్యహం ప్రభో ॥ 3

తా॥ హే ప్రభో ! ఆ రీతిగా వినియున్నను, నా చిత్తమునకు సంతృప్తి కలుగుటలేదు. సంపూర్ణమైన యథార్థమంతయు తెలిసుకొనదగినది యింకను మిగిలియున్నదని నేను విచారించుచున్నాను.

శ్లో॥ కిమిదం కారణం బ్రూహి జ్ఞాతవ్యాంశోఽస్తి వా పునః ।
అస్తి చేన్మమ తద్బ్రూహి బ్రూహీత్యుక్త్వాప్రణమ్య తమ్ ॥ ౪

తా॥ ఇంత తెలిసికొనినను తృప్తి లేకపోవుటకు కారణము చెప్పుము. ఇంకను తెలిసికొనదగిన యంశమున్నదా ? ఒక వేళ జ్ఞాతవ్యాంశమున్నచో, దానిని నాకు చెప్పుడని పలికి, ఆ హయగ్రీవదేవునకు సమస్కరించి —

సూత ఉవాచ :-

సూతుడిట్లనెను —

శ్లో॥ సమాలలంబే తత్పాదయుగలం కలశోద్భవః ।
హయాననో భీతభీతః కిమిదం కిమదంత్వితి ॥ ౫

తా॥ కలశోద్భవుడైన యగస్త్య మహర్షి శ్రీహయగ్రీవుని పాదపద్మములను గట్టిగా పట్టుకొనెను. హయగ్రీవుడు భీతభీతుడై యిదియేమి, యిదియేమి ? యని —

శ్లో॥ ముంచ ముంచేతి తం చోక్త్వా చింతాక్రాంతో బభూవ సః ।
చిరం విచార్య నిశ్చిన్వన్ వక్తవ్యం న మయేత్యసౌ॥ ౬

తా॥ పాదములను వీడుము, వీడు మని యగస్త్యునితో పలికి హయగ్రీవుడు చింతాక్రాంతుడాయెను. చిరకాలము

విచారించి, తాను లలితాత్రిశతీ రహస్యమును చెప్పగూడదని నిశ్చయించుకొనినవాడై —

శ్లో॥ తూష్ణీం స్థితః స్మరన్నాజ్ఞాం లలితాంబాకృతాం పురా,।
ప్రణమ్య విప్రః స ముని స్తత్పాదా వత్యజన్నితః ॥ ౭

తా॥ శ్రీ లలితాపరాభట్టారిక 'ఈ లలితా త్రిశతిని ఎవరికిని చెప్పజనదు' అని పూర్వము చేసిన యాజ్ఞను తలచుకొనుచు తూష్ణీంభావముతో మెదలక యుండెను. వేదమయుడయిన హయగ్రీవునకు నమస్కరించి విప్రుడు, మునిపుంగవుడయిన యగస్త్యుడు హయగ్రీవుని పాదములను వదలక యట్లే యుండెను.

శ్లో॥ వర్షత్రయావధి తదా గురుశిష్యౌ తథా స్థితౌ ।
తచ్ఛృణ్వంతశ్చ పశ్యంతః సర్వే లోకాః సువిస్మితాః॥౮

తా॥ అపుడు మూడు సంవత్సరములు గడచువఱకు గురువు గురురూపముననే కూర్చొనెను, శిష్యుడు పాదోపసంగ్రహణముతో నొడలు మఱచి ధ్యాననిమగ్నుడాయెను. ఆ గురుశిష్యుల ప్రవృత్తిని వినిన, చూచిన సర్వలోకనివాసులు విస్మయావిష్టులైరి.

శ్లో॥ తతః శ్రీలలితాదేవీ కామేశ్వరసమన్వితా ।
ప్రాదుర్భూయ హయగ్రీవం రహస్యేవ
మచోదయత్ ॥ ౯

తా॥ మూడు సంవత్సరములు గురుశిష్యు లిరువురును ఆ స్థితిలో నుండగా, కామేశ్వరసహితయైన శ్రీ లలితాంబిక ప్రత్యక్షమై హయగ్రీవుని రహస్యముగా ఈవిధముగా ప్రేరేపించెను.

శ్రీ దేవ్యువాచ :-

శ్రీదేవి యిట్లు పలికెను.

శ్లో॥ అశ్వాననాఽఽవయోః ప్రీతిః శాస్త్రవిశ్వాసిని
త్వయి।
రాజ్యం దేయం శిరో దేయం న దేయా షోడ
శాక్షరీ ॥ ౧౦

తా॥ ఓ హయానన ! శాస్త్రవిశ్వాసి వయిన నీయందు మా యిరువురకు ప్రీతి గలదు. అర్థించెడు భక్తునకు లేదనలేక యిచ్చువాడు రాజ్యమునైనను ఈయవచ్చును, మఱియు నావశ్యకమైన, శిరస్సును సయితము నీయవచ్చునుగాని షోడశాక్షరీ మహామంత్రము నెవ్వరికి నీయరాదు.

శ్లో॥ స్వమాతృజారవద్గోప్యా విద్యైషేత్యాగమా జగుః।
తతోఽతిగోపనీయా మే సర్వపూర్తికరీ స్తుతిః ॥ ౧౧

తా॥ ఈ షోడశాక్షరీవిద్య మాతృజారిణీత్వమువలె గోపనీయమని యాగమములుచెప్పుచున్నవి. నాసర్వపూర్తికరీస్తుతియు షోడశాక్షరీ విద్యకంటె అతిగోపనీయము.

శ్లో॥ మయా కామేశ్వరేణాపి కృతా సంగోపితా భృశమ్ ।
మదాజ్ఞయా వచో దేవ్య శ్చక్రు ర్నామ
సహస్రకమ్ ॥ ౧౨

తా॥ నాచేతను, కామేశ్వరుని చేతను ఈ సర్వపూర్తికరీస్తుతి రూపమైన త్రిశతి ప్రణీతమై యత్యంత గోప్యముగా నుంచబడినది. నా యాజ్ఞవలన వాగ్దేవతలు లలితాసహస్రనామ స్తోత్ర ప్రణయనము గావించిరి.

శ్లో॥ ఆవాభ్యాం కథితా ముఖ్యా సర్వపూర్తికరీ స్తుతిః ।
సర్వక్రియాణాం వైకల్యపూర్తి ర్యజ్జపతో భవేత్ ॥ ౧౩

తా॥ కామేశ్వరీ కామేశ్వరులమైన మా యిరువురిచేత చెప్పబడిన ఈ సర్వపూర్తికరీస్తుతి (సర్వవిద్యాసిద్ధి కరీస్తుతి) ముఖ్యమైనది. ఈ సర్వపూర్తికరీస్తుతి జపము (పారాయణము) వలన సర్వకార్యములు వైకల్యము లేక సిద్ధించును.

శ్లో॥ సర్వపూర్తికరం తస్మా దిదం నామ కృతం మయా ।
తద్బ్రూహి త్వమగస్త్యాయ పాత్రమేవ న సంశయః ॥

తా॥ కావున, సర్వసిద్ధిపూర్తికరమైన ఈ నామశతత్రయము నాచే ప్రణయనము చేయబడినది. రహస్యమైన ఈ త్రిశతీ స్తవమును అగస్త్యునకు చెప్పుము. ఇతడు ఈ స్తవము నుపదేశించుటకు పాత్రుడు, సందేహము లేదు.

శ్లో॥ పత్న్యస్య లోపాముద్రాఖ్యా మాముపాస్తేఽతి భక్తితః ।
అయం చ నితరాం భక్త స్తస్మా దస్య వదస్వ తత్ ॥ ౧౫

తా॥ లోపాముద్ర యను పేరుగల యీ యగస్త్యుని భార్య భక్త్యతిశయముతో నన్నుపాసించును. ఈ యగస్త్యుడు గూడ నాయందు అత్యంతభక్తి గలవాడు. కావున, ఈ సర్వపూర్తికరీ స్తుతిని ఈ యగస్త్యునకు ఉపదేశించుము.

శ్లో॥ అముంచమాన స్త్వత్పాదౌ వర్షత్రయ మసౌ స్థితః।
ఏతద్ జ్ఞాతు మతో భక్త్యా హీదమేవ నిదర్శనమ్॥ ౧౬

తా॥ త్వత్పాద సంగ్రహణముచేసి విడువక, మూడు సంవత్సరములు ధ్యాన నిష్ఠుడై యేకభక్తితో నిన్ను సేవించుచు ఉన్నాడు. ఆయన పాత్రతను (యోగ్యతను) తెలిసికొనుటకు ఇదియే నిదర్శనము.

శ్లో॥ చిత్తపర్యాప్తి రేతస్య నాన్యథా సంభవిష్యతి ।
సర్వపూర్తికరం తస్మా దనుజ్ఞాతో మయా వద ॥ ౧౭

తా। సర్వపూర్తికరీ స్తుతియైన త్రిశతిని చెప్పక, మఱియొక రీతిగా యితని చిత్తమునకు సంపూర్ణమైన యానందము కలుగ నేరదు. కావున నేను నీకనుజ్ఞ యిచ్చుచున్నాను. నీవు ఈ యగస్త్యునకు సర్వపూర్తికర త్రిశతిని చెప్పుము.

సూత ఉవాచ :-

సూతుడనెను -

శ్లో॥ ఇత్యుక్త్వాఽంతరధాదంబా కామేశ్వరసమన్వితా ।
అథోత్థాప్య హయగ్రీవః పాణిభ్యాం కుంభసంభవః॥ ౧౮
సంస్థాప్య నికటే వాచ మువాచ భృశవిస్మితః ।

తా॥ ఈ విధముగా పలికి కామేశ్వరీదేవి కామేశ్వర సహితయై యంతర్ధానము చెందెను. తదనంతరము హయగ్రీవుడు వర్షత్రయము పాదములు వీడక పడియున్న యగస్త్యుని రెండు చేతులతో ఆదరముగ పైకి లేవనెత్తి సమీపమున కూర్చుండ బెట్టుకొని అతివిస్మితుడై యిట్లు పలికెను.

హయగ్రీవ ఉవాచ :-

హయగ్రీవుడు పలికెను -

శ్లో॥ కృతార్థోఽసి కృతార్థోఽసి కృతార్థోఽసి ఘటోద్భవ ॥ ౧౯

తా॥ ఓ అగస్త్యుడా ! నీవు ముమ్మాటికి కృతార్థుడవైతివి.

శ్లో॥ త్వత్సమో లలితాభక్తో నాస్తి నాస్తి జగత్త్రయే ॥
యేనాగస్త్య స్వయం దేవీ తవ వక్తవ్య మన్వశాత్ ॥ ౨౦

తా॥ ముల్లోకములయందు నీతో సమునైన శ్రీలలితాదేవీభక్తుడు మఱియొకడు లేడు. అందువలన, నీవు ఉపదేశమునకు అర్హుడవని శ్రీదేవి యనుశాసించెను.

సచ్ఛిష్యేణ త్వయా చాహం ద్రష్టవా నస్మితాం శివామ్ ।
యతంతే దర్శనార్థాయ బ్రహ్మవిష్ణ్వీశపూర్వకాః॥ ౨౧

తా॥ సచ్ఛిష్యుఁడవైన నీకారణముగా నేను పరమేశానిని దర్శించితిని. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులు శివస్వరూపిణి యైన లలితాదేవీదర్శనమునకై ప్రయత్నింతురు. తాదృశ మహత్త్వ సంపన్నమైన పరాభట్టారికాదర్శనము అమేయమగు నీ భక్తి వలన నాకు లభించినది.

శ్లో॥ అతఃపరం తే వక్ష్యామి సర్వపూర్తికరం స్తవమ్ ।
యస్య స్మరణమాత్రేణ పర్యాప్తి స్తే భవేత్
హృది ॥ ౨౨

తా॥ ఇకముందు సర్వపూర్తికరమైన లలితాదేవీ స్తవమును నీకు చెప్పెదను. ఆ సర్వపూర్తికర స్తవము స్మరించిన మాత్రమున నీ హృదయమునందెట్టి లోపములేని సంతృప్తి కలుగును.

శ్లో॥ రహస్యనామసాహస్రాదపి గుహ్యతమం మునే ।
ఆవశ్యకం తతోఽప్యేతల్లలితాం సముపాసితామ్ ॥౨౩

తా॥ శ్రీలలితాసహస్రనామ స్తోత్రము కంటె ఈ త్రిశతీ స్తోత్రము గుహ్యతమమైనది. శ్రీలలితాదేవిని సముపాసించుటకు ఈ సర్వపూర్తికర స్తవము లలితాసహస్రనామ స్తోత్రము కంటె అత్యంతావశ్యకమైనదని తెలియుము.

శ్లో॥ తదహం సంప్రవక్ష్యామి లలితాంబానుశాసనాత్ ।
శ్రీమత్పంచదశాక్షర్యాః కాదివర్ణా న్క్రమాన్మునే॥ ౨౮

తా॥ శ్రీలలితాంబిక యాజ్ఞవలన నేను ఆ సర్వసంపూర్తి కర స్తోత్రము నుపదేశింపబోవుచున్నాను. హే మునే! శ్రీ పంచదశాక్షరివిద్యాసంబంధమైన కాదివర్ణవిశిష్ట నామములను క్రమముగా చెప్పబోవుచున్నాను.

శ్లో॥ పృథగ్వింశతినామాని కథితాని ఘటోద్భవ ।
ఆహత్య నామ్నాం త్రిశతీ సర్వసంపూర్తికారిణీ॥ ౨౯

తా॥ శ్రీవిద్య కాదివిద్య, హాదివిద్య యని ప్రసిద్ధము. కాదివిద్యయందు పదునైదు బీజాక్షరములు కలవు. దీనినే శ్రీ లలితాపంచదశి యందురు. ఇదియే సౌభాగ్యవిద్య యనుపేర ప్రసిద్ధము. ఓ కుంభసంభవ! ఒక్కొక్క యక్షరమునకు ఇరువది నామములు వేరువేరుగా చెప్పబడినవి. మొత్తము కలిసి మూడు వందల నామములతో సర్వసంపూర్తికారిణీవిద్యారూప త్రిశతి యగును.

శ్లో॥ రహస్యాతిరహస్యైషా గోపనీయా ప్రయత్నతః ।
తాం శృణుష్వ మహాభాగ సావధానేన చేతసా॥ ౩౦

తా॥ రహస్యాతిరహస్యమైన, సర్వపూర్తికారిణియైన ఈ త్రిశతీవిద్య విశేషప్రయత్నముతో గోపనీయముగా నుంచుకొని యుపాసింపదగి యున్నది. మహాభాగ! సావధాన చిత్తముతో ఆ త్రిశతీవిద్యను వినుము.

శ్లో॥ కేవలం నామబుద్ధిస్తే న కార్యా తేషు కుంభజ।
మంత్రాత్మకత్వమేతేషాం నామ్నాం నామాత్మ
తాఽపి చ ॥ ౨౭

తా॥ హే అగస్త్య! ఆ నామములయందు కేవల నామ బుద్ధి మాత్రమే కలిగి యుండగాదు. ఈ నామములకు మంత్రాత్మకత్వము, నామాత్మకత్వము రెండును గలవు.

శ్లో॥ తస్మాదేకాగ్రమనసా శ్రోతవ్యం చ త్వయా సదా।

తా॥ కావున, నీవు ఏకాగ్రచిత్తముతో ఈ త్రిశతిని నిరంతరము అర్థావబోధపర్యంతము శ్రవణము చేయదగి యున్నది.

సూత ఉవాచ :-

సూతుడు పలికెను —

శ్లో॥ ఇత్యుక్త్వా తం హయగ్రీవః ప్రోచే నామ
శతత్రయమ్ ॥ ౨౮

తా॥ హయగ్రీవదేవుడు ఈ విధముగా పలికి అగస్త్యునకు నామశతత్రయము నుపదేశించెను.

పూర్వపీఠికా సమాప్తా

శ్రీమాత్రే నమః

# శ్రీ లలితా త్రిశతీ భాష్యమ్

శంకర భాష్యమ్ :- బహుకాలం సుభక్తిమహిమ్నా గురుపాదాంబుజమవలంబ్య స్థితాయ కుంభయోనిమునయే శివదంపతికృత నామశతత్రయోక్త్యై ప్రేరితో హయగ్రీవ ఉవాచ-

ఆంధ్ర వివరణము :- చిరకాలము ఏకభక్తి మహిమతో గురుచరణపంకజములను ఆశ్రయించియున్న యగస్త్యమహర్షికి కామేశ్వరీకామేశ్వర ప్రణీతమైన నామశతత్రయము నుపదేశించుటకు పరమేశ్వరిచే ప్రేరితుడైన హయగ్రీవదేవుడు ఇట్లు చెప్పెను —

శ్లో॥ కకారరూపా కల్యాణీ కల్యాణగుణశాలినీ ॥
కల్యాణశైలనిలయా కమనీయా కళావతీ ॥ ౧

## ౧. కకార రూపా

శం. భా. కకారరూపేతి। కకారః కవర్ణః రూపం జ్ఞాపక విశేషణం యస్యాః సా, కాదివిద్యావిగ్రహేత్యర్థః। అథవా, కకారః రూపం వాచకం యేషాం తే కకారరూపాః హిరణ్యగర్భః, ఉదకం, ఉత్తమాంగం, సుఖాదయశ్చ। హిరణ్యగర్భనిష్ఠ జగద్ధారక జగత్కర్తృత్వాది గుణవత్త్వం కకారస్య వ్యంజనాదిమవర్ణత్వేన వర్తత ఇతి తద్వాచ్యతయా తథా।

ఉదకనిష్ఠానాదిద్వారా జగత్సంజీవన హేతుత్వమపి కకారస్య విద్యాగ్రిమవర్తతయాఽస్తీతి తద్రూపా వా ।

సర్వేషాం ప్రాణినాం శిరస్యమృత మస్తీతి యోగ మార్గేణ కుండలినీగమనే తత్రత్య తత్ప్రవాహాప్లుత యోగినా మీశ్వరసామ్యం జాయత ఇతి యోగశాస్త్రేషు ప్రసిద్ధమ్ । తద్వత్ కవర్ణః మంత్రాదిమభాగస్థః తత్పురశ్చర్యాపరాయణానాం శివభావమేవ యచ్ఛతీతి వా తద్రూపేత్యర్థః, 'కం బ్రహ్మ ఖం బ్రహ్మ' ఇతి శ్రుతేః ।

దహరాకాశస్య సుఖస్వరూపత్వేన పరమప్రేమాస్పదతయా అభిలాషవిషయత్వవత్ కకారోఽప్యతిప్రీతివిషయ మూలమంత్రాదిమాక్షరతయా అభ్యర్హితత్వాద్వాత ద్రూపేత్యర్థః ॥ ఓం కకారరూపాయై నమః ॥



శ్లో॥ చింతామణిమనూపాస్య యోగగమ్యా సరస్వతీ ।
అక్షరే పరమే వ్యోమ్ని జ్ఞేయా సా సుప్రసీదతు ॥

శ్లో॥ ఏకధా బహుధాచైవ శంకరా శంకరం గురుమ్ ।
భాసయన్ త్రిశతీభాష్యం అజ్ఞః ఆంధ్రీకరోమ్యహమ్ ॥

శ్లో॥ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిణః ప్రేరణేన చ ॥
జనస్వామి సుబ్రహ్మణ్యసూరి సాహాయ్యసంపదా ॥

శ్లో॥ శ్రీరాఘవాద్యపదసంభృత భవ్యనామ్నా
నారాయణేన కవినా మయకా ప్రణీతా।
సేయం కృతిః దేవగురుద్విజాతిప్రమేధా
సంభావనేన భవతు ప్రథితాపదోషా ॥

ఆం. వి. 'కకారః' 'క' అను అక్షరము. ఈ 'క' వర్ణము పరాదేవిరూపమును ద్యోతనము చేయునది గాన, ఆ తల్లి 'కకారరూపా' యను నామముచే వ్యవహరింపబడును; కాదివిద్యామూర్తి యని భావము. పంచదశీవిద్య కాదివిద్య, హాదివిద్య, సాదివిద్య యని మూడు విధములని సంప్రదాయ వేత్తలు చెప్పుదురు. కావున, ఈ నామము కాదివిద్యా ప్రాధాన్యమును సూచించుచున్నది. హిరణ్యగర్భ, జల, ఉత్తమాంగ (శిరస్సు), సుఖాదులకు కకారము వాచకము గాన, హిరణ్యగర్భాదులు కకారరూపులు.

అథవా, హిరణ్యగర్భనిష్ఠమైన ప్రపంచ సృష్టి, స్థితి, లయ కర్తృత్వరూప గుణవత్త్వము వ్యంజనము (హల్లు) లలో ప్రథమ వర్ణమైన 'క' కారమునందు ఉండుటవలన, జగన్మాత 'కకారరూపా' యను నామముచే కీర్తింపబడినది.

లేక, ఉదకమందున్న అన్నాదుల ద్వారా, లోకపోష కత్వహేతువుగూడ, పంచశీవిద్య యొక్క ఆదిమ వర్ణమైన కకారమునకు గలదుగాన, ఆమె 'కకారరూపా' యని పేర్కొన బడినది.

సర్వప్రాణులకు శిరోభాగమున అమృతము కలదని ప్రసిద్ధము. ఆ కారణమున, యోగమార్గము ద్వారా కుండలినీ శక్తి సంచారమునందు, అచట ఉన్న ఆ యమృత ప్రవాహములో మునుకలిడిన యోగులకు ఈశ్వరసామ్యము సంభవించునని యోగశాస్త్ర ప్రసిద్ధము. అటులనే, పంచదశీ మంత్రము నందలి ప్రథమ భాగమునందున 'క' వర్ణము, తన్మంత్ర పురశ్చర్యాపరాయణులకుశివస్వభావమునే ప్రసాదించును గావున, ఆమె 'కకారరూపా' యను నామముచే సంకీర్తిత యగుచున్నది. 'కం బ్రహ్మ ఖం బ్రహ్మ' యనుచు శ్రుతి 'కం, ఖం' అను వర్ణములు బ్రహ్మవాచకములని చెప్పుచున్నది.

దహరాకాశము, అనగా కారణాకాశము సుఖస్వరూపము, పరమ ప్రేమాస్పదము నగుటవలన అది అభిలాషకు విషయ (అభిలషణీయ) మగుచున్నది. ఆ రీతిగా, "క" వర్ణము గూడ, అత్యంత ప్రీతివిషయకమైన పంచదశీమంత్ర ప్రథమాక్షర మగుటవలన అత్యంతము గౌరవార్హముగాన, "కకారరూపా" యను నామముచే శ్రీజగన్మాత స్తవనీయురాలగుచున్నది.

## ౨. కళ్యాణీ

శం. భా. కళ్యాణీ । కళ్యాణాని సుఖాని । యుపసార్వభౌమానందాదారభ్య బ్రహ్మానందపర్యంతం తైత్తిరీయకాదా

ప్రతిపాదితాని । తత్తదుపాధిభేదే ష్వవచ్ఛిన్నస్వరూపతయా తాని కల్యాణశబ్దవాచ్యాని, "ఏతస్యైవానందస్య అన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" ఇతి శ్రుతేః । సమష్టి వ్యష్టి వత్త్వ ముపహితస్వరూపేణ సంభవతీతి మతుప్ సమాసోపపత్తిః । తథా చ "రాహోః శిర" ఇతివత్ సమాసాంతర్గత షష్ఠ్యర్థభేద స్యావివక్షితతయా అనంత్యైకవిగ్రహవతీత్యర్థః । "విజ్ఞాన మానందం బ్రహ్మ" ఇతి శ్రుత్యుక్త బ్రహ్మస్వరూప లక్షణవతీత్యర్థః ॥ ఓం కల్యాణ్యై నమః ॥

ఆం. వి. కల్యాణము లనగా, సుఖములు. యుపసార్వభౌమానందము (మానుషానందము) నుండి యారంభించి, బ్రహ్మానంద పర్యంతము, ఆ సుఖములు తైత్తిరీయాది ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడినవి. ఆ యా భిన్నభిన్న శరీరముల యందు భిన్నభిన్న స్వరూపము లుండుటచేత ఆ సుఖములు, సార్వభౌమాద్యానందములు కల్యాణశబ్దవాచ్యములు. "ఏతస్యైవానందస్య" అనుచు శ్రుతి యీ అద్వయానందము యొక్క అల్పాంశమునే యన్యభూతములు (ప్రాణులు) అనుభవించుచున్నవని చెప్పుచున్నది. ఏకస్వరూపమైన యానందము వ్యష్టిసమష్టి రూపము (వ్యాప్యవ్యాపకరూపము) కలిగియుండుట యనునది, యుపహితమైన స్వరూపమువలన సంభవించునుగాన, మతుప్సమాస ముపపన్నమవుచున్నది. శిరోరూపుడయిన రాహువును "రాహుశిరస్సు" అని యనినరీతిగ, సమాసాంతర్గత మైన షష్ఠీవిభక్తి యొక్క యర్థభేదము వివక్షచేయబడక

పోపుటచేత, పరాదేవత ఆనందైకవిగ్రహవతి, అనగా కేవల అద్వితీయానంద స్వరూపము గలది యని భావము. "విజ్ఞాన మానందం బ్రహ్మ" యను శ్రుతి 'బ్రహ్మస్వరూపము ఆనంద మని చెప్పుచున్నది. తాదృశ బ్రహ్మస్వరూప లక్షణములు' గలది పరమేశ్వరి యని తాత్పర్యము.

## 3. కళ్యాణగుణశాలినీ

శం. భా. కల్యాణగుణశాలినీ । కల్యాణాః సుఖకర్తారః యే గుణాః సత్యకామ, సత్యసంకల్ప, సర్వాధిపత్య, సర్వేశానత్వ, వామనీత్వ, సంయద్వామత్వాదయః, తేఽస్యాః శాలయంత ఇతి, తథా ఏనాం శోభయంతీతి వా, తైః శాల్యత ఇతి వా కల్యాణగుణశాలినీ । తథా చ కల్యాణాశ్చ తే గుణాశ్చ కల్యాణగుణాః శాలయంత్యేనా మితి కల్యాణగుణ శాలినీ; అస్మిన్ సమాసే దేవతాయాః పరాధీనగుణవత్త్వం స్వతః శుద్ధచైతన్యత్వం చ స్ఫురితమ్ । కల్యాణగుణైః శాల్యత ఇత్యత్ర గుణవత్త్వమాత్రం దేవతాయాః ద్యోత్యతే । తస్య చౌపాధికత్వం వైదికమపి స్తుతౌ తదప్రకటనం న దోషాయ । యది గుణానా మారోపితత్వేన తత్సంకీర్తనస్య భేదబుద్ధి సమయే తత్కృపాప్రాప్తిహేతుత్వేన ఆవశ్యకత్వమ్, తథాఽపి తదపవాదపురఃసరం శుద్ధచైతన్యాభేద ధ్యానరూప ముఖ్యభజనం ముఖ్యమేవేతి సంపాదయితుం స్వగురూపదిష్ట

మార్గేణ సుకరమేవేతి నాతివిస్తార్యతే ॥ ఓం కళ్యాణగుణ శాలిన్యై నమః ॥

అం. వి. సత్యకామ, సత్యసంకల్ప, సర్వాధిపత్య, సర్వేశానత్వ, వామనీత్వ, సంయద్వామత్వాది సుఖదాయకములైన గుణములు పరమేశ్వరి వలన ప్రకాశించుచున్నవి; లేక ఆ గుణములు ఈ జగన్మాతను శోభింపజేయుచున్నవి; అథవా, తద్గుణ సంపదచే ఈమె విరాజిల్లుచున్నదిగాన, 'కళ్యాణగుణశాలినీ' యను నామముచే స్తుతింపబడుచున్నది.

కళ్యాణప్రదములయిన గుణములు ఈ పరాదేవిని ప్రకాశింపజేయుచున్నవి గాన, ఆమె కళ్యాణగుణశాలిని. ఈ సమాసమునందు పరాదేవియొక్క పరాధీన గుణవత్త్వము, స్వయంప్రకాశ చైతన్యవత్త్వము ద్యోతమాన మవుచున్నది. కళ్యాణగుణైః శాల్యతే - కళ్యాణగుణములచేత ప్రకాశింపచేయబడుచున్నది అను సమాసమున దేవతయొక్క గుణవత్త్వమాత్రము స్ఫురింపజేయబడుచున్నది. ఆమెకు గల ఔపాధికత్వము వేదసమ్మతమైనను స్తుతియందు దాని నభివ్యక్తము చేయకుండుట దోషముకాదు. గుణము లారోపితము లగుట వలన, తాను, దేవి వేఱను భేదబుద్ధి కాలములో తద్దేవతాగుణ సంకీర్తనము ఆ దేవియొక్క అనుగ్రహ సంపాదన హేతువగుట వలన, ఆ దేవికి గుణవత్త్వము చెప్పుట యావశ్యకమని తెలియనగును. అయినను, ఆ గుణవత్త్వము

నకు అపవాదపురఃసరముగా శుద్ధచైతన్యముతో అభేదముగా ధ్యానము చేయుట యనెడి ముఖ్యభజనము ప్రధానమైనదే యని గ్రహించనగును. ఈ విషయమును స్వగురూపదిష్టమైన మార్గముద్వారా తెలిసికొనుట సుకరమే యని, యిచట విస్తరించి వివరించుట లేదు.

## ౪. కళ్యాణశైలనిలయా

శం. భా. కళ్యాణశైల నిలయా । శిలానాం వికారః శైలః శిలాఘన ఇత్యర్థః, కళ్యాణం సుఖమేవ శైలః ఘనీభూత ఇత్యర్థః, తస్మిన్ కళ్యాణశైలే స్వస్వరూపే ఆనందఘనే నిలయతి తిష్ఠతీతి కళ్యాణశైలనిలయా; "స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్నీతి హోవాచ" ఇతి శ్రుతేః, దేవదత్తః స్వస్మిన్నేవ స్వయం వర్తత ఇతి లౌకికప్రయోగాచ్చ, దేవతాయాః స్వస్వరూపే స్వాపస్థానం యుజ్యత ఇతి కళ్యాణమేవ శైలవత్ ఘనీభూతం కళ్యాణశైలః ఆనందమయకోశః, కళ్యాణశైలో నిలయః యస్యాః సా ఇతి బహువ్రీహిసమాసః న విరుద్ధః, "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" ఇతి ఉక్తశ్రుతిప్రామాణ్యాత్ ।

అథవా, కళ్యాణశైలః మహామేరుః నిలయం గృహం యస్యాః సా తథా; సుమేరుమధ్యశృంగస్థేత్యర్థః ॥ ఓం కళ్యాణశైలనిలయాయై నమః ॥

ఆం. వి. శిలయొక్క వికారము శైలము, శిలాఘనమని యర్థము, సుఖమే ఘనీభవించి యున్నదని భావము; ఆ కళ్యాణ శైలమందు, అనగా ఆనందఘనమైన స్వస్వరూపమునందు ఉండునది గాన, శ్రీలలితాదేవి 'కళ్యాణశైలనిలయా' యను అన్వర్థనామముతో కీర్తింపబడుచున్నది. "సభగవః కస్మిన్ ప్రతిష్ఠితః' యను శ్రుతి పరమేశ్వరుడు స్వీయ మహిమయందే శక్తియందే ప్రతిష్ఠితుడై యున్నాడని చెప్పుచున్నది. అది యునుగాక, దేవదత్తుడు తనయందే స్వయముగ స్వస్వరూపమున ఉన్నాడను లౌకిక ప్రయోగము కనబట్టుచున్నది. శ్రుతిప్రమాణము, లౌకిక ప్రయోగముల వలన దేవి స్వస్వరూపమందు తానుగా నుండుట యుక్తిసహజమే యని తెలియవలయును. కళ్యాణమే శైలము (పర్వతము) వలె ఘనీభూతమై యున్నదిగాన, కళ్యాణశైలము. కళ్యాణశైల మనగా ఆనందమయకోశము. కళ్యాణశైలము, అనగా ఆనందమయకోశము సహజ నివాస స్థానముగా గల దేవి యని బహువ్రీహి సమాసము చెప్పుటలో విరోధ మేమియు లేదు. "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" యను శ్రుతి యిందుకు ప్రమాణము.

అథవా, కళ్యాణశైలమనగా మహామేరువు (బంగారు కొండ) ఆ మహామేరువు నివాసగృహముగా గల దేవి 'కళ్యాణశైలనిలయా' యను నామముతో నొప్పారుచుండును. శ్రీలలితాసహస్రనామములలో 'సుమేరుమధ్యశృంగస్థా' యను నామముతో పరాభట్టారిక సంకీర్తింపబడినది.

## ౫. కమనీయా

శం. భా. కమనీయా। పరమానంద స్వరూపత్వేన పరమ ప్రేమాస్పదా, "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్। యదేష ఆకాశ ఆనందో న స్యాత్" ఇతి శ్రుతేః। సుఖస్య మనోహరత్వేన సర్వేషామభిషయత్వవత్ మాయావృతానాం సుఖప్రాపకత్వే నస్వస్వేష్టదేవతానుప్రీత్యతిశయేన తత్పూజాదౌ ప్రవర్తతాం తత్ఫలదానేన మనోహరత్వాద్వా కమనీయా జ్ఞానినా మానందఘనీభావాత్మక సుందరమూర్తిమత్తయా వా కమనీయా ॥ ఓం కమనీయాయై నమః ॥

ఆం. వి. శ్రీ త్రిపురసుందరీదేవి పరమానంద స్వరూపము గలదిగాన సర్వప్రాణులకు పరమ ప్రేమాస్పదురాలు. "కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్" అనుచు శ్రుతి కారణాకాశమందు, అనగా హృదయాకాశమందు ఈ యానంద ఘనస్వరూపము లేనియెడల, ఏ ప్రాణి ఉచ్ఛ్వాసనిశ్వాసములు చేయగలడు, జీవించగల' డని చెప్పుట వలన దేవి పరమానంద స్వరూపిణి, జీవనప్రదాయిని యని తెలియుచున్నది. ఆమె సుఖస్వరూపిణి గాన మనస్సు నాకర్షించును, ఆ జనని సర్వేచ్ఛావిషయభూతురాలు. మాయావృతులైన జీవులకు ఆమె సుఖము కలుగజేయును. సర్వజీవులకు తమ యిష్టదేవతల యందు అధికప్రీతి యుండుట వలన తద్దేవీధ్యాన, పూజాదులందు ప్రవర్తించు భక్తులకు వాంఛితార్థముల నొసగును.

అందువలన, ఆమెయందు మనోహరత్వ మను ధర్మ మున్నది. కావున, ఆ జగన్మాతకు 'కమనీయా' యను నామ మన్వర్థము.

అథవా, జ్ఞానులకు ఆనందఘనమైన సుందరరూపము గలదగుటచేతగూడ, దేవి 'కమనీయా' యను నామముచే స్తవనీయురాలగుచున్నది.

## ౬. కలావతీ

శం. వి. కలావతీ । కలాః శిరఃపాణ్యాద్యవయవాః, చతుష్షష్టికలాః విద్యారూపా వా, చంద్రకలా వా, భక్త ధ్యానాయ అస్యాః సంతీతి కలావతీ ॥ ఓం కలావత్యై నమః ॥

ఆం. వి. కళలనగా శిరస్సు, చేతులు, పాదములు మున్నగునట్టి యవయవములు, లేక అరువది నాలుగు కళలు, లేక విద్యారూపములు, అథవా, యోగులు తమ సమాధిస్థితి యందు దర్శించునట్టి చంద్రకళలు - ఇవి భక్త ధ్యానసాధన ములుగా, ఈ దేవియందు గలవుగాన, జగన్మాత 'కళావతీ' యను నామముచే ప్రసిద్ధినొందినది.

శ్లో॥ కమలాక్షీ కల్మషఘ్నీ కరుణామృతసాగరా।
కదంబకాననావాసా కదంబకుసుమప్రియా ॥ ౨

## ౭. కమలాక్షీ

శం భా. కమలే ఇవ అక్షిణీ యస్యాః సా తథా ।

కమలాయాః లక్ష్మ్యాః అక్షిశబ్దేన తన్నిమిత్తకంజ్ఞానం లక్ష్యతే విషయతాసంబంధేన తద్వతీతి వా ।

కమలాయాః ఐహికాముష్మికశ్రియః హేతుభూతే అక్షిణీ యస్యాః సా ఇతి స్వకీయేక్షణమాత్రేణ మహదైశ్వర్య ప్రాపికేతి భావః ॥ ఓం కమలాక్ష్యై నమః ॥

ఆం. వి. కమలముల వంటి కనులు గలదిగాన, పరాదేవి 'కమలాక్షీ' యను నామముతో కీర్తనీయురాలగుచున్నది.

కమలాక్షి యనగా లక్ష్మీదేవి యొక్క కన్ను, ఇచట అక్షి శబ్దముచేత తన్నిమిత్తకమైన జ్ఞానము లక్షణావృత్తి ద్వారా విషయతా సంబంధము వలన లక్షితమగుచున్నది. అనగా, నేత్రమునకు విషయము జ్ఞానము, విషయి నేత్రము. కావున విషయ విషయితాసంబంధముతో జ్ఞానము పరిలక్షితమగుచున్నది. ఆ కారణముచేత కమలాక్షి యనగా జ్ఞానపతి; పరమేశ్వరి తాదృశ జ్ఞాన స్వరూపిణిగాన, 'కమలాక్షీ' యని కీర్తింపబడుచున్నది.

అథవా, లక్ష్మీదేవి యొక్క నేత్రములు ఐహికఆముష్మిక సంపదలకు హేతుభూతములు. ఆమె తన క్రీగంటి చూపు చేతనే భక్తులకు మహదైశ్వర్యమును, అనగా ఇహలోక సంపదయే గాక, బ్రహ్మాత్మ జ్ఞానరూపమైన ఆముష్మిక

సంపదను ప్రసాదించుననిభావము. ఆపరమేశ్వరి, సకామనయా ఉపాసించు వారలకు ఐహిక సంపదల నిచ్చును; నిష్కామనయా ధ్యానించు భక్తులకు అద్వయ బ్రహ్మానందరూప ఫలము నొసగునని తాత్పర్యము.

## ౮. కల్మషఘ్నీ

శం. భా. కల్మషాని పాపాని హంతి నాశయతీతి కల్మషఘ్నీ, "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" ఇతి భగవద్వచనాత్ ।

అథవా, వేదాంత మహావాక్యజన్య సాక్షాత్కారరూప బ్రహ్మవిద్యా, "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" ఇతి స్మృతేః న, "పాపగ్ం శ్లోకగ్ం శృణోతి" ఇతి శ్రుతేశ్చ ॥ ఓం కల్మషఘ్న్యై నమః ॥

ఆం. వి. కల్మషము లనగా పాపములు. వానినెల్ల నశింపజేయునదిగాన, 'కల్మషఘ్నీ' యను నామము పరమేశ్వరి యందన్వర్థము, 'అహం త్వా సర్వపాపేభ్యః' యనుచు గీతలో శ్రీకృష్ణభగవానుడు 'నేను నిన్ను సర్వపాపవిముక్తుని గావించెద' నని యభయ మిచ్చి యున్నాడు. దేవి వైష్ణవీ శక్తి యగుటచే సర్వపాపవిమోచకత్వరూప ధర్మము పరమేశ్వరి యందు గూడ సంగతమే.

అథవా ఆ జగన్మాత తత్త్వమస్యాది వేదాంత మహా వాక్య శ్రవణ మననాదుల వలన గలిగెడి యపరోక్ష సాక్షాత్కారరూప బ్రహ్మవిద్యా స్వరూపము గలది యనియు చెప్ప వచ్చును. బ్రహ్మాపరోక్ష సాక్షాత్కారము నొందిన జ్ఞాన నిష్ఠులకు కల్మషము లనునవి యుండనే యుండవు. "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి" యను స్మృతి వచనము వలన 'జ్ఞానాగ్ని చేత సర్వకర్మలు, తత్ఫలములు భస్మీభూతలములగు' నని తెలియు చున్నది. ఇంతియేగాదు "న సపాపగ్ం శ్లోకగ్ం శృణోతి" యనుచు 'సచ్చిదానందాద్వితీయ బ్రహ్మాపరోక్షానుభూతి నొందిన జ్ఞాని పాపవార్తను విన" డని శ్రుతి ఘంటాపథముగా చెప్పుచున్నది. కావున, పరాదేవి అహంకార మమకారాదులను, కామక్రోధాదులను, అవిద్యాకామకర్మలను దూరా పాస్త మొనర్చి, భక్తుని శుద్ధబ్రహ్మవిద్యాస్వరూపునిగా జేయు నది యగుటచే. ఆ 'కల్మషఘ్ని' యను నామముతో ఆమె యొక్క గుణగానము చేయబడుచున్నది

## ౯. కరుణామృతసాగరా

శం. భా. కరుణామృతసాగరా । కరుణయా కృపయా జాతం యదమృతం మోక్షరూపం తస్య సాగరా । యథా అమృతసముద్రః స్వయ మమృతస్వరూపః సన్ అన్యానపి లోకాన్ అమృతపాయి మేఘా ద్విముక్తామృతేన సంజీవయతి,

తథా "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి", "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాది శ్రుత్యా స్వయ మమృతస్వరూపా సతీ। "లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్" ఇతి భగవద్వచనేన తత్తదధికారికృత కర్మోపాసనాదిఫలస్య దేవతా ప్రాపణీయస్య సంప్రాప్తౌ తత్తదధికారిణాం తత్తత్ఫలం స్థిత మితి సంభావ్యత ఇతి సాగరోపమా। అమృతవత్సర్వసంజీవనీ కరుణామృతస్య అభిన్నాశ్రయత్వాత్ సాగరాః, కరుణా చ భక్తవిషయక పరిపాల్యతాబుద్ధిః।

యద్వా, కరుణయాః కృపయా అమృతాః శాశ్వతకీర్తిమత్త్వేన బ్రహ్మదిలోకం గతాః సాగరాః సగరరాజ వంశ్యాఃయస్యాః సా తథా;

యద్వా, కరుణయా దయయా హేతునా అమృతాయ ప్రాప్తః సాగరః సముద్రో యథా భాగీరథీ కరుణామృత సాగరా ॥ ఓం కరుణామృతసాగరాయై నమః ॥

తెం. వి. పరమేశ్వరీకృప వలన మోక్షరూపమైన ఏ యమృతము జనించునో, ఆ యమృతసాగరము వలె అనంతమైన స్వరూపము గలదిగాన; ఆ జనని 'కరుణామృత సాగరా' యని భక్తులచే స్తుతింపబడుచున్నది.అ మృత సాగరము .క్షీరసాగరము తానమృత స్వరూపమై యుండును; ఆ యమృతసాగరామృతమును (జలమును) ద్రావిన

మేఘములు తిరిగి అమృతమునే (జలమునే) వర్షించును. అట్టి యమృతముచేత నితరలోకములను సైతము ఆ యమృతసాగరము జీవింపజేయును. ఆ రీతిగనే యీ తల్లి "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" - బ్రహ్మను దెలిసినవాడు బ్రహ్మయే యగును, "బ్రహ్మవిదాప్నోతి పరమ్" - బ్రహ్మవేత్త పరమైన స్థితిని పొందుచున్నాడు' - అను శ్రుతివచనాను సారము స్వయముగా నమృతస్వరూపిణియై మోక్షస్వరూపిణియై విరాజిల్లుచున్నది. "లభతే చ తతః కామాన్" 'విహితములు, హితకరములు నయిన కోరికలన్నియు నాచేతనే భక్తులకు ఫలప్రదము లగుచున్నవి' అను భగవద్వచనము ననుసరించి, ఆ యీ యధికారులచే ననుష్ఠింపబడిన కర్మోపాసనాది ఫలము దేవతాప్రాపణీయము; తత్ప్రాప్తియందు తత్తదధికారుల యొక్క యీ యీ భిన్నఫలములు గలవని భావింపబడుచున్నందున ఆ దేవి సాగరముతో పోల్చబడినది. సాగరము స్వస్వరూపమున ఉండి యన్యలోకములకు మేఘము ద్వారా ప్రాణసంధాయకమగుచున్నది. అటులనే పరమేశ్వరి స్వయముగ నమృత స్వరూపిణియై, తదమృతపానేచ్ఛ (మోక్షేచ్ఛ) గల యుపాసకులకు అధికార భేదము ననుసరించి తత్తత్కర్మోపాసనాది అనంత ఫలముల నొసంగుచు తత్ఫల స్వరూపిణియై యున్నది.

సాగరములు కరుణకు, అమృతమునకు నభిన్నాశ్రయములగుటవలన ఆ దేవి కరుణామృతసాగరయై అమృతమువలె సర్వ

జీవుల సంజీవనహేతుభూత యగుటచే, ఈ నామము ఆమె యందన్వర్థము -

పక్షాంతరమున, తన కృప వలన అమృతులయిన - శాశ్వత కీర్తి గలిగి బ్రహ్మాదిలోకములకు పోయిన సగరరాజ వంశీయులు (సగరరాజపుత్రులు) కలదిగాన తల్లి కరుణా మృత సాగర. కరుణ యనగా భక్తులను పాలించు (రక్షించు) వలెననెడి బుద్ధి.

అథవా, భగీరథుని వలన సాగరము అమృతమును - జలమును పొందినదిగాన ఆమె భాగీరథి. భాగీరథికి (స్వర్గంగకు) దేవికి అభేదము చెప్పబడినది. భాగీరథివలె పరమేశ్వరి సర్వ జీవులను పావితమొనర్చి బ్రహ్మాది లోకప్రాప్తిరూపఫలము నొసగునదిగాన పరాదేవి కరుణామృతసాగరా యను నామ ముతో బఱగుచున్నదని భావము.

## ౧౦. కదంబకాననావాసా

శం. భా. కదంబకాననావాసా । కదంబనామక కల్ప వృక్షయుక్తం యత్కాననం వనం తత్ర గృహం యస్యాః సా తథా ॥ ఓం కదంబకాననావాసాయై నమః ॥

ఆం. వి. కదంబనామము (కడిమిచెట్టు యను పేరు) తో బఱగు కల్పవృక్షములతో నిండిన వనమందు నివాస

గృహము గలదిగాన, మహాత్రిపురసుందరిని 'కదంబకానననావాసా' యను నామముతో భక్తజనులు స్తుతింతురు. కల్పవృక్ష వనాంతరవాసిని యగుటచేత పరమేశ్వరి, ఉపాసకుల మనోరథముల నీడేర్చగల సామర్థ్యము కలదని భావము.

## ౧౧. కదంబకుసుమప్రియా

శం. భా. కదంబకుసుమప్రియా । కదంబానాం కుసుమాని 'కదంబకుసుమాని, తేషు ప్రియా ప్రీతిమతీతి యావత్ । యద్యపి ప్రియశబ్దః ప్రీతివిషయవాచకః, తథాఽపి కుసుమజన్యప్రీతే రభావేన తద్విషయతాయాః వక్తు మశక్యత్వాత్ తథోక్తమ్ ॥ ఓం కదంబకుసుమప్రియాయై నమః ॥

ఆం. వి. కదంబకుసుమములందు ప్రేమగలది గావున దేవి కదంబకుసుమప్రియా' యని కీర్తింపబడుచున్నది. ప్రియ శబ్దము ప్రేమకు విషయమైన వస్తువును జెప్పినను, దానియందు కుసుమజన్యమైన ప్రేమ లేనందున, తద్విషయత్వమును (దేవి విషయముగా గలిగియుండుటను) జెప్పుట యుక్తము గాదు. ఏలన, కుసుమము జడముగాన, దేవి యా కుసుమములకు విషయము కాజాలదు. కావున, కదంబకుసుమములందే యమ్మవారికి ప్రేమ గలదని చెప్పబడినదని యెఱుంగవలెను.

శ్లో॥ కందర్పవిద్యా కందర్పజనకాపాంగవీక్షణా ।
కర్పూరవీటికాసౌరభ్యకల్లోలితకకుప్తటా ॥ 3

## ౧౨. కందర్పవిద్యా

శం. భా. కందర్పవిద్యా । కందర్పస్య విద్యా తత్ప్రాప్త ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞాన మిత్యర్థః । అథవా, విద్యాప్రాపకత్వాత్ తద్దృష్ట మూలమంత్రవర్ణసముదాయో విద్యే త్యుచ్యతే వేదవాక్యేషు ఉపనిషత్పదవత్ । తద్వాచ్యార్థత్వాత్ తథా దేవీ సూచ్యతే ॥ ఓం కందర్పవిద్యాయై నమః ॥

ఆం. వి. కందర్పు డనగా మన్మథుడు; కామరాజ బీజవాచ్యమైన విద్యాస్వరూపిణి గాన, పరమేశ్వరి 'కందర్ప విద్యా' యనుచు స్తవనీయురాలగుచున్నది. 'నేతి నేతి' యను వాక్యములచేత దృశ్యమాన ప్రకృతితత్త్వములను నిరసించిన తరువాత, సచ్చిదానందఘనమైన బ్రహ్మ, ప్రత్యగ్ బ్రహ్మ యిరువురును మిగిలి యుందురు. అపుడు కందర్పవిద్యాప్రాప్త మైన ప్రత్యగ్ బ్రహ్మైక్యజ్ఞాన ముదయించును. కావున, 'కందర్పవిద్యా' యన, బ్రహ్మాత్మైక్య జ్ఞానస్వరూపిణి యని భావము. బ్రహ్మవిద్యా ప్రాపకయగుట వలన, కామరాజ విద్యామూలమంత్రమందలి వర్ణసముదాయము, వేదవాక్యము లందలి ఉపనిషత్పదము విద్యాపదముచే చెప్పబడినట్లు ఇచట విద్యాపదముచే నభిహితమగుచున్నది. కామరాజ విద్యావర్ణవాచ్యమైన స్వరూపము గలది గాన, పరమేశ్వరి కందర్పవిద్యా నామముచే కొనియాడబడుచున్నది.

## ౧౩. కందర్పజనకాపాంగవీక్షణా

శం. భా. కందర్పజనకాపాంగవీక్షణా । అపాంగాభ్యాం వీక్షణం అపాంగవీక్షణమ్, ఈషద్దర్శనమితి యావత్। కందర్పస్య జనకం అపాంగవీక్షణం యస్యాః సా। అనేన నామ్నా యేషాం జడానామపి కురూపిణాం జనానా ముపరి సకృదీషద్వీక్షణ మభిజాయతే, తే కందర్పవత్ రూప యౌవన సామర్థ్య లక్ష్మీభాజో భవంతీతి ధ్వనితమ్।

యద్వా, కందర్పస్య జనకః శ్రీనారాయణః సః యస్యాః అపాంగవీక్షణే ఈషద్భ్రూవల్లీచలనే వర్తతే, యస్యాః ఆజ్ఞామాత్రవశ్యతయా మహావిష్ణుః జగద్రక్షాది కార్యం కరోతి సా తథా ఇతి।

అథవా, కందర్పజనకా మహాలక్ష్మీః యస్యాః అపాంగ వీక్షణే ప్రేర్యతయా వర్తతే సా తథా।

కందర్పస్య మన్మథస్య జనకాః ఉత్పాదకాః స్రక్చందనాది భోగ్యవిషయాః తే యస్యాః అపాంగవీక్షణాత్ భవంతి సా తథా।

అథవా,చంద్రస్య వామనేత్రతయా అపాంగవీక్షణం చంద్రికోచ్యతే। కందర్పజనకం అపాంగవీక్షణం యస్యాః సాః తథా కందర్పజనకాశబ్దేన లక్ష్మీనివాసకమలం లక్ష్యతే, తద్వత్ అపాంగం కమలాక్షీత్యర్థః, తన్నిరూపిత

వీక్షణం లోకసంజీవనం యస్యాః సా తథా ॥ ఓం కందర్ప
జనకాపాంగవీక్షణాయై నమః ॥

ఆం. వి. మన్మథభావమును కలిగించు అపాంగవీక్షణము క్రీగంటిచూపు కలది గావున ఆ పరమేశ్వరి కందర్పజనకాపాంగవీక్షణా యను నామమున బరగుచున్నది. ఆ తల్లి క్రీగంటిచూపు అంతటి జగన్మోహనమైనదని భావము. జడులు, కురూపులపైన ఆమె అపాంగవీక్షణము ఒక్కమారు ప్రస రించినంతనే వారు మన్మథునివలె రూప, యౌవన, సామర్థ్య, సంపదలకు పాత్రులగుదురని యీ నామముచేత వ్యంజితమగు చున్నది.

అథవా, మన్మథుని తండ్రి యగు శ్రీమన్నారాయణుడు పరమేశ్వరి యొక్క అతి సూక్ష్మ భ్రూవల్లీస్పందము (కనుబొమ ముడి యొక్క కదలిక) ననుసరించి తత్సూచిత కార్యనిర్వహణము నందు ప్రవర్తించుచుండును; ఆ పరాదేవి యొక్క యాజ్ఞకు వశవర్తియై శ్రీ మహావిష్ణువు జగ ద్రక్షణాది కార్యములను నిర్వర్తించుచుండును గాన, ఆదేవి, పై నామము చే స్తవనీయ యగుచున్నది.

యద్వా, మన్మథుని తల్లియగు మహాలక్ష్మి యీ పరమేశ్వరి యొక్క క్రీగంటి చూపునందు దివ్యభావ ప్రేరణ సమర్థమై యొప్పారుచుండును గాన, ఈ నామము పరాభట్టారిక యందన్వర్థము.

పక్షాంతరమున, దేవియొక్క అపాంగవీక్షణము వలన స్రక్ (పూలదండ) చందనాది భోగ్యవస్తువులు మన్మథ (కామ) భావజనకములుగా నగుచున్నవి గాన, పరమేశ్వరి యీ నామముచే కీర్తనీయ యగుచున్నది.

కాక, యీ రీతిగను జెప్పికొనవచ్చును - చంద్రుడు శ్రీదేవీవామనేత్రము (ఎడమ కన్ను) గా ప్రసిద్ధము. కావున, దేవీ వామనేత్రాపాంగవీక్షణము చంద్రిక (వెన్నెల) యని చెప్పబడును. దేవియొక్క అపాంగవీక్షణము (క్రీగంటిచూపు) కామభావోత్పాదనసమర్థ మగుటచేత ఆమె యీ నామముచే సంకీర్తితయై వెలుగొందుచున్నది. 'కందర్పజనకా' యను స్త్రీలింగశబ్దముచేత లక్ష్మీనివాసస్థానమైన పద్మము లక్షణయా వ్యంజితమవుచున్నది. దేవియొక్క క్రీగంటిచూపు కమలములవలె లోకాతిశాయి సౌందర్యము గలది ; ఆమె కమలములవంటి నేత్రములుగలది యని భావము. తన్నిరూపిత వీక్షణము లోకసంజీవన హేతుభూతమైనది. ఆ దేవి యొక్క దయాపూర్ణమైన అపాంగవీక్షణము సోకనిచో లోకములకు మనుగడయే లేదు. కావున, రాజరాజేశ్వరి 'కందర్పజనకాపాంగవీక్షణా' యను నామముతో విరాజిల్లుచున్నది.

## ౧౪. కర్పూరవీటిసౌరభ్యకల్లోలితకకుప్తటా

శం. భా. కర్పూరవీటి సౌరభ్యకల్లోలిత కకుప్తటా । కర్పూరయుక్తాశ్చ తాః వీటయశ్చ తాంబూలకబలాని తాసాం

సౌరభ్యం సౌగంధ్యం తైః కల్లోలితాని అసకృత్పరిమళితాని కకుభాం దిశాం తటాని ప్రదేశాః యస్యాః సా । ముఖవాసిత పరిమళేన జగన్మాత్రం సురభీకృత మితి స్వరూపాతిశయోక్తిః అస్మిన్నామ్ని వ్యజ్యతే, మహారాజభాగవతీత్యర్థః ॥ ఓం కర్పూరవీటి సౌరభ్యకల్లోలిత కకుప్తటాయై నమః ॥

అం. వి. శ్రీమద్రాజరాజేశ్వరి ముఖము తాంబూల రాగరంజితమై యుండును. ఆ తాంబూలకబళములు పచ్చ కప్పురపు పలుకులతో నిండియున్నవి. అట్టి తాంబూల కబళములచేత దిశాంచలప్రదేశములు నిరంతరము సుగంధ వాసితములుగా నొనర్పబడుచుండును. దేవియొక్క తాంబూల పూరిత ముఖసుగంధముచేత సమస్త ప్రపంచము సురభిళముగా జేయబడుచున్నదని స్వరూపాతిశయోక్తిగా నిట వర్ణితము. ఆమెయొక్క సౌగంధ్యముచేతి తాంబూలమునకు పరిమళ మబ్బుచున్నదని భావము. ఏలన, ఈ చరాచరసృష్టిలో తద్భిన్న మైన పదార్థ మనునది యేదియులేదు. కర్పూరవీటి పరిమళము సైతము దేవీముఖచర్వణము వలననే కలిగినదిగాని, మఱొండు కాదు. కావున భక్తులు 'కర్పూరవీటిసౌరభ్య కల్లోలిత కకుప్తటా' యనుచు ఆ దేవియొక్క మహిమాతిశాయిత్వ సంకీర్తనము చేయుదురు.

శ్లో॥ కలిదోషహరా కంజలోచనా కమ్రవిగ్రహా ।

కర్మాదిసాక్షిణీ కారయిత్రీ కర్మఫలప్రదా ॥ ౮

## ౧౫. కలిదోషహరా

శం. భా. కలేః నింద్యాః జాయమానానాం పురుషాణాం జన్మమాత్రేణ యే దోషాః పాపాని ఆయాంతి, తాన్ దృష్టా శ్రుతా కీర్తితా సంస్తుతా పూజితా ధ్యాతా సతీ హరతీతి తథా । కలేః అన్యోన్యవాదినాం కలహాత్ తత్తన్మతాభినివేశాత్ జాయమానా యే దోషాః పరబ్రహ్మవిషయే అస్తిత్వ నాస్తిత్వ దేహాదివ్యతిరిక్తత్వ భిన్నత్వాభిన్నత్వ గుణిత్వాదిసాధక యుక్త్యాభాస తదనుగుణసంమత్యాభాస శ్రుతితాత్పర్య విఘటనాన్యథాకరణ దురాగ్రహజన్య కామ క్రోధ పరుషపరవశ క్రియమాణ నిందాఽసహమానరూపా బహువిధా దోషాః, తా న్నద్వైత బ్రహ్మజ్ఞానసాధన ముక్తి రూపేణ హరతీతి కలిదోషహరా॥ ఓం కలిదోషహరాయై నమః॥

ఆం. వి. జనన మందుచున్న పురుషులకు - అనగా నుపాధిని ధరించుచున్న జీవులకు నింద్యమైన కలి వలన పుట్టుకతోనే యనేక దోషములు-పాపములు సంక్రమించుచుండును; అట్టి పాపములను చూచిన, వినిన దేవి, భక్తులచే గుణసంకీర్తన చేయబడి, స్తుతింపబడి, పూజింపబడి, ధ్యానింపబడినదై యా దోషములను - పాపములను హరించునది గాన, 'కలిదోషహరా' యను నామముచేత స్తవనీయ యగుచున్నది. కలి ప్రభావముచేత పరస్పరము వివాదము చేయువారి కలహము వలన, ఆయా యభిప్రాయములయందు మిక్కిలి యభినివేశము

(పట్టుదల) గల వ్యక్తులవలన అనేక దోషములు - పాపములు సంభవించుచుండును; ఇవియే కలిదోషములు. ఇవి పరబ్రహ్మ యొక్క అస్తిత్వనాస్తిత్వ విచారరూపములు, ఆ పరబ్రహ్మ దేహేంద్రియాది సహితము, దేహేంద్రియాదివ్యతిరిక్తమని దేహముకంటె భిన్నము, అభిన్నమనియు, సగుణము, నిర్గుణ మనియు జెప్పుటకు యుక్త్యాభాసలు, ఆ యుక్త్యాభాసల కను గుణములైన సంమతుల (అంగీకారముల) వలె గన్పట్టు శ్రుతి వాక్యముల తాత్పర్యమును విఘటనము, అన్యథాకరణము చేయుట (ఉన్నదానిని మఱియొక రీతిగ సమన్వయించుట) దురాగ్రహము (మొండి పట్టుదల) వలన కలుగునట్టి కామ, క్రోధములచేత నొరులు తెలియక చేయబడు పరుషములైన నిందలను సహించకపోవుట మున్నగు బహువిధ కలిదోషములు; అద్వైత బ్రహ్మజ్ఞానము — ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానము సాధనముగా గల మోక్షము ద్వారా యీ దోషములను హరించు సామర్థ్యము, గలదగుటచేత దేవికి 'కలిదోషహరా' యను నామ మన్వర్థము.

## ౧౬. కంజలోచనా

శం. భా. కంజలోచనా । కేభ్యః జాయంత ఇతి కంజాని. కంజశబ్దేన అరవింద నీలోత్పలాని లక్ష్యంతే, తద్వ ల్లోచనే యస్యాః సా తథా ।

అథవా, కంజం బ్రహ్మాండమ్ । "అయం పూర్వ్య మపః సృష్ట్వా తాసు వీర్య మపాసృజత్ తదండ మభవద్ధైమమ్" ఇతి వచనాత్ కంజాని అనేకకోటి బ్రహ్మాండాని లోచనయోః లోచనకృతి వీక్షణాత్ యస్యాః సా తథా, "సేయం దేవ తైక్షత" ఇతి శ్రుతేః ॥ ఓం కంజలోచనాయై నమః ॥

ఆం. వి. జలముల నుండి పుట్టినవిగాన కంజము లన బడును, కంజ శబ్దముచేత పద్మములు, నీలోత్పలములు (నల్ల కలువలు) లక్షణావృత్తిచే జెప్పబడును. కమలములు, నీలో త్పలముల వంటి విశాలనేత్రములు గలది గాన, పరాదేవత 'కంజలోచనా' యని స్తుతింపబడుచున్నది.

అథవా, కంజమనగా బ్రహ్మాండము. ఈ బ్రహ్మాండము జలము నుండియే యావిర్భవించినది. "అయం పూర్వ్యమపః సృష్ట్వా" యను శ్రుతివచనము వలన 'సృష్టికర్తయగు మాయా శబలిత బ్రహ్మ మొదట జలసృష్టిని చేసెను, తరువాత తజ్జల మందు తన వీర్యమును (తేజస్సును) విడచెను. ఆ వీర్యము సహస్రాంశుసమ ప్రభాదీప్తమైన బంగారు గ్రుడ్డు ఆయెను' అని తెలియుచున్నది. సువర్ణవికారమైన ఆ యండమే బ్రహ్మాండ మని తెలియవలెను. ఏతాదృశములైన అనేక కోటి బ్రహ్మాండములు శ్రీమత్త్రిపురసుందరీ నేత్ర వీక్షణ ప్రసారముల వలన సృష్టము లగుచున్నవి గాన, ఆ దేవి 'కంజలోచనా' యని చెప్పబడుచున్నది. "సేయం దేవతైక్షత"

యను శ్రుతివచనము ఉక్తవివరణమునకు ప్రమాణ మని తెలియవలెను.

## ౧౪. కల్యాణగుణశాలినీ

శం. భా. కల్యాణగుణశాలినీ । కల్యాణః అతిమనోజ్ఞాః గాంభీర్య ధైర్య మాధుర్యాది బహుగుణోపేతత్వాత్, విగ్రహః మూర్తిః యస్యాః సా తథా, "ఆనందరూప మమృతం యద్విభాతి" ఇతి శ్రుతేః। ఆనందస్వరూపత్వాద్వా కల్యాణవిగ్రహా; లలితారూపేత్యర్థః ॥ ఓం కల్యాణవిగ్రహాయై నమః॥

ఆం. వి. గాంభీర్య ధైర్య మాధుర్యాది బహుగుణోపేతమై యావిర్భవించుట వలన, అతి మనోజ్ఞమైన మూర్తి (ఆకారవిశేషము) గలదిగాన, దేవి 'కల్యాణవిగ్రహా' యను నామముతో నారాధింపబడుచున్నది. "ఆనందరూప మమృతం యద్విభాతి" అని శ్రుతివచనము. ఏ మోక్షము ఆనంద స్వరూపముగా వెలుగొందుచున్నదో, తదానంద రూపిణియే పరమేశ్వరి యని భావము. కావుననే యామె లలితా స్వరూపిణి.

విశే :- "లోకా నతీత్య లలతేఽతితరాం శోభత ఇతి లలితా" అను వచనము ననుసరించి పరమేశ్వరి సర్వలోకాతిశాయి సౌందర్యమూర్తి గావున 'లలితా' యని ప్రస్తుతింపబడు

చున్నదని తెలియును. లలితాపరమేశ్వరి ఉపాసకుల యొక్క స్వాత్మస్వరూపిణియే. "సదానందపూర్ణః స్వాత్మైవ పరదేవతా లలితా" యను వచనము పరదేవతయగు లలితా పరాభట్టారిక సదానందపూర్ణమైన ఆత్మస్వరూపిణి యని చెప్పుచున్నది.

## ౧౮. కర్మాదిసాక్షిణీ

శం. భా. కర్మాదిసాక్షిణీ । కర్మ ఆదిః యేషాం తాని కర్మాదీని ఉపాసనా యోగ శ్రవణ మనన నిదిధ్యాసనాని । తేషాం సాక్షిణీ అసంబంధీ (ద్రష్టీ), "సాక్షీ చేతా" ఇతి శ్రుతేః।

అథవా, కర్మాదయః సాక్షిభూతాః జీవనిష్ఠాః తదనాశ్రయతయా ఆత్మదర్శనసాధనాని సృజ్యమాన జగదుపాదానభూతాని యస్యాః సా తథా ॥ ఓం కర్మాదిసాక్షిణ్యై నమః॥

ఆం. వి. కర్మాదులనగా, వైదిక కర్మానుష్ఠానము, ఉపాసనము యోగాభ్యాసము, వేదాంత మహావాక్యశ్రవణ, మనన. నిధ్యాసనాదులకు సాక్షిభూతయై, అనగా సంగరహితముగ జూచునదై వర్తిలుచుండును గావున, పరమేశ్వరి 'కర్మాదిసాక్షిణీ' యను స్వస్వరూప పరిచాయక నామముతో విరాజిల్లుచుండును. "సాక్షీ చేతా" యను శ్రుతివచనము చిచ్ఛక్తి యగు పరమేశ్వరి సాక్షిమాత్ర, చైతన్యస్వరూపిణి యని చెప్పుచున్నది.

అథవా, సాక్షిమాత్రములు, జీవనిష్ఠములు నయిన కర్మాదులు తత్ఫలాభిసంధి రహితములగుట వలన, అవి ఆత్మ దర్శన సాధనములు, అనగా స్వరూప సాక్షాత్కార సాధనములు సృజ్యమాన జగత్తుకు ఉపాదాన భూతములుగా గలదగుట వలన ఆ జగన్మాత 'కర్మాదిసాక్షిణీ' యని సంకీర్తిత యగుచున్నది

## ౧౯. కారయిత్రీ

శం. భా కారయిత్రీ। కారయితృత్వం నామ కుర్వితాజ్ఞాపయితృత్వం జాయమాన కార్యగోచర కృత్యుత్పత్తి హేతు కర్మోద్బోధకత్వరూప లిఙ్ లోట్ తవ్యప్రత్యయానాం ధర్మః విధినిష్ఠభావేనేత్యుచ్యతే । తేషాం శబ్దాత్మకతయా జడానాం తథాత్వాసంభవాత్ తదధిష్ఠాన చైతన్యరూపతయా "సర్వే వేదా యత్రైకం భవంతి" ఇతి శ్రుత్యా వేదస్యాత్మాభేదేన స్వప్రకాశకతయా అర్థప్రకాశనద్వారా ప్రామాణ్యవిధినామపి వేదైకదేశతయా ప్రేరణరూపత్వాత్ తదధిష్ఠాన చైతన్యాత్మనా కారయతీతి తథా, "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి" ఇతి శ్రుతేః ॥ ఓం కారయిత్ర్యై నమః॥

ఆం. వి. కారయితృత్వ మనగా, 'చేయు' మని యాజ్ఞాపించుట. జన్మనెత్తుచున్న జీవుల యొక్క జన్మ యనెడు ఏ కార్యము గలదో తద్గోచరమగు (విషయమగు) కృతియొక్క

పుట్టుకకు హేతువైన కర్మను బోధించుట విధి (ఆజ్ఞ) నిష్ఠ భాసముతో లిఙ్, లోట్, తవ్య ప్రత్యయముల ధర్మమని చెప్ప బడుచున్నది. లిఙ్, లోట్, తవ్య ప్రత్యయములు శబ్దరూపము లగుట వలన, అవి జడములు; జడాత్మకములయిన శబ్దములకు కర్మబోధకత్వ మసంభవము. అందువలన, తదధిష్ఠాన చైతన్యము ద్వారా శబ్దములు కర్మబోధక సాధనము లగు చున్నవి. "సర్వే వేదా యత్రైకం భవంతి" — 'నిఖిల వేదములు బ్రహ్మవిషయమున బ్రహ్మాభిన్నములగుచున్నవి' అను శ్రుతివచనానుసారము, వేదమునకు ఆత్మాభేదము చెప్పుటచేత, స్వయంప్రకాశమానమగుటచేత, అర్థప్రకాశ నము ద్వారా ప్రామాణ్యవిధి వాక్యములకు గూడ వేదైక దేశత్వము (వేదములో నొక భాగము) ఉండుట వలన చోదన (ప్రేరణ) ధర్మమున్నది. "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి" 'ఈ పరబ్రహ్మయే కర్మను చక్కగ జేయించుచున్న' దను శ్రుతిప్రామాణ్యము ననుసరించి పరమేశ్వరి తదధిష్ఠాన చైతన్యాత్మరూపమున జీవులచేత సర్వ కర్మలను జేయించు చుండును గాన 'కారయిత్రీ' యను నామము అన్వర్థమై యొప్పారుచున్నది.

## ౨౦. కర్మఫలప్రదా

శం. భా. కర్మఫలప్రదా । కృతానాం కర్మణాం కాలాంతర భావిఫలప్రదానే అదృష్టం కారణ మితి అనీశ్వర శంకర. 12 - 9]

మీమాంసకాదిమతమ్; తన్న । జడానాం సూక్ష్మానా మదృష్టానాం చేతనధర్మ కర్మఫలప్రదాన సామర్థ్యా యోగాత్, కృతానాం కర్మణాం ఫలావశ్యంభావే "కర్మాధ్యక్షః" ఇతి శ్రుతేః, "మయైవ విహితాన్ హితాన్" ఇతి స్మృతేశ్చ, "ఫల మత ఉపపత్తేః" ఇతి న్యాయాచ్చ పరదేవతా కర్మఫలప్రదా ॥ ఓం కర్మఫలప్రదాయై నమః ॥

ఆం. వి. జీవులొనర్చిన పుణ్యాపాపరూప కర్మలకు భావి కాలమున ఫలము నొసగుట యందు 'అదృష్టము' కారణమని నిరీశ్వర పూర్వమీమాంసాది శాస్త్రములు చెప్పుచున్నవి. కాని, అట్లు చెప్పుట సంగతము కాదు. ఏలన, జడములు, సూక్ష్మములు నయిన అదృష్టములకు చేతనధర్మమైన కర్మఫల ప్రదాతృత్వసామర్థ్యము నొసగదు; కావున, జీవులు తామొనర్చిన కర్మలకు ఫలము తప్పనిసరిగా అనుభవించు విషయమున చేతన పురుషుడే కారణము గావలెను. "కర్మాధ్యక్షః" — 'జీవులు చేయు కర్మలకు పరమేశ్వరుడు అధ్యక్షుడై ఫలము నొసగు' నను శ్రుతివచనము వలన, "మయైవ విహితాన్ హితాన్" — 'నాచేత విహితములైన కర్మఫలము లను కర్తయగు జీవుడనుభవించుచున్నా' డను గీతావచనము వలన, "ఫల మత ఉపపత్తేః" — 'పరమేశ్వరుని చైతన్యము వలననే ఫలము లభించుచున్న' దను న్యాయము — బాదరాయణుని సూత్రము వలన, పరమేశ్వరియే కర్మఫలప్రదాత్రి యని తెలియవలెను. కర్మజడముగాన, ఫలప్రాపక సామర్థ్యము

ంలేదు; శుద్ధ చైతన్యము నిష్క్రియము గాన,
ప కర్తృత్వధర్మము లేదు; కావున, పరమేశ్వర
యిని, చైతన్యస్వరూపిణి (చిచ్ఛక్తి) యైన పరా
ర్మఫలప్రదాత్రి యవుచున్నది గాన, ఆ జగన్మాత
ర్మఫలప్రదా' యను నామ మన్వర్థము.

కారరూపా చైకాక్ష ర్యేకానేకాక్షరాకృతిః ।
తత్తదిత్యస్వర్దేశ్యా చైకానందచిదాకృతిః ॥ 9

కరూపా

భా. ఏకారరూపా । ఏకారః రూపం మంత్ర
యువ సంజ్ఞాపకం యస్యాః సా తథా ॥ ఓం ఏకార
మః ॥

వి. ఏకారము పంచదశీ మంత్రమందలి ద్వితీయ
సూచించును. అట్టి 'ఏ' కారము స్వరూపముగా
ఆమె 'ఏకారరూపా' యని స్తుతింపబడుచున్నది.

:- అ + ఇ = వర్ణములు సంయుక్తమైనచో,
ము ఏర్పడును. 'అ, ఇ' వర్ణములు శివశక్తిబోధక
ఏ' బీజము వలన శివశక్తి సామరస్యము వ్యంజిత
ని గ్రహింపవలెను.

## ౨౨. ఏకాక్షరీ

శం. భా. ఏకాక్షరీ। ఏకం ముఖ్యం ఈశ్వరోపాధిత్వేన। న క్షరతి ఆత్మజ్ఞానేన వినా ముక్తిః న నశ్యతీ త్యక్షరం కూటస్థశబ్దవాచ్యం మాయా। తత్ర ప్రతిబింబనిష్ఠ సర్వజ్ఞత్వా ద్యర్థదాయక విశేషణత్వేన అస్యా అస్తీతి ఏకాక్షరీ।

ఏకం అక్షరం సర్వప్రకృతిత్వా త్పరాపరబ్రహ్మప్రతీకతయా తదుపాసనయా తదుభయప్రాప్తిసాధనత్వేన శబ్దబ్రహ్మోపలక్షిత లౌకికశబ్దః ప్రణవః అస్యా అస్తీతి వా।

ఏకః అఖండైకచైతన్యరూపః అక్షరం అనశ్వరః అవినాశీ పరమేశ్వరః అర్ధశరీరత్వేన అస్యా అస్తీతి వా।

ఏకా న్యక్షరాణి మాయాబీజాదీని తదుపాసనాప్రతీకత్వేన అస్యాః సంతీతి వా। "అథ పరా। యయా తదక్షర మధిగమ్యతే" ఇతి శ్రుతేః అఖండాకారవృత్తిప్రతిఫలనయోగ్యచైతన్యరూపతయా తద్వృత్తివ్యాప్తిమాత్రేణ అక్షరపదలక్ష్య చైతన్యం విషయతాసంబంధేన అస్యా అస్తీతి ఏకాక్షరీ। చకారః నిర్గుణబ్రహ్మణోఽపి సగుణబ్రహ్మవిశేషణసద్భావ సముచ్చయపరః సర్వత్రాపి ద్రష్టవ్యః। "సచ్చిన్మయః శివః సాక్షా త్తస్యానందమయీ శివా" ఇతి వచనేన।

"స్త్రీరూపాం చింతయే ద్దేవీం పుంరూపా మథవేశ్వరీమ్।
అథవా నిష్కలం ధ్యాయే త్సచ్చిదానందవిగ్రహామ్॥"

ఇతి స్మృత్యా చ, "త్వం స్త్రీ త్వం పుమాన్" ఇతి శ్వేతాశ్వరోపనిషది ఉపాధికృత నానారూప సంభవోక్తేశ్చ। అత ఏవ "సేయం దేవతైక్షత "ఇత్యాదౌ" తత్సత్యం స ఆత్మా" ఇత్యంతే చ శ్రుతౌ స్త్రీలింగాంతదే వతాదిపదానాం "తత్సత్య" మితి నపుంసాత్మకస్య "స ఆత్మే" తి పుంలింగాత్మక శబ్దస్య ఏకార్థత్వ మవివక్షితోపాధిమత్తయా తత్త్వంపద లక్ష్యార్థస్యైకత్వాత్ । తస్మాత్ తత్త్వంపదలక్ష్యార్థే సర్వేఽపి గుణా వర్ణితుం సంభవంతీతి హయగ్రీవేణ అస్యాం త్రిశత్యాం బహవశ్చ కారా ఉపాత్తాః । తేన వయం సర్వేషాం సర్వత్ర స పార్థక్యేన ప్రయోజనాంతరం పశ్యామః ॥ ఓం ఏకాక్షర్యై నమః ॥

ఆం. వి. మాయావచ్ఛిన్న చైతన్యము ఈశ్వరుడు గాన, ఈశ్వరోపాధిగ మాయ ముఖ్య (ఏక) మైనది, ఆత్మ జ్ఞానము, మోక్షము లభించనంత వఱకు ఆ మాయ నశించదు గాన, ఆమె అక్షర (నాశరహిత) కూటస్థశబ్దవాచ్య. తన్మాయా ప్రతిబింబనిష్ఠములైనట్టి సర్వజ్ఞత్వ, సర్వసాక్షిత్వాది ధర్మములను ప్రతిబింబిత వస్తువు నందు ఆధానము చేయునట్టి విశేష లక్షణము గలదగుటచేత ఆ పరాశక్తి 'ఏకాక్షరీ' నామముతో స్తవనీయ యగుచున్నది.

ఏకాక్షరమైన ప్రణవము సర్వమునకు మూలము; ఆ ప్రణవము ( ఓంకారము ) పరాపరబ్రహ్మ లిరువురకును

ప్రతీక; తత్ప్రణవోపాసనచేత, తదుభయవిధ బ్రహ్మప్రాప్తి సాధనత్వము వలన శబ్దబ్రహ్మరూపలక్షితమైన బ్రహ్మకు లక్షకమైన, అనగా వాచకమైన శబ్దము - ప్రణవము ఈమెకు గూడ గలదుగాన, ఈమె 'ఏకాక్షరీ' నామముచే వ్యపదేశ్యరాలగుచున్నది. పరబ్రహ్మవాచకమైన ప్రణవము పరాశక్తి వాచకముగగూడ జెప్పుట వలన శక్తిశక్తిమంతుల కీచట అభేదము సూచితమని తెలియవలెను.

మాయాసంబంధము లేని సంపూర్ణ, అద్వయ (ఏక) చైతన్యస్వరూపుడు, అక్షరుడు, నాశరహితుడు నగు పరమేశ్వరుడు అర్ధశరీరియై పరమేశ్వరి యందున్నాడుగాన, ఈమెకు 'ఏకాక్షరీ' యను నామము సర్వథా యుక్తము.

ముఖ్యములైన మాయాబీజాది వర్ణములు, అనగా హ్రీం, క్లీం, శ్రీం మున్నగు బీజాక్షరములు తత్పరాదేవతోపాసనకు ప్రతీకలుగా నుండుట వలన ఆ పరమేశ్వరి 'ఏకాక్షరీ' నామవాచ్య యగుచున్నది. "అథ పరా మాయా తదక్షర మధిగమ్యతే" - 'పరాశక్తి యయిన పరావాక్కు చేత అక్షర పరబ్రహ్మతత్త్వము తెలిసికొనబడుచున్న' దను శ్రుతి తాత్పర్యానుసారము పరమేశ్వరి 'ఏకాక్షరి' యగుచున్నది. ఏకాక్షరమైన ప్రణవము పరావాక్ స్వరూపము; తన్నిఃసృతములయినవే సర్వ బీజాక్షరములు. సర్వ బీజాక్షరములు అద్వయానంద బ్రహ్మతత్త్వప్రతిపాదకములు గాన, పరావాక్

రూపమున పరాదేవత 'ఏకాక్షరీ' యను నామముతో విరాజిల్లుచున్నది.

అఖండాకారమైన వృత్తియందు ప్రతిబింబించుటకు తగిన చైతన్యస్వరూపము గలదగుటవలన, ఆ వృత్తియందు వ్యాప్తిమాత్రము చేతనే అక్షర (ప్రణవ) పదవాచ్యమైన శుద్ధచైతన్యము విషయతాసంబంధము (పరబ్రహ్మ పరమేశ్వరికి విషయమను భావము) తో ఈమెయందు గలదుగాన, దేవి 'ఏకాక్షరీ' నామముతో స్తుతింపబడుచున్నది.

మూలశ్లోకమున 'ఏకారరూపా చైకాక్షరీ' యని చకార ముచ్చరింపబడినది అటులనే తరువాత గూడ చకారములు గలవు. ఈ చకారము నిర్గుణ పరబ్రహ్మకు గూడ సగుణబ్రహ్మ యొక్క విశేషణ సద్భావ (విశేషణములు కలిగియుండుట) సముచ్చయపరమని సర్వత్ర భావనీయము. "సచ్చిన్మయః శివః" యను వచనము వలన 'శివుడు సాక్షాత్తు సత్యస్వరూపుడు, జ్ఞాన స్వరూపు' డనియు పరమేశ్వరి తదానంద స్వరూపిణి యనియు దెలియుచున్నది. "స్త్రీరూపాంచింతయేద్దేవీం" అనుచు స్మృతివచనము 'పరదేవతను స్త్రీరూపముగాను, లేక పుం రూపముగాను ధ్యానింపనగు ననియు, అథవాని స్థూలమైన సచ్చిదానందస్వరూపిణిగా ధ్యానింపవలయునని చెప్పుచున్నది.

"త్వం స్త్రీ త్వం పుమాన్" — 'నీవే స్త్రీవి, నీవే పురుషుడవు' అనుచు శ్వేతాశ్వతరోపనిషత్తు ఉపాధి (శరీరము)

చే నేర్పడిన అనేక రూపములు పరాశక్తికి సంభవములని చెప్పుచున్నది. కనుకనే, "సేయం దేవతైక్షత" 'ఆ దేవి పర్యాలోచన చేసెను' అని మొదలిడి, "తత్సత్యం స ఆత్మా" 'ఆ వస్తువు సత్యము, అతడు ఆత్మ' అని అంతముగా గల శ్రుతి యందు స్త్రీలింగాంత దేవతావాచకశబ్దములకు, "తత్సత్యమ్" అను నపుంసకాంత శబ్దములకు, "స ఆత్మా" అను పుంలింగాంత పదములకు ఏకార్థత్వము (మూడు లింగములచే బోధ్యమగు నట్టి యర్థము ఒకటియే యగుట), ఉపాధికృత భేదము వివక్షచేయబడక పోవుటవలన, 'తత్, త్వం' పదములకు లక్ష్యార్థము ఒకటియే యగుట వలన ఉపపన్నమే, అందువలన తత్త్వం (తత్ + త్వం) పదలక్ష్యార్థమైన పరబ్రహ్మ యందు సమస్త గుణములు వర్ణింపబడుట సంగతమే యని భావించి శ్రీహయగ్రీవస్వామి చేత త్రిశతి యందు అనేక చకారములు గ్రహింపబడినవి. ఆ కారణముచేత మేము సర్వ చకారములకు సర్వత్ర భిన్నమైన మఱియొక ప్రయోజనమును జూచుటలేదు.

## ౨౩. ఏకానేకాక్షరాకృతిః

శం. భా. ఏకానేకాక్షరాకృతిః । ఏకస్య ఈశ్వర ప్రతిబింబోపాధితయా శుద్ధసత్త్వప్రధాన మక్షర మజ్ఞానమ్ । అనేకాని మలిన సత్త్వప్రధానతయా జీవోపాధిభూతా న్యక్షరాణి అజ్ఞానాని "మయా చావిద్యాచ స్వయమేవ భవతి" ఇతి శ్రుతేః । ఏకం చానేకాని చ ఏకానేకాని తాని చ అక్షరాణి చ తాని తథా, "మాయాం తు ప్రకృతి" మితి శ్రుతేః ।

తేషామాకృతయః ప్రతిబింబా న్యవచ్ఛిన్నాని వా చైతన్యాని ఘటస్థోదకావచ్ఛిన్న ప్రతిబింబితాకాశవత్ యస్యాః సా తథా।

అథవా, ఏకాని చ ప్రణవాద్యాని అనేకాని చ అకారాది క్షకారాంతాని అక్షరాణి వర్ణాః ఆకృతిః స్వరూపం యస్యాః సా, మాతృకాస్వరూపత్వేన వా । "అకారాది క్షకారాంతా మాతృకే త్యభిధీయతే" ఇతి వచనాత్ ।

అథవా, ఏ చ కశ్చ ఏకార కకారౌ తౌ చ ఇతరాణ్యనేకాక్షరాణి చ సర్వం మిలిత్వా పంచదశవర్ణాత్మికా మూలవిద్యా ఆకృతిః స్వరూపం యస్యాః సా । సాక్షితయా ఏకీభూతా అనేకాక్షరేషు ఆకృతిః స్వరూపం శోధిత తత్త్వం పదార్థ సామరస్యాత్మకం యస్యాః సా తథా ॥ ఓం ఏకానేకాక్షరాకృతయే నమః ॥

ఆం. వి. ఏకమనగా, ఈశ్వర ప్రతిబింబము ఉపాధిగాగల శుద్ధసత్త్వ ప్రధానము (అన్యగుణ సంస్పర్శరహితము), అక్షరము నయిన అజ్ఞానము, అనగా శుద్ధసత్త్వ ప్రధానమైన మాయ; అనేకము లనగా మలినసత్త్వప్రధానము (అన్యగుణ సమ్మేళనముచే సంకరము) లయిన జీవోపాధి భూతములు, అక్షరములయిన అవిద్యలు "మాయా చావిద్యా చ" అనుచు శ్రుతి 'మాయ, అవిద్య - రెండును దేవి తానే యగుచున్న' దని చెప్పుటచేత ఈశ్వరోపాధియైన మాయయు, జీవోపాధి

మైన అవిద్యయు కలసి ఏకానేకములయినవి. ఏకము, అనేకములునయిన అక్షరములు ఏకానేకాక్షరములు; "మాయాంతు ప్రకృతిం విద్యాత్" — 'మాయను ప్రకృతిగా తెలియు' మను శ్రుతివచనము వలన, ఆ ఏకానేకాక్షరములందు ప్రతిబింబములయిన ఆకృతులు గాని, అవచ్ఛిన్న చైతన్యములు గాని, ఘటజలమందు అవచ్ఛిన్నము, ప్రతిబింబితము నయిన ఆకారముండురీతిగ ఈ పరమేశ్వరియందు భిన్నముగాను, అభిన్నముగాను గలవు గాన, ఆమె 'ఏకానేకాక్షరాకృతిః' యను నామముతో నొప్పారును.

అథవా, "అకారాది క్షకారాంతా మాతృకేత్యభిధీయతే" —'అకారము మొదలుకొని క్షకారము వఱకు గల యక్షర సముదాయమును 'మాతృకా' యని చెప్పుదురు' ఏకాక్షరములైన ప్రణవాదులు, అనేకములైన అకారాది క్షకారాంతముగల వర్ణములు స్వరూపముగా గలది గాన, అనగా, మాతృకాస్వరూపిణిగా విలసిల్లునదిగాన దేవికి ఈ నామ మన్వర్థము.

యద్వా, ఏకార, కకారములు, ఇతరము లయిన అనేకాక్షరములు కలసి, పంచదశవర్ణాత్మిక యయిన ప్రధాన పంచదశీవిద్య స్వస్వరూపముగా గలది; అనగా పంచదశీవిద్య (సౌభాగ్యవిద్య) యందలి బీజాక్షరములచే ప్రతిపాదిత తత్త్వం స్వరూపము, లేక ఆకృతిగ గలది యగుటచే మహాత్రిపుర

సుందరి 'ఏకానేకాక్షరాకృతిః' యను నామముతో సంకీర్త
నము చేయబడుచున్నది.

అనేకములైన అవిద్యోపాధులందు సాక్షిమాత్రు
రాలుగా ఏకమైయున్న స్వరూపము, తత్, త్వం పదార్థ
శోధన వలన తేలిన సామరస్యాత్మక స్వరూపము గలది గాన,
పరమేశ్వరి 'ఏకానేకాక్షరాకృతిః' యని స్తవనీయురాలై
వెలుగొందుచున్నది.

## ౮౫. ఏతత్తదిత్యనిర్దేశ్యా

శం. భా. ఏతత్తదిత్యనిర్దేశ్యా । ఏతత్ ఏతత్కాలేఽపి
ఇయత్తాపరిచ్ఛేదవద్వస్తు, తత్ పరోక్షమనిశ్చితస్వరూపమ్ ।
ఏతచ్చ తచ్చ ఏతత్తత్ । ఇతికారః ఇత్థంభావే తృతీయార్థే ॥
తథా చ ఏతత్త్వ తత్త్వాభ్యా మిత్యర్థః । ఏతత్తదిత్యనేన
నిర్దేష్టుం నిర్వక్తుం యోగ్యా నిర్దేశ్యా సా న భవతీతి
అనిర్దేశ్యా । లోకే సవిశేషో హి పదార్థః పరోక్షత్వాపరోక్ష
త్వాది ధర్మవిశేషేణ తద్గతేన నిర్వక్తుం శక్యః । శబ్దప్రవృత్తి
నిమిత్త జాతి గుణ క్రియా షష్ఠ్యర్థానాం యత్ర సంబంధో
నాస్తి, "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" "నిర్గుణం
నిష్కలమ్" ఇత్యాది శ్రుత్యా తాదృగ్వస్తు కేన కారణేన
కేన వా వచనేననిర్దేష్టుంశక్యమ్। "యద్వాచాఽనభ్యుదితమ్"
ఇతి శ్రుతేః అతః ఏతత్తదిత్యనిర్దేశ్యావాఙ్మనసాతీతేత్యర్థః ।

అథవా, ఏతత్ ప్రత్యక్షాదిప్రమాణసిద్ధం కార్యం పశ్చాద్భవతి । తత్ పరోక్షత్వాదివిశిష్టం పూర్వకాలసంబంధి వ్యవహితం కారణ ముచ్యతే । ఇతి శబ్దః ఉభయత్ర సంబంధనీయః । కార్యమితి కారణమిత్యపి శుద్ధచైతన్యరూపా అనిర్దేశ్యా, కార్యత్వ కారణత్వఘటక ఉపాధివిరహితత్వేన కార్యకారణభావాభావే తద్వాచకశబ్దైః విషయీకర్తు మశక్యత్వాత్ ।

అథవా, ఏతత్ అపరోక్షతయా అహమితి ప్రతీయమానం జీవచైతన్యం త్వంపదవాచ్యార్థః । తత్ పరోక్షతయా ప్రతీయమాన మీశ్వరచైతన్యం తత్పదవాచ్యార్థః । ఇతి శబ్దః ఏవకారార్థః । తథా చ వాదిభేదసిద్ధాంతః అనూదితః । సాంఖ్యమతే ప్రకృతిః జగత్కర్త్రీ, జీవో నానా చేతనః భోక్తా ఇత్యతః ఈశ్వర ఏవ నాస్తీ త్యంగీకృతమ్ । భాగవత మతే తు "గుణీ సర్వవిత్" ఇతి శ్రుతేః నిత్యగుణవిశిష్టత్వాత్ పరమేశ్వరాత్ విష్ణోః జీవానా ముత్పత్తివినాశవత్త్వేన అనిత్యత్వాత్ స ఏవ భగవాన్ పారమార్థికః ఏక ఇత్యంగీకృతమ్ । తదుభయవాదిసిద్ధాంతస్య ఔపనిషదమతే నిరస్తత్వాత్ తదుభయవిధయా అనిర్దేశ్యా । పరమార్థ సచ్చిదానందరూపతయా ఛాందోగ్యగత దేవతాశబ్దార్థస్య ప్రతిపాదనాదితిభావః ।

అథవా, తటస్థ ఈశ్వరవాది కాణాదాది సిద్ధాంతవత్ వ్యవస్థిత భేదవత్ జీవేశ్వర రూపతయాఅనిర్దేశ్యా । భేద

వ్యవస్థా ఏవ సాధితు మశక్యత్వాదితి ఏతత్తదిత్యనిర్దేశ్యా ॥
ఓం ఏతత్తదిత్యనిర్దేశ్యాయై నమః ॥

ఆం. వి. ఏతత్ అనగా, ఈ కాలము (వర్తమాన కాలము) నందు సైతము ఇంత (ఇయత్తా) యను పరిమాణము (పరిచ్ఛేదము) గల వస్తువు; తత్ అనగా పరోక్షము. అనిశ్చితము నయిన స్వరూపము గల పదార్థము. ఏతత్, తత్ (పరిమాణ పరిచ్ఛిన్నమైన ప్రత్యక్షవస్తువు, అనిశ్చితస్వరూపముగల పరోక్షవస్తువు) - ఈ రెండు సమసించగా "ఏతత్తత్" అగును. ఇత్థంభావము నందు (ఇటువంటిది యను భావము నందు) తృతీయా విభక్త్యర్థమునందు నిట 'ఇతి' శబ్దము ప్రయుక్తమైనదని తెలియనగును. కాగా, ఏతత్త్వ తత్త్వముల చేత (ఇది ప్రత్యక్ష వస్తువగుట చేత, అది పరోక్ష వస్తువగుట చేత) అని యర్థము వచ్చును. ఏతత్ — ఇదియని, తత్ — అదియని నిర్దేశింప — నిర్వచింప శక్యముకానిది యగుట వలన ఆ దేవి 'ఏతత్తదిత్యనిర్దేశ్యా' యయినది; లోకము నందు సాధారణముగా, ఒకానొక ధర్మముతో గూడిన పదార్థమును, తద్వస్తువుకు సంబంధించిన పరోక్షత్వ, అపరోక్షత్వరూప ధర్మవిశేషములచేత నిర్వచించి చెప్పుట శక్యమగును. "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్"— 'శబ్ద రహితము, స్పర్శరహితము, రూపరహితము, అవ్యయము నయినది బ్రహ్మపదార్థము అనియు, "నిర్గుణం నిష్కలమ్" 'ఆ బ్రహ్మతత్త్వము గుణాతీతము నిష్కలము' భాగరహితము

శాంతమునైనదనియు పెక్కు శ్రుతి వచనములు పేర్కొను చున్నవి; కావున, శబ్దప్రవృత్తికి కారణభూతములైన జాతి, గుణ, క్రియలకు, షష్ఠ్యర్థమునకు సంబంధము (ప్రవృత్తి) లేని విలక్షణ వస్తువు ఏ కరణము (సాధనము) చేతగాని, ఏ శబ్దము చేతగాని, నిర్వచించుటకు శక్యమగును. "యద్వాచానభ్యుదితమ్" అనుచు శ్రుతి బ్రహ్మపదార్థ మనిర్వచనీయ మని చెప్పుచున్నది. కావున, బ్రహ్మస్వరూపిణియగు ఆ పరమేశ్వరి 'ఏతత్తదిత్యనిర్దేశ్యా' యనగా 'వాఙ్మనసాతీతా' యనుచు కీర్తింపబడు చున్నది.

పక్షాంతరమున, ఏతత్ అనగా ప్రత్యక్షాది ప్రమాణముల చేత సిద్ధమై, అనంతరకాలము నందుండు కార్యము; తత్ అనగా పరోక్షత్వాది ధర్మవిశిష్టము, పూర్వ కాల సంబద్ధము, వ్యవహితము (దూరమునందున్న వస్తువు) నగు కారణ పదార్థము. ఇట 'ఇతి' శబ్దము ఉభయత్ర (ఏతత్, తత్ శబ్దములందు) యోజనీయము. ఆ దేవి కేవలచైతన్య స్వరూపిణి గాన, ఆమె కార్యమని గాని, కారణమని గాని నిర్దే శించుటకు శక్యముగానిది. కార్యత్వ, కారణత్వములను సంపా దించునట్టి యుపాధివిశేష మేదియు లేనందున కార్యకారణ భావము యొక్క అభావము నందు, కార్య, కారణవాచకము లైన శబ్దములచేత తద్బ్రహ్మపదార్థము వాచ్యము చేయబడ జాలదు గాన, ఆ బ్రహ్మణి 'ఏతత్తదిత్యనిర్దేశ్యా' యని స్తవ నీయ యగుచున్నది.

యద్వా, 'ఏతత్' అపరోక్షముగా 'అహం - నేను' అని గోచరమగుచున్న 'త్వం' పదమునకువా చ్యార్థమయిన జీవ చైతన్యము 'తత్' అనగా పరోక్షముగా ప్రతీయమానము, తత్పదవాచ్యార్థము నయిన ఈశ్వర చైతన్యము. 'ఇతి' అను శబ్దము నిర్ధారణను చెప్పునట్టిది. కాగా, ఈ నిర్వచనము వలన అద్వైతవాది సిద్ధాంత మనువదింపబడినది. సాంఖ్యమతము నందు ప్రకృతి ప్రపంచ సృష్టికర్త్రి; నానారూపమైన చైతన్యము జీవుడు; అతడే భోక్త - అనుభవించువాడు. కావున, ఆ మతమునందు ఈశ్వరుడే లేడని యంగీకరింపబడినది; భాగవతమతము నందు (విశిష్టాద్వైత మతమునందు) "గుణీసర్వ విత్" - 'పరమేశ్వరుడు అనంత కళ్యాణ గుణసంపన్నుడు, సర్వజ్ఞుడు' అను శ్రుతివచనము వలన శాశ్వత గుణవిశిష్టుడు, పరమేశ్వరుడు నయిన విష్ణువు వలన, జీవులు ఉత్పత్తి వినాశములు గలవారగుటచేతవారు అనిత్యులుగాన, భగవంతు డయిన ఆ నారాయణమూర్తి యొక్కడే పారమార్థికమైన తత్త్వమని యంగీకరింపబడినది. పైన పేర్కొనిన ఉభయవిధ సిద్ధాంతములు ఔపనిషద మతమునందు నిరసింపబడినవి; కావున, సాంఖ్య, భాగవత సిద్ధాంతములు రెండింటిచేతను నిర్దేశించి వర్ణింప నలవికానిది గాన, ఆ జగన్మాత 'ఏతత్తది త్యనిర్దేశ్యా' యనుచు భక్తగణముచే స్తుతింపబడుచున్నది.

ఛాందోగ్యోపనిషత్తు నందు దేవతాశబ్దార్థము పరమార్థమైన సచ్చిదానంద స్వరూపముగ ప్రతిపాదింపబడినది గాన ఆమె దేనిచేతను నిర్దేశింప శక్యము గానిది యని భావము.

అథవా, కాణాదాదుల తర్కసిద్ధాంతము 'ఈశ్వరుడు తటస్థు' డని జెప్పును. వారి సిద్ధాంతము చెప్పిన రీతిగా స్వవస్థితమైన భేదము గలజీవుడు, ఈశ్వరుడు అను భిన్నరూపము చేత ఆ జనని నిర్దేశింప శక్యము కానిది గాన, అనిర్దేశ్య. భేద నిరూపణమే (జీవేశ్వర భేదప్రదర్శనమే) సాధింప శక్యము కాని దగుట వలన (శ్రీ) పరమేశ్వరి 'ఏతత్తదిత్యనిర్దేశ్యా' యని సంకీర్తితురాలగుచున్నదని తాత్పర్యము.

## ౨౫. ఏకానందచిదాకృతిః

శం. భా. ఏకానంద చిదాకృతిః । ఏకా ముఖ్యా మోక్షరూపత్వేన ప్రాపిత్సితా । ఆనందః సుఖమ్ । చిత్ చైతన్యం ప్రకాశజ్ఞానమ్ । ఆనందశ్చాసౌ చిచ్చ ఆనందచిత్ ఏకాచాసౌ వానందచిచ్చ ఏకానందచిత్ ఆకృతిః స్వరూపం యస్యాః సా । సచ్చిదానంద బ్రహ్మరూపలక్షణవతీత్యర్థః । "విజ్ఞాన మానందం బ్రహ్మ", "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" ఇతి శ్రుతేః, "ఆనందాదయః ప్రధానస్య" ఇతి న్యాయాచ్చ దీప్తిస్వరూప ప్రకాశాత్మక పరమానందస్వరూపస్య జీవన్ముక్త్యవస్థాయాం పరమాత్మజ్ఞానవత్ పురుషానుభవరూప ప్రత్యక్షప్రమాణగోచరత్వ మస్యా ఇతి వా తథా ।

అథవా, ఏకేషాం అనుభావికానాం యోగినా మానంద సాక్షాత్కారరూపా ఆకృతిః నిరావరణప్రకారరూపా యస్యాః సా తథా ।

అథవా, ఆనందః శివః చిత్ పరమేశ్వరః ఏకే మూర్తి భేదరహితే ఆనందచితౌ ఆకృతిః యస్యాః సా తథా ॥ ఓం ఏకానందచిదాకృతయే నమః ॥

ఆం. వి. 'ఏకా' యనగా మోక్షరూపమున ముఖ్యముగా పొందుట కభిలషింపబడినది; ఆనందమనగా సుఖము; చిత్ అనగా చైతన్యము, ప్రకాశస్వరూపమైన జ్ఞానము; ఆనందము, చిత్ — రెండును సమసించి 'ఆనందచిత్' అగును; ఈ ఆనంద చిద్రూపము ఏకము అనగా ముఖ్యమగుటంజేసి 'ఏకానంద చిత్' యగును; ఏకానందచిత్స్వరూపము ఆకృతిగా గలదగుట చేత పరమేశ్వరి 'ఏకానందచిదాకృతిః' యను నామముతో విరాజమాన యగుచున్నది. ఆ తల్లి సచ్చిదానంద స్వరూప మైన పరబ్రహ్మయొక్క లక్షణములు గలది గాన. ఈ నామ మామెయందన్వర్థమని భావము. "విజ్ఞాన మానందం బ్రహ్మ" విజ్ఞానము, ఆనందము, 'బ్రహ్మ' యనియు, "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్". 'ఆనందమును బ్రహ్మయని తెలియు' మనియు చెప్పునట్టి శ్రుతివచనముల వలనను, "ఆనందాదయః ప్రధానస్య" — ఆనందాదులు, అనగా ఆనందము. సర్వ

గతత్వము, సర్వాత్మత్వము, సర్వజ్ఞత్వము మున్నగునవి సర్వశ్రేష్ఠమైన పరబ్రహ్మముయొక్క ధర్మములని చెప్పుచున్న బాదరాయణుల సూత్రము వలనను, జీవన్ముక్తి స్థితిలో దీప్తి స్వరూపము, ప్రకాశాత్మకము, పరమానందస్వరూపము నయిన పరమాత్మజ్ఞానమువలె, పురుషుని (జీవుని) యొక్క యనుభవ రూపమైన ప్రత్యక్ష ప్రమాణమునకు గోచరమగుట యను ధర్మము ఈ దేవియందు గలదుగాన, ఆ పరమేశ్వరి యీ నామముచేత నుతింపబడుచున్నది.

అథవా, సమాహిత చిత్తులు, మహానుభావులు నయిన యోగులకు ఆనందసాక్షాత్కార రూపమైన యాకృతి, అనగా ఆవరణ రహితమైన ప్రకాశస్వరూపము గలదగుటచేత పరాభట్టారిక 'ఏకానందచిదాకృతిః' యని కీర్తింపబడుచున్నది.

యద్వా, ఆనంద మనగా పరమేశ్వరి, చిత్ అనగా పరమేశ్వరుడు; వీరిరువురు మూర్తిభేదము లేని యద్వయానంద చిద్రూపులు; తాదృశ చిదానందములు స్వరూపముగ గలది గాన, శ్రీ త్రిపురసుందరి 'ఏకానందచిదాకృతిః' యను నామముతో భావనీయురాలగుచున్నది.

శ్లో॥ ఏవమిత్యాగమాబోధ్యా చైకభక్తిమదర్చితా ।
ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా చైషణారహితాదృతా ॥ 6

## ౨౬. ఏవమిత్యాగమాబోధ్యా

శం. భా. ఏవమిత్యాగమాబోధ్యా। నను ఆనందశబ్దస్య లక్షణయా ఆనందమయో వాచ్యః। 'య ఏకో జాలవానీశత ఈశనీభిః" ఇతి శ్రుత్యైకత్వ మపి జీవే సిద్ధ్యతి। తథా చ ఏకశ్చాసా వానందశ్చ తస్య చిత్ అధిష్ఠానప్రకాశకచైతన్య మాకృతిః యస్యాః సేతి విగ్రహః సంభవతి। "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇతి తత్ప్రకాశక చైతన్యస్య పుచ్ఛశబ్దేన పరామర్శాత్। ఏవం చ సతి ప్రకాశకనిత్యత్వస్య ప్రకాశ్య నిత్యత్వాపేక్షత్వాత్। "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది బ్రహ్మస్వరూపలక్షణవాక్యేషు వాచ్యార్థ ప్రాధాన్యేన విధిముఖేనైవ బ్రహ్మప్రతిపాదనే అతద్వ్యావృత్తిరూప నిషేధముఖేన లక్షణార్థప్రాధాన్యేన బ్రహ్మస్వరూప లక్షణ ప్రతిపాదనాయోగేన తత్త్వమసి వాక్యే వైశిష్ట్యం వాక్యార్థః సంభవతీతి చేత్. నేత్యాహ — ఏవమిత్యాగమాబోధ్యేతి। ఏవంవిశిష్టతయా ఇతి ప్రత్యక్షసిద్ధత్వేన ఆగమైర్వేదైః జ్ఞాపనీయా న భవతి। ఆనందశబ్దస్య ఆనందమాత్రవాచకస్య తత్ప్రచురే సంభావితేషద్దుఃఖే జీవే లక్షణాయాం త్రయో దోషాః। పారమార్థికభిన్నసత్తాక వస్త్వంతరాభావేన తత్త్వం పదవాచ్యార్థనిష్ఠ విశేషణద్వయస్య అన్యోన్యవిరోధవత్తయా తమఃప్రకాశవత్ వైశిష్ట్యాయోగే అఖండార్థో వాక్యార్థః సంపద్యతే। తథా చ స్వరూపలక్షణవాక్యేషు వాచ్యార్థస్య 'అతోఽన్యదార్తమ్' ఇతి శ్రుత్యా మిథ్యాత్వప్రతిపాదనాత్

నిషేధముఖేనైవ అతద్వ్యావృత్తి స్వరూపప్రతిపాదనేన లక్షణవాక్యాని సమంజసాని భవంతీతి భావః ॥ ఓం ఏవమిత్యాగమాబోధ్యాయై నమః ॥

ఆం. వి. ఓయీ, 'ఏకానందచిదాకృతిః' యను పూర్వోక్త నామమందలి యానంద శబ్దమునకు లక్షణావృత్తి చేత ఆనందమయుడని చెప్పవలయును. "య ఏకో జాలవా నీశత ఈశనీభిః" — 'జాలరియైన (మాయాశబలితుడైన) యొక్కడు, శాసించునట్టి స్వీయశక్తుల సాహాయ్యముతో సమస్త లోకములను పాలించుచున్నా' డని శ్రుతిబోధితమైన ఏకత్వము జీవునియందు సిద్ధించుచున్నది. కాగా ఏకమైన ఆనందము యొక్క చైతన్యము (చిత్), అనగా, అధిష్ఠాన ప్రకాశకమైన చైతన్యము ఆకారముగా గలదను విగ్రహ వాక్యము సిద్ధించును. "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" యనుచు శ్రుతి బ్రహ్మ ప్రకాశకచైతన్యముపుచ్ఛ శబ్దముచే పరామృష్టమైనది. ఈ రీతిగ కాగా, ప్రకాశకనిత్యత్వము ప్రకాశ్య వస్తు నిత్యత్వముపై నాధారపడియుండుట వలన, "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" 'సత్యము, జ్ఞానము, అనంతమునైనది బ్రహ్మ' అనుచు, బ్రహ్మస్వరూపలక్షణ బోధకములైన అనేకానేక శ్రుతివాక్యములందు వాచ్యార్థప్రాధాన్యము చేత విధిముఖముగానే బ్రహ్మప్రతిపాదనము సిద్ధించుచున్నది. అపుడు, అతద్వ్యావృత్తిరూప నిషేధముఖముగా, అనగా, అతత్ అనగా తత్ కానిది జడము, అతద్వ్యావృత్తి యనగా

జహన స్తువ్యాన్న త్తి, తన్నిషేధముఖముగా లక్షణార్థ ప్రాధా
న్యము చేత బ్రహ్మస్వరూప లక్షణమును ప్రతిపాదించుట
కుదరకపోవుచున్నది. కావున 'తత్త్వమసి' యను శ్రుతి
వాక్యము నందు విశేషణ విశిష్టత్వము వాక్యార్థము సంభ
వించునని చెప్పినచో, అది సంగతము కాదనుచు 'ఏవమిత్యాగ
మాబోధ్యా' యను నామ మారబ్ధమైనది — ఈ రీతిగ
వాక్యార్థము విశేషణవిశిష్టమని ప్రత్యక్షసిద్ధ మగుటవలన
వేదములచే జ్ఞాపనీయము కాదు. ఆనందమాత్ర వాచకమైన
ఆనందశబ్దమునకు, ఆనందవిశేషము నందు కొలది దుఃఖము
నూహించుచున్న జీవునియందు లక్షణావృత్తి చెప్పినచో,
మూడు దోషములు సంభవించును. పారమార్థికముగ భిన్న
సత్తగల వస్త్వంతరము లేకపోవుటచేత, తత్, త్వం పదముల
వాచ్యార్థము నందలి విశేషణద్వయము పరస్పర విరోధము
కలిగియుండుటచేత, తమఃప్రకాశముల వలె విశిష్టార్థము
పొసగదు కావున, వాక్యారము అఖండార్థస్వరూపముగ
సంగతమను. అటులయిన, స్వరూపలక్షణ వాక్యములందు
వాచ్యార్థము "అతోఽన్యదార్తమ్" — 'దీనికంటె భిన్న
మైనది అనృతము' అను శ్రుతివచనము చేత, బ్రహ్మభిన్న
మైనదానికి మిథ్యాత్వము చెప్పబడుట వలన, నిషేధ
ముఖముగా అతద్వ్యావృత్తి స్వరూపమును ప్రతిపాదించుట
వలనను లక్షణవాక్యము లన్నియు సమంజసములు, యుక్తి
సంగతములని భావము.

## ౨౭. ఏకభక్తిమదర్చితా

శం. భా. ఏకభక్తిమదర్చితా । ఏకస్మిన్నభేదే జీవబ్రహ్మణోః భక్తిః భజనీయత్వబుద్ధిః తత్పరిజిజ్ఞాసా యేషాం సంతి, తైరర్చితా పూజితా ఇత్యేతదుపలక్షణం స్తుతా ధ్యాతా నమస్కృతేత్యేవమాదీనాం "యన్మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి" ఇతి శ్రుతేః మానసిక వ్యాపారపూర్వకాని హి ఇతరేంద్రియకర్మాణి భవంతీత్యభిప్రాయః ।

అథవా, అస్మిన్ సంసారమండలే తత్స్వరూప పరిజ్ఞాతారః యే కేచన, తేషాం భజనీయత్వాధ్యవసాయో భక్తిః తదేకప్రవణతా సగుణబ్రహ్మవిషయా అష్టవిధా, తైరేకభక్తిమద్భిరర్చితా అంతర్యాగ బహిర్యాగ మహాయాగప్రకారైః పూజితా ఇత్యర్థః ॥ ఓం ఏకభక్తిమదర్చితాయై నమః ॥

ఆం. వి. జీవబ్రహ్మల యొక్క అభేదస్వరూపమునందు భజనీయత్వబుద్ధి, తత్సంబంధమైన జిజ్ఞాస కలవారిచేత అర్చింపబడునది, పూజింపబడునది; ఇది, స్తోత్రము చేయబడునది, ధ్యానింపబడునది, నమస్కరింపబడునది మొదలగువాని కుపలక్షణము. "యన్మనసా ధ్యాయతి". 'మనస్సుచేనాలోచించువిషయమును వాక్కుతో పలుకుచున్నాడు, దానినే కర్మరూపమున చేయుచున్నాడు' అను శ్రుతి వలన మానసిక వ్యాపారపూర్వకముగనే యితరేంద్రియ కర్మలు జరుగుచున్నవని తెలియుచున్నది.

అథవా, ఈ సంసార చక్రమునందు తత్స్వరూప పరిజ్ఞానము గల యే కొలదిమందికి మాత్రమే భజనీయత్వ ప్రయత్నము, తదేక ప్రవణత్వము, సగుణబ్రహ్మ విషయకము నయిన భక్తి యెనిమిది విధములుగ నుండును; తదేక ప్రవణ మైన భక్తి గలవారిచేత, అంతర్యాగ, బహిర్యాగ, మహా యాగ ప్రకారములతో అర్చింపబడునది పూజింపబడునది గాన, ఆ లలితాపరాభట్టారిక 'ఏకభక్తిమదర్చితా' యను నామముచే స్తవనీయ యగుచున్నదని భావము.

## ౨౮. ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా

శం. భా. ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా । ఏకం ఐక్యరూపం అగ్రం ఆలంబనం విషయః విజాతీయప్రత్యయ తిరస్కార పూర్వక సజాతీయవృత్తికాభిః నిరంతరవ్యాప్తివిషయీకృత చైతన్యం యస్య తత్తాదృశం చిత్త మంతఃకరణం యేషాం తైః । యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధీనాం పరిపాకాతిశయేన పశ్చాత్సంపద్య మానా అసంప్రజ్ఞాత సమాధేః త్రివిధా భూమికా - ఋతంభరా, ప్రజ్ఞాలోకా. ప్రశాంతవాహితా చేతి । ఋతం యథాభూతం సచ్చిదానందలక్షణం బ్రహ్మ భరతి వృత్తి వ్యాప్త్యా విషయీకరోతీతి ప్రథమా తథా, "ఆత్మన్యేవ వశం నయేత్" ఇతి భగవద్వచనాత్ । ప్రజ్ఞాలోకా ॥ ప్రజ్ఞాయాం అఖండాకారవృత్తౌ నిత్యనిరంతరాభ్యాసేన పరిపాకం నీతాయాం

బ్రహ్మవిషయిణ్యాం ఆవరణాభిభవం కుర్వంత్యాం సత్యామ్ "ప్రజ్ఞా ప్రతిష్ఠా" ఇత్యాది శ్రుతేః, ప్రజ్ఞానాః బ్రహ్మస్వరూపాయాః ఆలోకః అభివ్యక్తిః సాక్షాత్కారః యస్యాం సంపద్యతే సా కారణవిజ్ఞానమ్ । "యస్మిన్విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" త్యేకవిజ్ఞానేన సర్వవిజ్ఞానరూపమ్ । ప్రారబ్ధ వశాత్ తదా చిత్తం తదధ్యస్తం సర్వజగద్దృష్టు మిచ్ఛతి యది తదానీం చైతన్యప్రకాశేనైవ ప్రకాశితం జగత్ స్వాప్న పదార్థవదశేషం భాసతే। ఇదం చ భరద్వాజాదీనా మస్తీతి పురాణాదిప్రమాణవేద్య మస్మాకమ్ । తథా చ తస్యాం భూమికాయాం విరుద్ధ సామర్థ్యం సదంతఃకరణం సాకార స్వరూపం నిర్వాసనం యదా నశ్యతి, తదా ప్రశాంతవాహితా భవతి । వహాః ప్రవాహాః సంతతవృత్తిః ధారా అస్య అస్తీతి వాహీ, వాహినో భావః వాహితా, ప్రశాంతా చ సా వాహితా చ ప్రశాంతవాహితా । అథవా, ప్రశాంతఃవాహాః అస్య అస్తీతి ప్రశాంతవాహీ । ప్రశాంతవాహినో భావః ప్రశాంతవాహితా,

"మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయా స్థితిః ।
అసంప్రజ్ఞాత నామేతి సమాధి ర్యోగినాం ప్రియః ॥"

ఇతి వచనాత్, "ప్రశాంతమనసం హ్యేనమ్" ఇతి భగవద్వచనాత్,

పృథివ్యప్తేజోఽనిల ఖే సముత్థితే
పంచాత్మకే యోగగుణప్రవృత్తే ।
న తస్య రోగో న జరా న మృత్యుః
ప్రాప్తస్య యోగాగ్ని మయం శరీరమ్ ॥

ఇతి శ్రుత్యా ఉక్తలక్షణ సాధనపరిపాకవశా ద్భవతి। తైర్నిర్ధ్యాతా, ధ్యానస్యనిర్గతత్వాత్ । భేదాస్ఫూర్తౌ ధ్యాన విషయో న భవతి, ధ్యాతుః స్వరూపమేవ ప్రకాశతే. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" ఇతి శ్రుతేః । నిధ్యాతా ఇతి పాఠే నితరాం శ్రవణ మనన నిదిధ్యాసనేన సాక్షాత్కృతా ఇత్యర్థః ॥ ఓం ఏకాగ్రచిత్తనిర్ధ్యాతాయై నమః ॥

ఆం. వి. ఏకాగ్రమనగా, ఏకత్వరూపమైన అగ్రము, ఆలంబనము, విషయము; విజాతీయ ప్రత్యయ (జ్ఞాన) తిరస్కారపూర్వకముగా సజాతీయ వృత్తులచేత నిరంతర వ్యాప్తి విషయముగా చేయబడిన చైతన్యము గల అంతః కరణముతో నొప్పారునట్టివారిచేత నిర్ధ్యాత గాన, ఆ తల్లి 'ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా' యని కీర్తింపబడుచున్నది. ఇపుడు నిర్ధ్యాతా యను శబ్దము యోగసంప్రదాయానుగుణముగా వివరింపబడుచున్నది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులనెడి యష్టాంగముల యొక్క పరిపాకవిశేషము వలన అసంప్రజ్ఞాత సమాధి

యోగికి సిద్ధించును. ఆ అసంప్రజ్ఞాత సమాధి 'ఋతంభరా, ప్రజ్ఞాలోకా, ప్రశాంతవాహితా' యను త్రివిధ భూమికలలో నుండును.

ఋతమును, అనగా యథాభూతము (ఉన్నదానినున్నట్లు) సచ్చిదానంద లక్షణమైన బ్రహ్మను వృత్తి యొక్క వ్యాప్తి చేత భరించునది, ధరించునది గాన, మొదటిది 'ఋతంభరా' యని పేర్కొనబడును. "ఆత్మన్యేవ వశం నయేత్" చిత్తమును ఆత్మయందే అధీనము చేసికొనవలెను' అను భగవద్వచనము వలన ఋతంభరా భూమిక ద్యోతక మవుచున్నది.

'ప్రజ్ఞాలోకా' యనగా అఖండాకారవృత్తి గల బుద్ధి యందు నిత్యము నిరంతరాభ్యాసము చేత పరిపాకము పొందిన బ్రహ్మవిషయకమైన వృత్తి ఆవరణభంగము గలదగును. "ప్రజ్ఞా ప్రతిష్ఠా" ప్రజ్ఞయే-బుద్ధియే యాధారము' అను శ్రుతి వచనానుసారము ప్రజ్ఞాలోకము అనగా బ్రహ్మస్వరూప సాక్షాత్కారము కలిగెడిస్థితి కారణవిజ్ఞాన మనబడును. 'ఏది తెలిసిన, దృశ్యమానమగు ఈ విశ్వమంతయు తెలియు' నను శ్రుతితాత్పర్యానుసారము అది ఏకవిజ్ఞానము - అద్వితీయ బ్రహ్మవిజ్ఞానముచేత సర్వవిజ్ఞానరూపమైనది, ప్రారబ్ధకర్మ వలన అపుడు చిత్తము తత్కర్మచే నధ్యస్తమై నిఖిల విశ్వ మును చూడగోరినచో, అపుడు చైతన్య ప్రకాశముచే ప్రకాశితమైన జగత్తు సర్వము స్వప్నపదార్థము వలె భాసించును. ఈ స్థితి భరద్వాజాది బ్రహ్మర్షులకు గలదని

పురాణాది ప్రమాణముల వలన మనకవగత మగుచున్నది. ప్రజ్ఞాలోకాయను భూమికాస్వరూపమును పై విధముగా తెలియ నగును.

ఇక, ప్రశాంతవాహితా యను భూమికా స్వరూపమును పరిశీలింతము. ప్రజ్ఞాలోకాభూమికను అధిరోహించిన యోగి యొక్క యంతఃకరణసామర్థ్యము నిరుద్ధమై, సాకార స్వరూపము వాసనా (సంస్కార) రహితముగా నశించినపుడు 'ప్రశాంతవాహితా' యను భూమిక సిద్ధించును. వాహము అనగా సంతతవృత్తి ప్రవాహము గలదిగాన, వాహి యగును. వాహుల యొక్క భావము-ప్రవాహముల యొక్క భావము 'వాహితా' యనబడును; ప్రశాంతమైన వాహిత — ప్రవాహత్వముగాన, ప్రశాంత వాహితా' యనబడును.

అథవా ప్రశాంతమైన వాహము-ప్రవాహము గలది గాన, ప్రశాంతవాహీ యగును, ప్రశాంతవాహినుల భావము ప్రశాంతవాహిత యనబడును. "మనసో వృత్తిశూన్యస్య" యనుచు వృత్తిశూన్యమైన మనస్సు బ్రహ్మాకారమున నుండుటయే అసంప్రజ్ఞాత సమాధి యను పేరుతో బరగునని, ఈ సమాధి యోగుల కత్యంతప్రియ మైనదని చెప్పునట్టి వచనము వలనను, "ప్రశాంతమనసం హ్యేనమ్" - ప్రశాంత మనస్కుడైన యీ యోగిని సమాధి వరించుచున్న' దను భగవద్వచనము చేతను "పృథివ్యప్తేజోఽనిల ఖే సముత్థితే"

యనుచు 'పృథివ్యాది పంచభూతముల నధిగమించిన పంచాత్మకమైన యోగగుణము ప్రవర్తించగా, యోగాగ్ని మయమైన శరీరమును పొందిన యోగికి రోగ, జరా, మృత్యు భయము లేదు, అని చెప్పిన శ్రుతివచనము వలన, పూర్వోక్త లక్షణ సాధన పరిపాకవశము వలన ఈ ప్రశాంతవాహితా సమాధి సమకూరునని తెలియవలయును. ధ్యానము లేకపోవు టచే అసంప్రజ్ఞాత సమాధి నిష్ఠులైన యోగులచేత ధ్యానింప బడదు; భేదజ్ఞానము స్ఫురింపనిస్థితిలో ధ్యానమునకు విషయ మే యుండదు; ధ్యాత యొక్క - ధ్యానము చేయువాని యొక్క స్వస్వరూపమే యుండును. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" 'బ్రహ్మవిదుడు బ్రహ్మయే యగు' నను శ్రుతివచనాను సారము ఉపాస్య దేవత ఉపాసకుని స్వస్వరూపమే యగును గాన, ధ్యాన, ధ్యాతృ, ధ్యేయ రూపమైన త్రిపుటి నశించి సర్వము అఖండ సచ్చిదానంద స్వరూపముతో భాసించును. కావున, ఆ జగన్మాత 'ఏకాగ్రచిత్తనిర్ధ్యాతా' యను నామము చేత స్తుతనీయ యగుట ప్రత్యగ్బ్రహ్మైక్యస్థితి స్ఫోర కముగా నరలుచున్నది. 'నిధ్యాతా' యను పాఠాంతరము గనపట్టుచున్నది. అపుడు, అత్యంతము శ్రవణ, మనన, నిది ధ్యాసలచేత ఆ దేవి సాక్షాత్కరించుకొనబడుచున్న దని యర్థము చెప్పికొన నగును.

## ౨౯. ఏషణారహితాదృతా

శం. భా. ఏషణారహితాదృతా । ఏషణా ఇచ్ఛా । సా త్రివిధా । ఏతల్లోకజయాయ పుత్రైషణా । పితృలోక జయసాధన కర్మసంపాదనాయ విత్తైషణా । ఉపాసనాదినా జయసాధనం దేవలోకః, తస్మిన్నేషణా లోకైషణా । ఆభిః రహితైః అనాకృష్టచిత్తైః, "తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయ భిక్షాచర్యం చరంతి" ఇతి శ్రుతేః ఏషణారహితా యే పరమహంస పరి వ్రాజకాః సంన్యాసినః తైః ఆదరేణ అతిశయ ప్రేమ్ణా స్వ స్వరూపేణ ఆదృతా అంగీకృతా నిరంతరధ్యానేన సాక్షా త్కృతా సతీ మోక్షరూపతయా ప్రాప్తేత్యర్థః ఓం ॥ ఏషణా రహితాదృతాయై నమః ॥

ఆం. వి. ఏషణ యనగా ఇచ్ఛ. ఆ కోరిక పుత్రైషణ, విత్తైషణ, లోకైషణ యని మూడు విధములుగా నుండును. ఇహలోకమునకై పుత్రైషణ (పుత్రుల యందు కోరిక), పితృ లోక జయసాధనమైన వైదికకర్మానుష్ఠానము కొఱకు విత్తై షణ (ధనము నందు కోరిక), ఉపాసన, తపస్సు మున్నగువాని చేత దేవలోకజయమునకు సాధనమైనదాని యందు కోరిక లోకైషణ యనబడును. "తే హ స్మ పుత్రైషణాయాశ్చ" అనుచు యతీశ్వరులు పుత్రైషణ, విత్తైషణ, లోకైషణ లను త్యజించి భిక్షాచరణము చేయుదు' రని చెప్పుచున్న శ్రుతి

వచనానుసారము 'ఏషణాత్రయముచేత ఆకృష్టముగానిచిత్తము గల పరమహంస పరివ్రాజకులైన సంన్యాసుల చేత ప్రేమాతిశయముతో స్వస్వరూపముగ, తైలధారవలె అవిచ్ఛిన్న ధ్యానసాంతత్యము వలన సాక్షాత్కరింపచేసికొనబడినదై మోక్షరూపమున పొందబడుచున్నదీ గాన, మహాత్రిపురసుందరి 'ఏషణారహితాదృతా' యను నామముచే గుణ సంకీర్తనము చేయబడుచున్నది. ఏషణాత్రయమును జయించిన మహనీయులకే జగన్మాత స్వస్వరూపమున అనుభవవేద్యురాలు గాని, యన్యులకు గాదని యీ నామము వలన తెలియనగునని భావము.

శ్లో॥ ఏలాసుగంధిచికురా చైనఃకూటవినాశినీ ।
ఏకభోగా చైకరసా చైకైశ్వర్యప్రదాయినీ ॥ ౭

## ౩౦. ఏలాసుగంధిచికురా

శం. భా. ఏలాసుగంధిచికురా । ఏలావదితి దృష్టాంతే ప్రదర్శనం సౌగంధ్యమాత్ర సద్భావ ప్రదర్శనేన అకల్పిత దివ్య పరిమళసద్భావే హేతుః; నతు ప్రాకృతత్వదర్శనపరమ్, బ్రహ్మణః స్వాధీనమాయత్వాత్ । తద్వత్సుగంధ ఇతి సాజాత్యమాత్రం వ్యజ్యతే, గుణమాత్రాదానేన సర్వత్ర పదార్థాంతరస్యదృష్టాంతీకరణాత్ । సుగంధా యేషాం సంతీతి సుగంధినః, తాదృశాః చికురాః కుంతలాః యస్యాః సా తథా । స్వభావసిద్ధ దివ్యపరిమళశాలి సర్వాంగసౌరభ్యవతీ

చికురపదస్య ఉపలక్షణాత్వా దితి భావః ॥ ఓం ఏలాసుగంధి చికురాయై నమః ॥

ఆం. వి. ఏలకికాయ యొక్క పరిమళము వంటి పరిమళము గల చికురములు గలది గాన, దేవి 'ఏలాసుగంధి చికురా' యని సంకీర్తనము చేయబడును. ఏలావత్ - ఏలకి కాయ వంటిదని దృష్టాంతమును జూపుట, పరిమళమాత్ర సద్భావమును ప్రదర్శించుటచేత అకల్పితమైన, అనగా సహజ మైన దివ్య పరిమళ సద్భావము నందు హేతువుగాని, ప్రకృతి సహజమైన పరిమళమును జూపుటయందు హేతువు కాదని తెలియవలెను. ఏలన, బ్రహ్మ స్వాధీనమాయుడు గాని, మాయాధీనుడు కాడు. కేవలగుణాదానముచేత లోకమున సర్వత్రపదార్థాంతరము దృష్టాంతీకరింపబడుచున్నది గాన, అటు వంటి పరిమళమని పరిమళసాజాత్యము మాత్రమే వ్యంజితమగు చున్నది. సుగంధములు గలవానిని 'సుగంధినః' అందురు. తాదృశ సుగంధ సురభిళములైన చికురములు గలది గాన; పరమేశ్వరి 'ఏలాసుగంధిచికురా' యని భజనీయురాలగు చున్నది. ఈ నామమందలి 'చికుర' పదము సర్వావయవముల కుపలక్షణము; కావున దేవి సహజసిద్ధము, దివ్యపరిమళ శాలియు నైన స్వర్వావయవ సౌగంధ్యవతి యని భావము.

## ౩౧. ఏనఃకూటవినాశినీ

శం. భా. ఏనఃకూటవినాశినీ । ఏనసాం పాపానాం కూటం సముదాయః । ఆగామి సంచిత ప్రారబ్ధభేదేన సమష్టి

రూపేణ దృఢతరం తత్త్వజ్ఞానేన వినా అన్యస్య భోగ మాత్రస్య తద్వినాశకత్వావగమాత్ తేషాం చ కల్పకోటి కాలం క్రమిక భోగప్రదానం వినోపాయాంతరేణ క్షయో ప్యాసనా మాత్మబ్రహ్మాభేదజ్ఞాన విషయత్వాయా చైతన్యం నాశయతీతి తథా। ఏవంవిధ పాపం కర్మన శ్లిష్యతే, "అశరీరం వావ సంతం ప్రియాప్రియే న స్పృశతః" ఇత్యాది శ్రుతేః, "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" ఇతి స్మృతేశ్చ।

అథవా, ఏనాంసి చ తత్కారణీభూతం కూటం కపట వచనాభిధానం చ తత్కారణం మాయాం చ నాశయతీతి తథా ॥ ఓం ఏనఃకూటవినాశిన్యై నమః ॥

ఆం. వి. ఏనఃకూట మనగా పాప సముదాయము. ఆగామికర్మ, సంచితకర్మ, ప్రారబ్ధకర్మ యను భేదముతో ఆ పాపము సమష్టిగ దృఢతరమై యుండును; తత్త్వజ్ఞానము లేకయే, తద్భిన్నమైన భోగము మాత్రము తాదృశకర్మ వినాశకమని పురాణాదుల వలన తెలియుచున్నది; ఆ కారణము చేత ఆ కర్మలు కోటి కల్పముల పర్యంతము ఉపాయాంతరము లేక, క్రమముగ భోగప్రదము లవుచుండును; తత్కర్మ క్షయము గోరువారలకు ఆత్మ, బ్రహ్మల భేదజ్ఞానమునకు విషయమైన చైతన్యమును నాశన మొందించునది గాన, ఆ దేవి 'ఏనఃకూటవినాశినీ' యని స్తోతవ్య యగుచున్నది. ఈ

విధముగ తెలిసినవాడు పాపసంశ్లిష్టుడు కాడు, "అశరీరం వావ సంతం ప్రియాప్రియే న స్పృశతః" — 'శరీర తాదాత్మ్యములేని బ్రహ్మనిష్ఠుని, ప్రియాప్రియములు రెండును స్పృశించవు' మొదలైన శ్రుతివచనముల వలనను, "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" — 'నేను నిన్ను సర్వపాప విముక్తుడను చేయుదు' నని భగవానుడు అర్జునునకు చెప్పిన స్మృతి వచనము వలనను పై విషయము ద్యోతక మగుచున్నది.

అథవా, పాపములను, తత్కారణ భూతములై కపట వచనముల జెప్పుటను, తత్కారణ భూతురాలైన మాయను నాశమొందించునది గాన, ఆ పరమేశ్వరి భక్తులచే 'ఏనః కూటవినాశినీ' యని స్తవనీయురాలగుచున్నది.

## 3౨. ఏకభోగా

శం. భా. ఏకభోగా । ఏకేన కామేశ్వరేణ సాకం భోగః భుక్తిః । భోగః స్వస్వరూపానందానుభవః యస్యాః సా తథా ।

అథవా, ఏకస్య అజ్ఞాన తత్కార్యస్య కార్యకారణ రూపేణ అభిన్నస్య తదధిష్ఠానతయా స్వసత్తాధాయకత్వేన భోగః పరిపాలనం యస్యాః సా । ప్రపంచోత్పత్తి స్థితి నాశ హేతు మాయోపాధికచైతన్య మిత్యర్థః । "ఏకాకీ న రమతే

తతః పతిశ్చ పత్నీ చాభవతామ్" ఇతి పురుషవిధ (బ్రాహ్మణ వచనాత్, దంపత్యో ర్వైచ్ఛిక భేదకత్వావగమేన పరమార్థతః ఏతత్స్వరూప స్యైకచైతన్యరూపత్వావగమాత్, తదుభయభోగస్యాపి ఏకభోగత్వాత్ తద్వతీతి వా ॥ ఓం ఏకభోగాయై నమః ॥

ఆం. వి. అద్వితీయుడైన కామేశ్వరునితోటి భోగము, అనగా స్వస్వరూపానందము గలదిగాన, ఆ కామేశ్వరి 'ఏకభోగా' యను నామముచే నర్చిత యగుచున్నది.

అథవా, ఏకమైన అజ్ఞానమును, తత్కార్యమైన సంసారమును, కార్యకారణ రూపముతో అభిన్నముగ నున్నదానిని' తదధిష్ఠాన రూపముతోను, స్వీయసత్తను ఆధానము చేయుటచేతను పరిపాలించునది గాన, పరమేశ్వరి యందు 'ఏకభోగా' యను నామ మన్వర్థము. (లలితా సహస్రమందలి 'మిథ్యాజగదధిష్ఠానా' యను నామము ఈ విషయమును స్పష్టము చేయుచున్నది.) (ప్రపంచ సృష్టి, స్థితి, లయములకు హేతుభూతమైన మాయోపాధిక చైతన్యమని యర్థము. (మాయోపాధిక చైతన్యము ఈశ్వరుడుగదా ! పరమేశ్వరి మాయోపాధిక చైతన్య మనుట యెట్లు సంగతమగు ననెడి యాశంకకు సమాధానముగా ఉత్తరగ్రంథ మారంభమైనది) 'ఏకాకీ న రమతే" యనుచు 'ఒక్కడు ఆనంద మనుభవించలేడు, కావున, ఆ పరమేశ్వరుడు పతిగా, పత్నిగా నాయెను'

అను పురుషవిధ బ్రాహ్మణ వచనము వలన, దంపతులకు ఇచ్ఛాసంబంధమైన భేదకత్వము నంగీకరించుటతో పాటు, పారమార్థికముగా నేతత్స్వరూపము (పతి పత్నీ స్వరూపము), అద్వితీయ చైతన్య స్వరూపత్వము గలదని తెలియుచున్నది. కావున, తదుభయుల (పతి పత్నుల, లేక శక్తి శక్తిమంతుల, లేక మాయా, ఈశ్వరుల) భోగము (స్వస్వరూపానుభవము) సయితము ఏకభోగమగుట వలన పరమేశ్వరి 'ఏకభోగా' యని స్తుతింపబడుచున్నదని భావము.

విశే :- ఈ విషయమును గంగాదేవి యీ శ్లోకమున స్పష్టము చేయుచున్నది.

"సృష్టేః స్త్రీపుంసనిర్మాణ మాతృకారూపధారిణౌ।
పరిపద్యే ప్రతిబోధాయ చిత్ ప్రకాశకౌ శివౌ ॥"

కేవల చైతన్యము మాయారూప ప్రకాశముతో కలసి నపుడు చిత్ ప్రకాశ స్వరూపములుగా అభివ్యక్త మాయెను. ఆ చిత్ ప్రకాశ స్వరూపులే ఉమామహేశ్వరులు. వారి ననుసరించియే తరువాత బ్రహ్మాదుల సృష్టిక్రమ మనుస్యూత ముగా సాగుచున్నది. శ్రీ శంకరులు ప్రతిపాదించుచున్నట్టి యద్వైత చైతన్యము, ఆ చిత్ ప్రకాశము లభేదములుగా భాసించుచున్నట్టి స్వరూపమే యని భావింపసగును.

## 33. ఏకరసా

శం. భా. ఏకరసా । ఏకః అభిన్నః రసః సామరస్యం యస్యాః సా, "రసగ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" ఇతి శ్రుతేః । ఏకః నవరసేషు ముఖ్యః శృంగార రసః యస్యాః సా తథా,

అథవా, ఏకేన పరమేశ్వరేణ అస్యాం క్రియమాణః ప్రీత్యతిశయరూపః రసః ఏతద్విషయకః యస్యాః సా ।

అథవా, ఏకస్మిన్నేవ స్వభర్తరి రసః నిరతిశయ ప్రీతిః అనురాగసంజ్ఞా యస్యాః సా ।

అథవా, షడ్రసేషు ముఖ్యః మధుర రసః ప్రియత్వేన యస్యాః సా, సత్త్వగుణ మాయోపాధిక చైతన్య స్వరూపత్వాత్ । "రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్విక ప్రియాః" ఇతి భగవద్వచనాత్ ॥ ఓం ఏకరసాయై నమః ॥

ఆం. వి. ఏకరసము అనగా అభిన్నమైన సామరస్యము కలదిగాన, పరాదేవి 'ఏకరసా' యనుచు కీర్తింపబడుచున్నది. "రసగ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి" — 'ఈ జీవుడు రస స్వరూపమైన బ్రహ్మానుభవము పొంది ఆనందమయుడగుచున్నాడు' అను శ్రుతి వలన పరమేశ్వరి అద్వయానంద స్వరూప ఏకరస, యని తెలియుచున్నది. నవరసములలో ముఖ్యమైన శృంగార రసము గలది గాన, దేవి 'ఏకరసా' యని గానము చేయబడుచున్నది.

అథవా, ఏకైక పరమేశ్వరునిచేత మాయా స్వరూపిణి యందు జూపబడు ప్రేమాతిశయము గలదిగాన, త్రిపుర సుందరి 'ఏకరసా' యను నామముతో భజనీయురాలగు చున్నది.

అథవా, అద్వితీయుడైన తనభర్త యందే అనురాగ మను పేర నొప్పెడి రసరూపమైన నిరతిశయ ప్రేమ, పరమేశ్వరికి గలదు గాన, ఆమెయందు 'ఏకరసా' యను నామ మన్వర్థము.

అథవా సత్త్వగుణ ప్రధానమైన మాయ ఉపాధిగా గల చైతన్యస్వరూప మగుట వలన షడ్రసములలో నొక టైన-ముఖ్యమైన మధురరసము ప్రియమైన రసముగా గలది గాన. దేవి 'ఏకరసా' యని ఖ్యాతిగాంచెను. "రస్యాః స్నిగ్ధాః" యను భగవద్వచనము వలన 'రుచ్యములు, మృదువులు స్థిరములు, హృద్యములు నగు ఆహారములు సత్త్వగుణ ప్రధానులైనవారికి ప్రియమైనవి' యని తెలియుచున్నది.

కావున, సత్త్వగుణ ప్రధాన మాయోపాధిక చైతన్య స్వరూపిణియైన పరాభట్టారికకు మధుర రస మత్యంత ప్రియ మని గ్రహింపనగును. శ్రీ లలితాత్రిపురసుందరి శుద్ధసత్త్వ ప్రధానమైన మాయాశక్తి యనియు తెలియనగును.

## 3౮. ఏకైశ్వర్యప్రదాయినీ

శం. భా. ఏకైశ్వర్యప్రదాయినీ । ఈష్టే ప్రేరయతి అంతర్యామిత్వేన సర్వాణీతి ఈశ్వరః । "యః సర్వేషు భూతేషు తిష్ఠన్ యః సర్వాణి భూతాన్యంతరో యమయతి" ఇతి శ్రుతేః । తత్రైశ్వర్యమాణానాం జీవానాం భూతశబ్దవాచ్యానాం అజ్ఞాన తత్కార్యాంతఃకరణోపహిత ప్రతిబింబ చైతన్యరూపాణాం జాగ్రదాద్యవస్థాభిమానినాం అఖండబ్రహ్మసాక్షాత్కారవేలాయామభేదానుభవాత్. "తత్త్వమసి" ఇతి శ్రుతేశ్చ "ఏకమేవాద్వితీయమ్" ఇతి విశేషితత్వాచ్చ ఏకశ్చాసావీశ్వరశ్చ ఏకేశ్వరః తస్య భావః తదైక్యం తత్ ప్రదాతీతి తథా । బహుషు విద్యాధనవత్సు తేష్వేకో విద్యాధనవానిత్యుక్తే, తత్రత్య జననిష్ఠ విద్యాభావే తదతిశయప్రతీతివత్ ఏకం చ నిరతిశయ మణిమాదిక మైశ్వర్యం నిఃశ్రేయసం ప్రదదాతీతి వా ॥

యద్వా, ఏకం మానుషం సర్వోత్కృష్టం సార్వభౌమత్వాది లక్షణం అభ్యుదయసామాన్య మైశ్వర్యం ప్రదదాతీతి వా తథా ॥ ఓం ఏకైశ్వర్యప్రదాయిన్యై నమః ॥

ఆం. వి. పరమాత్మ అంతర్యామియై సర్వప్రాణులను ప్రేరేపించుచున్నాడు గాన, ఈశ్వరుడని చెప్పబడును. "యః సర్వేషు భూతేషు తిష్ఠన్" అను శ్రుతి వలన 'పరమేశ్వరుడు సర్వభూతములయందు నిండియుండి సర్వభూతములను శాసించు

చున్నా' డని తెలియుచున్నది. ఆ యంతర్యామిచే ప్రేరేపింప బడుచున్న, భూతశబ్దముచే చెప్పబడుచున్న జీవులందరును, అజ్ఞానము తత్కార్యమైన అంతఃకరణముచే నుపహితులైన చైతన్య ప్రతిబింబ స్వరూపులు; అట్టి జీవులు జాగ్రత్ స్వప్న, సుషుప్త దశలందు అభిమానము గలవారై యుందురు; వారు ఏకాకారమగు బ్రహ్మచైతన్య స్వరూపాను భవము పొందు సమయములో ప్రత్యగ్బ్రహ్మైక్యాను భవము (అభేదానుభవము) నొందుదురు; ఆ కారణముచేత, "తత్త్వమసి" — 'తత్పదవాచ్యమైన బ్రహ్మ నీవే అయి ఉన్నావు' అను శ్రుతి వలనను, "ఏకమేవాద్వితీయమ్" — 'ఆ తత్ పదార్థము ఏకము, అద్వితీయము, అనగా సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితము' అని విశేషణ యుక్తమై యుండుటచేతను ఏకేశ్వరుడనగా అద్వితీయ పరబ్రహ్మయని ద్యోతకమగును; తద్భావమును (ఏకేశ్వర భావమును), తదైక్యస్థితిని ప్రసాదించునది గాన, జగన్మాత 'ఏకైశ్వర్య ప్రదా' యని సంకీర్తింప బడుచున్నది. అవిద్యావృతుడైన జీవుడు అజ్ఞానము వలన స్వస్వరూపమును, అనగా తాను బ్రహ్మస్వరూపమను భావమును విస్మరించి, పరమేశ్వరుని కంటె భిన్నుడయిన జీవుడను భావముతో కొట్టుమిట్టాడును. అట్టి జీవునికి ఐశ్వర్యమును-ఈశ్వరత్వము ననుగ్రహించునది గాన, పరమేశ్వరి యందు ఈ నామ మన్వర్థమని భావము. అనేకులు విద్యాధన సంపన్నులైన వారుండగ, వారిలో

నొకరిని విద్యాధన సంపన్నుడని చెప్పినపుడు. అచట యున్న వ్యక్తి యందలి విద్యాభావము మిగిలినవారి కంటె అతిశయ మైనదను విషయము ప్రతీయమానమగును; ఆ రీతిగనే, పరమేశ్వరి ఏకము, నిరతిశయము, అణిమా, మహిమాది రూపము నయిన ఐశ్వర్యమును, అనగా నిః శ్రేయసమును ప్రసాదించునది గాన, ఈ నామముచేత స్తోతవ్యరాలగు చున్నది.

యద్వా, ముఖ్యము, మానుషము, సర్వోత్కృష్టము, సార్వభౌమత్వాది లక్షణోపేతము, అభ్యుదయ సామాన్యము నయిన ఐశ్వర్యమును ప్రసాదించును గాన, లలితాపరమేశ్వరి 'ఏకైశ్వర్యప్రదాయినీ' యను నామముతో ప్రఖ్యాత యయినది.

శ్లో॥ ఏకాతపత్రసామ్రాజ్యప్రదా చైకాంతపూజితా ।
ఏధమానప్రభా చైజదనేకజగదీశ్వరీ ॥ ౮

## 3౫. ఏకాతపత్రసామ్రాజ్యప్రదా

శం. భా. ఏకాతపత్రసామ్రాజ్యప్రదా । ఆతపాత్, ఆ సమంతాత్ అధ్యాత్మాధిదైవతాధిభూతాని ఆ-శబ్దార్థః, తేభ్యో జాతాః తాపాః ఆతపాః । తపంతి శోషయంతీతి తపాః, ఆతపేభ్యః త్రాయతి రక్షతీతి ఆతపత్రం సర్వ సంసారదుఃఖోపశమాత్మక మాత్మజ్ఞానమ్ । "యజ్జ్ఞాత్వా

సపున రోస్మహ మేవం యాస్యసి" ఇతి భగవద్వచనాత్ ।
అఖిల దుఃఖనిదానాజ్ఞాననివ ర్తకం ఏకం లక్షణయా అభిన్న
బ్రహ్మవిషయక మిత్యర్థః । ఏకం చ తత్ ఆతపత్రం చ
అఖండాకారజ్ఞానమ్, తేన జాయమానం యత్సామ్రాజ్యం
సమ్రాజో భావః సర్వోత్తమత్వం తత్ప్రదాతీతి ।

అథవా, ఏకాతపత్రసామ్రాజ్యం చక్రవర్తిత్వం తత్ప్ర
దాతీతి వా ॥ ఓం ఏకాతపత్రసామ్రాజ్యదాయై నమః ॥

ఆం. వి. 'ఆజ్' పూర్వక 'తప' ధాతువునకు సర్వత్ర నిండి
యున్న అధ్యాత్మ, అధిదైవత, అధి భూతముల నుండి
యుత్పన్నములగు తాపము లనియర్థము; అట్టి తాపములను
ఆతపము లందురు. 'తపంతి శోషయంతి' శోషింపజేయునవి
గాన, తపములు; ఆతపముల నుండి రక్షించునది గాన
ఆతపత్రము; ఇట్టి ఆతపత్ర మనగా, సర్వసంసార దుఃఖము
నుపశమింపజేయు నట్టి యాత్మజ్ఞాన మని యర్థము. "యజ్
జ్ఞాత్వా" యనుచు 'బ్రహ్మ (ఆత్మ) తత్త్వమును దెలిసికొని
నచో మఱల యీ సంసారరూప మోహమును పొందవు'
అని కృష్ణభగవానుని వచనము వలన దెలియుచున్నది. సర్వ
దుఃఖమునకు కారణమైన అజ్ఞానమును నివర్తింప జేయునట్టి
అద్వితీయ జ్ఞానము; అనగా లక్షణావృత్తిచేత అఖండము,
ఏకమునైన బ్రహ్మ విషయకజ్ఞాన మని యర్థము 'ఏకం చ
తత్ ఆతపత్రం చ' అని కర్మధారయ సమాసము చెప్పికొనిన,

'ఏకాతపత్ర' మను రూప మేర్పడును; ఏకాతపత్ర మనగా అఖండాకారమైన జ్ఞానము చేత కలుగునట్టి సామ్రాజ్యమును సర్వోత్తమత్వమును ప్రసాదించునది గాన, పరమేశ్వరి 'ఏకాతపత్రసామ్రాజ్యప్రదా' యని సంకీర్తితురాలగుచున్నది.

అథవా, ఏకచ్ఛత్రాధిపత్య సామ్రాజ్యమును ప్రదానము చేయునది గాన, ఆ దేవి 'ఏకాతపత్రసామ్రాజ్యప్రదా' యని స్తోతవ్యురాలగుచున్నది.

ఈ రీతిగా పరమేశ్వరి తన నుపాసించు భక్తులకు తాపత్రయోపశామకమైన బ్రహ్మాత్మజ్ఞానము నొసంగుటతో పాటు, సకామనయా ఉపాసించువారలకు మానుషానందములో సర్వాతిశాయియైన ఏకచ్ఛత్రాధిపత్యము నొసగి చక్రవర్తిని జేయునని భావము.

## ౩౬. ఏకాంతపూజితా

శం. భా. ఏకాంతపూజితా । ఏకస్య అద్వితీయస్య శోధితతత్త్వంపదార్థస్య అంతే ఉపాధౌ హృది పరిచ్ఛేదకత్వాత్ పూజితా అహ మిత్యపరోక్షీకృతా, "యత్సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ" ఇతి శ్రుతేః, । 'ఏకస్య బ్రహ్మణః అంతే ఉప పూజితా 'షద్ల్ గత్యవసాదనార్థయో' రితి ధాతు పాఠాత్ ఉపనిషద్ బ్రహ్మమాత్రతయా పర్యవస్యతీత్యర్థః । ఏకాంతపూజితేతి నామ్నోపనిషదిత్యర్థః ।

అథవా, ఏకాంతే "గుహానివాతాశ్రయేణ ప్రయోజ యేత్" ఇతి శ్రుతేః ఏకాంతస్థలే ధ్యానాదినా యోగిభి ర్విషయీ కృతేత్యర్థః ।

అథవా, కామేశ్వరేణ ఏకాంతే స్త్రీలింగే పూజితా। సంప్రదాయకాలే పూజాదినా సంతోషితత్వాత్ భూతార్థ వ్యపదేశః । ఏకాంతే సర్వ ప్రవిలాపన సమయే పూజితా ధ్యానాదినా సంపాదితా సాక్షాత్కృతేత్యర్థః । "కశ్చిద్ధీరః ఇతి ప్రత్యగాత్మాన మైక్షదావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్" ఇతి శ్రుతిరితి వా ॥ ఓం ఏకాంతపూజితాయై నమః ॥

ఆం. వి. ఏకమనగా అద్వితీయమైన శోధిత త్వం పదార్థము; 'తత్త్వమస్యాది వాక్యములందలి 'తత్' పదము నకు శుద్ధమాయాప్రతిబింబచైతన్య మని యర్థము. ఈశ్వరో పాధియైన శుద్ధ మాయను, జీవోపాధియైన అవిద్యను పృథక్క రించి తీసివేయగా మిగులునది అద్వయ చైతన్యము 'శోధిత' పదార్థము. 'త్వం' పదవాచ్యుఁడయిన జీవునిచేత తత్పదవాచ్య యైన పరమేశ్వరి పరిచ్ఛిన్న భావముతో పూజితురాలై అంతమున, పరిపూర్ణ ఏకత్వజ్ఞానము అనుభవమునకు వచ్చి నపుడు 'యత్సాక్షాద్బ్రహ్మ' — 'ఏది సాక్షాత్తు అపరోక్ష మైన బ్రహ్మయో' అను శ్రుతివచనానుసారము 'ఆ దేవియే నేను' అని అపరోక్ష సాక్షాత్కారము చేసికొనబడునది గాన, జగన్మాత 'ఏకాంతపూజితా' యను నామముతో విభ్రాజ మాన యగుచున్నది. 'ఏకాంత' శబ్దములోని 'అంత' శబ్దము

నకు 'సమీప' మని యర్థము. హృదయ గుహాంతర్వర్తి యైన పరమాత్మసామీప్యమున పూజింపబడునది. 'షద్లృ' ధాతువునకు గతి, అవసాదనము, విశరణము అర్థము. కావున, పరాశక్తి ఉపనిషత్ ప్రతిపాద్యమైన పరబ్రహ్మగా పర్యవసిత యగుచున్నది. 'ఏకాంతపూజితా' యను నామముచేత పరమేశ్వరి 'ఉపనిషత్' అని వ్యవహరింపబడు చున్నదని భావము.

యద్వా, "గుహానివాతాశ్రయేణ ప్రయోజయేత్" అను శ్రుతివచనము ననుసరించి ఏకాంత స్థలమునందు ధ్యానాదుల ద్వారా యోగులచేత తెలిసికొనబడునది గాన, పరమేశ్వరికి 'ఏకాంతపూజితా' యను నామము అన్వర్థము.

అథవా, కామేశ్వరునిచేత పరాదేవి ఏకాంతమందు అనగా స్త్రీలింగమందు పూజింపబడునది. సంప్రదాయ ప్రవృత్తి నిమిత్తము మొట్ట మొదట సృష్ట్యాది యందు ఈశ్వరుని చేత నుపాసనకు మొదటి సాధనమైన బహిర్యాగ క్రమముతో పూజాధ్యానాదుల చేత సంతోష పెట్టబడినది దగుట వలన తత్ప్రత్యయముతో నిది భూతార్థవ్యాహృతి యని తెలియుపలెను. 'రహోయాగ క్రమారాధ్యా' యను నామము భావనీయము.

పక్షాంతరమున, అన్ని తత్త్వములు ఏకాంతమునందు, అనగా స్వరూపమునందు ప్రవిలాపన సమయమున ధ్యానా

దులచే సంపాదింపబడునది, అనగా సాక్షాత్కరింప చేసికొన బడునది గాన దేవి 'ఏకాంతపూజితా' యనబడును.

'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్' — ఆత్మారాముడు, ఆంతర దృష్టి కలవాడు, బాహ్యేంద్రియోపరమణము గలవాడు, అమృతత్వాభిలాషియు నయిన ధీరుడు ప్రత్యగాత్మను దర్శించెను' అని శ్రుతి యుద్ఘోషించుచున్నది. కావున, బాహ్య విషయములన్నిటిని, అద్వయ చైతన్యము నందు ప్రవిలాపనము చేసినపుడే పరమేశ్వరి భక్తుని హృదయమున ననుభూయమాన యగునని భావము. ఇట, 'అంతర్ముఖ సమారాధ్యా' 'బహిర్ముఖ సుదుర్లభా' యను లలితా సహస్ర మందలి నామము లను సంధేయములు.

## ౩౭. ఏధమానప్రభా

శం. భా. ఏధమానప్రభా । ఏధమానా వివర్ధమానా సర్వాతిశాయినీ ప్రభా కాంతి రస్యాః సా, "తమేవ భాన్త మనుభాతి సర్వం తస్యభాసా సర్వ మిదం భాతి" ఇతి శ్రుతేః॥ ఓం ఏధమానప్రభాయై నమః ॥

ఆం. వి. వర్ధనశీలము, సర్వాతిశాయియు నయిన కాంతి గలది గాన, లలితాపరాభట్టారిక 'ఏధమానప్రభా' యని సంకీర్తింపబడుచున్నది. "తమేవ భాంత మనుభాతి సర్వమ్" అనుచు శ్రుతి 'స్వయంప్రకాశమాన మయిన బ్రహ్మ తత్త్వప్రకాశము వలన సర్వము ప్రకాశించుచున్నది,

తేజస్స్వరూపమైన ఆ పరబ్రహ్మప్రకాశము చేతనే జడస్వరూపమైన యీ బ్రహ్మాండ మంతయు ప్రకాశించుచున్న దని చెప్పుచున్నది. కావున, మహాత్రిపురసుందరి ఉపనిషత్ప్రతిపాద్యయైన సర్వాతిశాయిప్రభాభాసుర యగుట వలన 'ఏధమానప్రభా' యను నామ మాదేవి యందు అన్వర్థము.

## 31. ఏజదనేకజగదీశ్వరీ

శం. భా. ఏజదనేకజగదీశ్వరీ। ఏజంతి కంపమానాని చేష్టమానాని ప్రాణవంతి అనేకాని నానోపాధికాని జగంతి జంగమాని విచరత్ప్రాణీన ఇత్యర్థః। ఈష్టే ప్రేరయతీతి ఈశ్వరీ। స్థావరాణాం సుఖదుఃఖప్రాప్తి పరిహారోపాయానభిజ్ఞత్వేఽపి స్వజీవన హేతుభూతోదకపానాది ప్రవృత్తిదర్శనాచ్చేష్టావత్త్వం తత్రాప్యస్తీతి జగచ్ఛబ్దో నిర్విశేషప్రపంచమాత్రపరో వక్తవ్యః, అన్యథా "సర్వేషు భూతేషు" ఇతి శ్రుతౌ చరప్రాణిమాత్రపరత్వే సంకోచాపత్తేః। అసతి విరోధే సామాన్యవాచకస్య శబ్దస్య విశేషణాంగీకారస్య అన్యాయ్యత్వాత్। అన్యథా బ్రహ్మణః ప్రపంచమాత్రోత్పత్త్యాదిహేతుత్వం సకుచితం భవేత్। అతఏవ ఆకారే ఏజత్పదం ఉపాత్తమ్। యథాకథంచిత్ క్రియాశ్రయత్వేన ప్రాణవత్త్వమాత్రస్య సమష్టిహిరణ్యగర్భాశ్రయత్వేన సర్వేషాం ప్రేర్యత్వం సంభవతీతి భావః॥ ఓం ఏజదనేకజగదీశ్వర్యై నమః॥

ఆం. వి. కదలునవి అనగా లోకవ్యవహారము చేయునవి, ప్రాణవంతము లయినవియు నగు అనేక ఉపాధులను ధరించిన జంగమ ప్రాణులను ప్రేరేపించునది గాన, పరమేశ్వరి 'ఏజదనేక జగదీశ్వరీ' యని స్తోతవ్యయగుచున్నది. స్థావరము లయిన వృక్షాదులకు సుఖ సంపాదనోపాయము, దుఃఖ నివారణోపాయము తెలియదు. అయినను, వానియందు స్వజీవన హేతుభూతమైన ఉదకపానాది ప్రవృత్తి కన్పట్టుట వలన చేష్టావత్త్వము ఆ స్థావరము లందు సయితము గలదని జగచ్ఛబ్దము నిర్విశేష ప్రపంచ సూచకమని గ్రహింపవలెను. అనగా జంగమ స్థావర ప్రాణులను రెండింటిని జగచ్ఛబ్దముచే చెప్పనగునని తెలియవలయును. ఆ రీతిగ చెప్పకపోయినచో, 'సర్వేషుభూతేషు' అను శ్రుతి యందు జంగమ ప్రాణి మాత్ర పరమని యీశ్వరుని యందు సంకోచ మాపన్నమగును. విరోధము లేనపుడు సామాన్యవాచక శబ్దమునకు విశేష లక్షణ మంగీకరించుట న్యాయసంగతము కాదు. లేనిచో బ్రహ్మకు గల ప్రపంచోత్పత్తి స్థిత్యాదిహేతుత్వము సంకుచితము కావలసివచ్చును. కనుకనే, మూలమునందు (నామము నందు) 'ఏజత్' అను శబ్దము ప్రయుక్తము. ఏదోరీతిగ, క్రియాశ్రయత్వ మగుటచేతను, ప్రాణవంతమైన ప్రతి శరీరధారియు సూక్ష్మ శరీరాధికారియైన సమష్టి హిరణ్యగర్భుడు ఆశ్రయముగా గలిగియుండుట వలనను సర్వప్రాణులకు ఆ హిరణ్యగర్భుడు ప్రేరకుడగుట సంభవించుచున్నది. పరమేశ్వరి

హిరణ్యగర్భ స్వరూపములో ఉండి సర్వోపాధిధారులను ప్రేరేపించుచున్నదని తెలియనగును.

## ౩౯. ఏకవీరాది సంసేవ్యా

శం. భా. ఏకవీరాది సంసేవ్యా । ఏకః అనితరసాధారణః వీరః పురశ్చర్యాదినా కృతమంత్రదేవతా సాక్షాత్కారలబ్ధ పురుషార్థః పుమాన్ విజయప్రాప్త్యభ్యుదయశాలీ । రాజరాజ నిష్ఠ ధైర్యగాంభీర్యాది గుణవత్త్వేన తత్తద్దేవతోపాసకాః పురుషాః వీరా ఇత్యుచ్యంతే । యాసాం శక్తీనా మాదయో యేషాం ప్రాణకోటీనాం తా ఏకవీరాదయః తాసాంకదంబైః సంసేవ్యా సంసేవితుం యోగ్యా । యదా ఈశ్వరీ భక్తా నను గృహ్ణాతి సగుణవిగ్రహవతీస్యాత్ తదా అనేకపరివార దేవతా పరిసేవితా మంత్రదేవతా మంత్ర దేవతాత్వేనోపాసనీయే త్యర్థః ॥

అథవా, ఏకవీరా రేణుకా, తదాదయ శ్శక్తయః శ్యామలాప్రభృతయః, తాభి స్తత్కాలప్రపంచే స్వస్వపీఠే స్థితాః సత్యః ఉపాసకానా మభీష్టవరప్రదాత్ర్యో దృశ్యంతే, తా । అస్యాః పరిసేవకత్వేన స్వయమభీష్టవరకామాః ఇత్యస్యాః ప్రకృతాయా మహిమాతిశయోక్తిః ఓం ఏకవీరాది సంసేవ్యాయై నమః ॥

ఆం. వి. అనితర సాధారణుడయిన (సాధారణముగ లభించని) వీరుడు మంత్రపురశ్చర్యాదుల చేత మంత్రాధిష్ఠాన

దేవతా సాక్షాత్కారము వలన పురుషార్థమును సాధించిన పురుషుడు విజయప్రాప్తిచేత అభ్యుదయశాలి యైనవాడు. రాజాధిరాజుల యందుండెడి ధైర్య, గాంభీర్యాది గుణములు గలవారగుటచేత తత్త ద్దేవతోపాసకులైన పురుషులు వీర శబ్ద వాచ్యులగుదురు. ప్రాణికోటి యొక్క నానా శక్తులలో ఆద్య శక్తులయిన ఏకవీరాది శక్తిగణము చేత సేవింపదగినది గాన, పరాభట్టారిక 'ఏకవీరాది సంసేవ్యా' యను నామముచే సంకీర్తింపబడుచున్నది. పరమేశ్వరి సగుణ విగ్రహవతియై భక్తుల ననుగ్రహించునపుడు, ఆమె అనేక పరివార దేవతా పరిసేవిత యయిన మంత్రాధిష్ఠాన దేవతగా నుపాసనీయు రాలని భావము.

అథవా, 'ఏకవీరా' యనగా రేణుకాదేవి, తదాది శక్తులయిన శ్యామలాది ప్రముఖ శక్తులు ఉపాసనా సమయమున ఆ శక్తులచేత శ్రీచక్రస్థితములైన ఆయా పీఠములందుండి సేవింపబడుచు ఉపాసకుల మనోరథముల నీడేర్చువారుగ గన్పట్టుచున్నారు. ఆ యా శక్తులు ప్రధానశక్తియైన శ్రీ రాజరాజేశ్వరిని సేవించుచు తత్పరమేశ్వరి వలన వరములను బడయుచుందురు; తత్పరాభట్టారికా పూజాపరాయణులకు ఆ శక్తులు తాము ప్రసాదించదగు ఫలముల నొసంగుచుందురు. కావున, పరాభట్టారికా మహిమాతిశయము నేమని వర్ణింతుము! పరమేశ్వరి వాచామగోచర యని భావము.

శంకర. 12 - 15]

విశే :- ఈ నామమున 'వీర' శబ్దము ప్రయుక్తమైనది. వీర భావమనగా మంచి ఉత్సాహముతో, ధైర్యగాంభీర్యాది గుణ సంపదతో దేవి నుపాసించుట యని భావము.

"అహమః ప్రలయం కృత్వా ఇదమః ప్రతియోగినః।
పరాక్రమపరో భుంక్తే స్వాత్మాన మశివాపహమ్॥"

'ఇదం' శబ్దార్థమైన ప్రపంచమునకు ప్రతియోగియగు అహమును లయింపజేసి పరాక్రమపరుడై (పరా- మాయ - ఆ మాయ నతిక్రమించి పరుడైనవాడు) అమంగళములను - దుఃఖాదిబంధములను దూరాపాస్త మొనర్చునట్టి స్వస్వరూప మైన ఆత్మానుభవము ననుభవించువాడు వీరుడనబడును.

## ౪౦. ఏకప్రాభవశాలినీ

శం. భా. ఏకప్రాభవశాలినీ। ప్రభోర్భావః ప్రాభవం రక్షకత్వం, ఏక మనితరసాధారణం చ తత్ ప్రాభవం చ తచ్ఛాలక ఇతి తథా।

అథవా, ప్రాభవస్య సాపేక్షకధర్మత్వాత్ ఏకపదస్య చ అనన్యగామిత్వార్థస్య సామానాధికరణ్యేన స్వారస్యేన పర్యాలోచ్యమానేన అయ మర్థః సూచ్యతే। ప్రాభవం చ నియమ్య లోకోద్భవం వినా అనుపపద్యమానం తదంతర్గత తత్కార్య మర్థాపత్త్యా సిద్ధ్యతి। తథా చ వటబీజవత్ స్వాం తర్గత పశ్చాద్భావికార్యవత్ కూటస్థ చైతన్య మితి భావః।

అథవా, ప్రాభవం నామ ఈశ్వరత్వం తదాక్షిప్త నియమ్య జగచ్ఛేషలక్షణవిధయా యస్యైకస్య అఖండ చైతన్యస్య తదేకప్రాభవమ్ । 'పాదోఽస్య సర్వా భూతాని' 'ఏకాంశేన స్థితో జగత్' ఇతి శ్రుతిస్మృతిభ్యాం, భూతపూర్వ గత్యా ప్రాభవోపలక్షితం ఏకం సత్ చిచ్చైతన్యరూపం శాలతే ఆవిష్కరోతీతి తథా ।

అథవా, ఏకం చ తత్ ప్రాభవం ముఖ్యసార్వభౌమత్వ మితి యావత్ । ప్రభుత్వపరంపరాయాః సవిశేషాయాః కుత్రచిత్ పర్యవసానావశ్యంభావే 'ఏష సర్వేశ్వర ఏవ భూతాధిపతి రేష భూతపాలః' ఇతి శ్రుత్యా అంతర్యామితయా సాక్షాత్కృత్యుత్పాదకత్వ శ్రుత్యా చ ఇతర వాగాద్యవ యవ ప్రేరణాతిశయానాం పర్యాప్తి రత్రైవాస్తీ త్యభి ప్రాయః । తథా చ నిరంకుశ స్వతంత్ర జగత్కారణత్వరూప తటస్థ లక్షణలక్షిత వేదాంతసమన్వయవిషయీభూతా అఖండ సచ్చిదానందస్వరూపా పరదేవతా అవశ్యం స్వస్వరూ పేణైవ ధ్యాతవ్యేతి నిష్కృష్టార్థం ॥ ఓం ఏకప్రాభవశాలిన్యై నమః॥

ఆం. వి. ప్రభువుయొక్క భావము ప్రాభవము, రక్షించునది యని భావము. అనితర సాధారణమైన ప్రభుత్వ శక్తి పరాదేవి యందు ప్రకాశించును గాన, ఆమె 'ఏక ప్రాభవశాలినీ' యను నామముచేత ధ్యాతవ్యురాలగు చున్నది.

అథవా, ప్రాభవము అన్యాపేక్ష ధర్మము గలది. అందువలన, ఇతరుల యందు ఆ ప్రాభవము లేదను నర్థము చెప్పునట్టి 'ఏక' పదమునకు సామానాధికరణ్యము వలన; చక్కగా పర్యాలోచన చేయుటవలన కలిగిన స్వారస్యము వలన ఈ యర్థము సూచిత మగుచున్నది. ఈ ప్రాభవము నియమింపదగిన లోకసృష్టి లేకుండ అసంభవము. ప్రపంచ సృష్టిలో అంతర్భూత మయిన తత్కార్యము-ప్రాభవము అర్థాపత్తి ప్రమాణముచేత సిద్ధించుచున్నది. కాగా, వట బీజము - మఱ్ఱివిత్తనము నందు వప్రములు, శాఖలు, ఊడలతో భవిష్యత్తులో నేర్పడునట్టి వటవృక్ష మనెడి కార్యము అంతర్గతమై యిమిడి యుండును. కూటస్థచైతన్యము తత్సదృశమని భావము.

పక్షాంతరమున, ప్రాభవమనగా ఈశ్వరత్వము, ఆ యీశ్వరత్వముచేత రచింపబడిన, నియమింపదగిన జగత్తు గూడ ఉపలక్షణ విధాయకమైన ఏకము, అద్వితీయము నగు పరిపూర్ణ చైతన్యమునకు గలదు. కాన అది ఏకప్రాభవ మనబడును. 'పాదోఽస్య సర్వా భూతాని' అను ఛాందోగ్య శ్రుతి అనంతకోటి బ్రహ్మాండములలో ఉన్న భూతజాత మంతయు అఖండచైతన్యము యొక్క ఒక పాదమని చెప్పు చున్నది. 'ఏకాంశేన స్థితో జగత్' అను గీతావచనముకూడ పరమేశ్వరుడు ఒక్క అంశతో ప్రపంచ మంతయు వ్యాపించి ఉన్నాడని చెప్పుచున్నది. ఈ శ్రుతి స్మృతివచనముల వలన

భూతార్థవాద రీతిలో ప్రాభవముచేత నుపలక్షితమగు ఏకము సత్యము జ్ఞానరూపము నభివ్యక్తము చేయుచున్నది గాన. జగన్మాత 'ఏకప్రాభవశాలినీ' యను నామముతో వెలుగొందు చున్నది.

మఱియొక పక్షమున, 'ఏకం చ తత్ ప్రాభవం చ' అని కర్మధారయ సమాసము వలన 'ఏకప్రాభవం' అను రూపము సిద్ధించును. ఏకప్రాభవ మనగా ప్రధానమైన సార్వభౌమత్వమని భావము. లోకమందలి ప్రభుత్వపరంపర సవిశేష మగుటం జేసి ఎచటనో ఒక చోటున పర్యవసానము నొందుట యనివార్యము. "ఏష సర్వేశ్వరః" యనుచు బృహదారణ్యక శ్రుతి 'ఇతడే సర్వేశ్వరుడు, ఇతడే భూతముల కధిపతి, ఇతడే భూతపాలకు' డని చెప్పుచున్నది. ఈ శ్రుతివచనానుసారము అంతర్యామిత్వము చేతను, సాక్షాత్కారము కలిగించువాడు అనుయుక్తిచేతను ఇతర వాగాది యింద్రియముల ప్రేరణాతిశయము యొక్క పరిసమాప్తి యీ పరమేశ్వరి యందే గలదని భావము కాగా, ఆ పరమేశ్వరియే యీ జగత్తుకు నిరంకుశ స్వతంత్రకారణము, తద్రూపమైన తటస్థ లక్షణముచే నుపలక్షితయు, వేదాంతవాక్య సమన్వయమునకు విషయ భూతురాలు నయిన పరదేవత అఖండ సచ్చిదానంద స్వరూపిణియే. సచ్చిదానందస్వరూపిణి యగు ఆ పరాదేవి అవశ్యము స్వస్వరూపముగానే ధ్యానింపదగినదని సారాంశము ఉపాసకుడు అభేద బుద్ధితో పరమేశ్వరిని ధ్యానింపవలయునని భావము.

విశే :- "మహేశ్వరే వా జగతా మధీశ్వరే
జనార్దనే వా జగదంతరాత్మని।
న వస్తుభేదప్రతిపత్తి రస్తి మే
తథాఽపి భక్తి స్తరుణేందుశేఖరే ॥

అని అప్పయ్య దీక్షితులు చెప్పినారు. విష్ణురూపము ప్రపంచ సంబంధము కలది, శివస్వరూపము ప్రపంచాతీతము. అనగా అఖండ చైతన్యము. చైతన్యము ఏకము, భిన్నము కాదు. అయినను, ఈశ్వరానుగ్రహము వలన గాని, జ్ఞానము వలన గాని యీ శరీరములో ఉన్న విష్ణు స్వరూపము తెలిసినపుడు ఈ జడ శరీరములో అంతర్యామియై యున్న విష్ణురూపము శివరూపమే యని విదితమగును. శివ విష్ణు స్వరూపములలో భేదము లేకపోయినను, విష్ణువు జడమైన ప్రాణి కర్మాదులతో గలసి యుండును. అట్టి విష్ణు స్వరూపముతో నైక్యమగుట కంటె ఇది తెలిసికొని త్యజింపవలయును. అపుడు అఖండము, నిర్గుణము, త్రిపాద్విభూతి సంపన్న బ్రహ్మస్వరూపము నయిన శివునియందే నా చిత్తము భక్తిప్రవణమై యుండును. అదియే మోక్షమని భావము.

## ౪౧. ఈకారరూపా

శం. భా. ఈకారరూపా । ఈకారః రూపం తృతీయావయవః యద్వాచకమంత్రస్య యస్యాః సా తథా ॥ ఓం ఈకారరూపాయై నమః॥

పంచదశీ మంత్రము నందు ప్రథమ కూటములోని మూడవ బీజము ఈ కారము. ఈ బీజాక్షరము మహాత్రిపుర సుందరి ప్రతిపాదకము. తత్ర్పతిపాదక మంత్రము నందు 'ఈ' బీజము ఏ తల్లికి గలదో ఆ పరాశక్తి। 'ఈకారరూపా' యని స్తుతింపబడుచున్నది.

## ౪౨. ఈశిత్రీ

శం. భా. ఈశిత్రీ। ఇచ్ఛతి ఈష్టే ఇతి ఈశిత్రీ సర్వ ప్రేరికా ఇత్యర్థః ॥ ఓం ఈశిత్ర్యై నమః ॥

ఆం. వి. కోరుచున్నది అనగా ఇచ్ఛాశక్తిరూపిణి, సర్వప్రాణులను శాసించునట్టిది గావున, పరదేవత 'ఈశిత్రీ' అను నామముచే నొప్పారుచున్నది.

## ౪౩. ఈప్సితార్థప్రదాయినీ

శం. భా. ఈప్సితార్థప్రదాయినీ। అర్థ్యంతే ప్రార్థ్యంతే ఇత్యర్థాః అభ్యుదయనిఃశ్రేయసరూపాః, ఆప్తుంఇచ్ఛావిషయీ భూతాః ఈప్సితాః, తే చ తే అర్థాశ్చేతి కర్మధారయః, ఈప్సితార్థాన్ ప్రదదాతీతి తథా। కేవలకర్మణా మదృష్ట ద్వారా కాలాంతర భావిఫలదాతృత్వ మచేతనత్వా న్నోపప పద్యతే। తాదృశానాం కస్మిన్నప్యర్థే సామర్థ్యాదర్శనాత్। చేతనాధిష్ఠితానాం తు కర్మణాం భృత్యకృత పరాక్రమాది

తుష్ట రాజవత్ తదారాధిత పరమేశ్వరః "కర్మాధ్యక్షః", ఇతి శ్రుత్వా సర్వజ్ఞస్య తత్తదధికారికృత పుణ్యానురూపతయా ఫలప్రదానే సమర్థస్య సత్త్వకల్పనే తదనన్యస్య చేతనస్య జీవాదే స్తత్ర సామర్థ్యవిరహాత్ స ఏవ తత్తదనుగుణ విషయే చ్ఛోత్పాదనేన తత్సాధనానుష్ఠాపయితా సన్ తత్ఫలకామనాం పూరయతీ త్యనీశ్వర మీమాంసక మతనిరాసో ద్రష్టవ్యః ।

అథవా, ఈప్సితా జిజ్ఞాసితా, తథా చ స్వస్వరూప ప్రతిపాదక వేదాంతశ్రవణ మనన నిదిధ్యాసనవిషయీకృతా సతీ అర్థం ప్రార్థ్యమానం సర్వాభ్యర్థిత మోక్షరూపం పురుషార్థం ప్రదదాతీతి తథా ॥ ఓం ఈప్సితార్థప్రదాయిన్యై నమః ॥

ఆం. వి. ప్రార్థింపబడునవి, యాచింపబడునవి గాన, అర్థము లనబడును. ఆ యర్థములుంఅభ్యుదయ నిఃశ్రేయ రూపములు. పొందవలయునను కోరికకు విషయభూతములు గాన, అవి యీప్సితము లనబడును. ఈప్సితములైన అర్థము లని కర్మధారయ సమాసము చెప్పికొనవచ్చును. ఈప్సితములైన అర్థముల నొసగునట్టిది గాన పరాభట్టారికకు 'ఈప్సితార్థప్రదాయినీ' యను నామ మన్వర్థము. కేవల పుణ్యపాప రూప కర్మలు జడములు, అట్టి యచేతన కర్మలు అదృష్టము ద్వారా, అనగా అపూర్వము ద్వారా కాలాంతరమున

ఎప్పుడో ఫలము నొసంగు ననుట యుపపన్నము కాదు; వలన, తాదృశములైన జడరూప కర్మలకు ఫలప్రదాతృత్వ సామర్థ్యము ఏ విషయము నందైనను గన్పట్టదు. కావున, చేతనాధిష్ఠితములైన కర్మలకు, అనగా చైతన్యము గల పురుషులచేత అనుష్ఠింపబడు కర్మలకు సేవకులు ప్రదర్శించునట్టి పరాక్రమాదుల చేత సంతుష్టుడైన చక్రవర్తి వలె కర్మాను ష్ఠానము చేయునట్టి పురుషులచేత ఆరాధింప బడుచున్న పరమేశ్వరుడు అధ్యక్షుడని శ్రుతి చెప్పుచున్నది. ఆ శ్రుతి వచనము ననుసరించి ఆ యా కర్మల ననుష్ఠించుట యందు అధికారులైన జీవులు చేయునట్టి సుకృత దుష్కృతముల కనుగుణముగా ఫలము నొసగుటలో సమర్థుడు, సర్వజ్ఞుడు నగు పరమేశ్వరుని అస్తిత్వము నూహింపనగును. అటుల నయిన, ఆ పరమేశ్వరుని కంటె అనన్యులు, చేతనులు నయిన జీవులకు ఫలప్రదాతృత్వ సామర్థ్యము లేదు. అందువలన ఆ పరమేశ్వరుడే యా యా జీవులకు అనుగుణములైన విషయ ముల యందు ఇచ్ఛను కలిగించును. అందువలన తత్ఫలప్రాప్తి సాధనరూప కర్మలను జీవులచే ననుష్ఠింపజేయు చున్నవాడై తత్ఫలకామనల నీడేర్చుచున్నాడని చెప్పనొప్పును; ఈ రీతిగా జెప్పుట వలన అనీశ్వర పూర్వమీమాంసా సిద్ధాంతము నిరస్తమయినదని తెలియవలయును.

అథవా, 'ఈప్సితా' యనగా పరదేవత జ్ఞేయ స్వరూపిణి; కాగా స్వస్వరూపమును - ఆత్మస్వరూపమును ప్రతిపాదించునట్టి వేదాంత మహావాక్యముల శ్రవణ, మనన, నిదిధ్యాసనాదులకు విషయముగా చేయబడినదై పరదేవత సర్వప్రాణులచే నర్థింపబడునట్టి మోక్షరూప పురుషార్థ ఫలమును వారికి నొసగును; కావున, ఆ పరాభట్టారిక 'ఈప్సితార్థ ప్రదాయినీ' యని సంకీర్తితురాలగుచున్నది.

శ్లో॥ ఈదృగిత్యవినిర్దేశ్యా చేశ్వరత్వవిధాయినీ ।
ఈశానాదిబ్రహ్మమయీ చేశిత్వాద్యష్టసిద్ధిదా ॥ ౧౦

## ౪౪. ఈదృగిత్యవినిర్దేశ్యా

శం. భా. ఈదృగిత్యవినిర్దేశ్యా । ఈదృక్ ఏతల్లక్షణా లక్షిత ఏతాదృశ పరిమాణ ఏవంస్వరూపః ఏతాదృశధర్మవానితి ప్రత్యక్షసిద్ధార్థో వినిర్దేష్టుం శక్యతే । 'యచ్చక్షుషా న పశ్యతి' ఇత్యాది శ్రుత్యా సర్వేంద్రియగోచరత్వ నిరాకరణాత్ వినిర్దేశ్యా న భవతి । ఔపనిషదానాం మతే తు ఉపనిషదాం వేదైకదేశత్వేన ఇతర ప్రమాణానపేక్షతయా అజ్ఞాతార్థజ్ఞాపకత్వేన ప్రామాణ్య మురరీకృతమ్ । ఇదమేవ ఏతాదృగేవేతి ప్రత్యక్షసిద్ధార్థజ్ఞాపనే తాసా మనువాదకత్వేన సాపేక్షత్వరూప మప్రామాణ్యం ప్రసజ్యేతేత్యభిప్రాయః ।
ఓం ఈదృగిత్యవినిర్దేశ్యాయై నమః ॥

ఆం. వి. ఈదృక్ ఇటువంటి లక్షణములు గలవాడని, ఇటువంటి పరిమాణము గలవాడని, ఇటువంటి స్వరూపము గలవాడని, ఇటువంటి ధర్మములు గలవాడని ప్రత్యక్షగోచరుడైన వ్యక్తిని నిర్దేశించి చెప్పుటకు వీలగును. 'యచ్చక్షుషా న పశ్యతి' యను కేనోపనిషద్వచనము 'పరమేశ్వర తత్త్వము' సర్వేంద్రియ గోచరము కాదనినిరాకరించుట వలన ఆతత్త్వము నిర్దేశించి చెప్పుటకు వీలులేనిది. కావున పరమేశ్వరి 'ఈదృగిత్యవినిర్దేశ్యా' యని స్తవనీయురాలగుచున్నది. ఔపనిషద సిద్ధాంతమందు, ఉపనిషత్తులు వేదైకదేశములు, అన్య ప్రమాణాపేక్షారహితములు, అజ్ఞాతార్థజ్ఞాపకములు; అందు వలన ఉపనిషత్తులకు ప్రామాణ్యమంగీకరింపబడినది. ఇదియే యనియు, ఇటువంటిదే యనియు ప్రత్యక్షసిద్ధమైన అర్థమును జ్ఞాపకము చేయుటయందు శ్రుతివాక్యములు ప్రత్యక్షసిద్ధార్థమునకు అనువాదకము లగుటవలన సాపేక్షత్వ రూపమైన అప్రామాణ్యము సిద్ధించునని భావము.

## ౪౫. ఈశ్వరత్వవిధాయినీ

శం. భా. ఈశ్వరత్వవిధాయినీ । ఈశ్వరస్య భావః తస్యైక్యం విదధాతి, ఆవరణ విక్షేపశక్తిమదజ్ఞాననివర్తక అఖండాకార చైతన్యస్వరూపా సతీ భేదబుద్ధిమాత్రసంపాది తైశ్వర్యైక్య యోగభ్రమం నివర్తయతీత్యర్థః; "స్వేన రూపేణాభినిష్పద్యతే" ఇతి శ్రుతేః ।

అథవా, ఈశ్వరత్వం నామ నానాదేశ విద్యాధనో త్కర్షాదిమత్వం, తత్తత్ప్రాణి నికాయ పుణ్యప్రారబ్ధాను సారేణ కర్మఫలం ప్రయచ్ఛతీతి వా ॥ ఓం ఈశ్వరత్వ విధాయిన్యై నమః ॥

ఆం. వి. ఈశ్వరుని భావము ఈశ్వరత్వము. అనగా పర మేశ్వరునితో ఉపాసకునకు ఐక్యము కలిగించునది గావున, ఆ పరాభట్టారిక 'ఈశ్వరత్వవిధాయినీ' యని గానము చేయ బడుచున్నది. ఆమె ఆవరణరూప, విక్షేపరూప అజ్ఞానమును నివర్తింప జేయునట్టి జగన్మాత; ఆ తల్లి అఖండాకార చైతన్య స్వరూపిణి; తాదృశ మహిమాన్వితయైన దేవి, భేదబుద్ధి మాత్రముచేత సంపాదింపబడిన ఐశ్వర్యతాదాత్మ్య భ్రాంతిని పోగొట్టునదని భావము. 'స్వేన రూపేణాభినిష్పద్యతే' యనుచు 'పరమేశ్వరి స్వీయరూపముతో అనగా స్వస్వరూపముతో నిష్పన్నయై యుండు' నని శ్రుతి ముక్తకంఠముగా చెప్పు చున్నది.

అథవా, ఈశ్వరత్వ మనగా, నానాదేశముల యందు ఆధిపత్యము, విద్యాధిక్యము, ధనోత్కర్ష కలిగియుండుట; ఆ యా జీవుల సుకృత ప్రారబ్ధమును అనుసరించి కర్మఫలమును నానా దేశ విద్యాధనోత్కర్ష రూపమైన కర్మఫలము నొసగునది గాన. పరమేశ్వరి 'ఈశ్వరత్వవిధాయినీ' యనుచు కీర్తింప బడుచున్నది.

## ౪౬. ఈశానాదిబ్రహ్మమయీ

శం. భా. ఈశానాది బ్రహ్మమయీ । ఈశాన తత్పురుష అఘోర వామదేవ సద్యోజాతాఖ్యాని పంచ బ్రహ్మాణి తాని మయం స్వరూప మస్యా అస్తీతి సా తథా ।

అథవా, ఈశానః ఆది ర్యేషాం తే తథా అధికారి పురుషాః విష్ణుబ్రహ్మేంద్రాదయః, తేషామపి తత్తన్నామ రూపవిశిష్టానా మహంబుద్ధిమతా మంతర్యామిస్వరూపేణ బుద్ధిప్రేరక సచ్చిదానందస్వరూప పరబ్రహ్మానందప్రకాశాత్మనా స్ఫురతీతి తథా ॥ ఓం ఈశానాదిబ్రహ్మమయ్యై నమః ॥

ఆం. వి. ఈశాన, తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాత నామాదులతో ఒప్పారు పంచబ్రహ్మలు స్వరూపములుగా గలది గావున శ్రీ లలితా పరాభట్టారిక 'ఈశానాది బ్రహ్మమయీ' యను నామముతో స్తుతింపబడుచున్నది.

అథవా, నామరూపవిశిష్టులు, అహంబుద్ధిమత్తా విశిష్టులు, ఈశానాది ఆధికారిక పురుషులునయిన విష్ణుబ్రహ్మ ఇంద్రాదుల యందు సయితము అంతర్యామిస్వరూపముతో నుండి, బుద్ధిపూర్వకము, సచ్చిదానందస్వరూపము నయిన పరబ్రహ్మానంద ప్రకాశాత్మగా ప్రకాశించుచున్నది గావున, పరమేశ్వరికి 'ఈశానాదిబ్రహ్మమయీ' యను నామ మన్వర్థము.

విశే :- సచ్చిదానందస్వరూపము నిష్క్రియము, శాంతము అని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. ఆ పరమేశ్వర తత్త్వము నిష్క్రియమని చెప్పినపుడు దానికి కర్తృత్వము చెప్పుట పొసగదు గదా! 'బుద్ధిప్రేరక' మని చెప్పుట వలన కర్తృత్వము చెప్పినట్లగుచున్నది. సచ్చిదానంద రసఘనమైన చైతన్యమునకు కర్తృత్వ మంగీకరించినచో, అద్వైత స్థితికి భంగము వాటిల్లుచున్నది. ఇది యెట్లు సంగతమగునని యూ శంకింపజనదు. గాయత్రీమంత్రములో "ధియో యో నః ప్రచోదయాత్" అని మంత్రలింగము కన్పట్టుచున్నది. 'మా బుద్ధివృత్తులను ఏ దేవుడు ప్రేరేపించుచున్నాడో. ఆ సవితృ దేవుని శ్రేష్ఠమైన తేజస్సు నుపాసించుచున్నా' మని గాయత్రీ మంత్రార్థము. ఈ రీతిగానే వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసాదులలో ఎడనెడ సచ్చిదానంద చైతన్యమునకు కర్తృత్వ ప్రేరకత్వములు చెప్పబడినవి. అట్టి స్థలములలో ఎట్లు సమన్వయము చేయనగునో, శ్రీ వ్యాసభట్టారకులు యుక్తి పురఃసరముగా ఇట్లు వివరించినారు.

> "అనాపన్న వికారస్సన్ అయస్కాంతవదేవ యః ।
> బుద్ధ్యాదీం శ్చాలయేత్ ప్రత్యక్ సోఽహ మిత్యవధారయ ॥"

అయస్కాంతము తాను కదలకయే యినుమును కదిలించుచున్నది. ఆ రీతిగానే ప్రత్యక్ చైతన్యము తాను నిష్క్రియమయ్యు బుద్ధ్యాదులను కదిలించుచున్నదని భావము.

కావున, అయస్కాంతమునకు కర్తృత్వమును నిరూపించగల సాధన మేమున్నది ? ఏదియులేదు. కాని, అయస్కాంతమునందు చాలకత్వ లక్షణము లేనిచో, ఇనుప ముక్కలో చలన మెట్లు కలుగుచున్నది ? కావున, అయః పిండమునందు గన్పట్టు చలనమును బట్టి అయస్కాంతము నందు కర్తృత్వ ధర్మము గలదని యుక్తివాదులు చెప్పుదురు. ఇట్లు చెప్పుటయు యుక్తిసహము కాదు. ప్రత్యక్ష గోచరము కాని చాలక శక్తిని అయస్కాంతము నందు ఊహించుటలో ఔచిత్యము లేదు. కావుననే శ్రీ వ్యాస భట్టారకులు మఱి యొక శ్లోకములో ఈ రీతిగ వివరించి యున్నారు.

> "యస్య సన్నిధిమాత్రేణ దేహేంద్రియ మనోధియః ।
> విషయేషు ప్రవర్తన్తే తద్బ్రహ్మేత్యవధారయ ॥ "

దేవియొక్క సాన్నిధ్యమాత్రము చేతనే దేహేంద్రియ మనో బుద్ధులు విషయములందు ప్రవర్తించుచున్నవో, ఆ తత్త్వమును బ్రహ్మ యని తెలిసికొనుమని భావము. ఇట సంయోగ, సమవాయ సంబంధములు కారణములు కావని తెలియనగును.

కావుననే ఉపాసనాసంప్రదాయములో శ్రీ వనదుర్గా దేవిని 'సంవిత్స్వరూప బిసకందళకందరూప' యని స్తవము చేసినారు. పరమేశ్వరి కలదని మనకెట్లు తెలియును ? మన హృదయములో నావిర్భవించియున్న బుద్ధి క్షణక్షణము అంకు

రించుచున్నది. బుద్ధి యనెడి మొలకకు కారణరూపమైనది పరాశక్తి యనెడి తామరదుంప. ఆ బిసకందళము (తామర దుంప) నుండి బుద్ధి అంకురించుచున్నది. జలముగాని, భూమి గాని, ఆ దుంపకు ఆధారమై యుండవలయును. భూ జలాది సాన్నిధ్యము చేతనే తామరదుంప నుండి యంకుర ముద యించుచున్నది. ఆ రీతిగ బిసకందళస్థానభూతురా లయిన పరమేశ్వరికి ఆధారము సచ్చిదానంద చైతన్యము తత్సన్నిధి మాత్రము చేతనే పరమేశ్వరి నానా నామరూపాత్మక జగత్తుగా ఆవిర్భవించి, వికసించుచు సమస్త క్రియాకారిణి యగుచున్నది. కావున, ఆధారమగు చైతన్యము యొక్క సాన్నిధ్యము చేతనే ఆధేయ మగు పరమేశ్వరి యందలి గుణములు బహిర్గతములై స్ఫురించుచున్నవని గ్రహింపనగును.

## ౪౭. ఈశిత్వాద్యష్టసిద్ధిదా

శం. భా. ఈశిత్వాద్యష్టసిద్ధిదా । ఈశిత్వ మాది ర్యాసాం తా స్తథా ।

> "అణిమా మహిమా లఘ్వీ గరిమా ప్రాప్తి రీశతా ।
> ప్రాకామ్యం చ వశిత్వం చ యత్ర కామాః
> పరాగతాః ॥ "

ఇతి వచనాత్ । తాః సిద్ధీ రష్టౌ దదాతీతి తథా । అణిమా క్షణ మాత్రేణ అతి సూక్ష్మభావః । మహిమా మహతో భావః ।

లఘ్వీ లాఘవమ్ । గరిమా గురోర్భావః, జడతర పర్వతాది వత్ భారవశేన అప్రకంపిత్వ మిత్యర్థః । క్షణమాత్రేణ విరాడాకృతిమత్త్వం ప్రాప్తిః । హస్తేన చంద్రమండలాది స్పర్శః ఈశితా, ఇంద్రాదీనామపి ప్రేరకతా । ప్రాకామ్యం అప్రతిహత కామనావత్త్వమ్, వాంఛితార్థఫలప్రాప్తి రిత్యర్థః । వశిత్వం సర్వలోకవశీకరణసామర్థ్యమ్ । యత్ర కామాః పరాగతాః, కామ్యన్త ఇతి కామాః విషయాః యత్ర యస్మిన్ ఐశ్వర్యే సతి పరాగతాః బహిర్భూతాః భవన్తి। విషయాణా మనుభవాభావేఽపి తజ్జన్య సుఖవత్త్వం ఆప్తకామత్వ మిత్యర్థః ఏతా అష్ట సిద్ధయః ॥ ఓం ఈశిత్వాద్యష్టసిద్ధిదాయై నమః ॥

ఆం. వి. ఈశిత్వము మొదలైన యెనిమిది సిద్ధులు ఈశిత్వాది అష్టసిద్ధు లనబడును. అణిమా, మహిమా, లఘ్వీ, గరిమా, ప్రాప్తిః, ఈశితా, ప్రాకామ్యం, వశిత్వం అనునవి యష్టసిద్ధులుగా పేర్కొనబడును. ఈ యష్టసిద్ధులను సాధించిన పురుషునకు వాంఛనీయ విషయము లన్నియు దూరముగ బహిర్గతములై యుండునని అభియుక్తోక్తి వలన దెలియు చున్నది. ఆ యష్టసిద్ధులను భక్తులకు నొసంగునది గావున, పరమేశ్వరి 'ఈశిత్వాద్యష్టసిద్ధిదా' యని సంకీర్తనము చేయబడుచున్నది.

(1) అణిమా యనగా క్షణకాలములో అతి సూక్ష్మ రూపమును పొందుట. (2) మహిమా యనగా విశాలమైన, ఉన్నతమైన రూపమును ధరించుట. (3) లఘ్వీ యనగా

మిక్కిలి భారరాహిత్యమును పొందుట. (4) గరిమా యనగా అతిభారవంత మగుట, జడతరములైన పర్వతాదులకు వలె భారమగుట వలన ఎంత బలాఢ్యులకయినను కదిలింప శక్యము గాకుండుట యని భావము. (5) ప్రాప్తిః యనగా క్షణ కాలములో విరాడ్రూపమును (సర్వ జీవస్వరూపుడు సర్వవ్యాపకుడు నయిన విష్ణుస్వరూపమును) ధరించుట. (6) ఈశితా యనగా హస్తముతో చంద్రమండల. సూర్య మండలాదులను స్పృశించుట, లేక యింద్రాది దేవతలను నయితము కార్యప్రవృత్తి యందు ప్రేరేపించుట. (7) ప్రాకామ్య మనగా అప్రతిహతముగా, నిరాటంకముగా కోర్కెకలిడేరుట, వాంఛితార్థ ఫలప్రాప్తి యని భావము. (8) వశిత్వమనగా సర్వలోకములను వశము చేసికొన గల సామర్థ్యము. ఈ అష్టసిద్ధులయందు సమస్త కామములు దూరాపాస్తములగును. మనచే కోరబడునదిగాన, విషయ ములు కామశబ్దవాచ్యము లగుచున్నవి. ఈ విషయము లన్నియు ఈశిత్వాది అష్ట ఐశ్వర్యసిద్ధి కలిగినంతనే మన చిత్తమునకు దూరమై బహిర్గతములగును. అనగా విషయ కామన యుండదని భావము. అష్టఐశ్వర్య సిద్ధుడైనవాడు విషయగత సుఖములను అనుభవించకపోయినను విషయజన్య సుఖమును అనుభవించుచున్నవాడై ఆప్తకాముడగునని భావము. ఈ పైన చెప్పిన సిద్ధులు అష్టసిద్ధులు.

విశే :- ఈ అష్టసిద్ధులు లలితా పరాభట్టారిక యొక్క విభిన్న శక్తులే. శ్రీవిద్యాదీక్షితులైన యుపాసకులు శ్రీచక్రార్చనము చేయుట సంప్రదాయము. శ్రీచక్రము నందలి నవావరణదేవతలను సృష్టి సంహార క్రమములో అర్చింతురు. ఈ యష్టసిద్ధులను యోగినీదేవతలుగా ప్రథమావరణార్చనమునందు అర్చింతురు. ఒక్కొక్క యోగినీ దేవతనర్చించు స్థానములు, దిక్కులు, విదిక్కులు గూడ శ్రీచక్రము నందు నిర్దేశింపబడినవి.

"అణిమాం పశ్చిమద్వారే దక్షభాగే ప్రపూజయేత్ ।
లఘిమా ముత్తరద్వారే దక్షభాగే ప్రపూజయేత్ ॥
పూర్వద్వారే తు మహిమా ముత్తరే పూజయేత్తతః।
ఈశిత్వసిద్ధి ర్దేవేశి దక్షిణద్వారే పూర్వవత్ ॥
వశిత్వసిద్ధిం వాయవ్యే తేనైవ క్రమతో యజేత్ ।
ప్రాకామ్యసిద్ధి మీశానే తేనైవ క్రమతో యజేత్ ॥
ప్రాప్తిసిద్ధిః సర్వకామసిద్ధిశ్చ పరమేశ్వరి ।
అధోర్ధ్వక్రమరూపేణ జ్ఞాతవ్యే సురసుందరి ॥

ఈ తంత్రశాస్త్ర వచనానుసారము ఈ యష్టసిద్ధులు పరమేశ్వరి కంటె నభిన్నస్వరూపము గల యోగినీ దేవతలుగ దెలియవలయును.

శ్లో॥ ఈక్షిత్రీక్షణసృష్టాండకోటి రీశ్వరవల్లభా ।
ఈడితా చేశ్వరార్ధాంగశరీరేశాధి దేవతా ॥

## ౪౮. ఈక్షిత్రీ

శం. భా. ఈక్షిత్రీ। ఉదాసీనద్రష్ట్రీ సాక్షిణీ అసంగ ఉదాసీన జ్ఞానస్వరూపేత్యర్థః। "సాక్షీ చేతా" ఇతి శ్రుతేః, "ఆవిః సంనిహితం గుహాయామ్" ఇతి శ్రుతేః॥ ఓం ఈక్షిత్ర్యై నమః ॥

ఆం. వి. ఔదాసీన్య భావముతో సాక్షిభూతయై చూచునది నిస్సంగురాలు, ఉదాసీనజ్ఞానమే స్వరూపముగా గలది గావున పరాదేవత 'ఈక్షిత్రీ' యను నామముతో భక్తులచే అర్చింపబడుచున్నది. "సాక్షీ చేతా" యను శ్రుతి వచనము పరమేశ్వరి చైతన్యస్వరూపిణి, కేవల సాక్షిమాత్రయై యున్నదని యుద్బోధించుచున్నది. "ఆవిః సన్నిహితం గుహాయాం" అనుచు శ్రుతిమాత 'పరమేశ్వరి, హృదయగుహ యందు సన్నిహితురాలై ప్రకాశించుచున్న' దని యుపదేశించుచున్నది.

విశే :- మన కంటికి కన్పడుచున్న శరీరమును అన్నమయకోశమని యందురు. అన్నమయకోశములో ప్రాణమయ కోశము, ప్రాణమయకోశములో మనోమయ కోశము, మనోమయ కోశములో విజ్ఞానమయ కోశము, విజ్ఞానమయ కోశములో ఆనందమయకోశము క్రమముగా నొకదానిలో నొకటి యున్నది. కోశమనగా సంచి. సంచిలో సంచి దిగవేసి నట్లు ఈ పంచకోశములున్నవి. అయిదవ సంచి యొక్క-

మధ్య, అనగా ఆనందమయకోశము మధ్య ఉన్న యాకాశము 'గుహ' యనబడును. "గుహా సేయం పరంపరా" యని శ్రీ విద్యారణ్యస్వామి వచనము. పరమేశ్వరి తద్గుహాంతర్వర్తిని యై, ప్రత్యక్ చైతన్య స్వరూపిణియై విరాజిల్లుచుండునని భావము.

## ४८. ఈక్షణసృష్టాండకోటిః

శం. భా. ఈక్షణసృష్టాండకోటిః । అండానాం బ్రహ్మాండానాం కోటయః అసంఖ్యాతాః, భూత భావి కాల భేదేన బహువచనం కోటిశబ్దస్య, అనాదిత్వాత్ సంసార మండలస్య ఈక్షణేన భావికార్యాలోచనేన సృష్టా అండ కోటయో యయా సా "తథా; తదైక్షత బహుస్యాం ప్రజా యేయేతి", "స ఈక్షాంచక్రే", 'ఆత్మా వా ఇద మేక అగ్ర ఆసీత్ నాన్యత్కించన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాంల్లోకా నసృజత" ఇత్యాది శ్రుతేః, బాహ్య కారణ మనపేక్ష్య ఊర్ణనాభ్యాదిదృష్టాంతప్రదర్శనేన చేత నస్య అభిన్ననిమిత్తోపాదానప్రదర్శనయుక్తేః, "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్" ఇత్యాదేశ్చేతి భావః ॥

ఓం ఈక్షణసృష్టాండకోటయే నమః ॥

ఆం. వి. అండకోటయః అనగా అసంఖ్యాకములయిన బ్రహ్మాండములని యర్థము. భూత భవిష్యత్తులను కాలభేదము చేత కోటిశబ్దమునకు బహువచనము చెప్పబడినది. సంసారము

అనాదియగుటచేత ఈక్షణముచేత, అనగా భావికార్యపర్యా లోచనముచేత పరమేశ్వరి అనంతబ్రహ్మాండములను సృజించు నది గావున ఆమె 'ఈక్షణసృష్టాండకోటిః' యని స్తవనీయ యగుచున్నది. "తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి" యనుచు శ్రుతి 'నామరూపాత్మక భేదముతో అనేకమగుదు ననుచు హిరణ్యగర్భ తత్త్వము పర్యాలోచించె' నని చెప్పు చున్నది. "స ఈక్షాంచక్రే" — 'ఆ బ్రహ్మపస్తువు విచార మొనర్చె' నని శ్రుతివచనము. "ఆత్మావా ఇద మేక మగ్ర ఆసీత్ ...... అనుచు, సృష్టికి పూర్వము ఆత్మయొక్కటియే యున్నదనియు, ఆత్మకంటె భిన్నమైనది, కదలునది మెసలునది యేదియు లేదనియు, ఆ పరమేశ్వరుడే లోకములను సృజించెద నని పర్యాలోచనచేసి, యీ లోకములను సృజించె' ననియు శ్రుతివచనము లుద్ఘోషించుచున్నవి. బాహ్యకారణము నపే క్షింపకయే ఊర్ణనాభి (సాలీడు) మొదలగువానిని దృష్టాంత రూపమున ప్రదర్శించుట ద్వారా చేతనము ఈ జగత్తుకు అభిన్న నిమిత్తోపాదానకారణ మనెడి యుక్తి ప్రదర్శింపబడి నది. "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాంతానుపరోధాత్" అని శ్రీ బాదరాయణులు ప్రతిజ్ఞా దృష్టాంతములను బట్టి ప్రకృతి, పరమేశ్వరుని కంటె భిన్నురాలు కాదని బ్రహ్మసూత్రముల లోని యీ సూత్రము ద్వారా నిర్దేశించి యున్నారు. కావున, పై శ్రుతిస్మృతి వచనప్రమాణముల వలన 'ఈక్షణ సృష్టాండకోటిః' యను నామముపరమేశ్వరియందు అన్వర్థము.

విశే :- ఈ ప్రపంచములో ఊర్ణనాభి (సాలిపురుగు) ఉన్నది. అది తన నోటి యందలి జిగురు పదార్థముతో సాలె గూడును నిర్మించుకొనును. ఆ గూడును నిర్మించుకొనునది తానే, ఆ నిర్మాణమునకు కావలసిన పదార్థముతన నోటినుండి వచ్చినదే. అన్యకారణాపేక్ష ఆ సాలీడుకు లేదు. అటులే పరమేశ్వరచైతన్యము గూడ. లోకములో ఒక కుండ చేయుటకు నిమిత్తకారణమైన కులాలుడు (కుమ్మరి), ఉపాదాన కారణమైన మృత్తిక (మన్ను) ఆవశ్యకము లగును. కాని, ప్రపంచనిర్మాణ విషయములో నిమిత్తకారణము, ఉపాదాన కారణము - రెండును పరమేశ్వరుడే. ఏలన, బ్రహ్మకంటె భిన్నుడైన కర్త లేడు, బ్రహ్మభిన్నమైన పదార్థము లేదు. కావున, బ్రహ్మ ఈ ప్రపంచమునకు అభిన్న నిమిత్తోపాదాన కారణము. సాలిగూడుకు సాలీడు అభిన్ననిమిత్తోపాదాన కారణమని శ్రుతి యుక్తిప్రదర్శన పురఃసరముగా చెప్పి, యీ సృష్టికి అభిన్ననిమిత్తోపాదానకారణము పరమేశ్వరుడు, లేక పరమేశ్వరి యని విస్పష్టము గావించినదని తెలియనగును. పరమేశ్వరి యన్య నిరపేక్షముగా ఇచ్ఛామాత్రము చేతనే యీ బ్రహ్మండములను సృజించుచున్నదని భావము.

## ౫౦. ఈశ్వరవల్లభా

శం. భా. ఈశ్వరవల్లభా । ఈశ్వరః కామేశ్వరః వల్లభః పతిః యస్యాః సా తథా ।

ఈశ్వరాణాం బ్రహ్మవిష్ణురుద్రాదీనాం తత్తన్నిష్ఠ మహిమోత్కర్ష రూపేణ ప్రీత్యతిశయ విషయత్వేన అభ్యర్హితేత్యర్థో వా ॥ ఓం ఈశ్వరవల్లభాయై నమః ॥

ఆం. వి. కామేశ్వరుడు పతిగా గలది గాన, దేవి 'ఈశ్వరవల్లభా' యని ధ్యాతవ్య యగుచున్నది.

అథవా, సర్వసమర్థులైన బ్రహ్మ, విష్ణు, రుద్రాదుల యందు ఉన్న మహిమాతిశయరూపముతోను భక్త్యతిశయ విషయ మగుట చేతను చక్కగా అర్చింపదగినది గావున, దేవికి 'ఈశ్వరవల్లభా' యను నామము సార్థకము. ఆ పరా దేవత బ్రహ్మవిష్ణురుద్రాదుల కంటె అధిక మహిమోపేత, సాధకుల భక్త్యతిశయమునకు విషయభూతురాలని భావము.

## ౫౧. ఈడితా

శం. భా. ఈడితా - ఈడ స్తుతౌ వితి ధాతుపాఠాత్ స్తుతిభిః విషయీకృతా వేదాన్తైరితి శేషః । "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య" ఇత్యాది శ్రుతేః ॥ ఓం ఈడితాయై నమః ॥

ఆం వి. 'ఈడస్తుతౌ' అను ధాతువు వలన వేదాంత వాక్యముల చేత అనగా ఉపనిషద్వాక్యముల చేత స్తుతింపబడునది గావున, శ్రీ మహాత్రిపురసుందరి 'ఈడితా' యను నామముతో విరాజిల్లుచున్నది. "ఏ నిత్యో మహిమాష

బ్రాహ్మణస్య” యనుసు శ్రుతి ‘ఇది బ్రహ్మనిష్ఠుని యొక్క శాశ్వత మహత్త్వము’ అని చెప్పుచున్నది. బ్రహ్మవేత్త యొక్క మహిమ ఇంత మహత్త్వసంపన్న మయినపుడు, సాక్షాత్ బ్రహ్మస్వరూపిణి యగు లలితాపరాభట్టారిక యొక్క మహిమ వర్ణనాతీతము.

## ౫౨. ఈశ్వరార్ధాంగశరీరా

శం. భా. ఈశ్వరార్ధాంగశరీరా। ఈశ్వరస్య సచ్చిదానందాత్మకస్య శివస్య అర్ధం చ తత్ అంగం చ అర్ధాంగమ్। ఆనందస్వరూపతా శరీరం శరీరవత్త్వరూపలక్షణం యస్యాః తథా। “సచ్చిన్మయః శివః సాక్షాత్తస్యానందమయీ శివా” ఇతి స్మృతేః॥

అథవా, ఈశ్వరస్య అర్ధాంగం వామభాగః శరీరం మూర్తిః యస్యాః సా।

అథవా, ఈశ్వరస్య హకారస్య అర్ధాంగం శక్తిబీజం శరీరం మంత్రాత్మికా మూర్తిః యస్యాః సా తథా ॥ ఓం ఈశ్వరార్ధాంగశరీరాయై నమః॥

ఆం. వి. సచ్చిదానందస్వరూపుడయిన ఈశ్వరుని యొక్క సగము శరీరము, అనగా ఆనందస్వరూపత్వమే శరీరముగా గలది. శరీరము వలె (స్వరూపలక్షణము) శబ్ద

స్వరూప లక్షణము కూడ ఈమె యందున్నది; (చిద్రూపు డయిన ఈశ్వరుడు, ఆనందరూపిణియైన పరమేశ్వరి-ఇరువురును అర్ధనారీశ్వర శరీరముతో నున్నటుల ఈ నామమునందుగూడ అంతర్గర్భితులై యున్నారు) "సచ్చిన్మయః శివః సాక్షాత్ తస్యానందమయీ శివా" — 'శివుడు సాక్షాత్ సత్యజ్ఞాన స్వరూపుడు; శర్వాణి ఆ పరమేశ్వరుని యొక్క ఆనందమయ స్వరూపము' అని స్మృతివచనము వలన తెలియుచున్నది గావున, పరమేశ్వరి గుణగానము' ఈశ్వరార్ధాంగశరీరా' యని చేయబడుచున్నది

అథవా, ఈశ్వరునియొక్క వామభాగము శరీరముగా గలది గావున, ఈ నామము పరాదేవి యందన్వర్థమని తెలియ నగును.

అథవా, ఈశ్వరవాచకమైన హకారము యొక్క అర్ధాంగము, అనగా శక్తిబీజమైన 'ఈం' శరీరముగా గల మంత్రాత్మక విగ్రహము గలది గావున, దేవి 'ఈశ్వరార్ధాంగ శరీరా' యని యుపాసకులచే స్తుతింపబడు చున్నది, 'హ్రీం' శివశక్తుల నికువురను తెలియజేయు బీజాక్షరమని సంప్రదాయ వేత్తల నిశ్చయము.

## ౫౩. ఈశాధిదేవతా

శం. భా. ఈశాధిదేవతా । ఈశస్యేత్యుపలక్షణం జీవస్యాపి. ఈశస్య తత్పద వాచ్యార్థస్య మాయోపాధికస్య విశిష్టస్య అధి ఉపరి విశేషణద్వయస్య పరిత్యాగే దేవతా

ద్యోతమానా కూటస్థచిన్మాత్రశోధిత తత్త్వంపదార్థరూపే త్యర్థః ।

అథవా, ఈశః కామేశ్వరః అధిదేవతా పూజ్యా యస్యాః సా తథా । పరమ పతివ్రతేత్యర్థః ॥ ఓం ఈశాధి దేవతాయై నమః ॥

ఆం. వి. 'ఈశ' యను పదము జీవునకుగూడ ఉపలక్షణము. అనగా 'ఈశ' శబ్దముచేత జీవుడుగూడ సూచింపబడుచున్నాడని భావము. ఈశ్వరుడు 'తత్త్వం' పదములలోని తత్పదవాచ్యార్థమైన, మాయోపాధిక విశిష్టచైతన్యమునకు పై వాడని యర్థము. ఈ రెండు విశేషణములను తీసివేయగా, ప్రకాశన శీలమైన దైవము, కూటమువలె నిష్క్రియమై యున్న చైతన్యస్వరూపముగా వివేచన చేయబడిన 'తత్ త్వం' పదార్థరూపచైతన్యము. పరాదేవి కూడ తాదృశ చైతన్యస్వరూపిణి యగుటచే 'ఈశాధిదేవతా' యను నామము చేత సంకీర్తితురాలగుచున్నది.

అథవా, కామేశ్వరః - కామేశ్వరుడు పూజనీయుడైన అధిదైవముగా గలది గావున, పరాదేవి 'ఈశాధిదేవతా' యను నామముతో నొప్పారుచున్నది. ఆ తల్లి పరమ పతివ్రత యని భావము.

విశే :- పరమేశ్వరి యొక్క పతివ్రతాధర్మాతిశయమును శ్రీ ఆదిశంకరులు సౌందర్యలహరిలో ఒక శ్లోకము నందీరీతిగ వర్ణించియున్నారు.

"కలత్రం వైధాత్రం కతి భజన్తే న కవయః
శ్రియో దేవ్యాః కోవా న భవతి పతిః కైరపి ధనైః।
మహాదేవం హిత్వా తవ సతి సతీనా మచరమే
కుచాభ్యా మాసంగః కురవకతరో రప్యసులభః ॥"

జననీ ! పతివ్రతామతల్లీ ! కవులు వాణీపతులైరి, ధనవంతులు లక్ష్మీపతులైరి. కాని, ఓ తల్లీ ! నీ భర్తయైన శివుని వదలి, నీ కుచస్పర్శ నీ యుద్యానవనమందలి కురవక వృక్షమునకు సయితము అసంభవము. కావున ఈ లోకమున భవానీపతు లెవరును లేరనుట నీ పతివ్రతాత్వము యొక్క అతిశయమును చాటుచున్నది. పరమేశ్వరి సదాశివ వామాంకస్థిత. సింహాసనములు, పీటలు మొదలైన వన్నియు నొక వృక్షము యొక్క అవయవములు. అందుచే ఆపరమేశ్వరి శివవామాంకమును వీడి ఆ యాసనములపై కూర్చుండుటకు నిచ్ఛగించదు. అటుల, ఆసీనురాలైనచో తన పాతివ్రత్యమునకు భంగము వాటిల్లునని తలంచును. దోహదక్రియాభిలాషతో కురవక వృక్షమును (గోరింటచెట్టును) సయితము తా నొంటరిగా స్పృశించదు. తనలో సాబాలైన శివునితో గూడియే స్పృశించును. ఆమె పరమేశ్వర నిత్యానపాయినియై యుండునని భావము. ఇది పరమేశ్వరి యొక్క మహాపతివ్రతాత్వమును ద్యోతనము చేయునని తెలియవలయును.

"మాయోపాధికం చైతన్యం ఈశ్వరః, అవిద్యోపాధికం చైతన్యం జీవః" యని శాస్త్రము ఈశ్వరున' కుపాధిమాయా

యనియు, జీవున కుపాధి యవిద్య యనియు, జీవేశ్వరభేదము ఉపాధికల్పితము గాని, వస్తుసత్యస్థితి కలది కాదనియు చెప్పు చున్నది. 'తత్త్వమసి' యను మహావాక్యార్థమును లెస్సగా విచారించి తెలిసికొనిన బ్రహ్మజ్ఞాన నిష్ఠుడు కల్పితములైన మాయ, అవిద్య యనెడి యుపాధులను తొలగించి శుద్ధ సచ్చిదానందస్వరూపమును దర్శించి స్వస్వరూపావస్థితుడై యుండును. ఉపాధికృతమైన జీవేశ్వరభేదము పోయి "ఏక మేవాద్వితీయమ్" అను రీతిగా ఏకత్వ భావముతో కూటస్థ చైతన్యమాత్రుడుగ ఉండును. పరమేశ్వర నిత్యానపాయిని యైన పరాభట్టారిక తాదృశచైతన్య స్వరూపిణియే యని భావము.

శ్లో॥ ఈశ్వరప్రేరణకరీ చేశతాండవసాక్షిణీ ।
ఈశ్వరోత్సంగనిలయా చేతిబాధావినాశినీ ॥ ౧౭

## ౫౮. ఈశ్వరప్రేరణకరీ

శం. భా. ఈశ్వరప్రేరణకరీ । ఈశ్వరస్య బింబచైత న్యస్య స్వరూపా సతీ జగత్సర్జనాదికార్యప్రేరయిత్రీ ప్రేరణ కరీ అజ్ఞాపికేత్యర్థః । ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్త్యావరణ విక్షేప శక్తి ప్రతిఫలిత చిత్స్వరూపా భావికార్యానుకూల ప్రారబ్ధా ధ్యక్షపరమేశ్వరేక్షణ నామధేయప్రకాశాత్మికా భవతీతిభావః।

ఈశ్వరప్రేరణం తదాజ్ఞా మనుల్లంఘనేన కరోతీతి వా తదీయ భార్యాత్వేన నితరాం తద్వశ్యేతి యావత్ ॥ ఓం ఈశ్వరప్రేరణకర్త్ర్యై నమః ॥

ఆం. వి. ఈశ్వరుడనగా మాయాప్రతిబింబిత చైతన్యము పరాదేవి బింబభూతమైన ఈశ్వరచైతన్యము యొక్క స్వరూపమై వెలుగొందుచుండును. ఆ రీతిగా ఈశ్వరచైతన్య స్వరూపిణియై యుండి, జగన్మాత ప్రపంచసృష్టి, స్థితి, లయములను ప్రేరేపించుచుండును. ఆజ్ఞా మాత్రము చేతనే సర్వమును నిర్వహించుచుండునని యర్థము. ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తుల యందును, ఆవరణ, విక్షేపశక్తుల యందును ప్రతిఫలించిన చైతన్యస్వరూపిణియై భావి సృష్టి కార్యమున కనుకూలమైన ప్రారబ్ధమునకు - అనగా ఫలము నిచ్చుట కారంభమైన పురాకృత కర్మకు - అధ్యక్షుడైన పరమేశ్వరుని యొక్క ఈక్షణ (ఆలోచన) మను పేరుగల వ్యాపారరూపమైన ప్రకాశము కలదై భాసిల్లుచుండునని భావము. ఈశ్వరప్రేరణను, అనగా ఈశ్వరాజ్ఞను అతిక్రమించకసృష్టి, స్థితి, లయరూపకార్యమును నిర్వహించుచు, ఈశ్వరపత్నిగా, మిక్కిలి ఈశ్వరివశవర్తినియై యుండునదగుటం జేసి, లలితాపరాభట్టారిక 'ఈశ్వరప్రేరణకరీ' యను నామముతో ఉపాసకులచే ధ్యానింపబడుచున్నది.

## ౫౭౫. ఈశతాండవసాక్షిణీ

శం. భా. ఈశతాండవసాక్షిణీ । ఈశస్య తత్పదవాచ్యార్థస్య తాండవం నర్తనప దప్రయత్నసంపాద్యం లీలామాత్ర మిత్యర్థః, జగత్సర్జనాదిరూపా క్రియా చలనరూప

కర్మత్వసామాన్యాత్; తస్య సాక్షిణీ అసంసర్గప్రకాశ రూపిణీత్యర్థః; "అసంగో నహి సజ్జతే" ఇతి శ్రుతేః ॥

అథవా, ఈశతాండవస్య పరమేశ్వరనృత్య నాట్యాభి వ్యంజిత చతుఃషష్టికలోపదేశస్య సాక్షిణీ । తదుక్తమ్ — "నర్తనాద్ధి పరేశస్య చతుః షష్టికలాజనిః" ఇతి। ప్రదోషస్తోత్రే ఈశతాండవ నర్తనవర్ణన మతిస్ఫుటమితి నేహ లిఖ్యతే ॥
ఓం ఈశతాండవ సాక్షిణ్యై నమః ॥

అం. వి. 'తత్' పదవాచ్యార్థమైన పరమేశ్వరుని యొక్క తాండవనృత్యము వలె అప్రయత్నముగా సంపా దింపదగిన లీలావిశేషమని యర్థము, ఏలన, జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయాది రూపమైన క్రియ చలనరూపకర్మత్వ సామాన్యద్యోతకము; పరమేశ్వరి యీ తాండవమునకు — అనగా, జగత్సర్జనాది క్రియకు-సాక్షిభూతురాలై యుండును, సంగవర్జితయై ప్రకాశరూపిణియై యుండును. "అసంగో నహి సజ్జతే" - 'నిస్సంగయైన పరాశక్తి సృష్టమైన జగత్తుతో సంగము లేక కేవలసాక్షి మాత్రమై యుండు' నని శ్రుతి యుద్ఘోషించుచున్నది.

పక్షాంతరమున-ఈశతాండవమునకు-అనగా పరమేశ్వ రుని నృత్యనాట్యాదులచేత అభివ్యంజితమైన అరువదినాలుగు కళలయొక్క యుపదేశమునకు సాక్షిణియై జగన్మాత వర్తిలు చుండును. "నర్తనాద్ధి పరేశస్య చతుఃషష్టికలాజనిః" —

'పరమేశ్వరుని నాట్యము వలన అరువదినాలుగు కళలు (విద్యలు) ఉద్భవించిన' వని ప్రదోష స్తోత్రము నందు ఈశ్వర తాండవనర్తనము విస్పష్టముగా వర్ణింపబడినది. ఆ కారణముచేత, ఇచట వివరించుట లేదు. ఈశ తాండవోపదేశమునకు సాక్షిణియై యుండునది గాన పరమేశాని 'ఈశతాండవసాక్షిణీ' యని సంకీర్తితుగాలగుచున్నది.

## ౫౮. ఈశ్వరోత్సంగనిలయా

శం. భా. ఈశ్వరోత్సంగనిలయా। ఈశ్వరస్య స్వభర్తుః ఉత్సంగః ఊరూ తౌ నిలయః యస్యాః సా తథా ॥ ఓం ఈశ్వరోత్సంగనిలయాయై నమః ॥

ఆం. వి. తనభర్త యగు కామేశ్వరునియొక్క యూరువులే (తొడలే) నివాసస్థానముగాగలది గాన, జగన్మాత యగు కామేశ్వరికి శ్వరోత్సంగనిలయా' యను నామ మనర్థము.

## ౫౯. ఈతిబాధావినాశినీ

శం. భా. ఈతిబాధావినాశినీ । ఈతిబాధా దైవాద్యుపద్రవః; క్షుద్ర జంతుపీడా వా; తాం వినాశయతీతి తథా ॥ ఓం ఈతిబాధావినాశిన్యై నమః ॥

ఆం. వి. ఈతిబాధలనగా, దైవికముగా సంభవించెడి అతివృష్టి, అనావృష్టి మొదలయిన యుపద్రవములు, క్షుద్ర

కీటకాదుల వలన కలిగెడి బాధలు; తాదృశములైన యుప ద్రవములను నశింపజేయునది గాన, శ్రీ లలితాపరాభట్టారిక 'ఈతిబాధావినాశినీ' యను నామముతో ధ్యాతవ్య యగుచున్నది.

విశే :- "అతివృష్టి రనావృష్టిః శలభా మూషకాః శుకాః ।
ప్రత్యాసన్నాశ్చ రాజానః షడేతే ఈతయః స్మృతాః ॥"

అని యభియుక్తవచనము. అతివృష్టి, అనావృష్టి, మిడుతల బాధ, ఎలుకల వలన బాధ, చిలుకల వలన బాధ (చెట్టు కాయలను, పండ్లను చిలుకలు కొరికివేయుట) ప్రత్యాసన్ను లైన (సమీపస్థులైన) రాజులు (పాలకులు) ఈ యారు బాధలను ఈతిబాధలని పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ ఈహావిరహితా చేశశక్తి రిషత్స్మితాననా ।
లకారరూపా లలితా లక్ష్మీవాణీనిషేవితా ॥ ౧౩

## ౫౮. ఈహావిరహితా

శం. భా. ఈహావిరహితా । అప్రాప్తప్రాప్తిం ప్రతి ఇచ్ఛా ఈహా, తయా విరహితా; ఆప్తకామత్వాత్ తద్వి రహితేత్యర్థః ॥ ఓం ఈహావిరహితాయై నమః ॥

అం. వి. దొరకని వస్తువుపై నుండెడి కోరికను 'ఊహా' యందురు. పరాదేవికి లభ్యము కాని వస్తువేదియు లేదుగాన, ఆమెకు అట్టి యిచ్ఛయుండదు. ఆమె యాప్తకామ, వస్త్వంతరాపేక్ష లేకయే ఆ పరాదేవి స్వానుభవరూపమైన యానందము స్వరూపముగా గలది. అందుచే పరాభట్టారిక 'ఊహావిరహితా' యనుచు సంకీర్తింపబడుచుండును.

## ౫౯. ఈశశక్తిః

శం. భా. ఈశశక్తిః సర్వజ్ఞత్వాదిస్వరూపసామర్థ్యం యస్యాః సా తథా, "దేవాత్మశక్తిం" ఇతి శ్రుతేః ॥ ఓం ఈశశక్త్యే నమః ॥

అం. వి. ఈశ్వరుని శక్తి గాన, పరాశక్తి ఈశశక్తి యనబడును. సర్వజ్ఞతా; నిత్యతృప్తి, అనాదిబోధ, స్వతంత్రతా, నిత్యమలుప్తతా, అనంతతా యనెడి షడ్విధశక్తులు స్వరూపముగా గలది గాన, మహాత్రిపురసుందరి 'ఈశశక్తిః' యను నామముచే స్తోతవ్య యగుచున్నది. "దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్" అను శ్వేతాశ్వతరోపనిషద్వచనము వలన స్వగుణములచే నిగూఢమైయున్న పారమేశ్వర శక్తియే పరాశక్తి యని తెలియుచున్నది.

## ౬౦. ఈషత్స్మితాననా

శం. భా. ఈషత్స్మితాననా । ఈషత్ స్మితం మందహాసః యస్య తత్ తథా, తాదృగాననం యస్యాః సా తథా;

పర్యాప్తకామత్వేనసర్వదా ప్రసన్నముఖీత్యర్థః। దుఃఖాస్పర్శి పరమానందరూపతయా వా తథా ॥ ఓం ఈషత్స్మితాననాయై నమః ॥

ఆం. వి. ఈషత్ స్మిత మనగా మందహాసము. పరాదేవి ముఖము సదా దరహాసోజ్జ్వలమై వెలుగొందుచుండును గాన, 'ఈషత్ స్మితాననా' యని కీర్తింపబడుచుండును. సర్వవిధము లయిన కామములు ఆ దేవికి అనుభవసిద్ధములు, అందువలన ఆమెకు కోరదగిన కోరిక యనునది యుండదు. కావున, నిరంతరము ప్రసన్నముఖియై యుండునని భావము. దుఃఖస్పర్శ (సంబంధము) లేని పరమానందము స్వరూపముగా గలదగుట వలన గూడ పరమేశ్వరికి 'ఈషత్స్మితాననా' యను నామ మన్వర్థము.

## ౭౧. లకారరూపా

శం. భా. లకారరూపా। రూప్యత ఇతి రూపం మంత్రస్య చతుర్థవర్ణత్వేన జ్ఞాపకం యస్యాః సా తథా ॥ ఓం లకారరూపాయై నమః ॥

ఆం. వి. నిరూపింపబడునది గావున రూప మనబడును. పంచదశీ మహామంత్రము నందలి ప్రథమకూట చతుర్థవర్ణమైన 'ల' కారముచేత జ్ఞాపకము చేయబడునది, ఉపాసింపబడునది గాన, పరమేశ్వరి 'లకారరూపా' యని సంకీర్తనము చేయబడుచున్నది.

## ౬౨. లలితా

శం. భా. లలితా । 'లలితం త్రిషు సుందరమ్' ఇతి వచనాత్ అత్యంత సౌందర్యవతీత్యర్థః । అనుపమ సౌందర్యా వా ॥ ఓం లలితాయై నమః ॥

ఆం. వి. 'లలితం త్రిషు సుందరమ్' అను నిఘంటు వచనము వలన 'లలిత' శబ్దమునకు మూడు లింగములందును 'సుందర' మని అర్థము. కావున, జగన్మాత అత్యంత సౌందర్యవతి, లేక అసమాన సౌందర్యము గలది యగుటచే 'లలితా' యను నామముతో భాసిల్లుచుండును.

## ౬౩. లక్ష్మీవాణీనిషేవితా

శం. భా. లక్ష్మీవాణీనిషేవితా । లక్ష్మీః రమా సర్వైశ్వర్యశక్తిః, వాణీ సరస్వతీ సర్వజ్ఞానశక్తిః, తాభ్యాం నితరాం అకృత్రిమ ప్రేమ్ణా అనన్యభూతా సతీ సేవితా । సేవా నామ ఉన్మీలితాజ్ఞాప్రతీక్షా, తద్వత్త్వాదిత్యర్థః॥ ఓం లక్ష్మీవాణీనిషేవితాయై నమః ॥

ఆం. వి. సర్వైశ్వర్యశక్తియైన లక్ష్మీదేవి, సర్వజ్ఞాన శక్తియైన సరస్వతీదేవి-ఈ యిరువురి చేత మిక్కిలి అవ్యాజ ప్రేమతో అనన్యభూతయై సేవింపబడునది. సేవ యనగా రాబోవు యాజ్ఞకై నిరీక్షించు చుండుట. లక్ష్మీ సరస్వతు లిరువురును పరమేశ్వరి యాజ్ఞకై సదా నిరీక్షించుచుందురు

గాన, ఆ పరాశక్తి 'లక్ష్మీ వాణీనిషేవితా' యను సార్థక నామముతో విరాజిల్లుచుండును.

శ్లో॥ లాకినీ లలనారూపా లసద్దాడిమపాటలా ।
లలంతికాలసత్ఫాలా లలాటనయనార్చితా ॥ ౧౪

## ౬౪. లాకినీ

శం. భా. లాకినీ । "కం సుఖమ్, కం బ్రహ్మ" ఇతి శ్రుతేః, తదనుభవతీ త్యకం, బ్రహ్మాభిన్నతయా ప్రతీయమానం దుఃఖాత్మకం జగత్ అకమ్; లీయత ఇతి లమ్, ఉపలక్షణ ముత్పత్త్యాదేః; లమకమస్యాస్తీతి లాకినీ; అనృత జడ దుఃఖరూప జగత్కారణ తద్వ్యావృత్తస్వరూప బ్రహ్మభూతా ఇత్యర్థః ॥ ఓం లాకిన్యై నమః ॥

ఆం. వి. "కం" అనగా సుఖము. 'కం బ్రహ్మ' యని శ్రుతి. బ్రహ్మభిన్నమైనది, లేక సుఖభిన్నమైనది 'అకం' అనబడును. బ్రహ్మభిన్నముగా ప్రతీయమాన మగుచున్న దుఃఖాత్మక ప్రపంచము 'అకం' అనబడును. లయమొందుచున్నది గావున, 'లం' అనబడును. లయమని చెప్పుట సృష్టిస్థితుల కుపలక్షణము; సృష్టి స్థితి, లయములు గల, దుఃఖరూపమైన ప్రపంచము గలదిగావున పరమేశ్వరి 'లాకినీ' యని స్తుతింపబడుచున్నది. పరమేశ్వరి అనృత, జడ, దుఃఖాత్మక జగత్తుకు కారణభూతురాలు, తత్ప్రపంచవ్యావృత్తస్వరూపమైన (నివర్తకస్వరూపమైన) బ్రహ్మస్వరూపభూతురాలని భావము.

## ౭౫. లలనారూపా

శం. భా. లలనారూపా । రూప్యతే జ్ఞాప్యతే అనేనేతి రూపం జ్ఞాపకం తద్వ్యాప్యలింగం చిహ్నమితి వా, లలనానాం స్త్రీణాం రూపం వేషః ఆభరణాద్యలంకారో వా ఆకృతిర్వా యస్యాః సా తథా, లలనాః స్త్రియః రూపాణి భూతయః యస్యాః సా తథా; "లింగాంకిత మిదం పశ్య జగ దేతద్భగాంకితమ్" ఇతి పురాణవచనాత్ ॥ ఓం లలనారూపాయై నమః ॥

ఆం. వి. నిరూపింపబడునది, జ్ఞాపకము చేయబడునది గాన రూప మందురు. ఆ జ్ఞాపకము చేత వ్యాప్యమైన లింగము, లేక చిహ్నమనిగాని చెప్పనగును. లలనల, అనగా స్త్రీల రూపము - వేషము, లేక ఆభరణాద్యలంకారములు గాని, ఆకృతివిశేషము గాని కలిగియుండునుగాన జగన్మాతకు 'లలనారూపా' యను నామము ప్రసిద్ధము.

లలనావిభూతులు (సంపదలు) కలదగుటం జేసి పరమేశ్వరి 'లలనారూపా' యనబడును. 'ఐశ్వర్యముతో వ్యాప్తమైన ఈ ప్రపంచమంతయు స్త్రీత్వజ్ఞాపకమైన రూపముతో నిండియున్నది' అను పురాణ వచనము వలన పై విషయము స్పష్టమగును.

## ౭౬. లసద్దాడిమపాటలా

శం. భా. లసద్దాడిమపాటలా । దాడిమశబ్దేన వికసితం తత్పుష్పం లక్ష్యతే; లసత్ సద్యోవికసనప్రకాశం చ తద్దాడి

మం చ; ఇదం ఉపలక్షణం బంధూకాదీనాం; తద్వత్పాటలా శ్వేత మిశ్ర రక్తవర్ణ ప్రధానమూర్తిమతీత్యర్థః; "శ్వేతరక్తం తు పాటలమ్" ఇతి వచనాత్ ॥ ఓం లసద్దాడిమపాటలాయై నమః ॥

ఆం. వి. 'దాడిమ' శబ్దము వలన వికసిత దాడిమ పుష్పము (దానిమ్మపువ్వు) అని లక్ష్యార్థము గ్రహింపనగును; 'లసద్దాడిమ' మనగా అప్పుడే వికసించి ప్రకాశించుచున్న దానిమ్మపువ్వు అని యర్థము; ఇది మంకెనపువ్వు మొదలైన పుష్పముల కుపలక్షణము. పరమేశ్వరి సద్యోవికసితమైన దాడిమ పుష్పము వంటి వర్ణముతో విలసిల్లునట్టి శరీరము గలది. అందువలన భక్తులు లలితాపరమేశ్వరిని 'లసద్దాడిమ పాటలా' యను నామముతో అర్చింతురు. "శ్వేతరక్తం తు పాటలమ్" అను వచనము వలన శ్వేతమిశ్ర రక్తవర్ణ ప్రధానమైన వర్ణమును (రంగును) పాటల వర్ణమని తెలియవలయును. జగన్మాత తాదృశ పాటలవర్ణభాసురమైన యాకృతివిశేషము చే వెలుగొందుచుండు నని భావము.

"రక్తశుక్ల ప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః" అను వచన మిచట అనుసంధేయము.

## ౬౭. లలంతికాలసత్ఫాలా

శం. భా. లలంతికాలసత్ఫాలా । లలంతికయా పరితః ముక్తాఫల ఖచితనవరత్నమధ్యయా లలాటమధ్యదేశభూషయా;

ఇద ముపలక్షణం లలాటపట్టాదీనామ్, లసత్ ఫాలం యస్యాః సా తథా ॥ ఓం లలంతికాలసత్ఫాలాయై నమః ॥

ఆం. వి. నవరత్నముల చుట్టును ముత్యములు పొదగబడిన ఆభరణవిశేషమును 'లలంతికా' యందురు; ఆ యాభరణమును స్త్రీలు లలాటమధ్యభాగమునందు అలంకరించు కొందురు. ఇది లలాట పట్టాదుల కుపలక్షణము. 'లలంతికా' యనెడి యాభరణముచే ప్రకాశించుచున్న ఫాలభాగము గలదిగాన, మహాత్రిపురసుందరి 'లలంతికాలసత్ఫాలా' యని స్తుతింపబడుచున్నది.

## ౭౮. లలాటనయనార్చితా

శం. భా. లలాటనయనార్చితా । లలాటే నయనం యేషాం తే; అత్ర లలాటశబ్దేన భ్రూమధ్యం లక్ష్యతే; నయనశబ్దేన జ్ఞానమపి; తథాచోర్ధ్వదృష్టిభిః ఖేచరీముద్రయా విలీనచిత్తైః అపి వరుణాయో ర్మధ్యదేశాభిధానావిముక్తకృత పరమేశ్వరారాధనపర పురుషప్రాప్యత్వాభిధాయకాత్రిప్రశ్నోత్తర జాబాలశ్రుతిగత యాజ్ఞవల్క్యోత్తరవాక్యనిర్దిష్ట భూమికా జయసిద్ధిమత్పురుషైః అర్చితా సాక్షాత్కృతేత్యర్థః।

అథవా, తృతీయ నేత్రవతా శివేన, తత్స్వరూప రుద్రైర్వా పూజితేత్యర్థః ॥ ఓం లలాటనయనార్చితాయై నమః ॥

ఆం. వి. లలాటము నందు నేత్రము గలవారు లలాట నయనులు; ఇట లలాట శబ్దముచే భ్రూమధ్య ముపలక్షిత మగును; నయన శబ్దముచేత జ్ఞానము సయితము సూచితము; ఖేచరీముద్ర చేత చిత్తవృత్తులను లయింపజేసినవారిని ఊర్ధ్వ దృష్టిగల వారని యందురు. అసి, వరుణా అనెడి నదులకు మధ్యనున్న ప్రదేశమునకువారణాసి, అవిముక్తక్షేత్రమని పేరు; అట్టి యవిముక్త క్షేత్రము నందు ఊర్ధ్వదృష్టి గల సాధకులు పరమేశ్వరారాధనాతత్పరులై యుందురు; తాదృశపరమేశ్వ రారాధనా నిష్ఠులకు ప్రాప్యత్వమును (పొందదగినతత్త్వమును) జాబాలశ్రుత్యంతర్గతములైన అత్రి; యాజ్ఞవల్క్య ప్రశ్నోత్తర వాక్యము లుపదేశించును; తాదృశ వాక్యముల యందు నిర్దిష్టమైన భూమికాజయమును సాధించిన సిద్ధ పురుషులచేత అర్చింపబడునది, సాక్షాత్కరించు కొనబడునది గావున, శ్రీ రాజరాజేశ్వరి 'లలాటనయనార్చితా' యను దివ్య నామముచేత గానము చేయబడును.

అథవా, త్రినేత్రుడైన శివునిచేతను, తద్రూపులైన రుద్రులచేతను అర్చింపబడునది గాన, 'లలాటనయనార్చితా' యను నామము పరమేశ్వరి యందన్వర్థము.

విశే :- భ్రూమధ్యము నందు దృష్టిని నిలిపి, శిరస్సున ప్రాణము నుంచి మనస్సును వృత్తిరహితముగ జేసిన, 'తానే

పరమాత్మ' యనునట్టి యనుభూతి కలుగునని శ్రీ హర్షాదుల యనుభవప్రకాశము.

శ్లో॥ లక్షణోజ్జ్వలదివ్యాంగీ లక్షకోట్యండనాయికా ।
లక్ష్యార్థా లక్షణాగమ్యా లబ్ధకామా లతాతనుః॥ ౧౫

## ౭౫. లక్షణోజ్జ్వలదివ్యాంగీ

శం. భా. లక్షణోజ్జ్వలదివ్యాంగీ । దీవ్యతే ప్రకాశత ఇతి దివ్యం । లక్షణైః స్వరూప తటస్థనామకైః ఉజ్జ్వలం శోభితం శుద్ధం అంగం స్వరూపం విగ్రహో వా। ఘృతకాఠిన్య భావేన "తదాత్మానం స్వయ మకురుత" ఇతి శ్రుతేః సచ్చిదానందఘనీభూత జీవాత్మకో విగ్రహో యస్యాః సా తథా ।

అథవా, సాముద్రిక శాస్త్రోక్త దివ్యలక్షణై రుజ్జ్వలాని సంపూర్ణాని దివ్యాని యాని అంగా న్యవయవాః శిరఃపాణ్యా దయః అస్యాః సంతీతి వా తథా ॥ ఓం లక్షణోజ్జ్వల దివ్యాంగ్యై నమః ॥

ఆం. వి. ప్రకాశించునది గాన దివ్యము; స్వరూప లక్షణము, తటస్థ లక్షణము -ఈ రెండింటిచేత శోభించుచున్న నిర్మలమైన స్వరూపము, లేక విగ్రహము కలదగుట వలన జగజ్జనని 'లక్షణోజ్జ్వలదివ్యాంగీ' యని సాధకులచే భావనీయ యగుచున్నది. ఘృతము తాను కరగి, తాను గడ్డకట్టి యుండును; ఆ న్యాయము ననుసరించియు, "తదాత్మానం

స్వయ మకురుత" - ఆ చైతన్యము తనను తాను స్వయముగా నిర్మించుకొనెను' అను శ్రుతివచనము ననుసరించియు సత్ చిత్ ఆనందములు ఘనీభవించినజీవ రూప శరీరము గలదగుటం జేసి పరాదేవత 'లక్షణోజ్జ్వలదివ్యాంగి' యని యుపాసకులచే భజనీయురాలగుచున్నది.

అథవా, సాముద్రికశాస్త్రమునందు వివరించిన లక్షణ ములచేత ఉజ్జ్వలములు, దివ్యములు నయిన శిరఃపాణ్యాద్యవ యవములు గలది గాన ఈనామము పరమేశ్వరియందన్వర్థము.

విశే :- లక్షణము ద్వి విధము 1. స్వరూప లక్షణము. 2. తటస్థ లక్షణము. స్వరూపమేవ లక్షణం స్వరూపలక్షణమ్ స్వరూపమే లక్షణముగా గలది స్వరూపలక్షణము. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యను శ్రుతిచే ప్రతిపాదింపబడిన బ్రహ్మ లక్షణములు బ్రహ్మయొక్క స్వరూప లక్షణమని వేదాంత మర్యాద.

ఏ లక్షణము, లక్ష్యము ఎంతకాలముండునో అంతవరకు ఉండక, కొంతకాలము మాత్రమే యుండి, అన్య పదార్థముల నుండి యా లక్ష్యమును వేరు చేయునట్టి లక్షణమును తటస్థ లక్షణ మందురు జగత్తు యొక్క సృష్టి స్థితి లయ కారణ త్వము సృష్ట్యారంభమునందే యుండును. ప్రళయసమయమున ప్రపంచమే యుండదు గనుక, తత్కారణత్వము బ్రహ్మ యందు ఉండదు. జగత్సృష్టిస్థిత్యాదికారణత్వము బ్రహ్మతి

రిక్తమైన వస్తువునం దుండుట యసంభవము. కనుక ఈ తటస్థ లక్షణము బ్రహ్మను, అన్య వస్తువుల నుండి పృథక్కరించును. కనుక జగజ్జన్మాది కారణత్వము బ్రహ్మ యొక్క తటస్థ లక్షణము అని తెలియనగును.

## ౭౦. లక్షకోట్యండనాయికా

శం. భా. లక్షకోట్యండనాయికా । లక్షాణిచ కోట్యశ్చ అసంఖ్యాతా పరిమితానీత్యర్థః, సంసారస్యానాదిత్వేన భూత భవిష్యదాదిభేదేన బహుసంఖ్యావత్త్వ మండానామ్; తాని చ తాన్యండాని చ హిరణ్యగర్భ విరాడ్రూపాణి సమష్టివ్యష్ట్యాత్మనా విశ్వ తైజసోపాధిభూతాని; తేషా మధిష్ఠానబింబ చైతన్యాత్మనా నయతి స్వసత్తా మాపాదయతీతి నాయికా ॥
ఓం లక్షకోట్యండనాయికాయై నమః ॥

ఆం. వి. లక్షలు కోట్లు, అనగా అసంఖ్యాకములు, అపరిమితములు నయిన బ్రహ్మాండము లని యర్థము; సంసారము అనాది; కావున, భూతకాలము నందు లయించిన బ్రహ్మాండములు, భవిష్యత్తులో సృజనీయములగు బ్రహ్మాండములు అనెడి భేదము వలన బ్రహ్మాండములకు బహు సంఖ్యాసత్త్వ ముపపన్నము. త్రికాలస్థితము లయిన యండములు, అనగా హిరణ్యగర్భ విరాడ్రూపములు, సమష్టివ్యష్ట్యాత్మకములు నగు విశ్వతైజసోపాధిభూతములు. ఈ సమస్త బ్రహ్మాండములకు అధిష్ఠానమైన బింబచైతన్య రూపముతో

స్వీయసత్తను ఆ బ్రహ్మాండముల కాపాడించునట్టిది గాన, పరమేశ్వరి 'లక్షకోట్యండనాయికా' యని సంకీర్తింపబడు చున్నది.

## ౭౧. లక్ష్యార్థా

శం. భా. లక్ష్యార్థా । లక్షణయా శోధనయా జహదజహల్లక్షణయా యా ప్రతిపాద్యతే వేదాంతమహావాక్యానాం యోఽర్థః తత్స్వరూపా ।

అథవా, యోగశాస్త్రప్రసిద్ధ బహిరంత రూర్ధ్వాధః ప్రదేశవిశేషరూపభూమికాసు స్వస్వ మనోవాంఛావిషయ విశేషణత్వేన వా మనోవిలయరూప హఠ రాజయోగాది సాధన పరిపాకవశేన సాక్షాత్కృతం చైతన్యం లక్ష్య ఇత్యుచ్యతే; అర్థ్యతే యాచ్యతే గురుం ప్రతి ఇతి అర్థః; లక్ష్యో యోఽర్థః చిత్స్వరూప పరమానందరూపః సోఽపి సైవేతి తథా; "బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ" ఇతి శ్రుతేః॥ ఓం లక్ష్యార్థాయై నమః॥

ఆం. వి. జహదజహల్లక్షణావృత్తిచేత "తత్త్వమసి" ఇత్యాది వేదాంత మహావాక్యములకు ఏ యర్థము ప్రతిపాదింపబడు చున్నదో, అట్టి శోధితార్థము స్వరూపముగా గలది గాన మహాత్రిపురసుందరి 'లక్ష్యార్థా' యని గానము చేయబడుచున్నది.

అథవా, యోగశాస్త్ర ప్రసిద్ధములైన బాహ్యాభ్యంతర ఊర్ధ్వాధోభూమికా విశేషములయందు తమ తమ మనో వాంఛా విషయములకు విశేషణత్వము చేతగాని, నిర్గుణత్వము చేతగాని అమనస్క (మనోవిలయ) రూపమైన హఠయోగ రాజయోగాది సాధనములచేత పరిపక్వ మగుట వలన సాక్షాత్కృతమైన చైతన్యము లక్ష్యమని చెప్పబడును; గురూపసదనము జేసి అర్థింపబడునది - యాచింపబడునది గాన అర్థము; చైతన్యరూపమైనది పరమానందస్వరూపము, అదియే లక్ష్యార్థము; ఆ లక్ష్యార్థమైన సచ్చిదానందస్వరూపము గూడ ఆ పరమేశ్వరియే గాన, 'లక్ష్యార్థా' యని సంకీర్తిత యగుచున్నది. "బ్రహ్మైవేద మమృతం పురస్తా ద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ"-ఇది యంతయు అమృతస్వరూపమైన బ్రహ్మయే ఎదుట బ్రహ్మ, వెనుక బ్రహ్మ, దక్షిణ పార్శ్వమున బ్రహ్మ, ఉత్తర పార్శ్వమున బ్రహ్మయే, సర్వం! బ్రహ్మమయ మని శ్రుతి చెప్పుచున్న గావున పరమేశ్వర నిత్యానపాయిని యగు లలితాపరాభట్టా రిక సాక్షాత్తు బ్రహ్మస్వరూపిణి యని భావము.

## ౭౨. లక్షణాగమ్యా

శం. భా. లక్షణాగమ్యా । లక్షణా నామ శక్యార్థే వాచకస్య పదస్య అన్వయాద్యనుపపత్త్యా తత్సంబంధి పదార్థాంతరజ్ఞానహేతుః శబ్దవృత్తిత్యుచ్యతే; తస్యా వాచ్య

వాచక తత్సంబంధాది భేదజ్ఞానపూర్వికాయాః పరిచ్ఛిన్న సావయవ పదార్థసంబంధ జ్ఞానహేతోః కేవలచిన్మాత్రే నిరు పాధికే వస్తుని షష్ఠీజాత్యాత్యాదీనాం లక్ష్యతావచ్ఛేదక ధర్మాణా మభావే ప్రవృత్త్యయోగాత్, తయా అగమ్యా; గంతుం జ్ఞాతుం యోగ్యం గమ్యం, తన్నభవతీ త్యగమ్యా। వేదాంతమతే జహదజహ ల్లక్షణయా విశేషణమాత్రపరిత్యా గస్య అన్యోన్య తాదాత్మ్యనుపపత్త్యా బోధితత్వాత్ తదర్థం సా అవశ్య మంగీకర్తవ్యా। విశేష్యస్య జ్ఞానస్వరూపత్వేన నిత్యతయా లక్షణాజన్యత్వాత్ తదర్థం సా న అపేక్ష్యత ఇతి భావః। తథా చ ప్రకృతాయా దేవతాయాః శుద్ధచైతన్య మాత్రస్వరూపతయా స్వయంప్రకాశత్వేన లక్షణాగోచర త్వాత్ లక్షణాగమ్యేతి నామ యుక్తమితి భావః॥ ఓం లక్షణా గమ్యాయై నమః॥

ఆం. వి. శక్యార్థము-నందు-అభిధాశక్తిచేత చెప్పబడు నట్టి యర్థము నందు వాచకమైన శబ్దమునకు ప్రకరణము ననుసరించి అన్వయాదు లుపపన్నములు కావు, అపుడు ప్రకర ణానుగుణముగా తత్సంబంధితమైన (వాచకపదమునకు సంబం ధించిన) యర్థాంతరమును చెప్పవలసియుండును. ఆ యన్యార్థ జ్ఞానమునకు హేతువు, శక్యార్థ సంబంధాదులు గల పదము వలన కలుగునట్టి పదార్థాంతరజ్ఞానమునకు హేతువు నయిన శబ్దవృత్తి లక్షణావృత్తి యనబడును; ఆ లక్షణావృత్తికి వాచ్య వాచక భేదజ్ఞానము, తత్సంబంధాది భేదజ్ఞానముండును. అట్టి

లక్షణావృత్తి పరిచ్ఛిన్నము, సావయవమగు పదార్థసంబంధ జ్ఞానమునకు హేతువగును; తాదృశమైన లక్షణావృత్తి కేవల చిన్మాత్రము, ఉపాధిరహితము నగు బ్రహ్మవస్తువునందు ప్రవర్తింపజాలదు; ఏలన నిరుపాధిక చిన్మాత్ర వస్తువు నందు లక్ష్యతావచ్ఛేదక ధర్మములు, అనగా లక్ష్యత్వమును విభజించునట్టి ధర్మములైన వ్యక్తి, జాత్యాది ధర్మములకు ప్రవృత్తి లేదు; కావున, పరమేశ్వరి యీ లక్షణావృత్తిచేత అగమ్య, అనగా పరాదేవత లక్షణావృత్తి ద్వారా తెలిసికొనుటకు వీలు లేనిదని భావము. కావున, శ్రీచక్రనగర మహా సమ్రాజ్ఞి 'లక్షణాగమ్యా' యనునట్టి యన్వర్థ నామముతో వెలుగొందుచుండును.

అద్వైత వేదాంతము నందు జహదజహల్లక్షణ ద్వారా తత్ త్వం పదార్థములకు అన్యోన్యతాదాత్మ్యము ప్రసక్తము కానందున విశేషణమాత్ర పరిత్యాగము చెప్పబడును. అందు వలన లక్షణావృత్తి యవశ్య మంగీకరింపనగును. విశేష్యము జ్ఞానరూపము, నిత్యము, లక్షణచేత తెలిసికొనదగినది కాదు గనుక, లక్షణావృత్తి యపేక్షితము గాదని భావము. కాగా, ప్రకృతము చెప్పబడుచున్న పరమేశ్వరి కేవల శుద్ధచైతన్య స్వరూపిణి, లక్షణావృత్తిచేత అగోచరము నగుట వలన ఆ జగన్మాతను 'లక్షణాగమ్యా' యను నామముతో స్తుతించుట యుక్తమే.

విశే :- లక్షణావృత్తి మూడు విధములు జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ. శబ్దముయొక్క శక్యార్థము (వాచ్యార్థము) లక్ష్యార్థము నందు అంతర్భావము చెందక, అన్యార్థము ప్రతీయమానమైనపుడు దానిని జహల్లక్షణ యందురు. "విషం భుంక్ష్వ" - విషమును భక్షించుము. ఈ వాక్యమునందలి పదముల వలన విషభక్షణ రూపమైన వాచ్యార్థజ్ఞానము కలుగదు. 'శత్రుగృహము నందు భుజించకుము' అనెడి భోజననివృత్తిరూప లక్ష్యార్థము ప్రతీయమాన మగును. కావున ఇది జహల్లక్షణ యనబడును.

వాచ్యార్థమును త్యజించకయే యన్యార్థ ప్రతీతి (లక్ష్యార్థప్రతీతి) కలిగినపుడు అజహల్లక్షణ చెప్పనగును. "శుక్లో ఘటః" — 'తెల్లని కుండ' అను వాక్యము నందు శుక్ల శబ్దము తన శుక్లగుణరూప స్వార్థమును (వాచ్యార్థమును) శుక్లగుణ విశిష్ట ద్రవ్య (ఘట) రూప లక్ష్యార్థము నందు అంతర్భావితము చేసియే, శుక్ల గుణముగల ఘట రూపార్థములో లక్షణావృత్తితో లక్ష్యార్థప్రతీతిని కలిగించును. ఇది అజహల్లక్షణకు ఉదాహరణము.

ఏ వాక్యము నందు విశిష్టవాచక శబ్దము విశేషణ రూపమైన ఏకదేశమును (ఏకభాగమును) వదిలిపెట్టి విశేష్య రూపమైన ఏకదేశము యొక్క ప్రతీతి కలుగునో, అచట

జహదజహల్లక్షణ చెప్పబడును. "తత్త్వమసి" 'ఆబ్రహ్మవు నీవే' యను అభేద బోధకమైన వాక్యము నందు అజహదజహల్లక్షణ చెప్పినగాని, జీవబ్రహ్మలకు ఐక్యము చెప్పుట పొసగదు. ఏలన, సర్వజ్ఞత్వాది ధర్మవిశిష్టమైన ఈశ్వరచైతన్యము 'తత్' శబ్దమునకర్థము; 'త్వం' శబ్దమునకర్థము అంతఃకరణోపాధి విశిష్టము, అల్పజ్ఞము నయిన జీవచైతన్యము. సర్వజ్ఞ ఈశ్వరచైతన్యమునకు అల్పజ్ఞజీవచైతన్యమునకభేదము చెప్పుట అనుపపన్నము కావలసి వచ్చును. అందువలన ఇట్టి స్థలములందు అజహదజహల్లక్షణ అవశ్య మంగీకరింపవలసి యుండును. వాస్తవమునకు జీవబ్రహ్మలకు భేదము లేదు. అభేదమును సాధించుటకై యీ పదములందలివిశేషణాంశములను (సర్వజ్ఞ అల్పజ్ఞరూప విశేషణాంశములను) వదలి విశేష్య భాగమును గ్రహింపనగును. అపుడే శ్రుతిసంమతముగా జీవబ్రహ్మలకభేదము ఉపపన్నమగును. ఇట్టి లక్షణావృత్తి ద్వారా లక్ష్యార్థము (జీవబ్రహ్మైక్యము) సిద్ధించును. ఈ లక్షణావృత్తిని జహదజహల్లక్షణ యనియు భాగత్యాగలక్షణ యనియు చెప్పుదురు.

## ౭3. లబ్ధకామా

శం. భా. లబ్ధకామా । లబ్ధాః కామ్యంత ఇతి కామాః ఐహికాముష్మిక సుఖసాధనాని, లక్షణయా తజ్జన్య సుఖాని వా, తథాభూతాః కామాః యయా సా తథా; పర్యాప్త కామేత్యర్థః, "పర్యాప్తకామస్య కృతాత్మనస్తు ఇహైవ

సర్వే ప్రవిలీయంతి కామాః" ఇతి శ్రుతేః॥ ఓం లబ్ధకామాయై నమః ॥

ఆం. వి. కామ్యంత ఇతి కామాః — కోరబడునవి గాన, కామములనబడును. ఐహిక ఆముష్మిక సుఖసాధనములు, లేక లక్షణావృత్తితో తెలియునట్టి తజ్జన్య సుఖములు గాని, కామములని పేర్కొనబడును. తాదృశ కామము లన్నియు పొందినది గాన, పరాదేవి 'లబ్ధకామా' యని కీర్తింపబడు చుండును; పర్యాప్తకామ, అనగా సంపూర్ణమైన కామములు గలదని యర్థము. "పర్యాప్తకామస్య కృతాత్మనస్తు" అనుచు 'పూర్ణకాముడు, కృతాత్ముడు అనగా అపరోక్ష ఆత్మసాక్షాత్కారము పొందినవానికి సర్వ కామములు ఈ లోకము నందే విలయము నందును' అని శ్రుతి యుద్ఘోషించుచుండుట వలన పరమేశ్వరి 'లబ్ధకామా'యనుట సముపపన్నము.

## ౮౪. లతాతనుః

శం. భా. లతాతనుః । లతా ఇవ లతాః కల్పాది వల్లయః సకలపురుషార్థప్రదత్వేన జగతి ప్రసిద్ధాః; తా ఇవ సుకుమారత్వాద్యాశ్రయా తనుః మూర్తిః యస్యాః సా తథా ॥ ఓం లతాతనవే నమః ॥

ఆం. వి. తీగల వంటి తీగలైన కల్పలతాదులు లోకమున సకల పురుషార్థప్రదములుగా ప్రసిద్ధములు. కల్పలతాదుల వలె సౌకుమార్యాదులకు ఆశ్రయమైన శరీరము, లేక

యాకృతి గలదగుటం జేసియూ తల్లి 'లతాతనుః' అను నామముతో స్తవనీయ యగుచున్నది.

శ్లో॥ లలామరాజదళికా లంబిముక్తాఫలాంచితా ।
లంబోదరప్రసూ ర్లభ్యా లజ్జాఢ్యా లయవర్జితా॥ ౧౬

## ౭౫. లలామరాజదళికా

శం. భా. లలామరాజదళికా । లలామ్నా కస్తూరీ తిలకేన కస్తూరీపత్రేణ వా రాజత్ విభ్రాజత్ పరమశోభి అలికం లలాటం యస్యాః సా తథా ॥ ఓం లలామరాజదళికాయై నమః ॥

ఆం. వి. కస్తూరీ తిలకముచే గాని, కస్తూరీ పత్ర రచన చేతగాని ప్రకాశించుచున్న, పరమ శోభాకరమైన యళికము (లలాటము) గలది గాన పరమేశాని 'లలామరాజదళికా' యనుచు సంకీర్తిత యగుచున్నది. అళిక మనగా కనుబొమల పై భాగమందుండు ముఖభాగము.

## ౭౬. లంబిముక్తాలతాంచితా

శం. భా. లంబిముక్తాలతాంచితా । లంబిన్యః లంబమానాః అధఃప్రసృతాః ముక్తాలతాః హారాః ముక్తాఫలాని వా యస్యాః సా తథా । నవరత్నఖచిత సువర్ణముక్తాగుచ్ఛైః సర్వాంగేషు ప్రలంబమానైః లలాటపర్యంతం లంబమాన కిరీటప్రథమభాగ లలాటపట్టనాసాగ్ర తాటంకాధఃకర్ణ దేశ కంఠప్రదేశ హస్తచతుష్టయాంగద సమానప్రదేశ కూర్పాస

పరితఃపదకాగ్రదేశ కటినిబద్ధ కాంచ్యాదిషు పరిలంబమానైరిత్యర్థః ॥ ఓం లంబిముక్తాలతాంచితాయై నమః ॥

ఆం. వి. క్రిందికి వ్రేలాడుచున్న ముత్యాల జాలరులు లేక ముక్తాఫలములు (ముత్యములు) గలదిగాన లలితాత్రిపుర సుందరి 'లంబిముక్తాలతాంచితా' యను నామముతో విభ్రాజితయై యొప్పారుచుండును. సర్వావయవముల యందు నవరత్న జడితములైన సువర్ణాంచిత ముక్తాఫలగుళుచ్ఛములు వ్రేలాడుచున్నవి, ఆ ముత్యముల గుత్తులు లలాటభాగము వరకు వ్రేలాడుచున్న కిరీట ప్రథమ భాగమైన ముఖపట్టిక వరకు వ్రేలాడుచున్నవి; ఇంతియే గాదు, దేవియొక్క నాసాగ్ర భాగము, తాటంక (చెవికమ్మ) విరాజిత కర్ణాధఃప్రదేశము, కంఠప్రదేశము, నాలుగు చేతుల యందుండు అంగదములు (భుజకీర్తులు), మోచేతులకు పైన ఉన్నరైక యంచులయందు వెలుగొందునట్టి దండకడియముల ప్రదేశము, కటినిబద్ధము లయిన కాంచ్యాది ఆభరణముల (కటి ప్రదేశమున ధరించునట్టి ఒడ్డాణము మొదలైన యాభరణముల) వఱకు ముత్యాల జాలరులు వ్రేలాడుచున్నవి. అట్టి ముక్తాహారములతో పరమేశ్వరి విరాజిల్లుచున్నదని భావము.

## ౭౭. లంబోదరప్రసూః

శం. భా. లంబోదరప్రసూః । లంబోదరస్య మహాగణేశస్య ప్రసూః జనయిత్రీ మాతేత్యర్థః । లంబోదరం ప్రసూత ఇతి వా ॥ ఓం లంబోదరప్రసువే నమః ॥

ఆం. వి. లంబోదరు డనగా మహాగణపతి. ఆయన తల్లి యని యర్థము, లేక లంబోదరుని కనినదిగాన, జగన్మాతకు 'లంబోదరప్రసూః' అను నామము ప్రసిద్ధము.

## ౬౮. లభ్యా

శం. భా. లభ్యా । సంసారదశాయా మావరకాజ్ఞానేన స్ఫుట మప్రకాశమానా సతీ శ్రవణాదిసంస్కృతాంతఃకరణ వృత్తా వఖండాకార జ్ఞానభూమికాయాం ప్రతిఫలితస్వరూపేణ విస్మృత కంఠగత కనకభూషణవత్ ప్రాప్తప్రాప్తిరూప తయా లబ్ధుం యోగ్యేతి తథా ॥ ఓం లభ్యాయై నమః ॥

ఆం. వి. సాధకుడు లోకవ్యవహారము నందున్నపుడు ఆవరకమైన అజ్ఞానము వలన పరాశక్తి ప్రస్ఫుటముగా ప్రకటము గాదు; స్పష్ట ప్రకాశము లేనిదయ్యు, ఆమె శ్రవణ మన నాదులచే సుసంస్కృతమైన అంతఃకరణవృత్తి యందు, అఖండాకారజ్ఞానభూమిక యందు ప్రతిబింబిత స్వరూపముతో విస్మరింపబడిన కంఠాలంకృత సువర్ణాభరణము వలె ప్రాప్తమైన వస్తువే ప్రాప్తమైనట్లు పొందుటకు తగినదిగాన, 'లభ్యా' యను నామము శ్రీదేవి యందు సర్వథా యన్వర్థము.

## ౬౯. లజ్జాఢ్యా

శం. భా. లజ్జాఢ్యా । లజ్జయా, ఉపలక్షణ మంతఃకరణ ధర్మాణాం సర్వేషామ్, ఆఢ్యా తద్వత్త్వేన ఆకారవతీత్యర్థః ।

తిరోధానాదినా అంతర్హితా సతీ వరాది ప్రయచ్ఛతీతి లజ్జాఢ్యా భవతీతి చ ఉపచర్యతే ॥ ఓం లజ్జాఢ్యాయై నమః ॥

ఆం వి. లజ్జ అంతఃకరణ ధర్మములన్నింటికి ఉపలక్షణము. లజ్జ మొదలైన సమస్త అంతఃకరణధర్మములతో కూడిన ఆకారము కలదని యర్థము. తిరోధానాది శక్తుల చేత అంతర్హితురాలై భక్తులకు వరము, అభయము మున్నగు సంపదల నొసంగవలసి వచ్చెనుగదా యని దేవి తనకు తానే సిగ్గు పడును. అజ్ఞానావరణము తొలగని కారణముచేత భక్తులకు దేవి సాక్షాత్కారము కలుగదు. అట్టి సాధకులకు కరుణరసార్ద్రమూర్తియై పరోక్షముగ నుండియే వరాదుల నొసంగుచుండును. పరోక్షముగ వరాదుల నొసంగుటకు ఆ తల్లి సిగ్గు పడును. ఆ కారణము చేత 'లజ్జాఢ్యా' యను నామము దేవికి ప్రసిద్ధము.

## ౮౦. లయవర్జితా

శం. భా. లయవర్జితా । "అవినాశీ అరేఽయ మాత్మా అనుచ్ఛిత్తిధర్మా" ఇత్యాది శ్రుతేః, లయో వినాశః రహితా వర్జితేత్యర్థః । ఇద ముపలక్షణం షడ్భావవికారాణామ్; "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతేః ॥ ఓం లయవర్జితాయై నమః ॥

ఆం, వి. "అవినాశీ వా అరేఽయ మాత్మా అనుచ్ఛిత్తిధర్మా" — 'ఈ ఆత్మ అవినాశి, ఉచ్ఛేద ధర్మరహితము'

అను శ్రుతివచనానుసారము దేవి లయరహిత - నాశరహిత యని భావము. లయవర్జిత యనునది శరీరమునందు కలిగెడి 'అస్తి, జాయతే, వర్ధతే విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి' యను షడ్భావ వికారముల కుపలక్షణము. అనగా పరమేశ్వరి షడ్భావవికారరహిత యని భావము. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యను శ్రుతి ప్రమాణమును బట్టి పరమేశ్వరి 'లయవర్జిత' యని స్పష్టమగును.

శ్లో॥ హ్రీంకారరూపా హ్రీంకారనిలయా హ్రీంపదప్రియా ।
హ్రీంకారబీజా హ్రీంకారమంత్రా హ్రీంకారలక్షణా॥

## ౮౧. హ్రీంకారరూపా

శం. భా. హ్రీంకారరూపా । హ్రీంకారః రూప్యతే నిరూప్యతే నిర్దేశ్యత ఇతి రూపః; మంత్ర పంచమావయవః యస్యాః సా తథా ॥ ఓం హ్రీంకారరూపాయై నమః ॥

ఆం. వి. హ్రీంకారము నిరూపింపబడుచున్నది, లేక నిర్దేశింపబడుచున్నదిగాన, హ్రీంకార రూపము, పంచదశీ మంత్ర ప్రథమ కూటము నందలి అయిదవ యవయవము లేక బీజాక్షరముగ గలది గాన శ్రీత్రిపురసుందరి 'హ్రీంకారరూపా' యను నామముతో స్తవనీయ యగుచున్నది.

## ౮౨. హ్రీంకారనిలయా

శం. భా. హ్రీంకారనిలయా । హ్రీం మక్షరం నిలయః గృహావ దపచ్ఛేదకం యస్యాః సా తథా। స్వీయ వాచక

త్త్వారోపిత వాచ్యతావచ్ఛేదక ధర్మావచ్ఛిన్నతాది సంపాద నేన గృహవర్తి పురుషవత్ వ్యావృత్తస్వరూపేణ జ్ఞాపకం భవతి। అన్యథా నామ్నో వాచ్యార్థే ప్రవృత్త్యయోగాదితి భావః ॥ ఓం హ్రీంకారనిలయాయై నమః ॥

ఆం. వి. 'హ్రీం' అనెడి యక్షరము నిలయముగా గలది - గృహమువలె అవచ్ఛేదకముగా గలది గాన, పరా భట్టారిక 'హ్రీంకారనిలయా' యని ఖ్యాతనొంద యగుచున్నది. పరాదేవి సర్వాంతర్యామిణియై యుండునదైనను, హ్రీం కారము ఆతల్లికి ముఖ్యనివాసస్థానము గనుక 'గృహమువలె' యని యుపమానము చెప్పబడినది. స్వీయవాచకత్వమునందు ఆరోపింపబడిన వాచ్యతావచ్ఛేదక ధర్మములచేత అవచ్ఛిన్న తాదులను (భేదాదులను) పొందుట వలన, అనగా వ్యావృత్తమయ్యు, భిన్నముగా గోచరించుచున్నదనెడి ధర్మభేదము వలన గృహము నందున్న పురుషునివలె వ్యావృత్తస్వరూపముతో-ఇతర ధర్మముల కంటె భిన్నమైన ధర్మముతో హ్రీంకారము జ్ఞాపక (సూచక) మగుచున్నది. అటుల కాని యెడల వాచకమైన పదమునకు వాచ్యార్థము నందు ప్రవృత్తి యే యుండదని భావము.

## ౮౩. హ్రీంపదప్రియా

శం. భా. హ్రీంపదప్రియా। పద్యతే గమ్యతే జ్ఞాయతే అనేనేతి పదమ్; పద్యతే గమ్యతే ప్రాప్యత ఇతివా పదమ్;

హ్రీంకారస్య మంత్రావయవతయా తద్దేవతాప్రకాశకత్వేన తస్యాం శక్తత్వాత్ — 'శక్తం పదమ్' ఇతి తల్లక్షణాత్ తథా ప్రథమం వ్యాఖ్యానమ్ । హకార రేఫేకారానుస్వారాణాం వర్ణానాం సమష్టిస్వరూపేణ సముదాయాత్మకత్వాత్ 'వర్ణసముదాయః పదమ్' ఇత్యపి పదలక్షణవత్త్వ మస్య ఘటతే । పురశ్చర్యావతాం స్వదేవతాసాక్షాత్కారద్వారా సకలపురుషార్థప్రాపకత్వాత్ ద్వితీయ వ్యాఖ్యానం తథా కృతమ్ । తస్మిన్ ప్రియా ప్రీతిమతీత్యర్థః ॥ ఓం హ్రీంపద ప్రియాయై నమః ॥

ఆం. వి. 'పద్యతే' అనగా దేనిచేత తెలిసికొనబడు చున్నదో అది 'పద' మనబడును, లేక దేనిచేత పొందబడు చున్నదో, అది పదము, హ్రీంకారము మంత్రావయవము' హ్రీం బీజము తద్దేవతాప్రకాశకముగా పరదేవత యందు శక్తమై యున్నది. 'శక్తం పదమ్' అని పదలక్షణము గాన, పై రీతిగా మొదటి (జ్ఞాయతే - తెలిసికొనబడుచున్నదను) వ్యాఖ్యానము చేయుబడినది. హకార. రేఫ, ఈకార, అనుస్వార వర్ణములు సమష్టిగా సముదాయాత్మక మగుటవలన 'వర్ణసముదాయము పదము' అను పదలక్షణవత్త్వము ఈ హ్రీం బీజమునకు ఉపపన్నమగును. మంత్రపురశ్చర్య చేయునట్టి యుపాసకులకు స్వేష్టదేవతాసాక్షాత్కారము ద్వారా సకల పురుషార్థముల నొసంగునదగుట వలన రెండవ వ్యాఖ్యానము (ప్రాప్యతే - పొందబడుచున్నదను వ్యాఖ్యానము)

చేయబడినది. ఆ హ్రీం బీజము నందు ప్రీత్యతిశయము గల దగుటంజేసి జగన్మాత యగు దేవికి 'హ్రీంపదప్రియా' యను నామ మన్వర్థము.

## ౧౫౪. హ్రీంకారబీజా

శం. భా. హ్రీంకారబీజా । హ్రీంకార ఏవ బీజం స్వవాచకమంత్రభాగః, "జ్ఞాపకం దేవతానాం యత్ బీజ మక్షర ముచ్యతే" - ఇతి వచనాత్, హ్రీంకారస్య మాయా ప్రకాశకత్వేన, వటధానాదిః స్వనిష్ఠ వృక్షాభివ్యంజకత్వేన కారణతయా యథా బీజ మిత్యుచ్యతే - సత్కార్యవాదినా మవ్యక్త నామరూపకారణం బీజమ్. అభివ్యక్త నామరూపా త్మకం పశ్చాద్భావి కార్య మిత్యంగీకారః; సకల కారణసమ వధానే విశేషనామరూపవత్తయా కారణస్యాభివ్యక్తి రుత్పత్తిః, తథా చ ఉక్తబీజస్య మాయావచ్ఛిన్న చైతన్యాభివ్యంజ కత్వేనాపి బీజత్వమ్; తాదృశం హ్రీంకారబీజం యస్యాః సా తథా ॥ ఓం హ్రీంకారబీజాయై నమః ॥

ఆం. వి. పరాదేవికి హ్రీంకారమే బీజము, అనగా స్వవాచక (తనను చెప్పునట్టి) మంత్రభాగము, "జ్ఞాపకం దేవ తానాం యత్ బీజ మక్షర ముచ్యతే" - 'దేవతా జ్ఞాపకమైన యక్షరము బీజ మని చెప్పబడును' అను వచనము వలన హ్రీం బీజము పరమేశ్వరీజ్ఞాపకమని తెలియనగును. హ్రీం కారము మాయాప్రకాశక మగుట వలన వటబీజము (మఱ్ఱి

గింజ) స్వనిష్ఠ (తనయందున్న) వృక్షాభివ్యంజక కారణత్వము చేత బీజ మని యెట్లు చెప్పబడునో, యటులనే మాయాప్రకాశక హ్రీంకారము బీజ మని చెప్పబడును. సత్కార్యవాదులు అవ్యక్త నామరూపముల యొక్క కారణమును బీజమందురు. అటులనే, భవిష్యత్తులో జరుగునట్టి అభివ్యక్త నామరూపాత్మకమైన జగత్తును కార్యమని యంగీకరింతురు. సకల కారణ సమవధానమునందు (ఒక చోటికి ప్రోగైనపుడు) విశేష నామ రూపములు గల కారణాభివ్యక్తి ఉత్పత్తి యనబడును; కాగా, పైన పేర్కొనబడిన హ్రీం బీజము మాయావచ్ఛిన్నమైన చైతన్యమున భివ్యంజక మగుటవలన గూడ దానికి బీజత్వము సంగతమగును. తాదృశ హ్రీం బీజము పరమేశ్వరీవాచకము గాన, 'హ్రీంకారబీజా' యనుచు దేవీగుణ సంకీర్తనము చేయ బడుచున్నది.

## ౨౫౧. హ్రీంకారమంత్రా

శం. భా. హ్రీంకారమంత్రా । హ్రీంకారస్య మననాత్ త్రాయతే రక్షతి వాచ్యవాచకయో రభేదాదితి తథా । హ్రీంకార ఘటితో మంత్రో వా యస్యాః సా ఇతి వా తథా ॥ ఓం హ్రీంకారమంత్రాయై నమః ॥

ఆం. వి. హ్రీంకారవాచ్య పరమేశ్వరి; పరమేశ్వరీ వాచక బీజము హ్రీంకారము. వాచ్యవాచకములకు (పర దేవతకు హ్రీం బీజమునకు) అభేదము గనుక, హ్రీం బీజ

మునన వలన భక్తులను రక్షించునది గాన, పరాదేవి 'హ్రీంకారమంత్రా' యని స్తోతవ్యురాలగుచున్నది.

అథవా, హ్రీంకార ఘటితమైన మంత్రము గలదగుట వలన 'హ్రీంకారమంత్రా' యను నామము ఆ తల్లికి అన్వర్థము.

## ౧౯. హ్రీంకారలక్షణా

శం. భా. హ్రీంకారలక్షణా । హకారః శివః, ఆకాశబీజత్వా దాకాశవన్నిర్లేపః, రేఫః వహ్నిబీజం కార్యోత్పాదన సంనిహితశక్తిమ దీశ్వరవాచకమ్; తథా చ హకారయుక్త రేఫః శుద్ధచైతన్యమేవ కారణతావచ్ఛిన్న మితి వదతి । ఈకారః మన్మథబీజం తత్కారణలక్షకతయా స్థితిహేతు విష్ణురూప చైతన్య మభిదధాతి । అనుస్వార స్తస్మిన్నేవ పదార్థే అభిన్ననిమిత్తోపాదానే లయం వక్తి । తథా చ హ్రీమిత్యుక్తే జగదుత్పత్తి స్థితి లయ కారణం చైతన్యం శక్త్యా వాచ్యార్థః ప్రతీయతే । తస్యైవోపాధిపరిత్యాగరూపలక్షణం యస్యాః సా తథా । హ్రీంకారః లక్షణం తటస్థలక్షణం యస్యాః సేతి వా తథా ॥ ఓం హ్రీంకారలక్షణాయై నమః ॥

ఆం. వి. హకారమనగా శివుడు; 'హ' వర్ణము ఆకాశబీజము, అందువలన శివుడు ఆకాశమువలె అన్యవస్తుసంగము లేనివాడు, రేఫ అగ్నిబీజము, ప్రపంచ రూపమైన కార్యసృష్టికి సంనిహితమైన శక్తిగల యీశ్వరుని చెప్పునట్టిది; కాగా, హ

కారముతో కూడిన రేఫ వర్ణము శుద్ధచైతన్యమే కారణతా వచ్ఛిన్నమని (కారణత్వము పొందియున్నదని) చెప్పెను. కామబీజమైన 'ఈ' కారము తనకు కారణమైనదానిని లక్షణా వృత్తితో స్థితికి హేతువైన విష్ణురూపచైతన్యమును చెప్పెను; అనుస్వారము అభిన్ననిమిత్తోపాదాన కారణమైన యీ పదార్థము నందే (ఆ చైతన్యమునందే) లయమును చెప్పెను. ఈ రీతిగా చెప్పగా, హ్రీం బీజమును ఉచ్చరించినపుడు జగత్తు యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారణమైన చైతన్యము అభిధాశక్తిచేత వాచ్యార్థము ప్రతీయమానమగును. ఆ చైతన్యము యొక్క ఉపాధిపరిత్యాగమైన లక్షణమే పరమేశ్వర నిత్యానపాయినియైన భగవతికి గలదు గాన, 'హ్రీంకార లక్షణా' యనుచు గాయమాన యగుచున్నది. హ్రీంకారము తటస్థ లక్షణముగా (సృష్టి, స్థితి, లయకర్తృత్వరూప లక్షణముగా) గలదిగాన, జగన్మాత 'హ్రీంకారలక్షణా' యని స్తుతింపబడుచున్నది.

శ్లో॥ హ్రీంకారజపసుప్రీతా హ్రీంమతీ హ్రీంవిభూషణా ।
హ్రీంశీలా హ్రీంపదారాధ్యా హ్రీంగర్భా హ్రీం
పదాభిధా ॥ ౧౮

## ౮౭. హ్రీంకారజపసుప్రీతా

శం. భా. హ్రీంకారజపసుప్రీతా । హ్రీంకారస్య జపః హ్రీంకారజపః తేన సుప్రీతా ॥ ఓం హ్రీంకారజపసుప్రీతాయై నమః ॥

ఆం. వి. హ్రీంబీజ జపముచేత సంతుష్టురాలై భక్తుల ననుగ్రహించునది గాన దేవికి 'హ్రీంకారజపసుప్రీతా' యను నామము ప్రసిద్ధము.

## ౨౨. హ్రీంమతీ

శం. భా. హ్రీంమతీ । వాచకత్వేన లక్షకత్వేన వా లక్ష్యపదార్థరూపేణ వా వాచ్యవాచకయోరభేదేన వా అస్యా అస్తీతి హ్రీంమతీ ॥ ఓం హ్రీంమత్యై నమః ॥

ఆం. వి. అభిధాశక్తిచేత గాని, లక్షణావృత్తి చేతగాని, లక్ష్యమైన పదార్థరూపముతో గాని, వాచ్యవాచకముల కభేదముచేత గాని హ్రీంకారము గలదిగాన, పరమేశ్వరి 'హ్రీం మతీ' యను నామముతో స్తవనీయ యగుచున్నది.

## ౨౩. హ్రీంవిభూషణా

శం. భా. హ్రీంవిభూషణా । కేవల జడ మాయా వాచకః హ్రీంకారః, తథాఽపి హకారః శ్వేతవాచకః, రేఫః లోహితార్థకః, ఈకారః నీలార్థకః; తథా చ విశిష్టస్య శుక్ల రక్త నీలవత్పదార్థవాచకతయా సత్త్వ రజస్తమోగుణాత్మక త్రిప్రకృతివాచకత్వేన పరిచ్ఛిన్న అనృత జడ దుఃఖస్వరూప వాచ్యార్థకతయా ప్రకాశరాహిత్యేన అనుపాదేయతాయాం సత్యాం తదవచ్ఛిన్న స్వప్రకాశ చైతన్యాకారతయా విశిష్టార్థస్య ఆపాదమస్తకభూషిత తరుణీవత్ ఆనందస్వరూపతయా

తద్వాచక హ్రీంపదస్య అష్టైశ్వర్యసిద్ధిప్రధాన శక్త్యాథాయక తయా శోభాయమానం భూషణవత్. 'కుండలీ పురుషః' ఇత్యత్ర కుండలస్యోపలక్షణతయా ఇతర సజాతీయాది వ్యావర్తకత్వమ్, తథాఽస్యాపి బీజస్యేతరవ్యావృత్త వాచ్యార్థగోచర ప్రభాజనకత్వేన భూషణవత్ యస్యాః సా తథా ॥ ఓం హ్రీం విభూషణాయై నమః ॥

ఆం. వి. హ్రీంకారము కేవల జడ మాయావాచకము. హ్రీంకారము మాయా బీజమని సంప్రదాయము. హకారము శ్వేతవర్ణమును, రేఫ అరుణ వర్ణమును, ఈకారము నీల వర్ణమును చెప్పును. కాగా, హ్రీం బీజము తెలుపు, ఎరుపు, నలుపు రంగులు గల పదార్థమును తెలుపునట్టి బీజాక్షరమని తెలియవలయును. అందువలన, హ్రీం పదము సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతిని చెప్పునట్టి బీజాక్షరము. ఆ కారణముచేత పరిచ్ఛిన్న, అనృత, జడ, దుఃఖస్వరూప వాచ్యార్థము కలదగుటచేతను, ప్రకాశరాహిత్యముచేతను ఉపాదేయము కాకపోవుచున్నది. అందువలన, పరదేవత తదవచ్ఛిన్నమైన (మాయావచ్ఛిన్నమైన) స్వప్రకాశచైతన్యమే స్వరూపముగా గలది కావున, విశిష్టార్థమునకు (మాయావచ్ఛిన్న చైతన్యమునకు) ఆపాదమస్తకము ఆభరణాదులతో అలంకృతమైన తరుణివలె ఆనందస్వరూపమగుటచేత తద్వాచకమైన హ్రీంకారము అణిమాది అష్ట ఐశ్వర్యసిద్ధుల నొసగు శక్తిని కలిగించునదగుటచేత శోభాధాయకమైన భూషణము

వంటిది. 'కుండలీ పురుషః' - 'కర్ణ కుండలములు గలపురుషుడు' అను స్థలమునందు కుండలములు ఉపలక్షణమగుటచేత ఇతర సజాతీయాది ధర్మములను నివర్తింపజేయును. ఆ రీతిగా, ఈ హ్రీంబీజముకూడ ఇతరవస్తు నివర్తకము, వాచ్యార్థగోచరము ప్రకాశజనకము అగుటచేత భూషణము వలె పరమేశ్వరికి శోభాధాయకమై యుండును. అనగా, జడచైతన్యములకు పరమేశ్వరి భూషణమై విరాజిల్లుచున్నది యని భావము, అందువలన శ్రీచక్రసమ్రాజ్ఞి 'హ్రీం విభూషణా' యనుచు భక్తులచే సంస్తవనీయ యగుచున్నది.

## ౯౦. హ్రీంశీలా

శం. భా. హ్రీంశీలా । హ్రీ మిత్యనేన తద్వాచ్యార్థాః బ్రహ్మ విష్ణు రుద్రాః లక్ష్యంతే, తేషాం శీలం స్వభావః పారమార్థికం రూపం సచ్చిదానందాత్మకతయా యస్యాః సా తథా; తన్నిష్ఠధర్మాః సత్త్వరజస్తమోగుణాదయో వా యస్యాః సా తథా; 'శీలం స్వభావే ధర్మే చ' ఇతి వచనాత్॥ ఓం హ్రీంశీలాయై నమః ॥

ఆం. వి. 'హ్రీం' అను బీజాక్షరముచేత బ్రహ్మవిష్ణు రుద్రులు లక్షణయా పరిలక్షితు లగుదురు. ఆ మూర్తి త్రయము యొక్క శీలము - స్వభావము సచ్చిదానందాత్మక

మైన పారమార్థికరూపము గలది. అందుచేత దేవియొక్క గుణ సంకీర్తనము 'హ్రీంశీలా' యని చేయబడుచున్నది.

తన్నిష్ఠ (హ్రీంబీజమునందున్న) ధర్మములైన సత్త్వ, రజస్తమో గుణాదులు గలది గాన, పరమేశ్వరి 'హ్రీంశీలా' యని చెప్పబడును. 'శీలం స్వభావే ధర్మే చ' - 'శీల శబ్దము స్వభావమును, ధర్మమును చెప్పును. అను వచనప్రమాణము వలన పై వివరణము సంగతమని తెలియనగును.

## ౯౧. హ్రీంపదారాధ్యా

శం. భా. హ్రీంపదారాధ్యా । హ్రీంపదేన ఏకాక్షర బీజమంత్రేణ ఆరాధితుం యోగ్యా తథా । "హ్రీంకారేణైవ సంసిద్ధో భుక్తిం ముక్తిం చ విందతి" ఇతి భువనేశ్వరీకల్పవచనాదితి యావత్ ॥ ఓం హ్రీంపదారాధ్యాయై నమః ॥

ఆం. వి. 'హ్రీం' అనునట్టి యేకాక్షరబీజ మంత్రముతో ఆరాధింపదగినది గాన, పరమేశ్వరి 'హ్రీంపదారాధ్యా' యని ప్రస్తూయమాన యగుచున్నది. "హ్రీంకారేణైవ సంసిద్ధో భుక్తిం ముక్తిం చ విందతి" యనుచు భువనేశ్వరీకల్పవచనము 'హ్రీంకార జపము వలన సిద్ధిని పొందిన యుపాసకుడు ఐహిక భోగములను, మోక్షము ననుభవించు' నని చెప్పుచున్నది.

విశే :- శ్రీ శంకరులు పంచదశీవర్ణమాలాస్తవములో

"హ్రీం హ్రీ మితి ప్రతిదినం జపతాం తవాఖ్యాం
కిం నామ దుర్లభ మిహ త్రిపురాధివాసి ।"

'హే త్రిపురసుందరి ! త్వద్వాచకమైన హ్రీం బీజమును ప్రతి దినము జపించువారలకు ఈ లోకమున దుర్లభమైనది ఏమి యుండును' అని హ్రీం బీజాక్షర మహత్త్వమును ముక్త కంఠముతో చాటినారు.

శ్రీహర్షుడు 'ఆద్యంతము లందు ప్రణవమును జేర్చి హ్రీం బీజమును జపించిన (ఓం హ్రీం ఓం), చింతామణి మంత్రమగుననియు, తన్మంత్రజాపకుడు మూర్ఖుని మస్తకము పై హస్తముంచిన, అతడు మహాకవి యగుననియు చెప్పి హ్రీంబీజ మహత్త్వఖ్యాపనము చేయుట గమనార్హము.

## ౯౨. హ్రీంగర్భా

శం. భా. హ్రీంగర్భా । హ్రీం శబ్దార్థాః సగుణ మూర్తయ స్త్రిస్రః గర్భే స్వస్వరూపే సశక్తికాః అవినా భావసంబంధేన యస్యాః సా తథా, "మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహమ్" ఇతి వచనాత్ ॥ ఓం హ్రీంగర్భాయై నమః ॥

ఆం. వి. హ్రీం శబ్దార్థములు. సగుణమూర్తులునయిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మువ్వురు స్వస్వరూపము నందు (గర్భము నందు) స్వీయ శక్తిసహితులై అవినాభావ సంబంధముతో ఆ పరాదేవతాస్వరూపము నందు ఉందురు

గాన, జగన్మాత 'హ్రీంగర్భా' యని స్తుతింపపబడుచున్నది. "మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్" — స్వీయ మాయ - త్రిగుణాత్మిక ప్రకృతి సర్వభూతసృష్టికి కారణభూతురాలు, సర్వ కార్యముల కంటె మహత్త్వ సంపన్నగాన, ఆ ప్రకృతియే (యోనిః) మహద్బ్రహ్మ, ఆ బ్రహ్మమే సర్వ ప్రపంచ సృష్టికి కారణము; ఆ మహత్తత్త్వ బ్రహ్మయందు - యోనియందు హిరణ్యగర్భుని జన్మకు కారణమైన బీజమును నిక్షేపించుచున్నాను' అని గీతావచనము వలన తెలియుచున్నది.

## ౯౩. హ్రీంపదాభిధా

శం. భా. హ్రీంపదాభిధా । హ్రీంకారః అభిధా నామ యస్యాః సా తథా । సమష్టిరూపాయాః సమష్టిశబ్దవాచ్యత్వ నియమా దిత్యభిసంధిః ॥ ఓం హ్రీంపదాభిధాయై నమః ॥

ఆం. వి. హ్రీంకారము నామముగాగలది గాన, దేవి 'హ్రీంపదాభిధా' యని ప్రస్తుతింపబడును. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల సమష్టిరూపమైన పరమేశ్వరిని సమష్టివాచకమైన 'హ్రీం' బీజమే చెప్పవలయునని నియమము.

శ్లో॥ హ్రీంకారవాచ్యా హ్రీంకారపూజ్యా హ్రీంకార
పీఠికా ।
హ్రీంకారవేద్యా హ్రీంకారచింత్యా హ్రీంశరీరిణీ ॥

## ౯౪. హ్రీంకారవాచ్యా

శం. భా. హ్రీంకారవాచ్యా । మాయోపాధిక బ్రహ్మణి కల్పితధర్మేణ శబ్దప్రవృత్త్యుత్పత్తేః హ్రీంపదస్య వాచ్యా రూఢ్యేత్యర్థః ॥ ఓం హ్రీంకారవాచ్యాయై నమః ॥

ఆం. వి. మాయ ఉపాధిగా గల బ్రహ్మచైతన్యము నందు (ఈశ్వరుని యందు) కల్పితమైన ధర్మముచేత శబ్ద ప్రవృత్తి కలుగుచున్నందున, వాచకమైన హ్రీంకారమునకు వాచ్యార్థయగుటంజేసి అనగా రూఢ్యర్థయగుట వలన 'హ్రీం కారవాచ్యా' యను నామము శ్రీ లలితాపరాభట్టారిక యందు రూఢమని గ్రహింపనగును.

## ౯౫. హ్రీంకారపూజ్యా

శం. భా. హ్రీంకారపూజ్యా । 'మూలమంత్రేణ పూజ యేత్' ఇతి పూజాంగత్వేన మూల మనో ర్వినియోగః శ్రూయతే । మూలమనుశ్చ దేవతయాః స్వకం నామేతి వచ నాత్ । అంతర్ముఖానామేవ మంత్రశాస్త్రేషు తన్నామ్నా వ్యుత్పన్నత్వాత్ । హ్రీంకారం నమోఽంత ముచ్చార్య యథాగురుసంప్రదాయం శ్రీచక్రాదౌ మూలదేవతా పూజ నీయే త్యాగమరహస్యాత్ హ్రీంబీజేనైవ పూజయితుం యోగ్యా । అతిప్రియ బీజనామత్వా దిత్యభిప్రాయః ॥ ఓం హ్రీంకారపూజ్యాయై నమః ॥

ఆం. వి. 'మూలమంత్రేణపూజయేత్' -' మూలమంత్రముతో పూజించవలయును' అను వచనము ననుసరించి పూజాంగముగా మూలమంత్ర వినియోగము వినబడు చున్నది. దేవతయొక్క స్వీయ నామమే మూలమంత్రమని యాగమవచనము. అంతర్యాగము చేయునట్టి యంతర్ముఖులకే యీ నామమువలన మంత్రశాస్త్రముల యందు వ్యుత్పత్తి కలుగుచున్నది. కావున, నమోఽంతముగా హ్రీంకారము నుచ్చరించి, అనగా 'హ్రీం నమః' యని ఉచ్చరించి గురు సంప్రదాయానుసారము శ్రీచక్రాదుల యందు మూలదేవత పూజింపదగియున్నదని యాగమరహస్యము; కావున, పరమేశ్వరి హ్రీం బీజము చేతనే పూజింపదగినది. ఏలన, హ్రీం బీజము పరాభట్టారికకు మిక్కిలి ప్రియమైన నామ మని యభిప్రాయము.

## ౯౭. హ్రీంకారపీఠికా

శం. భా. హ్రీంకారపీఠికా। అత్ర పీఠశబ్దః ఆధార లక్షకః। వాచ్యార్థో హి వాచకశబ్దస్య సత్తాప్రదత్వేన ఆధారో భవతి। మంత్రదేవతయోః అభేదేఽపి అర్థనిష్ఠమహిమ్నః తద్వాచకపదేఽదృశ్యమానత్వాత్ కల్పితభేదం సంపాద్య ఇద ముచ్యతే। హ్రీంకారస్య పీఠికా ప్రవృత్తిస్థానం శక్త్యా గోచరతయా విషయీభూతేత్యర్థః। ఓం హ్రీంకారపీఠికాయై నమః॥

ఆం. వి. ఇట పీఠ శబ్దము ఆధారమును సూచించును. వాచ్యార్థమే వాచక శబ్దమునకు సత్త్వాప్రదము గనుక, ఆధారమగును: మంత్రమునకు, దేవతకు భేదము లేకపోయినను, అర్థనిష్ఠమైన మహిమ తద్వాచక పదమునందు గోచరించదు; కావున భేదమును కల్పనచేసి ఈవిషయము చెప్పబడుచున్నది. హ్రీంకారమునకు ఆధారమైనది, అనగా వ్యుత్పత్తిస్థానమైనది అని శక్తిచేత గోచరించుట వలన పరమేశ్వరి 'హ్రీంకారపీఠికా' యను నామమునకు విషయముగా అయినదని యర్థము.

## ౯౭. హ్రీంకారవేద్యా

శం. భా. హ్రీంకారవేద్యా । స్వరూపతః నిర్గుణబ్రహ్మతయా అజ్ఞానవిషయత్వాశ్రయత్వాభ్యాం అప్రాప్త పురుషార్థరూపతయా సంసారదశాయాం ప్రతీయమానత్వాత్ గురూపసదన శ్రవణాదిరూప విధ్యప్రామాణ్యనిరాసాయ లక్షణయా శుద్ధస్వరూపపరమానందతయా ప్రేప్సితత్వాత్ శ్రవణాదిజన్య వృత్తివ్యాప్యత్వరూప వేదనావిషయత్వమ్ "బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తి రితీర్యతే", "మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాామ్" ఇత్యాదివచనాత్ భగవతాఽప్యంగీకృతమితి । హ్రీంకారేణ గురుముఖోద్భూతేన వేద్యా వేదితుం యోగ్యా । తత్స్వరూప పరిజ్ఞానద్వారా తత్ప్రాప్తిరూప పురుషార్థహేతుత్వాదితి తాత్పర్యమ్ ॥ ఓం హ్రీంకారవేద్యాయై నమః ॥

ఆం. వి, స్వరూపముతో పరమేశ్వరి నిర్గుణబ్రహ్మ స్వరూపిణి యగుట వలన, అజ్ఞానమునకు విషయము, ఆశ్రయము నగుట వలన పరమ పురుషార్థమైన మోక్షప్రాప్తి సిద్ధించును; అందువలన సంసారదశయందు ఆమె భాసించు చున్నది; కావున, గురూపసదన (గురువు నాశ్రయించుట) శ్రవణ మననాదిరూపమైన విధియొక్క యప్రామాణ్య శంకా నిరాసము కొఱకు, లక్షణావృత్తితో శుద్ధబ్రహ్మరూపమైన పరమానందముగా ఆ దేవి పొంద నభిలషణీయురాలగుచున్నది: కావున శ్రవణాది జన్యమైన వృత్తిజ్ఞానము ద్వారా వృత్తి వ్యాప్యత్వరూపమైన (వ్యాపించుటరూపముగా గల) జ్ఞానమునకు విషయమగుటను "బ్రహ్మణ్యజ్ఞాననాశాయవృత్తివ్యాప్తి రితీర్యతే" - 'ప్రత్యగాత్మయందు బ్రహ్మవిషయకమైన అజ్ఞాన నాశము వృత్తివ్యాప్తి యని చెప్పబడును', "మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం" - 'నన్నే సర్వాత్మనా ధ్యానము చేయువారు ఈ మాయను తరించుదురు' మొదలైన వచనముల వలన భగవానుడు అంగీకరించెను. ఈ రీతిగా సగుణబ్రహ్మోపాసన చేత అజ్ఞానము నశించునని తెలియు చున్నది. గురుముఖము నుండి యుద్భూతమైన హ్రీంకారము చేత పరమేశ్వరి తెలిసికొనబడదగినది. బ్రహ్మస్వరూపము యొక్క పరిజ్ఞానము ద్వారా బ్రహ్మావగతిరూపమైన పురుషార్థమునకు పరమేశ్వరి కారణభూతురాలని భావము.

## ౯౮. హ్రీంకారచింత్యా

శం. భా. హ్రీంకారచింత్యా । అస్య బీజస్య పంచ ప్రణవాంతర్గతత్వేన ఓంకారభేదే బ్రహ్మప్రతీకత్వావిశేషాత్। ప్రణవే యథా పరాపరబ్రహ్మోపాసన హేతు వదస్మిన్ వా ప్రతీకే తద్భవతీతి వికల్పః । యదా భక్తిః పార్థక్యేన మంత్ర విశేషేషుభవతీతి యోగవేదమార్గరహస్యం న వాదజల్పాద్యవ కాశః । హ్రీంకారే ఉభయవిధ బ్రహ్మస్వరూపతయా చింతి తుం యోగ్యా। ధ్యానస్య సాక్షాత్కారం ప్రతి ఆరాదుప కారకత్వేన ధ్యాతవ్యేత్యర్థః ॥ ఓం హ్రీంకార చింత్యాయై నమః ॥

ఆం. వి. ఈ హ్రీం బీజము పంచప్రణవములలో ఒకటి ఓంకార భేదములో ఒకటి యగుట వలన ఈ బీజము కూడ బ్రహ్మప్రతీక యగుటలో భేదములేదు. ప్రణవమునందు పరా పరబ్రహ్మోపాసన (హేతుత్వనిర్గుణస గుణ బ్రహ్మోపాసనా కారణత్వ) మున్నటుల, హ్రీంబీజమునందు నయితముపరాపర బ్రహ్మోపాసన హేతుత్వమున్నదని వికల్పము. మంత్రవిశే షములయందు భక్తి వేఱువేఱుగానుండునను యోగవేదమార్గ రహస్యమును తర్కించుటకు, అపలాపము చేయుటకు నవ కాశము లేదు. హ్రీంకారము ఉభయవిధ (పరాపర) రూప మైన బ్రహ్మస్వరూపముగా ధ్యానించదగినది. మంత్రదేవతా

సాక్షాత్కారమునకు ధ్యానము, దగ్గరి యుపాయ మగుట వలన పరమేశ్వరి ధ్యాతవ్య యని భావము.

## ౯౯. హ్రీం

శం. భా. హ్రీం । హృఞ్ హరణే ఇతి ధాతుపాఠాత్ సమస్త విద్యైశ్వర్యప్రదానాదిశక్త్యాఽఽరోపాధిష్ఠానత్వే సతి అపవాదావశేషిత పరమానందరూపముక్తి రిత్యర్థః ॥ ఓం హ్రీం నమః ॥

ఆం. వి 'హృఞ్ హరణే' అను ధాతుపాఠము వలన హ్రీం బీజము సమస్త విద్య ఐశ్వర్యప్రదానాది సామర్థ్యారోపణమునకు అధిష్ఠానమై యున్నది. కాగా, అపవాదశాస్త్రముచే మిగిలిన పరమానందరూపమైన ముక్తి యని హ్రీంకారమున కర్థము. తాదృశ హ్రీంబీజ స్వరూపమే పరదేవత యని భావము.

విశే :- "పాణిన్యనూదిత హృఞో హృదభూత్
క్విపేదం హ్రీ శ్శక్తి స్తత్ర చాత్ర పురుషో
హరి రావిరాసీత్ తత్రాద్యయేన హరః
క్షమి నిరాకృతి స్సా వైచిత్ర్యసంధిత
మిహైకమహాదుకూలమ్ ॥"

హృఙ్ ధాతువును పాణిన్యాచార్యు లనువదించిరి గాని, ఆ ధాతువును సృష్టించలేదు. హృఙ్ ధాతువుకు క్విప్ ప్రత్యయము చేర్చగా 'హృత్' అను రూపము నిష్పన్నమైనది. హృత్ అనగా హృదయము. హ్రీ స్త్వత్-'హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ' అను శ్రుతి వాక్యము ననుసరించి 'హ్రీం' అనునది లక్ష్మీదేవికి గూడ ఉపలక్షణము. హృదయము నుండి యుద్భవించిన 'హ్రీః' అనుశక్తియే పురుషరూపముతో హరిగానావిర్భవించెను. ఆ హరిరూపము నుండి రెండు అకారములతో గూడిన 'హర' రూప ముదయించినది. హరిహర రూపములకు అద్వైత భావముతో అభేదము చెప్పబడినది. ఆ 'హర' శబ్దము నుండి రెండు అకారములు తీసివేసి 'ఈం' అను బీజమును కలిపిన, నిర్గుణమైన శుద్ధవిద్యాశక్తి 'హ్రీం' అని తెలియును. అది వైచిత్ర్యయుక్తము, ఏకైకము నయిన మహోదుకూలము (వస్త్రము) అహో, ఆశ్చర్యము!

వాచకమైన శబ్దమునందు సర్వదేవతాస్వరూపమైన వైచిత్ర్యము కన్పట్టుచున్నది. తద్వాచ్యార్థమైన స్వరూపము నందు నానారూపత్వమున్నట్లు కన్పడుచున్నది. శ్రవణ మననాదుల ద్వారా విచారణ చేయువారికి శబ్దార్థముల రెండింటి యందు ఏకత్వ భావమే గాని, భేదము గోచరించదు. కావున, హ్రీంకారము సగుణ నిర్గుణ బ్రహ్మవాచకమని భావము. ఒకే సద్వస్తువు నానాత్వముతో, ఏకత్వముతో భాసించుచుండుట యాశ్చర్యము.

## ౧౮౮. హ్రీంశరీరిణీ

శం. భా. హ్రీం శరీరిణీ । మూలమంత్రాత్మికేతి యావత్ । హ్రీమేవ శరీరం మూర్తి రస్యా అస్తీతి హ్రీం శరీరిణీ ॥ ఓం హ్రీంశరీరిణ్యై నమః ॥

ఆం. వి. హ్రీంశరీరిణీ యనగా మూలమంత్రాత్మికా యని భావము. హ్రీం బీజమే శరీరముగా గలది గాన, దేవి 'హ్రీంశరీరిణీ' యని స్తోతవ్య యగుచున్నది.

శ్లో॥ హకారరూపా హలధృక్పూజితా హరిణేక్షణా ।
హరప్రియా హరారాధ్యా హరిబ్రహ్మేంద్రవందితా ॥

## ౧౮౯. హకారరూపా

శం. భా. హకారరూపా । హకారః రూపం స్వరూప మపి యస్యాః సా; మూలవిద్యావాచ్యార్థవాచకం యస్యాః సా తథా ॥ ఓం హకారరూపాయై నమః ॥

ఆం. వి. పంచదశీ విద్యయందలి యారవ యక్షరమైన 'హ' వర్ణము స్వరూపముగా గలది గాన, దేవికి 'హకార రూపా' యని సార్థక నామము; మూలవిద్య (పంచదశీ మహా విద్య) యొక్క వాచ్యార్థమైన పరమేశ్వరీతత్త్వమునకు వాచకమైన హ్రీంబీజము గలది గాన, పరాశక్తి 'హకార రూపా' యని స్తూయమాన యగుచున్నది.

విశే :- హకారము ఈశ్వర బీజ మనుచుహకారబీజ మహత్త్వఖ్యాపనము బీజనిఘంటువు నందు ఈ రీతిగ చేయ బడినది —

"హకార మైశ్వరం బీజం ఋషిర్బ్రహ్మ సనాతనః ।
సావిత్రీచ్ఛంద ఇత్యుక్తం హృదయాంభోజసంస్థితమ్ ॥
మహాప్రాణ మిదం వత్స మహాఘోషం మహత్త్వదం।
బ్రహ్మాది స్తంబపర్యంతం క్రీడతే తు హకారకే ॥
న మృత్యోర్భయ మాప్నోతి దశలక్షేణ వై గుహ ।
బిందునాదసమాయుక్తజపాత్ పృథ్వీజయం భవేత్॥"

## ౧౦౨. హలధృక్పూజితా

శం. భా. హలధృక్పూజితా । హలం యుగం ధరతి ఇతి హలధృక్ బలరామః, తేన పూజితా ధ్యానాదిభి రారాధి తేత్యర్థః ॥ ఓం హలధృక్పూజితాయై నమః ॥

ఆం. వి. హలధృక్ అనగా నాగలిని ఆయుధముగా ధరించునట్టి బలరాముడని యర్థము. బలరామునిచే పూజింప బడునది, ధ్యానాదులచేత ఆరాధింపబడునది గాన, దేవికి 'హలధృక్పూజితా' యను నామము ప్రసిద్ధము.

## ౧౦౩. హరిణేక్షణా

శం. భా. హరిణేక్షణా। హరిణ్యాః ఈక్షణ మివ ఈక్షణం యస్యాః సా తథా; అతిసంతోషేణ కాతరాక్షీతి భావః ।

సర్వత్ర సర్వదా సర్వద్రష్ట్రీతివా । భక్తేషు ఆదరదర్శనపతీతి భావః ॥ ఓం హరిణేక్షణాయై నమః ॥

ఆం. వి. పరమేశ్వరి లేడియొక్క చూపువంటి చూపు గలదగుటచేత 'హరిణేక్షణా' యని ప్రస్తుతింపబడుచున్నది. ఆనందాతిశయముతో లేడివలె కాతరేక్షణయై కనురెప్ప లాడించుచున్న కన్నులు గలది; నిరంతరము సర్వత్ర సాక్షి భూతురాలై సర్వ ప్రపంచమును చూచునదని భావము.

## ౧౦౪. హరప్రియా

శం, భా. హరప్రియా । హరస్య ప్రియా శివవల్లభేత్యర్థః । హరః ప్రియో యస్యాః సా ఇతి వా ॥ ఓం హరప్రియాయై నమః ॥

ఆం. వి. శివునకు ప్రేమాస్పదయైనది, శివవల్లభ యని యర్థము. శివుడు వల్లభుడుగా గలది. కావున. దేవి 'హరప్రియా, యనుచు భక్తులచే సంకీర్తింపబడుచున్నది.

## ౧౦౫. హరారాధ్యా

శం. భా. హరారాధ్యా। హరేణ స్వభర్త్రా ఆరాధితుం యోగ్యా, కేవల సచ్చిదానందరూపత్వాత్ ॥ ఓం హరారాధ్యాయై నమః ॥

ఆం. వి. పరమేశ్వరి శుద్ధ సచ్చిదానందస్వరూపిణి; అందువలన తన భర్తయైన యీశ్వరునిచేత ఆరాధింపబడుటకు

యోగ్యగాన, 'హారారాధ్యా' యని భక్తులచే గానము చేయ బడుచున్నది.

## ౧౦౯. హరిబ్రహ్మేంద్రవందితా

శం. భా. హరిబ్రహ్మేంద్ర వందితా । హరిః రమేశః బ్రహ్మా వాణీశః। ఇంద్రో దేవేశః ఉపలక్షణం సర్వదేవ భేదానామ్ తైర్వందితా నమస్కృతా ॥ ఓం హరిబ్రహ్మేంద్రవందితాయై నమః ॥

ఆం. వి. రమాపతియైన విష్ణువు, వాణీశుడైన బ్రహ్మ సర్వ దేవతల కధిపతియైన ఇంద్రుడు - సర్వదేవతా భేదము లకు ఉపలక్షణము. - వీరందరిచేత నమస్కరింపబడునది గాన 'హరిబ్రహ్మేంద్రసేవితా' యనుచు దేవి స్తవనీయ యగుచున్నది.

శ్లో॥ హయారూఢాసేవితాంఘ్రి ర్హయ మేధసమర్చితా ।
హర్యక్షవాహనా హంసవాహనా హతదానవా ॥

## ౧౧౦. హయారూఢాసేవితాంఘ్రిః

శం. భా. హయారూఢాసేవితాంఘ్రిః । హయారూఢా నామ అశ్వమాత్ర సేనానీశక్తిః వశ్యకరీ । తయా సేవితౌ అంఘ్రీ యస్యాః సా తథా ॥ ఓం హయారూఢాసేవితాంఘ్ర్యై నమః ॥

ఆం. వి. అశ్వారూఢ యనగా అశ్వసైన్యమునకు సేనానియైన శక్తి, పరమేశ్వరి చరణపంకజములు అశ్వారూఢచే సేవింపబడునవి గాన, త్రిపురసుందరి 'హయారూఢా సేవితాంఘ్రిః' యనునామముతో వెలుగొందుచున్నది. అశ్వారూఢ పంచదశీమహావిద్య యొక్క యుత్తరాంగదేవత యని శ్రీవిద్యా సంప్రదాయము.

## ౧౦౮. హయమేధసమర్చితా

శం. భా. హయమేధసమర్చితా । హయమేధేన అశ్వమేధేన సమర్చితా పూజితా। పురుషత్వాది ప్రాప్త్యై ఇలాదిభిరిత్యర్థః ॥ ఓం హయమేధసమర్చితాయై నమః ॥

ఆం. వి. శ్రీ మహాత్రిపురసుందరి అశ్వమేధయాగము చేత అర్చింపబడునది; పురుషత్వాది ఫలప్రాప్తికై ఇలాది శక్తులచేత సేవింపబడునది గావున, 'హయమేధసమర్చితా' యని స్తోతవ్యురాలగుచున్నది.

## ౧౦౯. హర్యక్షవాహనా

శం. భా. హర్యక్షవాహనా । వాహయతీతి వాహనమ్, హర్యక్షః కేసరీ వాహనం యస్యాః సా తథా । మహాలక్ష్మీరూపధృగిత్యర్థః ॥ ఓం హర్యక్షవాహనాయై నమః ॥

ఆం. వి. వహించునది గాన వాహనము, హర్యక్షమనగా సింహము. సింహము వాహనముగా గలదగుట వలన

పరాభట్టారిక 'హర్యక్షవాహనా' యని ప్రస్తూయమాన యగుచున్నది. సింహవాహనసమారూఢ, మహాలక్ష్మీ స్వరూపిణియైన దుర్గాదేవి యని భావము.

## ౧౧౦. హంసవాహనా

శం. భా. హంసవాహనా । హంతి గచ్ఛతీతి హంసః, సూర్యః ప్రాణో వా, వాహనవత్ ఆధారభూత ప్రతీకమిత్యర్థః। అభివ్యక్తిస్థానమితి యావత్, "స యశ్చాయం పురుషే, యశ్చాసా వాదిత్యే । సఏకః" ఇతి శ్రుతేః । అథవా, హంస వాహనా బ్రాహ్మీరూపేణేత్యర్థః ॥ ఓం హంసవాహనాయై నమః ॥

ఆం. వి. గమనము చేయునది కాన హంస, సూర్యుడు, లేక ప్రాణమని యర్థము. వాహనము వలె ఆధారభూతమైన ప్రతీక యని భావము. అభివ్యక్తిస్థానమని తాత్పర్యము. 'స యశ్చాయం పురుషే' - 'ఈ పురుషునియందు ఏ తేజస్సు కనబడుచున్నదో, ఆకాశమున సూర్యమండలమందు ఏ తేజస్సు కనబడుచున్నదో, ఆ రెండు తేజస్సులు భిన్నముగావు, ఏకమే' యని శ్రుతి చెప్పుచున్నది.

అథవా, హంసవాహన, బ్రాహ్మీశక్తియైన సరస్వతి యని భావము.

## ౧౧౧. హతదానవా

శం. భా. హతదానవా । హతాః దానవాః అనేక ప్రకార శక్తిరూపధరయా భండాసురాదయః యయా సా తథా ॥ ఓం హతదానవాయై నమః ॥

ఆం. వి. సమష్టిలో నుండి వ్యష్టిరూపముతో వ్యాపించిన లలితాత్రిపురసుందరి చేత వ్యష్టిలో నుండి సమష్టి రూపముగా భాసించుచున్న దుర్గాశక్తి చేత, ఈ రీతిగా అనేకానేక శక్తులచేత భండాసుర, మహిషాసురాది దానవులు నిహతులగుట వలన పరమేశ్వరి 'హతదానవా' యను నామముతో విరాజిల్లుచున్నది.

శ్లో॥ హత్యాదిపాపశమనీ హరిదశ్వాదిసేవితా ।
హస్తికుంభోత్తుంగకుచా హస్తికృత్తిప్రియాంగనా ॥

## ౧౧౨. హత్యాదిపాపశమనీ

శం. భా. హత్యాదిపాపశమనీ । హత్యా బ్రహ్మహత్యా ఆది ర్యేషాం తాని తథా పాపాని శమయతీతి తథా, "హరిర్హరతి పాపాని" ఇతి వచనాత్ ॥ ఓం హత్యాదిపాపశమన్యై నమః ॥

ఆం. వి. బ్రహ్మహత్యాది మహాపాపములను సంకల్పమాత్రమున పోగొట్టునది, 'హరిర్హరతిపాపాని' యను వచ

నానుసారము 'ఎంతటి పాపకర్ముడైనను, స్మరించిన మాత్రము ననే వారి పాపములను హరి - శ్రీమహావిష్ణువు, పోగొట్టు' నని తెలియును. పరమేశ్వర నిత్యానపాయిని యగు పరాదేవత గూడ అట్టిదేగాన 'హత్యాదిపాపశమనీ' యను నామము ఆమె యందు సార్థకము. పూర్వము వివరించిన నామానుసారము హరి, హరులు, హ్రీంబీజ ప్రతిపాద్య యగు దేవి ముప్వురును ఒక వస్త్రములోని భిన్న శకలములుగాన, 'హరి ర్హరతిపాపాని' యను పురాణవచనము శ్రీమహాత్రిపురసుందరి విషయము నందు గూడ సంగతమగునని భావము.

## ౧౧౩. హరిదశ్వాదిసేవితా

శం. భా. హరిదశ్వాదిసేవితా। హరిత్ హరిద్వర్ణః మరకత ఇవ అశ్వో యస్యేంద్రస్య స తథా ఆది ర్యేషాం దిక్పతీనాం తైః సేవితా చరణారవిందసంస్థిం కింకరతయాఽఽశ్రితే త్యర్థః ॥ ఓం హరిదశ్వాదిసేవితాయై నమః ॥

ఆం. వి. మరకతమణివలె పచ్చని రంగు గల యశ్వములు వాహనములుగా గల యింద్రాది అష్టదిక్పాలకుల చేత సేవింపబడునది. ఇంద్రాదిదేవతలు దాస భావముతో పరదేవత చరణసరోజముల సంనిధి నాశ్రయించి యుందురని భావము. కావున, పరమేశాని 'హరిదశ్వాదిసేవితా' యనుచు సంకీర్తింపబడుచున్నది.

## ౧౧౪. హస్తికుంభోత్తుంగకుచా

శం. భా. హస్తికుంభోత్తుంగకుచా । హస్తః అస్య అస్తీతి హస్తీ, తస్య కుంభౌ తద్వదున్నతౌ కుచౌ సాంద్రౌ యస్యాః సా తథా ॥ ఓం హస్తికుంభోత్తుంగకుచాయై నమః ॥

ఆం. వి; హస్తః అనగా తుండము, తుండము గలది గాన, **హస్తి** యనబడును. ఏనుగుయొక్క కుంభస్థలము వంటి యున్నతములు, సాంద్రములైన కుచములు గలదిగాన, 'హస్తి కుంభోత్తుంగకుచా' యను నామముతో దేవి యొక్క గుణ సంకీర్తనము చేయబడుచున్నది.

## ౧౧౫. హస్తికృత్తిప్రియాంగనా

శం. భా. హస్తికృత్తిప్రియాంగనా । హస్తినః కృత్తౌ చర్మణి ప్రియః ప్రీతిమాన్ శివః, తస్యాంగనా భామినీత్యర్థః ॥ ఓం హస్తికృత్తిప్రియాంగనాయై నమః ॥

ఆం. వి. శివుడు గజచర్మము నందు ప్రేమగలవాడు. ఆ శివుని యొక్క సర్వాంగసౌందర్య సంపద్విలసితమైన భార్య యగుటంజేసి శ్రీమాతకు 'హస్తికృత్తిప్రియాంగనా' యను నామ మన్వర్థమై యొప్పారును.

శ్లో॥ హరిద్రాకుంకుమాదిగ్ధా హర్యశ్వాద్యమరార్చితా ।
హరికేశసఖీ హాదివిద్యా హాలామదాలసా ॥ ౨౩

## ౧౧౬. హరిద్రాకుంకుమాదిగ్ధా

శం. భా. హరిద్రాకుంకుమాదిగ్ధా । హరిద్రాకుంకుమాభ్యాం ఉపలక్షణం కస్తూరీపత్రాదీనామ్, ఆదిగ్ధా లిప్తేత్యర్థః ఓం హరిద్రాకుంకుమాదిగ్ధాయై నమః ॥

ఆం. వి. పసుపు, కుంకుమలు కస్తూరీ పత్రాది సుగంధ ద్రవ్యములకు ఉపలక్షణము. హరిద్రాకుంకుమాదులచే లిప్తాంగి యగుట వలన పరమేశ్వరీపరిచాయకమైన యీ నామముతో అర్చింపబడుచుండును.

## ౧౧౭. హర్యశ్వాద్యమరార్చితా

శం. భా. హర్యశ్వాద్యమరార్చితా । హర్యశ్వః సురేశః ఆదిర్యేషా మమరాణాం, తైరర్చితా కింకరతయా నియామకత్వేన పూజితేత్యర్థః ॥ ఓం హర్యశ్వాద్యమరార్చితాయై నమః ॥

ఆం. వి. ఇంద్రాది దేవతలచేత సేవక భావముతో నియామకముగా అర్చింపబడునది గావున 'హర్యశ్వాద్యమరార్చితా' యను నామముతో పరాదేవి ధ్యాయనీయ యగుచున్నది.

## ౧౧౮. హరికేశసఖీ

శం. భా. హరికేశసఖీ । హరయః హరిద్వర్ణాః కేశాః శిరోరుహాః యస్య, "హిరణ్యశ్మశ్రు ర్హిరణ్యకేశః" ఇతిశ్రుతేః॥ తస్య సఖీ ప్రయోజన మనపేక్ష్య ఉపకారిణీత్యర్థః ।

యద్వా, వర్ణేన నీలేన హరిణా విష్ణునా సమాః కేశాః అస్య సంతీతి సర్వాంగసుందర నిత్యయౌవన చిద్రూపసహిత కామేశ్వరః, తస్య సఖీ ॥ ఓం హరికేశసఖ్యై నమః ॥

ఆం. వి. కామేశ్వరుడు పింగకేశుడు - పచ్చని కేశములు గలవాడు. 'హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః' - 'పరమేశ్వరుడు బంగారు రంగు గల మీసములు కేశములు గలవా' డని ఛాందోగ్య శ్రుతి చెప్పుచున్నది. ఆయన సఖి, అనగా ప్రయోజన మపేక్షించక యుపకారము చేయునది గాన, భగవతి 'హరికేశసఖి' యని స్తవనీయ యగుచున్నది.

అథవా, సర్వాంగసుందరుడు, నిత్యయౌవనుడు చిచ్ఛక్తి, సహితుడు నయిన కామేశ్వరుడు మేఘశ్యామలదేహుడైన విష్ణువు యొక్క దేహచ్ఛాయతో సమానమైన కేశములు గలవాడు. తాదృశ కామేశ్వరుని సఖగాన, కామేశ్వరి 'హరికేశసఖి' యనుచు భక్తులచేధ్యాయమాన యగుచున్నది.

## ౧౯౯. హాదివిద్యా

శం. భా. హాదివిద్యా । లోపాముద్రోపాసిత మనురూపేత్యర్థః ॥ ఓం హాదివిద్యాయై నమః ॥

ఆం. వి. 'హ' కారము ఆదియందుగల పంచదశీ విద్య హాదివిద్య. లోపాముద్రచేత ఉపాసింపబడిన హాదివిద్యా మంత్రస్వరూపము గలదగుట వలన శ్రీ త్రిపురసుందరి 'హాది

విద్యా' యని స్తుతింపబడుచున్నది. ఈనామము వలన మంత్ర మునకు తద్దేవతకు గల అభేదము సూచితము.

## ౧౭౦. హాలామదాలసా

శం. భా. హాలామదాలసా । హాలాయాః అమృత మథనోద్భూత వారుణ్యాః మదేన ఉల్లాసేన అలసా ఆరక్త నేత్రాంత రోమాంచాది చిహ్నవతీత్యర్థః ॥ ఓం హాలా మదాలసాయై నమః ॥

ఆం. వి. అమృతమథన సమయమున క్షీరసాగరము నుండి 'వారుణీ' యను పేరుగల రసముద్భవించెను; తద్రసమును సేవించుటచేత దేవికి ఉల్లాసము కలిగెను. ఆ యానందము వలన కొంచెము ఎఱ్ఱనైన నేత్రాంతముల వఱకు-కను కొనల వరకు రోమాంచాది (గగుర్పాటు మొదలైన) చిహ్నములు గలదగుట వలన పరాశక్తి 'హాలామదాలసా' యను సార్థక నామముతో విరాజిల్లుచుండును.

శ్లో॥ సకారరూపా సర్వజ్ఞా సర్వేశీ సర్వమంగలా ।
సర్వకర్త్రి సర్వభర్త్రి సర్వహంత్రి సనాతనా ॥ ౨౮

## ౧౭౧. సకారరూపా

శం. భా. సకారరూపా । ద్వితీయఖండ ద్వితీయావ యవత్వేన జ్ఞాపకం యస్యాః సా తథా ॥ ఓం సకారరూపాయై నమః ॥

అం. వి. పంచదశీ మంత్రములోని ద్వితీయ ఖండము నందలి ద్వితీయ వర్ణముగా స్వరూపవాచకమైన సకారము పరదేవతాస్వరూపమును జ్ఞాపకము చేయును; అట్టి స్వస్వరూపవాచకమైన 'స' బీజము కలదిగాన, పరమేశ్వరి 'సకారరూపా' యని స్తవనీయ యగుచున్నదని భావము.

## ౧౨౨. సర్వజ్ఞా

శం. భా. సర్వజ్ఞా । అలుప్త నిత్యజ్ఞానస్వరూపేణ సామాన్యరూపేణ సర్వం జానాతీతి సర్వజ్ఞా; "యః సర్వజ్ఞః సర్వవిత్" ఇతి శ్రుతేః ॥ ఓం సర్వజ్ఞాయై నమః ॥

అం. వి. నిత్యమలుప్తజ్ఞాన స్వరూపముతోను, సామాన్యము గాను సర్వమును తెలిసికొనునది, "య స్సర్వజ్ఞః సర్వవిత్" - 'పరమేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వవిదు' డని శ్రుతి చెప్పుచున్నది. ఆ బ్రహ్మానపాయిని, బ్రహ్మణి యగు త్రిపుర సుందరి తాదృశ సర్వజ్ఞత్వ, సర్వవేతృత్వాదులు గలదగుటం జేసి 'సర్వజ్ఞా' యని గానము చేయబడుచున్నది.

## ౧౨౩. సర్వేశీ

శం. భా. సర్వేశీ । సర్వస్య అంతర్యామిరూపేణ ఈష్టే ప్రేరయతీతి తథా ॥ ఓం సర్వేశ్యై నమః ॥

అం. వి. సమస్తకార్య ప్రపంచమును అంతర్యామి రూపముతో ప్రేరేపించునది, నియమించునది గావున 'సర్వేశీ' యను నామము పరమేశ్వరి యందన్వర్థము.

## ౧౭౪. సర్వమంగలా

శం. భా. సర్వమంగలా । సర్వప్రకారేణ శుద్ధ విశిష్ట చైతన్యరూపేణ మంగలా పరమానందస్వరూపా । అత్ర బహువ్రీహౌ రవివక్షితత్వాత్ । వివక్షితాయాం వా సుందర కాయో రాజేత్యాదివత్ సమాసార్థః ।

అథవా, సర్వేషాం మంగలంయస్యాః సా తథా ।

సర్వైః ప్రకారైః ధ్యాన కీర్తన పూజా నమస్కారా ద్యర్చన॥ భక్తిజన్య కైంకర్యైః జడానా మపి మంగలం సుఖం యస్యాః జాయతే సా తథా !

సర్వేషా మాత్మరూపతయా ప్రతీయమానం మంగలం సుఖస్వరూపం యస్యాః సేతి వా ।

సర్వశబ్దవాచ్యః సర్వకారణం శివః, తస్య మంగలం సుఖం యస్యాః జాయితే సా తథా, "సచ్చిన్మయః శివః సాక్షాత్తస్యానందమయీ శివా" ఇతి వచనాత్ ।

అథవా, మంగలశబ్దేన మంగలహేతుభూతాః స్త్రియో లక్ష్యంతే । సర్వేషాం ప్రాణినాం మంగలం మంగలసాధన భూతాః యోషాః స్వాభిన్న సచ్చిదానందవత్త్వేన యస్యాః సా తథా; "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" ఇతి శ్రుతే రిత్యర్థః ।

శంకర. 12 - 26]

"అశుభాని నిరాచష్టే తనోతి శుభసంతతిమ్ ।
స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగలం విదుః ॥

అతికల్యాణరూపత్వాత్ నిత్యకల్యాణసంశ్రయాత్ ।
స్మర్తౄణాం వరదత్వాచ్చ బ్రహ్మ తన్మంగలం విదుః॥"

ఇత్యాది వచనాత్ ॥ ఓం సర్వమంగలాయై నమః॥

ఆం. వి. సర్వవిధములుగా, శుద్ధచైతన్యరూపముతో, మాయావిశిష్టచైతన్యముతో పరమేశ్వరి లోకమునకు కళ్యాణప్రదమైన దగుటచేత అఖండపరమానందరూపిణి. ఇచట బహువ్రీహి సమాసము వివక్షితము కాదుగనుక, పై రీతిగ అర్థము చెప్పనగును. బహువ్రీహి సమాసము చెప్పికొనినచో (సర్వమంగళములు గలది యని చెప్పినచో) సుందరావయవములు గల రాజు అను రీతిగా సమాసార్థము చెప్పికొనవలసి యుండును.

అథవా, సర్వజీవులయొక్క కళ్యాణము స్వరూపముగా గలదిగాన, సర్వమంగళ.

సర్వవిధములయిన ధ్యాన, నామసంకీర్తన, పూజా, నమస్కార, అర్చన, భక్తిజన్యములయిన కైంకర్యములవలన జనులకు సయితము ఏ దేవి వలనమంగళము (సుఖము) కలుగుచున్నదో యామె సర్వమంగళ.

సర్వప్రాణులకు ఆత్మస్వరూపముగా గోచరించునట్టి సుఖస్వరూపము గలదగుట వలన ఆమె సర్వమంగళ.

సర్వశబ్దవాచ్యుడు, సర్వకారణుడు నయిన శివునికి ఆనందము ఏ పరమేశ్వరి వలన కలుగుచున్నదో, ఆమె సర్వమంగళ "సచ్చిన్మయః శివః సాక్షాత్తస్యానందమయీ శివా" 'శివుడు సత్యజ్ఞాన స్వరూపుడు, శివాని సాక్షాత్తు ఆ పరశివుని యొక్క ఆనందస్వరూపిణి' యను వచనము వలన శివునికి ఆనందసంధాత్రి పరమేశ్వరి యని తెలియుచున్నది.

పక్షాంతరమున, మంగళ శబ్దముచేత సర్వమంగళము లకు కారణభూతలైన స్త్రీలు పరిలక్షితులగుదురు. సమస్త దేహధారులకు మంగళ (సుఖ) సాధనభూతలైన స్త్రీలు ఆ పరమేశ్వరికి కంటె అభిన్నమైన సచ్చిదానందస్వరూపములు గలవారగుట చేత ఆమె సర్వమంగళ "ఏతస్యైవా నందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి" - 'ఇతరమైన భూతకోటి యంతయు బ్రహ్మానందస్వరూపమైన యీ శివా నందములో నల్పాంశమును మాత్రమే యనుభవించుచున్నది' యను శ్రుతివచనము వలన నిఖిల, ప్రాణిజాతము పరమేశ్వరి యొక్క సచ్చిదానందస్వరూపము కంటె అభిన్న స్వరూపము గల స్త్రీల వలన సర్వసుఖములను అనుభవించుచున్నందున స్త్రీలు సాక్షాత్తు పరమేశ్వరీస్వరూపము గల వారని భావము.

'బ్రహ్మతత్త్వము అశుభములను పోగొట్టి శుభ సమూహమును కలిగించుచున్నది, స్మరణమాత్రము చేతనే అట్టి బ్రహ్మతత్త్వము పురుషులకు, అనగా జీవులకు సుఖము నిచ్చుచున్నది, అట్టి బ్రహ్మను 'మంగళమ్' అని తెలియుదురు.'

'బ్రహ్మవిషయనిరపేక్షమైన సహజానందరూపము (అతికళ్యాణకారి), నిత్యానందస్వరూపము (నిత్యకళ్యాణ సంశ్రయః), స్మరించువారలకు వరప్రదము నగుట వలన బ్రహ్మను 'మంగళమ్' అని తెలియుదురు.'

ఇత్యాది వచనముల ననుసరించి బ్రహ్మణి యగు లలితాంబిక 'సర్వమంగళా' యను సార్థక నామముతో విరాజిల్లుచున్నది.

## ౧౨౫. సర్వకర్త్రీ

శం. భా. సర్వకర్త్రీ। సర్వం సమస్తం స్వశక్త్యా మాయారూపతయా కరోతీతి తథా, "ఈశత ఈశనీభిః" ఇతి శ్రుతేః ॥ ఓం సర్వకర్త్ర్యై నమః ॥

ఆం. వి. పరమేశ్వరి మాయారూపమైన స్వశక్తితో సర్వమును సృజించుచున్నది. "ఈశత ఈశానీభిః" - 'మాయా శబలిత చైతన్యము సర్వసమృద్ధములైన స్వీయశక్తుల ద్వారా సర్వప్రపంచ కార్యనిర్వహణము చేయుచున్నది' అను శ్రుతి వలన సచ్చిదానందస్వరూపిణి, సృష్టి, స్థితి, లయకర్త్రి యగు పరమేశాని 'సర్వకర్త్రీ' యని స్తుతింపబడుచున్నదని భావము.

## ౧౭౬. సర్వభర్త్రీ

శం. భా. సర్వభర్త్రీ। సర్వం బిభర్తీతి తథా। "ఏష విధృతి రేషాం లోకానామ్" ఇతి శ్రుతేః ॥ సర్వభర్త్ర్యై నమః ॥

ఆం. వి. సర్వమును భరించునది, "ఏష విధృతి రేషాం లోకానామ్" - 'ఈ లోకములను భరించు శక్తి యీ బ్రహ్మమే' అను శ్రుతివచనానుసారము శ్రీకామేశ్వరి 'సర్వభర్త్రీ' యను నామముతో ధ్యేయురాలగుచున్నది.

## ౧౭౭. సర్వహంత్రీ

శం. భా. సర్వహంత్రీ। సర్వం హరతీతి తథా। ఏభిర్నామత్రయైః 'యతో వా' ఇత్యాది శ్రుత్యుక్త తటస్థ లక్షణత్రయ మభిహిత మితి వేదితవ్యమ్ ॥ ఓం సర్వహంత్ర్యై నమః ॥

ఆం. వి. సమస్త ప్రపంచమును హరించుచున్నది లయము చేయుచున్నదిగాన, పరాదేవికి 'సర్వహంత్రీ' యను నామము ప్రసిద్ధము. పై మూడు నామముల ద్వారా "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది శ్రుతులచే ప్రతిపాదింపబడిన సృష్టి. స్థితి, లయరూపమైన తటస్థలక్షణత్రయము చెప్పబడిన దని తెలియవలయును.

## ౧౨౮. సనాతనా

శం. భా. సనాతనా । "అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః" ఇతి శ్రుతేః, నిత్య సిద్ధస్వరూపేత్యర్థః ॥ ఓం సనాతనాయై నమః ॥

ఆం. వి. "అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః" 'ఈ బ్రహ్మ అజుడు (పుట్టుక లేనివాడు), నిత్యుడు, సర్వదా కనబడునట్టి శాశ్వతుడు (శశ్వత్ సిద్ధః), పురాణ పురుషుడు' (ఎప్పటివాడో యెవరికిని తెలియనివాడు) అను శ్రుతివాక్యము ననుసరించి, భూతభవిష్యద్వర్తమాన కాలముల కతీతమైన, షడ్భావవికార రహితమైన స్వరూపము ఆ బ్రహ్మతత్త్వము; ఆ సచ్చిదానందతత్త్వమే శుద్ధమాయ గావున, పరమేశ్వరి 'సనాతనా' యను నామముతో ధ్యాతవ్య యగుచున్నది.

శ్లో॥ సర్వానవద్యా సర్వాంగసుందరీ సర్వసాక్షిణీ ।
సర్వాత్మికా సర్వసౌఖ్యదాత్రీ సర్వవిమోహినీ॥ ౬౫

## ౧౨౯. సర్వానవద్యా

శం. భా. సర్వానవద్యా । సర్వైః జ్ఞానైశ్వర్యాది గుణైః రనవద్యా । అవద్యా నామ విద్యయా హీనా జడప్రకృతిః మిథ్యా బాధ్యమానత్వాత్ । తద్విలక్షణా సత్యజ్ఞానానంద రూపత్వా దనవద్యా । సర్వేషాం సర్వాభీష్టప్రాపకత్వేన స్తుత్యా వా ॥ ఓం సర్వానవద్యాయై నమః ॥

ఆం. వి. సమస్తజ్ఞాన, ఐశ్వర్యాది గుణముల చేత దోషరహిత గాన, పరమేశ్వరి 'సర్వానవద్య' యనబడును. అనవద్యా యనగా విద్యారహిత-జ్ఞానరహితమైన జడ ప్రకృతి బాధింపబడునది - నశించునది యగుటచేత అది మిథ్యాస్వరూపిణి; పరమేశ్వరి తద్విలక్షణమైన సత్యజ్ఞానానంద స్వరూపము గలదగుట చేత అనవద్యా యనబడును.

అథవా, సర్వప్రాణికోటియొక్క కోరికల నీడేర్చునదగుటచేతగూడ, పరమేశ్వరి 'సర్వానవద్యా' యనబడును.

## ౧౩౦. సర్వాంగసుందరీ

శం. భా. సర్వాంగసుందరీ । సర్వాణి చ తాని అంగాని చ అవయవాః శిరఃపాణ్యాదయః; తేషు న్యూనాతిరిక్తభావవత్త్వాత్ యథా సాముద్రికలక్షణం తద్వత్త్వేన సర్వాంగసుందరం ।

అథవా, సర్వేషామంగేషు శరీరేషు బ్రహ్మస్వరూపతయా అత్యంతప్రేమవిషయత్వేన సుందరపదార్థవత్ అవినాభావ వాంఛావిషయత్వాత్ తథా ॥ ఓం సర్వాంగసుందర్యై నమః ॥

ఆం. వి. శిరఃపాణ్యాది సర్వావయవములందు తక్కువ యెక్కువ యను భావము లేక, సాముద్రిక శాస్త్రము నందు చెప్పిన లక్షణములు గలదగుట చేత దేవి సర్వాంగసుందరి.

అథవా, సర్వప్రాణుల శరీరముల యందు బ్రహ్మ స్వరూపముగా, అత్యంత ప్రేమాస్పదముగా ఉండుటచేతను, సుందరమైన వస్తువవలె నిరంతర వాంఛావిషయ మగుట వలనను, పరమేశ్వరి 'సర్వాంగసుందరీ' యని స్తోతవ్య యగుచున్నది.

## ౧౩౧ సర్వసాక్షిణీ

శం. భా. సర్వసాక్షిణీ । సర్వేషాం జడానాం కార్యాణాం స్ఫూర్త్యాధాయకత్వేన ప్రకాశకర్త్రీ తథా ।

సర్వం సాక్షాదీక్షత ఇతి వా తథా ॥ ఓం సర్వసాక్షిణ్యై నమః ॥

ఆం. వి. సమస్త జడకార్యములకు స్ఫూర్తిని కలిగించి ప్రకాశింపజేయునదిగాన, పరదేవత సర్వసాక్షిణి.

సర్వమును సాక్షాత్తుగా చూచునదిగాన, 'సర్వసాక్షిణీ' యను నామము దేవి యందు ప్రసిద్ధము.

## ౧౩౨. సర్వాత్మికా

శం. భా. సర్వాత్మికా । సర్వేషా మాత్మస్వరూపత్వాత్ ॥

"యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయా నిహ ।
యచ్చాస్య సంతతో భావ స్తస్మా దాత్మేతి గీయతే॥"

యచ్చాస్య సంతతో భావ స్తస్మా దాత్మేతి గీయతే॥"

ఇతి వచనాత్ తథా ॥ ఓం సర్వాత్మికాయై నమః ॥

ఆం. వి. పరమేశ్వరి సర్వప్రాణుల యాత్మస్వరూప మగుట వలన 'సర్వాత్మికా' యని కీర్తింపబడును,

'ఆత్మ యిచట సర్వ విషయములను పొందుచున్నది. గ్రహించుచున్నది. అనుభవించుచున్నది, ఆత్మకు సంతతో భావము అనగా అంతటనిండియుండుట యను భావము కలదు; ఆ కారణముచేత అది యాత్మయని చెప్పబడుచున్నది' అను వచనము వలన సర్వాంతర్యామిస్వరూపముతో సర్వ విషయములను అనుభవించుటచేత త్రిపురసుందరి 'సర్వాత్మికా' యనుచు జేగీయమాన యగుచున్నది.

'సర్వతత్త్వవ్యాపినీ శ్రీ మహాసుందరీ తృప్యతు' యను వచనము వలన గూడ పరమేశ్వరి సర్వాత్మిక యని చెప్పుట యుక్తమే.

## ౧౩౩. సర్వసౌఖ్యదాత్రీ

శం. భా. సర్వసౌఖ్యదాత్రీ । సుఖినః భావః సౌఖ్యమ్, సర్వాణి చ తాని ప్రియ మోదప్రమోద ఆనంద శబ్దవాచ్యాని, ఇష్టదర్శనజన్యం సుఖం ప్రియమ్ । తల్లాభజన్యం మోదః ।

తదనుభవజన్యం ప్రమోదః ఆనందః । సమష్టిః । జీవో భోక్తా।
తానిదదాతీతి తథా ।

సర్వప్రకారైః స్మరణాదిభిః సౌఖ్యం దదాతీతి వా ।

సర్వేషా మాబ్రహ్మస్తంబపర్యంతానాం యథాకర్మో
పాసనం ప్రత్యక్షేణ దృశ్యమానం జ్ఞానైశ్వర్యాదిసహితం
సుఖం దదాతీతి వా తథా । "ఏష హ్యేవానందయాతి" ఇతి
శ్రుతేః ॥ ఓం సర్వసౌఖ్యదాత్ర్యై నమః ॥

అం. వి. సుఖము గలవాని యొక్క ధర్మము సౌఖ్యము,
సర్వవిధము లైన ప్రియము, మోదము, ప్రమోదము, ఆనంద
ముల నొసగునది గాన, జగన్మాత 'సర్వసౌఖ్యదాత్రీ' యని
స్తవనీయు రాలగుచున్నది. ఇష్టమైన వస్తువును, లేక వ్యక్తిని
చూచుట వలన కలుగునట్టి సుఖము ప్రియ మనబడును, ఇష్ట
వస్తులాభజన్యమైన సుఖమును మోద మందురు. ఇష్టవస్తువు
యొక్క అనుభవము వలన లభించునట్టిది ప్రమోదము, పైన
పేర్కొనిన సర్వసౌఖ్యముల సమాహారరూపమే యానందము.
జీవుడు ఆనందభోక్త. తాదృశములయిన సర్వసౌఖ్యముల
నొసగునది గాన, దేవికి 'సర్వసౌఖ్యదాత్రీ' యను నామ
మన్వర్థము.

సర్వవిధములైన స్మరణ, కీర్తన, ధ్యానాదుల చేత
సౌఖ్యము నొసగునదిగాన, ఆమె సర్వసౌఖ్యదాత్రి.

బ్రహ్మాది స్తంబపర్యంతము (బ్రహ్మాది మొదలుకొని గడ్డిపోచ వఱకు) అందరకు, వారివారి కర్మానుష్ఠానము ననుసరించి ప్రత్యక్షముగా దృశ్యమానమగు జ్ఞాన ఐశ్వర్యాది యుక్తమైన సుఖము నొసగునది. "ఏష హ్యేవా నందయాతి"- 'ఈ పురుషుడే సర్వప్రాణులకు నానందము నొసగుచున్నాడు' అను శ్రుతివచనానుసారము పరమేశ్వరి 'సర్వసౌఖ్యదాత్రీ' యను నామముతో నర్చింపబడు చున్నది.

## ౧౩౪. సర్వవిమోహినీ

శం. భా. సర్వవిమోహినీ । సర్వాన్ విమోహయతీతి అన్యథా గ్రాహయతీతి వా తథా । "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః," 'అనృతేన హి ప్రత్యూఢాః" ఇతి శ్రుతిస్మృతిభ్యాం అజ్ఞానావరణశక్తికార్యం మోహనాది సత్తా ప్రకాశాది ప్రధానాధిష్ఠానత్వేనఉపచారాత్ సర్వంమోహయ తీత్యుచ్యతే అయో దహతీతి వత్ ॥ ఓం సర్వ విమోహిన్యై నమః ॥

ఆం. వి. సర్వజనులను మోహింపజేయునది, లేక ఉన్న వస్తువును ఉన్నటుల గాక, మఱియొక విధముగా గ్రహింప జేయునది గాన, దేవి సర్వవిమోహిని. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" - 'జ్ఞానము మాయాకార్యమైన యజ్ఞానముచేతనావరింపబడియున్నది', "అనృతేనప్రత్యూఢాః" 'మాయా కల్పితమైన యనృతము (అజ్ఞానము) చేత సత్యము

(జ్ఞానము) ఆవరింపబడియున్నది' యను శ్రుతిస్మృతి వచనముల వలన, అజ్ఞాన, ఆవరణశక్తుల కార్యములయిన మోహింపజేయుట, వస్తుసత్తను ప్రకాశింపజేయుట మొదలయిన ప్రధాన కార్యములకు అధిష్ఠానముగా ఉన్నది, అందువలన ఆరోపము చేత, 'ఇనుము తగలబడుచున్నది' అను రీతిగా సర్వమును మోహింపజేయుచున్నదని చెప్పబడినది. కావున, 'సర్వవిమోహినీ' యను నామము దేవియందు అన్వర్థము.

అనగా, అజ్ఞానము వలన ప్రపంచముగా కన్పడునట్టి వస్తువును పరమేశ్వరి జ్ఞానప్రకాశము చేత బ్రహ్మస్వరూపముగా దర్శింపజేయును. ప్రకాశస్వరూపముగు బ్రహ్మవస్తువును తన యావరణశక్తి చేత ప్రపంచరూపముగా చూపించును. బ్రహ్మనిష్ఠయై యీశ్వర రూపముతో కనపడుచున్నది గావున, పరమేశ్వరి జడప్రకృతియైన యినుము వంటిదని, మాయాశబలిత చైతన్యము (ఈశ్వరుడు) దాహకత్వశక్తిగల, యగ్నియని యారోపించి చెప్పబడినదని తెలియనగును.

శ్లో॥ సర్వాధారా సర్వగతా సర్వావగుణవర్జితా ।
సర్వారుణా సర్వమాతా సర్వభూషణభూషితా ॥ ౨౯

## ౧౩౫. సర్వాధారా

శం. భా. సర్వాధారా । సర్వస్య ఆధారా "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" ఇతి శ్రుతేః । సర్వేషాం హృదయాని

ఆధారః అభివ్యక్తిస్థానం ఉపాసనాయ యస్యాః సేతి తథా ॥
ఓం సర్వాధారాయై నమః ॥

ఆం. వి. సర్వమునకు ఆధారమైనది, "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" - 'బ్రహ్మ పుచ్ఛాకారముగా సర్వమున కాధారమై యున్నది' అను శ్రుతి వలన పరమేశ్వరి సర్వాధారభూతురాలని తెలియనగును. సమస్తప్రాణులహృదయములు పరమేశ్వరి యొక్క యభివ్యక్తిస్థానములు గాన, ఆమె 'సర్వాధారా' యనుచు స్తవనీయ యగుచున్నది.

## ౧౩౬. సర్వగతా

శం. భా. సర్వగతా । సర్వం గచ్ఛతీతి తథా, "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య" ఇతి శ్రుతేః ॥ ఓం సర్వగతాయై నమః ॥

ఆం. వి. సర్వప్రపంచమును జీవరూపములో ప్రవేశించి యుండునది గావున, దేవికి 'సర్వగతా' యను నామ మన్వర్థము. "అనేన జీవేనాత్మనా అను ప్రవిశ్య"-'ఈజీవాత్మ రూపముతో సర్వ ప్రపంచమును ప్రవేశించి నేను నామరూప వ్యాకరణము చేయుచున్నాను' అను శ్రుతివచనానుసారము పరమేశ్వరి సర్వగత యనుట శ్రుతి సంగతము.

## ౧౩౭. సర్వావగుణవర్జితా

శం. భా. సర్వావగుణవర్జితా । అవమానవేంతవశ్చ తే గుణాశ్చ తథా; ఆధ్యాత్మికసంబంధేన ఆరోపితా స్సత్త్వా

దయః సమష్టా, అంతఃకరణధర్మాః కామాదయః వ్యష్టా, సర్వే చ అపగుణాశ్చ తథా ।

సర్వాంతర్యామిత్వేన సర్వానుస్యూతత్వేఽపి తత్తదుపాధినిష్ఠ ఉత్తమాధమధర్మైః న సంబధ్యతే ఘటాదినిష్ఠ ఆకాశవత్ కోశాంతర్గత ఖడ్గవద్వా;

"సూర్యో యథా సర్వలోకస్య చక్షుః
న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః ।
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥"

ఇతి శ్రుతేః ॥ ఓం సర్వభూతాంతరాత్మాయై నమః ॥

౭౦. వి. అవమానమునకు హేతువులయిన గుణములు అపమానగుణములు; ఆధ్యాత్మిక సంబంధముచేత సమష్టి యందు ఆరోపింపబడిన సత్త్వ, రజ స్తమోగుణములు, ప్రతి వ్యష్టి సూక్ష్మ శరీరము నందు ఆరోపితములు, అంతఃకరణ ధర్మములు నయిన కామాదులు-ఇవియన్నియు అవగుణములు, ఇట్టి యవగుణముల స్పర్శ లేనిదిగాన, దేవి సర్వావగుణవర్జిత యనబడును.

సర్వాంతర్యామిరూపిణియై దేవి సర్వగుణములతో అనుస్యూతముగా సంబంధము కలదైనను, ఆయా యుపాధుల యందున్న ఉత్తమ అధమ ధర్మములతో ఘటాకాశమువలె,

కోశాంతర్గతమైన (ఒర యందున్న) ఖడ్గమువలె సంబంధ రహితమై యుండును.

'సర్వలోక చక్షుస్థానీయుడైన సూర్యుడు నేత్ర సంబంధమైన దోషములచేత సంలిప్తుడుగాడు. ఆ రీతిగానే, సర్వభూతముల యంతరాత్మరూపముతో ఉన్న ఏకము, అద్వితీయము నయిన పరమాత్మ, సత్త్వాదిగుణ జన్యములైన బాహ్యదుఃఖములతో సంసక్తుడు కాడు' అను శ్రుతివచనము వలన పరమేశ్వరి సర్వావగుణవర్జిత యని తెలియనగును.

## ౧౩౮. సర్వారుణా

శం. భా. సర్వారుణా । సర్వేష్వంగేష్వరుణా ఆరక్తవతీ, "అసౌ య స్తామ్రో అరుణః" ఇతి శ్రుతేః ॥ ఓం సర్వారుణాయై నమః ॥

ఆం. వి. సర్వావయవము లందు అరుణ వర్ణముతో ఆరంజితయై శోభిల్లుచుండును. "అసౌ య స్తామ్రో అరుణః" అను శ్రుతియు 'ఈ పరమేశ్వరుడు తామ్రవర్ణుడు, అరుణవర్ణాంచితు' డని చెప్పుట వలన 'సర్వారుణా' యను నామము పరమేశ్వరి యొక్క రూప సౌందర్యవాచకమైన భక్తుల హృదయమును భక్తిభావరంజితము చేయుచున్నదని భావము.

## ౧౩౯. సర్వమాతా

శం. భా. సర్వమాతా । సర్వేణ మీయతే అను మీయతే అభేదేనేతి తథా । తథాహి - ఇదం జగత్ బ్రహ్మ

భిన్నం తత్సత్తాస్ఫూర్తినియత సత్తాప్రకాశజ్ఞానవిషయ త్వాత్ యఃయన్నియతసత్తాప్రకాశవాన్ స తదభిన్నః-యథా తంతుకార్యః పట ఇతి.

సర్వాన్ మినోతి స్వాభేదేన జానాతీతి తథా ॥ ఓం సర్వమాత్రే నమః ॥

సమస్తకార్య ప్రపంచముతో కారణరూపమున అభిన్నమై యున్నదని భక్తులచేత ఊహింపబడుచున్నదిగాన, పరమేశ్వరి 'సర్వమాతా' యని కీర్తింపబడుచున్నది. అట్లూహించుట యుక్తమే. ఏలన, జగత్తుయొక్క స్ఫూర్తికి నియతమైన (ఆవశ్యకమైన) సత్తను (ఉనికిని) ప్రకాశింపజేయు జ్ఞానమునకు విషయమగుట వలన ఈ జగత్తు బ్రహ్మకంటె భిన్నముగాదు; ఏది ఏ వస్తువుయొక్క నియత సత్తాప్రకాశకమో, అది యా వస్తువుకంటె అభిన్నము, తంతు (దారము) కార్యమైన వస్త్రమువలె. వస్త్రముగా గోచరింపజేయునది తంతు సముదాయము, తత్తంతుసముదాయము కంటె వస్త్రము భిన్నము కాదని భావము. ఆ రీతిగ పరమేశ్వరి జగదభిన్న యని భావింపనగును.

సర్వ విషయములను స్వాభిన్నముగా తెలిసికొనునది గాన, జగదీశ్వరి 'సర్వమాతా' యని సంకీర్తింపబడుచున్నది.

## ౧౪౦. సర్వభూషణభూషితా

శం. భా. సర్వభూషణభూషితా । సర్వాత్మకత్వేన యే యే ప్రాణినః యాని యాని భూషణాలంకారభోజనాదీని

భోగ్యవస్తూని ఆత్మార్థం సంపాదయంతి, తేషాం సర్వేషాం ప్రత్యక్తయా తైః సర్వై ర్భూషితా ఉపకృతేత్యర్థః, "ఆత్మ నస్తు కామాయ సర్వం ప్రియం భవతి" ఇతి శ్రుతేః ।

అథవా, సర్వదేవాత్మకత్వేన సర్వభక్తజనస్య స్వస్వేష్ట దేవతాప్రీత్యర్థం భూషణభూషితత్వేన తథా ॥

అథవా, భక్తజనైః తత్తద్ భూషణై రారోపితా; స్వస్యాః మహారాజ్ఞీత్వేన అసంగోదాసీనస్వభావత్వా దితి భావః ।

యద్వా, స్వదేశకాల లోకేషు భూషణైః తత్ర భవైః ఉచ్చాసచై ర్భూషణై రారోపితా; హస్త్యశ్వాది దేహోపాధికా సతీ తత్తదీయాలంకారాదిషు జుగుప్సారహితేత్యర్థః।

భూషయంతి సర్వోత్తమత్వేన ప్రతిపాదయంతీతి భూషణాని వేదాంతమహావాక్యాని; సర్వైః సమస్తైః గతిసామాన్యాత్ ఏకతాత్పర్యేణ భూషితా లక్షణయా పర్యవసితా సమన్వితా వేత్యర్థః ॥ ఓం సర్వభూషణభూషితాయై నమః ॥

ఆం. వి. దేవి సర్వాత్మస్వరూపము గలది. ఆకారణము చేత, జీవజాతము ఆత్మార్థము భోగ్యవస్తువులయిన భూషణ, అలంకార, భోజనాదులను సంపాదించుకొనుచున్నది. ఆ సమస్త జీవకోటి యందు ప్రత్యగాత్మరూపముతో నున్నందున, దేవి ఆ సర్వప్రాణుల భూషణములచేత (భోగ్యజాతము

చేత) అలంకరింపబడునదని భావము. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియంభవతి" 'ఆత్మసంతోషము నిమిత్తము సమస్తము జీవునకు ప్రియమగుచున్న' దని శ్రుతివచనము.

అథవా, సర్వదేవాత్మక స్వరూపముతో విలసిల్లు చున్నందున, భక్తజనులందరకు తమతమ యిష్టదేవతాప్రీతి కొఱకు వివిధ భూషణాలంకృతయై విరాజిల్లుచున్నది గాన, పరమేశ్వరి సర్వభూషిత యని భావము.

అథవా, సకలభక్తజనముచేత ఆయా యవయవముల యందు భూషణములతో అలంకరింపబడునది; జగదంబ మహా రాజ్ఞి యగుట వలన, అసంగ, ఉదాసీన స్వభావము గలదగు టంజేసి భక్తు లొసగు నలంకారములచే భూషిత యగుచున్న దని భావము.

అథవా, సర్వదేశముల యందు, సర్వకాలములయందు సర్వ లోకముల యందు ఎచటనైన లభించునట్టి మహార్ఘములైన మిక్కిలి విలువగల భూషణములతో అలంకరింపబడునది; గజ, అశ్వాది దేహములు ఉపాధిగా గలదై, ఆయా దేశకాలాదుల యందు జుగుప్స లేనిదని యర్థము.

వేదాంతమహావాక్యములు పరమేశ్వరిని సర్వోత్తమ ముగా ప్రతిపాదించునవి, అలంకరించునవి గాన, భూషణ ములు; సర్వవేదాంత వాక్యములు గతిసామాన్యము లగుట

వలన ముఖ్యమైన తాత్పర్యముతో అలంకరింపబడునది; జహ దజహల్లక్షణావృత్తి చేత పరమేశ్వరి పర్యవసితార్థము (సార రూపమైన అర్థము) గలది, లేక సమన్వితార్థము గలది గావున జగన్మాత 'సర్వభూషణభూషితా' యను నామముతో అర్చ నీయ యగుచున్నది.

శ్లో॥ కకారార్థా కాలహంత్రీ కామేశీ కామితార్థదా ।
కామసంజీవనీ కల్యా కఠిన స్తనమండలా ॥ ౨౭

## ౧౪౧. కకారార్థా

శం. భా. కకారార్థా । 'కం బ్రహ్మ' ఇతి శ్రుత్యా కకారస్య బ్రహ్మార్థకత్వేన తద్వ్యతిరిక్తస్య అతదర్థస్య బాధిత త్వాత్ ॥ ఓం కకారార్థాయై నమః ॥

ఆం. వి. 'కంబ్రహ్మ' — 'కం అనగా బ్రహ్మ' యను శ్రుతివచనమువలన, కకారము బ్రహ్మార్థకమగుటచేత తద్వ్యతి రిక్తమైన (కకారవ్యతిరిక్తమైన) అతదర్థము అనగా తత్ శబ్దముచే ప్రతిపాదింపబడు బ్రహ్మకంటె భిన్నమైన యర్థము బాధిత మగుట వలన పరమేశ్వరి 'కకారార్థా' యని భజనీయ యగుచున్నది.

పంచదశీ మంత్రస్థమైన రెండవ కూటము నందలి మూడవ బీజాక్షరమైన 'క' వర్ణముచే కామేశ్వరాంకనిలయ యైన కామేశ్వరీదేవి ప్రతిపాదింపబడుచున్నదని సంప్ర దాయము.

## ౧౮౨. కాలహంత్రీ

శం. భా. కాలహంత్రీ । అజపారూపేణ ప్రాణాపాన నామక చంద్రసూర్యనియమనే పురుషాణాం నియమితపరిమితా యుస్స్వరూప ఏకవింశతి షట్శతాధిక సహస్రసంఖ్యాక నిర్గమనరూపేణ క్షపయంతి అవశేషాయుషో యుగకల్పాద్యవిశిష్టస్య వృద్ధ్యా సంయుంజానస్య సర్వప్రాణేంద్రియస్య వృత్తిలయే మనోఽస్మన్యవస్థా నిష్పద్యతే । తథా చ శ్రుతిః-

'పృథివ్యప్తేజోఽనిల ఖేసముత్థితే
పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే ।
న తస్య రోగో న జరా న మృత్యుః
ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్ ॥ "

ఇతి; 'అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి' ఇతి చ । తథాచ తదానీ మావిర్భూత బ్రహ్మస్వరూపేణ 'తత స్సంవత్సరోఽజాయత' ఇతి శ్రుత్యా క్రియా శక్త్యాత్మక కాలోత్పత్తిశ్రవణాత్ తస్మిన్ బ్రహ్మణ్యేవ లయే కాలం హంతి నాశయతీతి తథా నామనిర్వచనం యుక్తం వక్తుమితి భావః ॥ ఓం కాలహంత్ర్యై నమః ॥

ఆం. వి. కాలమును-భూతభవిష్యద్వర్తమాన రూపమైన కాలమును నాశము చేయునది గాన, దేవి 'కాలహంత్రీ' యను నామముచే భజనీయ యగుచున్నది. అజపాగాయత్రీ

రూపమున ప్రాణాపానము లను పేరుతో వ్యవహరింపబడు నట్టి చంద్రసూర్యులుని యమింపబడుదురు. అపుడు పురుషులకు (జీవులకు) నియమితమైన పరిమితాయుస్స్వరూపమైన యిరు వదియొక్క వేల ఆరువందలు (21,600) సంఖ్యగల ఉచ్ఛ్వాస నిశ్శ్వాసరూపముతో నశింపజేయును. యుగకల్పాది రూప ముతో మిగిలిన ఆయుర్దాయము యొక్క వృద్ధికై ప్రాణా యామము చేయనగును. ఆ రీతిగా చేయు ప్రాణాయామము వలన, ఆయుర్వృద్ధి జరుగుచుండగా, సంయమితమైన (నియ మింపబడిన) సర్వప్రాణేంద్రియవృత్తి లయము పొంది మనో న్మన్యవస్థ జనించును.

'పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము - వీని వలన సముత్థితమైన, అనగా పంచభూతాత్మకమైన యోగ గుణము ప్రవర్తించినపుడు యోగి యోగాగ్నిమయ శరీర మును పొందును, అట్టి యోగికి రోగ, జరామరణము లుండ' వనియు, అధ్యాత్మయోగము చేత, అనగా, శరీరము నందలి ప్రాణాదుల సంయమనము చేయుటచేత ధీరుడైనవాడు హర్ష శోకములను రెండింటిని విడిచిపెట్టు' ననియు శ్రుతులుద్ఘోషించు చున్నవి. ఆ రీతిగా హర్ష శోకములను వీడిన ధీరునకు బ్రహ్మ స్వరూపానుభూతి కలుగును, 'తతస్సంవత్సరోఽజాయత' - ఆ బ్రహ్మ వలన సంవత్సరోత్పత్తి జరిగినది' అను శ్రుతివచనము వలన, క్రియాశక్తి స్వరూపమైన కాలోత్పత్తి శ్రూయమాణ మగుచున్నది. ఆ కారణముచేత ఆ కాలమునకు ఉత్పత్తిస్థాన

న్మైన యీ బ్రహ్మయందే లయమగుచున్నది. కావున, బ్రహ్మ నన్యయగు పరమేశ్వరి కాలనాశము చేయునదను (కాలహంత్రీయను) నామనిర్వచనము చెప్పుట యుక్తియుక్తమని తెలియ నగును.

విశే :- 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః' అని మహాకవి కాళిదాస వచనము. వికారహేతువు లయిన విషయములు సమీపమున నున్నను ఎవరి మనసులు వికారము నొందవో - చలించవో - వారే ధీరులని భావము. ప్రాణ సంయమనము ద్వారా మనోలయ మును సాధించిన యోగిని, విషయసాపేక్షములయిన హర్ష శోకాదు లేమియు బాధింపలేవు, అట్టి యోగులే ధీరశబ్ద వాచ్యులు.

మనస్సే సర్వదుఃఖములకు మూలము. సమస్తజ్ఞాన ములు మనోవృత్తిరూపములే గదా! మనోవిలయము కలిగి నపుడు ద్వైతభావమే యుండదనియీ క్రిందివచనము వలన తెలియుచున్నది.

"మనోవిజృంభితం సర్వం యత్కించిత్సచరాచరమ్ ।
మనసో హ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే ॥"

అమనస్కత సిద్ధించిన ధీరునకు గర్భదుఃఖ, జన్మదుఃఖ, జరా దుఃఖ, వ్యాధిదుఃఖ, మరణదుఃఖములుండవు.

పంచభూతాత్మకమైన యోగగుణప్రవృత్తి గల యోగికి రోగ జరా మరణాదులుండవు. యోగగుణ ప్రవృత్తి యననేమో యీ క్రింది శ్లోకము స్పష్టము చేయుచున్నది.

"జ్యోతిష్మతీ స్పర్శవతీ తథా రసవతీ పరా ।
గంధవత్యపరా ప్రోక్తా చతస్రస్తు ప్రవృత్తయః ॥
ఆసాం యోగప్రవృత్తీనాం యద్యేకాఽపి ప్రవర్తతే।
ప్రవృత్తయోగం తం ప్రాహు ర్యోగినో యోగ
చింతకాః ॥"

అగ్ని, వాయువు, జల, పృథివీ భూతములకు సంబంధించిన జ్యోతిష్మతి, స్పర్శవతి, రసవతి, గంధవతి యనునాలుగు ప్రవృత్తులు యోగికి కలుగును. ఈ నాలుగు యోగప్రవృత్తులలో ఏ యొక ప్రవృత్తి కలిగినను, యోగులు దానిని 'ప్రవృత్త యోగ' మని చెప్పుదురని భావము. అట్టి యోగగుణ ప్రవృత్తి గల యోగికి రోగ, జరా, మృత్యువు లుండవు.

## ౧౪౩. కామేశీ

శం. భా. కామేశీ । కామానాం భోగ్యపదార్థానాం యథాదృష్టం ఈష్టే ప్రేరయతీతి తథా॥ ఓం కామేశ్యై నమః॥

ఆం. వి. కామములను, అనగా భోగ్యపదార్థములను ప్రస్తుతము అనుభవనీయములుగా, ఉన్నవి యున్నటులుగా ప్రేరేపించునది, లేక శాసించునది గావున, పరాశక్తి 'కామేశీ' యనుచు భక్తులకు ధ్యాతవ్య యగుచున్నది.

## ౧౪౪. కామితార్థదా

శం. భా. కామితార్థదా । కామితాన్ సర్వార్థాన్ దదాతీతి తథా, 'ఆప్తకామః' ఇతి శ్రుతేః। సంసారదశాయాం మాయావృతానందస్య అనాప్తవత్ అవభాసమానస్య ఆత్యంతిక సుఖాత్మికా ముక్తిర్మే స్యాదితి కామ్యమానత్వాదాత్మనః కామితత్వమ్ । కామితశ్చాసౌ అర్థశ్చేతి తస్యైవ జ్ఞానస్య ఆవరణాభిభావకత్వేన ప్రాప్తప్రాప్తిరూపతయా తం దదాతి ప్రయచ్ఛతీతి ప్రకాశస్వరూపేణ అనుభావయతీత్యర్థః ॥ ఓం కామితార్థదాయై నమః ॥

అం. వి. అభీష్టార్థముల నొసంగునది గావున, జగన్మాత 'కామితార్థదా' యని స్తుతింపబడుచున్నది. 'ఆప్తకామః' యనుచు శ్రుతి 'పరమేశ్వరుడు ఆప్తకాముడని, పూర్ణకాము' డని చెప్పుట వలన పరమేశ్వరి జీవుల వాంఛితార్థములను తీర్చునదని భావము. సంసారదశలో అనగా, వ్యావహారిక దశలో అజ్ఞానముచేత ఆవృతమైన ఆనందస్వరూపము గల జీవుడు అనాప్తునివలె, అనగా ఏమియు లేని దరిద్రునివలె ప్రతీయమానుడగుచుండును. అట్టివాడు ఆత్యంతిక సుఖస్వరూపమైన ముక్తి నాకు కలుగవలెనని యభిలషించును గాన, ఆత్మకు కామితత్వము సిద్ధించును. ఆవరకమైన యజ్ఞానమును తొలగించునట్టి జ్ఞానస్వరూపముగల పరమేశ్వరియే ప్రాప్తమై యున్న వస్తువును ప్రాప్తింపజేయును. అందువలన జగజ్జనని ప్రకాశరూపిణియై (జ్ఞానస్వరూపిణియై) కామితార్థముల నను

భవింపజేయు చున్నది గావున ఆమెకు 'కామితార్థదా' యను నామ మన్వర్థమై విరాజిల్లుచున్నది.

## ౧౭౫. కామసంజీవనీ

శం. భా. కామసంజీవనీ। కామం మన్మథం పరమేశ్వరనేత్రాగ్నివిప్లుష్టం భండాసురాత నా అనేకకాల దేవలోక విపక్షం కామశాస్త్రప్రయోగసమయే రతీదేవీప్రార్థనసమీచీన తదీయపూర్వకాయం తపశ్చర్యాది పరిపాకఫలభూతం కరుణారసపూరితాపాంగావలోకనేన సంజీవయతి సప్రాణం కృత్వా తస్మై వరాదిప్రయచ్ఛతి; తేన తంహర్షయతీతితథా॥ ఓం కామసంజీవన్యై నమః॥

ఆం. వి. భండాసురరూపముతో చిరకాలము దేవలోక శత్రు వయిన మన్మథుడు పరమేశ్వర ఫాలనేత్ర సముద్భూతమైన యగ్నికీలలచే దగ్ధుడాయెను; మన్మథుని ప్రసూనశరఘాతములచేత వ్యాకులితచిత్తుడైన పరమశివుడు పార్వతీరూపముతో అవతరించిన పరాశక్తిని పరిణయమాడెను; రహఃక్రీడాసమయమున, రతీదేవి తన భర్తను సజీవునిగా చేయ జగన్మాతను ప్రార్థించెను; తత్ప్రార్థనా సామీచీన్యము వలన, రతీదేవి యొక్క తపశ్చర్యాదులచే పరిపక్వమైన ఫలరూపముగా, పరమేశ్వరి కరుణారసపూర్ణమైన యపాంగవీక్షణముతో దగ్ధమైన మన్మథుని పూర్వశరీరమును పునరుజ్జీవింప

జేసెను; ఆవిధముగా సజీవుని జేసి, యతనికి వరాదులనొసగి, సంతోషపరచెను. ఆకారణముచేత పరమేశ్వరి 'కామసంజీవనీ' నామముతో భక్తులచే భజనీయురాలగుచున్నది.

## ౧౪౭. కల్యా

శం. భా. కల్యా । కలయితుం ధ్యాతుం యోగ్యా ।
అథవా, సర్వోత్తమదేవత్వేన ధ్యాతుం యోగ్యా కల్యా । కలేః కామధేనుత్వేన యథావాంఛితార్థకారణమ్ ॥ ఓం కల్యాయై నమః ॥

అం. వి. ధ్యానయోగ్యగాన, 'కల్యా' యనబడును.

అథవా, సర్వదేవతామతల్లిగా ధ్యానయోగ్య, గాన 'కల్యా' యనియు చెప్పనగును. 'కవి' ధాతువునకు కామితార్థముల నీడేర్చుటకు గారణమైన కామధేనువనియర్థము. అందుచే పరాశక్తి 'కల్యా' యను నామముతో భక్తులచేత ఆరాధింపబడుచున్నది.

విశే .- 'కల్యా కళ్యాణవాచీ స్యాత్' 'కలాసునిష్ణాతా కల్యా', 'కలః కామధేనుః కవీనామ్" అను వచనముల తాత్పర్యము గూడ ఇచట యనుసంధేయము.

## ౧౪౮. కఠినస్తనమండలా

శం. భా. కఠినస్తనమండలా । స్తనయోః మండలే ఆవిమభాగౌ సాంతప్రదేశౌ, కఠినే అప్రకంపే అశిథిలే వా యస్యాః తథా ॥ ఓం కఠినస్తనమండలాయై నమః ॥

ఆం. వి. అతి కఠినములైన స్తన మండలములు గలది గావున, జగన్మాత 'కఠిన స్తనమండలా' యనుచు స్తవనీయ యగుచున్నది.

శ్లో॥ కరభోరుః కలానాథముఖీ కచజితాంబుదా ।
కటాక్షస్యందికరుణా కపాలిప్రాణనాయికా ॥ ౨౮

## ౧౪౮. కరభోరుః

శం. భా. కరభోరుః । కరభ ఇవ ఊరూ యస్యాః సా తథా । 'మణిబంధా దాకనిష్ఠం కరస్య కరభో బహిః' ఇతి ప్రమాణాదితి భావః ॥ ఓం కరభోరవే నమః ॥

ఆం. వి. కరభము వంటి యూరువులు (తొడలు) గలది గాన, దేవికి 'కరభోరుః' అను నామ మన్వర్థము. 'మణికట్టు మొదలుకొని చిటికెన వ్రేలు వఱకు గల చేతియొక్క క్రింది భాగము 'కరభ' మనబడును' అను వచనము వలన దేవి యొక్క యూరు భాగములు కరభము వంటివని తెలియనగును.

## ౧౪౯. కలానాథముఖీ

శం. భా. కలానాథముఖీ । కలాః చతుఃషష్టికలాః నాథయతి ప్రేరయతీతి కలానాథః, 'నిఃశ్వసిత మేతదృగ్వేదో యజుర్వేదః సామవేదః' ఇత్యాది శ్రుతేః 'శాస్త్రయోనిత్వాత్' ఇతి న్యాయాచ్చ । తాదృశం ముఖం వదనం యస్యాః సేతి

తథా । కలానాథశ్చంద్ర ఇవ యస్యాః సేతి వా ॥ ఓం కలానాథముఖ్యై నమః ॥

ఆం. వి. పరమేశ్వరుడు చతుఃషష్టికళలను ప్రేరేపించును గాన, కళానాథుడనబడును. 'నిఃశ్వసిత మేతత్' అనుచు 'ఋగ్వేద, యజుర్వేద, సామవేదములు పరమేశ్వరుని నిఃశ్వసితము' లని శ్రుతి చెప్పుచున్నది, 'శాస్త్రయోనిత్వాత్' అని బ్రహ్మసూత్రము. తాదృశ చతుః షష్టికళాప్రేరకమైన ముఖారవిందము గలది గాన, శ్రీ రాజరాజేశ్వరిని 'కళానాథముఖి' యనుచు ఉపాసకులు ఆనందపరవశులై గానము చేయుచుందురు.

అథవా, కళానాథుడనగా చంద్రుడు. చంద్రునివంటి షోడశకళాపూర్ణమైన సుందరవదనము గలదిగాన, దేవి 'కళానాథముఖి' యని స్తుతింపబడుచుండును.

## ౧౫౦. కచజితాంబుదా

శం. భా. కచజితాంబుదా। కచేన కేశభారేణ కబరేణ వేత్యర్థః ॥ జితాః అధరీకృతాః అంబుదా మేఘా యయా సా తథా; మేఘమండలాపేక్షయా ఊర్ధ్వగామి శిరోరుహభారా వ్యోమకేశీతి భావః ।

అథవా, కేశవృత్తినీలరూపేణ సాదృశ్యాసహత్వేన ధిక్కృతాః మేఘాః యయా సా తథా ॥

ఆం. వి. కేశభారము చేత, లేక కబరీ (కొప్పు) భారము చేత తిరస్కరింపబడిన మేఘములు గలదగుటంజేసి దేవి 'కచజితాంబుదా' యనుచు స్తవనీయ యగుచున్నది. మేఘ మండలము కంటె ఊర్ధ్వములయిన శిరోరుహభారము గల వ్యోమకేశి (ఆకాశమే కేశములుగా గలది) యని భావము.

అథవా, కేశము లందుండు నీలవర్ణము తోటి సాదృశ్య మును సహించలేకపోవుట వలన అధఃకరింపబడిన మేఘ మండలము గలదిగాన, 'కచజితాంబుదా' యను నామము దేవియందు సార్థకము. నీలమేఘము కంటె ఎక్కువ నీల వర్ణము గల కేశపాశము గలదని భావము.

శివునకు వ్యోమకేశుడను నామము ప్రసిద్ధము. కావున, శివాభిన్నురాలయిన పరదేవత గూడ 'వ్యోమకేశీ' యను నామముతో స్తోతవ్యయగుచున్నది.

## ౧౫౧. కటాక్షస్యందికరుణా

శం. భా. కటాక్షస్యందికరుణా। యద్యపి దీనేషు పరి పాల్యతాబుద్ధిః దేవానాం మహాతాం కరుణేత్యుచ్యతే, తథాఽపి తస్యాః ఆంతరత్వేన అజ్ఞాయమానతయా తేషు భక్త్యతిశయేన ప్రవృత్త్యర్థం సేవాద్వా తద్వ్యాప్తాజ్ఞానస్య ఆవశ్యక ఫలప్రదానాది హేతుతయా నిశ్చయేన తదనుగుణ సాత్త్విక వీక్షణ స్మేర సంభాషణాదిసత్త్వం తత్ర అవశ్యం భవతీతి కార్యసత్త్వప్రసంజిత కారణసత్త్వవత్త్వాత్, కరు ణాయాః నవరసేష్వంతర్భావాత్, రసశబ్దస్య మధురాద్యా

మాధత్వాత్ తేషా మనిర్వచనీయత్వేఽపి అనుభవగోచర తాయాం ఇక్ష్వాది సారద్రవ్య పదార్థనిష్ఠత్వోపలబ్ధేః తత్సం బంధవశాత్ పరంపరయా ద్రవద్రవ్యనవృత్తి స్యందనరూప క్రియాశ్రయత్వ ముపచర్యతే। తథాచ కటాక్షస్యందినీ కరుణా పరిపాల్యతాబుద్ధిరూపా యస్యాః సా తథా ॥ ఓం కటాక్ష స్యంది కరుణాయై నమః ॥

అం. వి. దీనులపట్ల మహాత్త్వసంపన్నులయిన దేవతలకు కల పరిపాల్యతాబుద్ధి కరుణ యనబడును; అయినను ఆ కరుణ యాంతరమైన దగుట వలన ఎవరికిని తెలియునది గాదు. అందు వలన భక్త్యతిశయముతో వారి సేవాదుల యందు ప్రవర్తిం చుటకై 'దేవతలు కరుణాసముద్రు' లనెడి జ్ఞానము ఆవశ్యక మైన ఫలము నొసగుటలో హేతువగును. అందువలన నిశ్చయముగా తదనుగుణము, సత్త్వగుణసంపన్నము నయిన వీక్షణ, మందహాస, సంభాషణాదులు దేవతలలో తప్పనిసరిగా ఉండియుండును. వలన, కార్యము నందు గన్పట్టునదికారణము నందు తప్పక యుండితీరవలయును. అనగా దేవతలు భక్తుల పట్ల కరుణ చూపించుచున్నందున, వారిలో తప్పనిసరిగా కరుణరసము ఉండి తీరవలయునని భావము. కరుణ నవరసములలో ఒక రసముగా అంతర్భూతము. రసశబ్దము మధుర రసాదులయందు రూఢము. తన్మధురాదిరసములు అనిర్వచనీయములయినను, అనుభవముచేత చెరకుగడ మొద లగు పదార్థముల సారముగా ఆ ద్రవ్యముల యందు ఉండుట

మనకు తెలియుచున్నది. తత్సంబంధము వలన పరంపరయా ప్రసప్రసన్యస్తమైన స్రవించుట యను క్రియకు కటాక్షము ఆశ్రయ మగుచున్నది; అనగా స్రవించుట యను క్రియ కటాక్షమునందు ఆరోపిత మగుచున్నది. కాగా, క్రీగంటి చూపులందు స్రవించుచు, భక్తులను కాపాడవలయునను బుద్ధి రూపమైన కరుణ గలది గావున, జగన్మాతకు 'కటాక్షస్యంది కరుణా' యను నామ మన్వర్థము.

## ౧౫౧. కపాలిప్రాణనాయికా

శం. భా. కపాలిప్రాణనాయికా । కపాల మస్యాస్తీతి కపాలీ ఆనందభైరవః, తస్య ప్రాణనాయికా, ప్రాణస్యేత్యుప లక్షణం పంచానామ్ । నాయికా అధిష్ఠానత్వేన ప్రేరకా ।

"న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన ।
ఇతరేణ జీవన్తి యస్మిన్నేతా వుపాశ్రితౌ॥ "

ఇతి శ్రుతేః । తస్యాపి హృదయాంతర్వర్తి పరమేశ్వరరూపేతి యావత్ । ప్రాణవల్లభేతి వా; ప్రియేతి భావః ॥ ఓం కపాలి ప్రాణనాయికాయై నమః ॥

ఆం, వి. కపాలము గలవాడు (కపాలమును చేతిలో ధరించినవాడు) గావున, కపాలి, ఆనందభైరవుడు; కపాలధారి యైన ఆనందభైరవుని యొక్క ప్రాణనాయికగాన, పరమేశ్వరి కపాలిప్రాణనాయిక; ప్రాణశబ్దము పంచ ప్రాణములకు-ప్రాణ,

అపాన, వ్యాన, ఉదాన, సమానములకు ఉపలక్షణము. 'నాయికా' యనగా అధిష్ఠానరూపిణియై పంచప్రాణములను వానివాని కార్యము లందు ప్రవర్తింపజేయునది.

'న ప్రాణేన నాపానేన' అనుచు శ్రుతి 'ఏ మానవు డయినను, ప్రాణాపానములవలన జీవించుట లేదనియు, ప్రాణాపానముల రెండింటికి ఆధారమై తద్వ్యతిరిక్తమైన మఱియొక తత్త్వముచేత జీవించుచున్నా' డనియు చెప్పుచున్నది. ఆనంద భైరవుని హృదయాంతర్వర్తియై ప్రేరణ చేయునది ఆ పరమే శ్వరియే యని భావము; ప్రాణసదృశముగా పరమేశ్వరునకు ప్రియమైనదనియు చెప్పవచ్చును. పరమేశ్వరి 'కపాలిప్రాణ వల్లభ' గాన, 'కపాలిప్రాణనాయికా' యనుట సుసంగతము'

విశే :- "అకృశం కచయోః కృశం వలగ్నే
విపులం చక్షుషి విస్తృతం నితంబే ।
అధరేఽరుణ మావిరస్తు చిత్తే
కరుణాశాలి కపాలిభాగధేయమ్॥"

అని దేవీస్తవ వచనము. పర్వతసదృశమైన స్తనమండలము గలది, కృశించిన నడుము గలది విశాల నేత్రములు గలది, పృథుల నితంబము గలది, అరుణాధరములు గలది. కరుణా సాగరయు నయిన పరమేశ్వరి కపాలపాణియై భిక్షాటనము చేయునట్టి కపాలి యొక్క అదృష్టదేవత. తాదృశభాగధేయ రూపిణి నిరంతరము మన హృదయమున ప్రకాశించుగాక యని కవి తను యనుభూతిని వివరించి యున్నాడు.

'కపాలీ' యనగా కపాలము నందు (సహస్రారము నందు) ఉండు బ్రహ్మతేజము ఆ బ్రహ్మతేజము యొక్క యంశరూపముతో పరమేశ్వరీతత్త్వము శరీరావయవముల యందువ్యాపించి యున్నది. కపాలములోనుండు బ్రహ్మతేజము నిర్గుణముగావున, శుద్ధ సత్త్వప్రధానమై తెల్లగా నుండును.

'అధరే అరుణం' - క్రిందికి అనగా పార్థివ శరీరము లోనికి వ్యాపించిన దేవీతత్త్వము రజోగుణాది మిశ్రితమై యుండును. కావున,అరుణవర్ణాంచితమైయెవిలసిల్లుచుండును. స్తన మండలమందు (స్తనములకు నధిష్ఠానమైన హృదయమందు) బ్రహ్మ తేజము విస్తారముగా వ్యాపించి యుండును. కటి ప్రదేశము నందు అంతకంటె కొంచెము తక్కువగా వ్యాపించి యుండును. ఆ బ్రహ్మతేజస్సు నేత్రముల యందు విశాలముగా వ్యాపించి యుండును, (విశాలనేత్రములు గలవారు జ్ఞాను లగుదురని సాముద్రిక శాస్త్రము.) ఆ తేజస్సు నితంబముల యందువిస్తారముగా వ్యాపించి యుండును.

నితంబస్థానము శక్తికూటము; మోక్షార్థులకు పరమే శ్వరి యొక్క నితంబభాగము ఉపాసనీయము. వేదవ్యాస భట్టారకుడు శక్తికూటస్థానమైన పరమేశ్వరీ నితంబభాగమును ఉపాసించి మహాభారతరచన చేసెనని శ్రీహర్షకథనము.

పరమేశ్వరీముఖస్థానము వాగ్భవకూటము. తాదృశ వాగ్భవకూటమును నారదుడు ఉపాసించె ననియు, మధ్య

భాగమైన మధ్యకూటమును భృగుమహర్షి యుపాసించి సర్వై శ్వర్యసంపన్నుడయ్యె ననియు చెప్పుదురు.

'ఊర్ధ్వమూల మధశ్శాఖ' మని గీతావచనము. కపాలి స్థానము శరీరమునకు పైన ఉన్న సహస్రారము. అదియీశ్వర రూపము. అచట గుణముల ప్రసక్తిలేదు; ఆ తేజము పరాశక్తి రూపమున సర్వావయవముల యందు వ్యాపించినపుడు సర్వ గుణములు, కరుణాదిరసములు పరమేశ్వరి యందు అభివ్యక్త మగును; కావున నిరంతరము పరమేశ్వరి నుపాసించి, బ్రహ్మా త్మైక్యానుభూతి నొందవలెనని భావము.

శ్లో॥ కారుణ్యవిగ్రహా కాంతా కాంతిధూతజపావలిః ।
కలాలాపా కంబుకంఠీ కరనిర్జితపల్లవా ॥ ౨౯

## ౧౫౩. కారుణ్యవిగ్రహా

శం. భా. కారుణ్యవిగ్రహా । కారుణ్యం పూర్వోక్త కృపా, కరుణస్య భావః. తత్ విగ్రహః మూర్తిః యస్యాః సేతి తథా । కారుణ్యస్య అంతఃకరణపరిణామ బుద్ధిరూపత్వేన నేత్రాంతపేక్షా సస్మితభాషాదినా అనుమీయమానత్వేఽపి సాక్షాత్ తజ్జన్య మనోవాంఛిత వరప్రదానాదీనాం శరీరావ యవవిశేషజన్యతయా కారుణ్యం విగ్రహో యస్యాః సేతి సమాసోపపత్తిః। మాయోపాధికస్య బ్రహ్మణః జగత్సృష్ట్యను కరణహేతుభూత స్వేచ్ఛామాత్రానిమిత్తక కర్మానధీన

సచ్చిదానందఘనీభూతాత్మక భక్తానుగ్రాహక విగ్రహవత్త్వాం వినా దేవతాయాః బుద్ధా వనారోపేణ సగుణోపాసన మనుప పద్యమానం స్యాత్; తదర్థం దేవతాధికరణే మంత్రప్రకాశితా దేవాః 'వజ్రహస్తః పురందరః' ఇత్యాది స్వతఃప్రమాణ వేద వాక్యవశాత్ బాధకాభావే విగ్రహవంతః అంగీకర్తవ్యా ఇతి ప్రతిష్ఠాపితమ్। తథా 'బహుశోభమానా ముమాం హైమవతీ' మితి కేనోపనిషద్భాష్యే హైమాని హేమవికారాణి భూష ణాని యస్యాః సేతి వా తథా, హిమవతః అపత్యం స్త్రీ ఇతి చ తథేతి పరదేవతాయాః దివ్యవిగ్రహవత్త్వం ప్రతిష్ఠాపితమ్। తథాచ మహానుభావానాం స్వప్రకాశ చైతన్యరూపాణా మేనం భూతానాం సర్వాత్మనా సర్వోత్తమానాం మూర్తిత్రయ దేవానాం ధ్యానాద్యుపకారాయ తాదృశమూర్తిమత్త్వ మస్తీతి న కించి దనీశ్వరవాదప్రసంగావకాశ ఇతి ఆస్తాంవిస్తరః॥

ఆం. వి. కారుణ్య మనగా పూర్వనామ మందు వివ రింపబడిన దయ, కరుణయొక్క భావము కారుణ్యము. కారు ణ్యమే శరీరముగా గలది గాన, పరాదేవి 'కారుణ్యవిగ్రహా' యను నామముతో ప్రసిద్ధము. అంతఃకరణపరిణామమైన బుద్ధి వృత్తిరూపమే కారుణ్యము; క్రీగంటిచూపు, మందహాస పూర్వకమైన భాషణాదుల చేత అనుమీయమానమైనను (ఊహింపబడినను), కారుణ్యము వలన కలిగిన అభీష్టవరప్రదా నాదులు శరీరము నందలి యవయనవిశేషముల చేత కలుగుట వలన కారుణ్యము శరీరముగా గలదను సమాసము యుక్తి

సహామేయని తెలియవలయును. మాయోపాధికమైన బ్రహ్మకు ప్రపంచసృష్టి యొక్క యనుకరణమునకు హేతుభూతము, స్వేచ్ఛామాత్రమే నిమిత్తముగా గలది, కర్మాధీనము కాని, ఘనీభూత సచ్చిదానంద స్వరూపము, భక్తుల ననుగ్రహించు నట్టిదియు నగు విగ్రహవత్త్వము (శరీరమునుధరించియుండుట) లేకపోయినను, మఱియు దేవతను బుద్ధియందు నారోపించక పోయినను సగుణోపాసనము అనుపపన్నము కావలసి యుండును; ఈ అనుపపత్తిని నివారించుటకై బ్రహ్మసూత్ర భాష్యము నందలి దేవతాధికరణములో మంత్రప్రకాశితు లైన దేవతలు 'వజ్రహస్తః పురందరః' - 'పురందరుడు (ఇంద్రుడు) వజ్రహస్తుడు' మొదలయిన స్వతఃప్రామాణ్యము గల శ్రుతివాక్యముల వలన, బాధకములయిన హేతువులు లేకపోవుట వలన శరీరము గలవారుగా అంగీకరింప నగునని ప్రతిష్ఠాపింపబడినది. మఱియు, 'బహుశోభమానా ముమాం హైమవతీమ్' - 'అతిశోభమాన, హిమవంతుని పుత్రికయైన ఉమాదేవిని' అనుచు కేనోపనిషద్భాష్యము నందు హేమ వికారములయిన (బంగారముతో చేయబడిన) ఆభరణములు గలదిగాన, హైమవతి యనియు హిమవంతుని పుత్రిక యనియు చెప్పి, పరదేవత దివ్యశరీరధారియై యుండుట నిరూపింపబడి నది. కాగా, ఏవంవిధమైన మహామహిమసంపన్నులు, స్వయం ప్రకాశమాన చైతన్యస్వరూపులు, సర్వాత్మనా సర్వశ్రేష్ఠులు నయిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు, దేవతలకు ధ్యానాది

సాకర్యమునకై తాదృశమైన శరీరధారణము గలదనుటలో అనీశ్వరవాదులు చేసే ప్రసంగములకు ఈషణ్మాత్రమైనను అవకాశము లేదనుచు ఇంకను విస్తరింపక విరమించుచున్నాము.

## ౧౫౪. కాంతా

శం. భా. కాంతా । 'కన దీప్తౌ' ఇతి ధాతోః అత్యంత మనోహరతమేత్యర్థః । మదనగోపాలవిగ్రహా వా ।

"కదాచి దాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా ।
వంశీనాదవినోదేన కరోతి వివశం జగత్ ॥"

ఇతి త్రిపురతాపనీయే ॥ ఓం కాంతాయై నమః ॥

ఆం. వి. 'కన దీప్తౌ' అను ధాతువు వలన 'కాంతా' యను రూపము సిద్ధించును. మనోహరములైనవారిలో అత్యంతము మనోహరమైనది, లేక మదనగోపాలశరీరము గలదిగాన, దేవి 'కాంతా' యను నామముతో ప్రసిద్ధము.

'ఒకప్పుడు ఆద్యశక్తియైన లలితాదేవి పురుషవేషముతో కృష్ణవిగ్రహయై యవతరించి, వేణునాద వినోదముతో సమస్త ప్రపంచమును పరవశింపచేయుచున్నది' అని త్రిపుర తాపనీయోపనిషత్తు చెప్పుచున్నది.

## ౧౫౫. కాంతిధూతజపావలిః

శం. భా. కాంతిధూతజపావలిః। జపానాం జపాపుష్పాణాం, ఉపలక్షణ మన్యేషా మారక్తవర్ణానామ్, ఆవలిః పంక్తిః

దృష్టాంతత్వేన కవిభి రుత్ప్రేక్షితా । కాంత్యా అప్రాకృతి స్వచ్ఛ పరమానంద చిద్భాసా ధూతాః పరిత్యక్తాః ప్రాకృత త్వేన అల్ప కాంతిమత్తయా ఉపమాన యోగ్యతయా యయా సా; 'నహి మహాంతో నీచై రుపమీయంతే' ఇతి న్యాయాదితి భావః ॥ ఓం కాంతిధూతజపావళ్యై నమః ॥

ఆం. వి. జపాకుసుమములు పరమేశ్వరి శరీరచ్ఛాయకు కవులచే దృష్టాంతముగ చెప్పబడును. జపాకుసుమము ఎఱ్ఱని రంగు గల కింశుకాది పుష్పములకు ఉపలక్షణము. పరమేశ్వరి శరీరచ్ఛాయ అప్రాకృతము, స్వచ్ఛపరమానందరూపచైతన్య ప్రకాశము; జపాపుష్పమో, ప్రాకృతము, అల్పకాంతి మంతము. ఆ కారణముచేత అవి యుపమానముగా చెప్పుటకు యోగ్యములుకానపున, గాపని, పరమేశ్వరి తన చైతన్యప్రకాశముచేత వానిని పరిత్యజించినది. తల్లి 'కాంతిధూతజపావళిః' యనుచు స్తుతింపబడుచున్నది. 'మహాత్ములను అల్పులతో పోల్చరా' దనియు ఆలంకారికన్యాయము.

## ౧౪౬. కలాలాపా

శం. భా. కలాలాపా కలాః చతుఃషష్టికలాః ఆలాపో వ్యావహారికశబ్దః యస్యాః సా తథా. 'వేదశాస్త్రమయీ వాణీ యస్యాః సా పరదేవతా' ఇతి వచనాత్ !

కలః అవ్యక్తమధురః సప్రయోజనః ఆలాపః సంలాపో యస్యాః సేతి వా తథా, 'అవ్యక్తా భారతీ తథా' ఇతి మహాపురుష సాముద్రికవచనాత్ ॥ ఓం కలాలాపాయై నమః ॥

ఆం. వి. చతుఃషష్టి కళలు వ్యావహారిక శబ్దములుగా గలది గాన, పరమేశ్వరికి 'కలాలాపా' యను నామ మర్థవంతము. 'వేదశాస్త్రమయమైన వాణి గలది పరదేవత' యని అభియుక్త వచనము.

అవ్యక్తమధురము. ప్రయోజన సహితము నయిన సంలాపము గలదగుటంజేసి దేవి 'కలాలాపా' యనిసంకీర్తితురాలగుచున్నది. 'అవ్యక్తమధురమైన వాణి కలిగియుండుట ఉత్తమ స్త్రీ లక్షణ' మని సాముద్రిక శాస్త్రవచనము.

## ౧౫౭. కంబుకంఠీ

శం. భా. కంబుకంఠీ । కంబుశబ్దేన అత్ర శంఖనిష్ఠ రేఖాత్రయం లక్ష్యతే । తద్వాన్ కంఠః యస్యాః సేతి తథా; గుణనామేదమ్ ॥ ఓం కంబుకంఠ్యై నమః ।

ఆం. వి. ఈ నామము నందలి 'కంబు' శబ్దము శంఖము నందుండు రేఖాత్రయమును లక్షణయా చెప్పుచున్నది. తాదృశమైన కంఠము గలదిగాన, పరమేశ్వరి 'కంబుకంఠీ' యని గానము చేయబడుచున్నది. పరమేశ్వరి గుణపరిచాయకమైన నామ మిది.

## ౧౫౮. కరనిర్జితపల్లవా

శం. భా. కరనిర్జితపల్లవా । కరశబ్దేన కరతలంలక్ష్యతే। పల్లవశబ్దేన తన్నిష్ఠపాటల్యం స్నిగ్ధతా లక్షణయా ఇత్యర్థః।

తథాచ అన్యోన్యగుణయోః జయపరాజయో, అర్థాత్తద్వతో రపి తౌ సిద్ధావితి తన్నామోపపత్తిః । 'వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే' ఇతి వచనాత్ కరతలే తత్సామ్య ధ్వని రనేన నామ్నా కృతః । కరేణ నిర్జితాః పల్లవాః యస్యాః సా తథా ॥ ఓం కరనిర్జిత పల్లవాయై నమః ॥

ఆం. వి. కరశబ్దము చేత అరచేయి సూచిత మగును, పల్లవశబ్దము చేత తన్నిష్ఠపాటలత్వము (చిగురుటాకు నందలి యెఱ్ఱదనము), స్నిగ్ధత్వము (మృదుత్వము) లక్షణాయాద్యోతన మగునని తెలియవలెను. కాగా, ఆ గుణములకు జయపరా జయములు కలిగినపుడు, ఆ గుణములు గల కరతలమునకు, పల్లవమునకు గూడ జయపరాజయములు అర్థాత్తు సిద్ధించును; కాన, ఈ నామము ఉపపన్నమే యని తెలియనగును. 'వివా హము, వివాదము సములయందే శోభించును' అను నానుడిని బట్టి అరచేతియందు ఈ నామము ద్వారా కిసలయము ధ్వనిత మగుచున్నది. అరచేతుల యందలి యరుణిమతో చిగురు టాకుల ఎఱ్ఱదనమును నిర్జించిన దగుటంజేసి పరాదేవి 'కర నిర్జితపల్లవా' యని కీర్తింపబడుచున్నది. పరదేవత యొక్క కరతలమునందు పల్లవసామ్య ముండుట వలననే యామె 'కరనిర్జితపల్లవా' యని ప్రసిద్ధి నొందెనని భావము.

శ్లో॥ కల్పవల్లీసమభుజా కస్తూరీతిలకాంచితా ।
హాకారార్థా హంసగతి ర్హాటకాభరణోజ్జ్వలా ॥

## ౧౫౯. కల్పవల్లీసమభుజా

శం. భా. కల్పవల్లీసమభుజా। యథాదివ్యవృక్షానందనోద్యానేప్రసిద్ధాః తథా తదలంకారాయ వల్ల్యాదయోఽపి, కల్పయంతి సంపాదయంతీతి కల్పాః, కల్పాశ్చ తా వల్ల్యశ్చ ప్రవతత్యః, తాభిః సమాః భుజాః హస్తాః యస్యాః సాతథా। కవిసంప్రదాయప్రాప్త్యా (స్త్రీ) భుజానాం వల్లీసామ్యోక్తిరితి మంతవ్యమ్ । అత్ర సమపదస్వారస్యేన తేషామపి తదవచ్ఛిన్నచైతన్యద్వారా యథాప్రారబ్ధం చేతనవల్లోకవాంఛితఫలకర్తృత్వ మితి ధ్వనితమ్ । 'ఏక స్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ' ఇతి శ్రుతేః । 'తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్' ఇతిస్మృతౌ చ భగవతా స్వకీయ సచ్చిదానంద స్వరూపావస్థితి రేవోక్తా। అత ఏవ పరదేవీభుజానాం నైవ సామ్యోక్తిరితి శంకా నిరస్తా వేదితవ్యా, ఔపాధిక చైతన్యేన తథాభూత చైతన్యస్య సామ్యోపపత్తేః ॥ ఓం కల్పవల్లీసమభుజాయై నమః ॥

ఆం. వి. నందనోద్యానవనము నందుదివ్యవృక్షములు ప్రసిద్ధములై యున్న రీతిగనే, యా దివ్య వృక్షముల (కల్పవృక్షముల) యలంకారమునిమిత్తములతలుగూడ ప్రసిద్ధములై యున్నవి. కోరిన వస్తువులను సృష్టించి యర్థించినవారి కొసగునవిగాన, కల్పము లనబడును, అభీష్టవస్తువులను కల్పించి

(సృష్టించి) యొసగునట్టి లతలు గాన, కల్పవల్లులతో సమాన మైన భుజములు గలదగుట వలన పరమేశ్వరికి 'కల్పవల్లీ సమభుజా' యను నామము ప్రసిద్ధము. కవిసంప్రదాయము ననుసరించి స్త్రీభుజములకు లతాసామ్యము చెప్పబడు నని తెలియనగును. ఇట, 'సమ' పదస్వారస్యముచేత ఆ వృక్షము లకు సయితము తదవచ్ఛిన్నమైన (ఆ వృక్షములయందు వేలు వేలుగా వ్యాప్తమై యున్న) చైతన్యముద్వారా ప్రారబ్ధకర్మ ఫలము ననుసరించి సచేతనప్రాణుల యభీష్టఫలప్రదాతృత్వ రూపమైన కర్తృత్వము. 'ఏక స్తథా సర్వభూతాంతరాత్మా రూపం ప్రతిరూపో బహిశ్చ' - 'సర్వభూతాంతరాత్మగా వ్యాపించియున్న పరమేశ్వరుడొకడే బాహ్యముగా ప్రతి శరీరము నందు భిన్నరూపములతో ఉన్నా' డని శ్రుతి స్పష్ట ముగా చెప్పుచున్నది. 'తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశ సంభవమ్' - 'లోకమున ఉన్నదంతయు నా తేజస్సుయొక్క యంశతో సృష్టమైనదని తెలిసికొనుము' అను గీతావచనము నందు శ్రీకృష్ణపరమాత్మ సమస్త బ్రహ్మాండములో స్వీయ సచ్చిదానందస్వరూపావస్థితినే చెప్పెను. కావుననే, పరదేవతా భుజములకు సాదృశ్యము చెప్పుట సంగతము కాదను శంక పరాస్తమైనదని తెలియనగును. ఔపాధిక (సర్వ శరీరముల యందున్న) చైతన్యముతో పరమేశ్వరీ చైతన్యమునకు పోలిక చెప్పుట యుపపన్నమే యని భావము.

## ౧౬౦. కస్తూరీతిలకాంచితా

శం. భా. కస్తూరీతిలకాంచితా । కస్తూరీతిలకేన లలాట దేశసంస్థాపిత బిన్ద్వాకార మృగనాభినా అంచితా చిహ్నితా అలంకృతేత్యర్థః ॥ ఓం కస్తూరీతిలకాంచితాయై నమః ॥

ఆం. వి. ఫాలభాగమునందు పెట్టుకొనిన చుక్కవలె గుండ్రముగా ఉన్న కస్తూరీతిలకముతో అలరారుచుండుట వలన 'కస్తూరీతిలకాంచితా' యనుచు పరమేశ్వరి యొక్క లోకాతిశాయి ముఖసౌందర్యము కీర్తింపబడుచున్నది.

## ౧౬౧. హకారార్థా

శం. భా. హకారార్థా । హకారస్య ఆకాశబీజస్య అర్థా, అర్థః స్వరూపచైతన్యమ్, ఆకాశవిగ్రహేత్యర్థః । 'ఆకాశో హ వై నామ నామరూపయో ర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ' ఇతి శ్రుతేః ॥ ఓం హకారార్థాయై నమః ॥

ఆం. వి. ఆకాశబీజమైన 'హ' వర్ణమునకు అర్థము స్వరూపచైతన్యము; కావున దేవి 'ఆకాశవిగ్రహా' యని స్తుతింపబడుచున్నది.

ఈ 'హ' బీజము పంచదశీమంత్రము నందలి ద్వితీయ కూటములోని చతుర్థవర్ణము. ఆకాశబీజమైన 'హ' కారము పరమేశ్వరీ స్వరూపచైతన్యవాచకబీజ మని తెలియవలెను.

## ౧౬౨. హంసగతిః

శం. భా. హంసగతిః హంతి। గచ్ఛతీతిహంసః ఆదిత్యో వా । హంసస్య ప్రాణస్య గతిః గమనాగమనే లక్షణయా తజ్జాప్యాజపామంత్రరూపా యస్యాః సా తథా; 'హకారేణ బహిర్యాతి సకారేణ పునర్విశేత్' ఇతి వచనాత్ ।

యద్వా, తదభిమానదేవతారూప అగ్నిషోమాత్మక సూర్యచంద్రగతి అహోరాత్రాత్మక కాలస్వరూపాయాః యస్యాః సా తథా ।

అథవా, హంతి దేహాద్దేహాంతరం గచ్ఛతి స్వకర్మవశేనేతి హంసో జీవః తస్య గతిః, ప్రాప్యస్థానం ముక్తిరిత్యర్థః, 'బ్రహ్మవిదాప్నోతి పరమ్', 'యద్గత్వా న నివర్తంతే' ఇతి శ్రుతిస్మృతివచనాత్ ।

అథవా, హంతి స్వకార్యభూతం జగత్ప్రవిశతీతి హంసః 'హంసస్తు పరమేశ్వరః' ఇతి నృసింహతాపనీయే । గమ్యతే ప్రాప్యతే శరణత్వేన ప్రపద్యతే చతుర్విధభక్తైరితి గతిః । హంసశ్చాసౌ గతిశ్చేతి సామానాధికరణ్యసమాసః, 'హగ్ంసశ్శుచిషత్' ఇతి శ్రుతేః ।

ఆహోస్విత్, హంసస్య బ్రహ్మవాహనస్య గతిరివ గమనం యస్యాః సా తథా ।

ఉతాహో, హంసశబ్దేన నామైకదేశేన హంసకం పాదకటకముచ్యతే; గమ్యతే అనేనేతి గతిః చరణమ్; హంసయుక్తే గతీ పదారవిందే యస్యాః సా తథా ।

యద్వా, హంసశబ్దేన నిత్యానిత్య సారాసార జడాజడాది వస్తువివేకసమర్థాః, హంతి గచ్ఛంతి ప్రతిగ్రామం ప్రతిదేశ మితి హంసాః పరివ్రాజకాః చతుర్థాశ్రమిణఃనిష్కామాః, తేషాం గతిః గమ్యతే జ్ఞాయతే సాక్షాత్క్రియత ఇతి గతిః; 'సంన్యాసయోగా ద్యతయశ్శుద్ధసత్త్వాః' ఇతి శ్రుతేః । 'యే పూర్వం వేదా ఋషయశ్చ తద్విదుః తే తన్మయా అమృతా వై బభూవుః' ఇతి శ్రుతేః । జీవన్ముక్త పురుషానుభూయమాన పరమానందముక్తిస్వరూపేత్యర్థః ॥ ఓం హంసగత్యై నమః ॥

ఆం. వి. హంస శబ్దమునకు ప్రాణము, లేక ఆదిత్యుడు అని యర్థము (హంతి గచ్ఛతీతి హంసః). హంస యొక్క, అనగా ప్రాణము యొక్క గమనాగమనములు (రాకపోకలు) లక్షణావృత్తి చేత తజ్జాప్యమైన (ఆ ప్రాణముచే జపింపదగిన) అజపాగాయత్రీ మంత్రరూపముగలదిగాన, పరమేశ్వరి 'హంసగతిః' యను నామముతో ప్రసిద్ధినందినది; 'హకారేణ బహిర్యాతి సకారేణ పునర్విశేత్' - 'ప్రాణము 'హ' కారముతో బయటకు వచ్చును, 'స' కారముతో పునః లోపలకు ప్రవేశించును' అను వచనము వలన ప్రాణగమనాగమనములు తెలియుచున్నవి.

పక్షాంతరమున, ప్రాణాభిమాన దేవతా రూపులు, అగ్నిషోమాత్మకులు నయిన సూర్యచంద్రుల గతులు అహో

శాస్త్రాత్మక కాలస్వరూపిణియైన పరమేశ్వరికి గలవు గాన, జగన్మాతకు 'హంసగతిః' యను నామము ప్రసిద్ధము.

అథవా, హంస యనగా జీవుడు, అతడు ప్రారబ్ధ కర్మానుసారము ఒక దేహమును విడచి మఱియొక దేహము నందు ప్రవేశించును గావున, అతనికి 'హంసః' యనినామము. అట్టి జీవునియొక్క గతి, అనగా గమ్యస్థానమైన మోక్షమని యర్థము. 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' - 'బ్రహ్మవేత్త పరమ పదమును - మోక్షమును పొందును, 'యద్గత్వా న నివర్తతే' 'అట్టి పరమ పదమును పొందినవాడు మఱల తిరిగిరాడు' అను శ్రుతిస్మృతి వచనముల వలన పరమేశ్వరి జీవునకుపరమప్రాప్య స్థానమని స్పష్టముగా తెలియుచున్నది.

అథవా, పరమేశ్వరుడు తనచే సృజింపబడిన ప్రపంచ మున ప్రవేశించునుగాన, 'హంసః' యనబడును. 'హంసస్తు పరమేశ్వరః' - 'హంస యనగా పరమేశ్వరుడు' అని నృసింహ తాపనీయోపనిషత్తు చెప్పుచున్నది. 'గమ్యతే ప్రాప్యతే ఇతి గతిః' - 'నాలుగు విధములయిన భక్తులచేత (ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని) శరణు పొందబడునదిగాన, 'గతిః'యనబడును' 'హంసగతిః' యని సామానాధికరణ్య సమాసము, 'హంసః శుచిషత్' - 'కాశ్యాది అవిముక్త క్షేత్రములయందు నుండు నది 'హంస' యని శ్రుతి వచనము.

పక్షాంతరమున, బ్రహ్మవాహనమైన హంసయొక్క నడకవంటి నడక గలదగుటచేత 'హంసగతిః' యనిచెప్పబడును.

మఱియొక పక్షమున, 'నామైకదేశే నామగ్రహణమ్' అను న్యాయము ననుసరించి 'హంసక' శబ్దముచేత చెప్పబడు కాలియందె హంసశబ్దముచేతవివక్షితమగును. కాలియందెతో గమనము గలదిగాన, గతి, యనగా పాదమని యర్థము, హంసయుక్తమైన (అందెలతో గూడిన) పాదారవిందములు గలది గాన, పరమేశ్వరి 'హంసగతిః' యను నామముతో భజనీయ యగుచున్నది.

యద్వా, నిత్యము-అనిత్యము, సారము-సారరహితము, జడము-చేతనము మొదలగు వస్తువులను వివిక్తముగా చూడగలుగు సమర్థులు హంస శబ్దముచే వివక్షితులగుదురు, అట్టి వివేకము గలవారు ఒక గ్రామమునుండి మఱియొక గ్రామమునకు, ఒక దేశము నుండి మఱియొక దేశమునకు బోవుదురు గాన, హంస శబ్దవాచ్యులు; వారు పరివ్రాజకులు, నాల్గవ యాశ్రమ ధర్మమైన సంన్యాసమును గైకొనినవారు, నిష్కాములు; తాదృశులైన సంన్యాసులకు గతి పరమేశ్వరి, అనగా వారిచేత తెలిసికొనబడునది, సాక్షాత్కరించుకొనబడునది గావున, సచ్చిదానందస్వరూపిణి యగు దేవి 'హంసగతిః' యను నామముతో వ్యవహరింపబడును. 'సంన్యాసయోగాత్ యతయః శుద్ధసత్త్వాః' - 'శుద్ధ సత్త్వము గల యతీశ్వరులు సంన్యాసయోగము వలన పరమేశ్వరుని పొందుచున్నారు' అని శ్రుతివచనము. 'యే పూర్వం దేవా ఋషయశ్చ' అనుచు శ్రుతి 'పూర్వము వేదదర్శనముగల ఋషులు బ్రహ్మవస్తువును

తెలిసికొని (బ్రహ్మస్వరూపులై యమృతత్వమును పొంది) రని చెప్పుచున్నది. జీవన్ముక్తులైన వారిచేత అనుభవింపబడు చున్న పరమానందరూపమైన ముక్తియే స్వరూపముగా గలది పరమేశ్వరి యని భావము.

విశే :- 'హంస హంసేతి యో బ్రూయాత్ హంసో నామ సదాశివః' అని యభియుక్తోక్తిః ఇదియే అజపాగాయత్రి. దీనికి ప్రాణగతి యని నామము కలదు. 'గాయంతం త్రాయత ఇతి గాయత్రీ'-జపముచేయువానిని రక్షించునదిగాన, గాయత్రి యనబడును అహోరాత్రములు అప్రయత్నముగా నిరంతరము ప్రాణగతి (హంస మంత్రజపము, లేక అజపాగాయత్రీజపము) సాగుచునే యుండును. సూర్యోదయాది సూర్యోదయ పర్యంతము 21,600 పర్యాయములు ఉచ్ఛ్వాస నిఃశ్వాస రూపమున ప్రాణసంచారము జరుగుచుండును. 'అద్య సూర్యోదయ మారభ్య పరేద్యుః సూర్యోదయపర్యంతం అజపాగాయత్రీ మహామంత్రజప మహం కరిష్యే' యని ప్రతిదినము సంకల్పము చేయవలయును. ఈ శ్వాసప్రశ్వాసలను ఈ రీతిగా విభజించ వలయును. మూలాధారమున కధిష్ఠానదైవమైన గణపతికి 600, స్వాధిష్ఠానమున కధిదైవతమైన బ్రహ్మకు 6000, మణిపూరమున కధిపతియైన విష్ణువునకు 6000, అనాహతమున గల శివునకు 6000, కంఠమున (విశుద్ధమున) గల జీవునకు 1000, భ్రూమధ్యము (ఆజ్ఞాచక్రము) నందుగల పరమాత్మకు 1000, బ్రహ్మరంధ్రము (సహస్రారము) నందు గలగురుమూర్తికి

1000 - ఈ విధముగా హంసగాయత్రీ జపమును సమర్పించి తిరిగి సూర్యోదయ సమయమున హంసగాయత్రీ జపమునకై సంకల్పము చేయవలయును. ఈ రీతిగా అజపాగాయత్రీ జపము చేయువారు బ్రహ్మనిష్ఠులగుదురని శ్రీవిద్యాతత్త్వజ్ఞుల యుపదేశము.

## ౧౬౩. హాటకాభరణోజ్జ్వలా

శం. భా. హాటకాభరణోజ్జ్వలా । హాటకస్య సువర్ణస్య కార్యాణి చ తాని ఆభరణాని చ హాటకాభరణాని తైరుజ్జ్వలా తథా, ప్రకాశితా అలంకృతేత్యర్థః । హాటకస్య సువర్ణరూప బ్రహ్మాండస్య ఆభరణవదుజ్జ్వలా ప్రకాశకరీ సత్తాస్ఫూర్తికరీ త్యర్థః ।

యద్వా, తస్మిన్ ఆభరణైః మంగలసూత్రాదిభిః సనాథ స్త్రీ మండలస్వరూపైరుజ్జ్వలతీతి ।

ఆహోస్విత్, కార్యకారణద్వయరూప వసుదానేన వసు స్వరూపేణ వా ఉజ్జ్వలతి ప్రకాశత ఇతి తథా, 'వసురంతరిక్ష సత్' ఇతి శ్రుతేః॥ ఓం హాటకాభరణోజ్జ్వలాయై నమః ॥

ఆం. వి, సువర్ణాభరణములతో శోభాయమానముగా అలంకృతయై యుండునది గాన, పరమేశ్వరి 'హాటకాభరణో జ్జ్వలా' యని గానముచేయబడును. సువర్ణరూపబ్రహ్మాండము

నకు ఆభరణము వలె శోభాదాయకమైనది, అనగా సత్తా స్ఫూర్తిని కలిగించునదని భావము.

యద్వా, ఆ బ్రహ్మాండమునందు మంగళసూత్ర, నానాభరణాదులతో అలంకృతలై యున్న ముత్తైదువల సమాజ రూపముతో ప్రకాశించుచున్నది గాన, పరదేవత యందు 'హాటకాభరణోజ్జ్వలా' యను నామము అన్వర్థము.

పక్షాంతరమున, కార్యకారణరూపముతో - అనగా సువర్ణ వికారమైన యాభరణరూపముతో గాని, లేక ఆభరణ రూపమైన కార్యమునకు కారణమైన సువర్ణరూపముతో గాని భక్తులు చేయునట్టి దానముతో లేక వసుస్వరూపముతో పర దేవత ప్రకాశించునది. 'వసురంతరిక్షసత్' - 'పరమేశ్వరుడు లేక పరమేశ్వరి యాకాశమున వసు (ధనము లేక సువర్ణము) రూపమున ఉండు' నని శ్రుతివచనము వలన తెలియుచున్నది.

శ్లో॥ హారహారికుచాభోగా హాకినీ హల్యవర్జితా ॥
హరిత్పతిసమారాధ్యా హఠాత్కారహతాసురా॥ ౩౧

## ౧౮౪. హారహారికుచాభోగా

శం. భా. హారహారికుచాభోగా। హారస్య పరమేశ్వరస్య ఇమే సంబంధినః హారాః ఈశ్వరత్వ-ఆప్తకామత్వ-నిత్యతృప్తత్వాదయో గుణాః; తాన్ హారతి తద్విపరీత-అవిద్యాధానేన ఉత్పాదయతీతి హారహారీ, కుచయోరాభోగః పర్యంతభూమిః

యస్యాః సా తథా । పరమేశ్వరస్య తద్విషయక వాంఛయా తదేకసక్తమనస్త్వేన తత్కారణీభూతా' విద్యావశస్ఫూర్తిత్వేన పశీకృతమాయత్వ స్వరూపేశ్వరత్వ సమానాధికరణ - ఆప్త కామత్వాదయః అపహృతాః, జీవేశ్వరయో రేకత్ర తేషాం తద్గుణానాం చ సామానాధికరణ్యాయోగాదిత్యర్థః । తథా చ ఈశ్వరస్య మదిష్టసాధన మిత్యన్యత్ర పదార్థే బుద్ధిమత్త్వ స్యైవ బహుధనరూపతయా తస్య జగదాకారత్వాధాయకా ఇత్యధికగుణోత్కర్షా విషయత్వేన భోగస్యాతిశయోక్తిరితి ద్రష్టవ్యమ్ ।

అథవా హారాన్ ముక్తాస్రజః హరతి ఆదత్తే ఇతి హార హారీ కుచాభోగో యస్యాః సేతి తథా, షట్ప్రకారేణ ముక్తా హారేణ యథోచితకాలం భూషితవతీతి భావః॥ ఓం హారహారి కుచాభోగాయై నమః ॥

ఆం. వి. హారునకు - పరమేశ్వరునకు సంబంధించిన ఈశ్వరత్వ, ఆప్తకామత్వ, నిత్యతృప్తత్వాది గుణములు హారము లనబడును. ఆ గుణములను హరించునది, ఆ యాప్త కామత్వాది గుణములకు వ్యతిరేకమైన యవిద్యా, కామ కర్మల నాధానము చేత (కల్పించుట చేత) నాశమొందించు నది గాన, 'హారహారి' యనబడును. ఈశ్వరగుణాపహారకమైన కుచాభోగము, అనగా స్తనమండలము గలదిగాన, దేవి 'హార హారికుచాభోగా' యని స్తుతింపబడుచున్నది.

స్తనమండల విషయకమైన వాంఛ, స్తనమండలము నందే సక్తమైన మనోదశ; అట్లగుటకు కారణమైన అవిద్యకు వశమై యుండే మనోవృత్తిమత్త్వము-వీనిచేత, పరమేశ్వరుని యొక్క-వశీకృతమాయత్వము, స్వరూపముచేత ఈశ్వరత్వము వీనితో సామానాధికరణ్యముగల ఆప్తకామత్వాదిగుణములు జీవుని యందు అపహ్నూతములైనవి. ఏలన, జీవేశ్వరులకు, జీవ గుణములకు, ఈశ్వర గుణములకు ఒకచోట సామానాధికరణ్యము పొసగదు. కాగా, 'నాక్షిప్తసాధనమైనది' అని యితర పదార్థమునందు బుద్ధిగల యీశ్వరునకే 'ఏకోऽహం బహు స్యాం ప్రజాయేయ' అని బహుభవనరూపమైన యిచ్ఛ గలిగినది. అందువలన, పరమేశ్వరినానా నామరూపాత్మకమైన జగద్రూపమును సంపాదించునదని చెప్పుటకు, అధిక గుణోత్ప్రేక్షకు విషయమైన కుచాభోగము యొక్క యతిశయోక్తి చెప్పబడినదని దర్శింపనగును.

అథవా, ముత్యాల హారములను గ్రహించునట్టి కుచాభోగము గలదిగాన, పరమేశ్వరికి ఈ నామము అన్వర్థము. దేవి తగిన కాలమునందు ఆరు పరుసల ముక్తాహారమును అలంకరించుకొనునదని భావము.

## ౧౬౯. హాకినీ

శం. భా. హాకినీ । హాకయతి జన్మమరణే ఛేదయతీతి హాకినీ, 'హాక్ ఛేదే' ఇతి ధాతుపాఠాత్॥ ఓం హాకిన్యై నమః॥

ఆం. వి, 'హాక్ ఛేదే' అను ధాతుపాఠము వలన ఛేదనార్థకమైన 'హాకినీ' యను రూపము నిష్పన్నమైనది, భగవతి జన్మమరణములను అనగా, పునరావృత్తిరహితబ్రహ్మపదము నొసంగునది గాన, 'హాకినీ' యని స్తుతింపబడుచున్నది.

## ౧౮౮. హాల్యవర్జితా

శం. భా. హాల్యవర్జితా । హాలసంబంధి హాల్యం కృష్యాదిద్వారా జనకత్వమ్, తద్వర్జితా కామాదివిహీన శుద్ధచైతన్యస్వరూపత్వాత్ । హాల్యం కపటః మిత్రేష్వన్యథా స్వాంతఃకరణావిష్కృతిః తేన వర్జితా । అవిద్యావిరహిత తత్త్వంపదలక్ష్యార్థభూతత్వాదితి యావత్ ॥ ఓం హాల్యవర్జితాయై నమః ॥

ఆం. వి. హాల మనగా నాఁగలి; హాలమునకు సంబంధించినది హాల్యము, వ్యవసాయము ద్వారా కలుగునట్టి యైశ్వర్యము హాల్యము; కామక్రోధాదిరహితమైన శుద్ధచైతన్యస్వరూపము గల దగుటచే పరాశక్తి 'హాల్యవర్జితా' యని స్తవనీయ యగుచున్నది. హాల్య మనగా కపటమని యర్థము గలదు. మిత్రుల విషయమున గూడ తమ యంతఃకరణములోనున్న భావమును ఉన్నది యున్నటులగాక, మఱొక తీరుగా ప్రకటించుట 'హాల్య'మనబడును. అవిద్యాస్పర్శ లేని 'తత్త్వమసి' యను మహావాక్యము నందలి తత్త్వంపద లక్ష్యార్థభూతురాలగుట వలన దేవి కపటమనెడి దోషము

లేనిది. కావున జగన్మాత హాల్యసర్జితా-కపటరహితా యని కీర్తింపబడును.

## ౭౬౭. హరిత్పతిసమారాధ్యా

శం. భా. హరిత్పతిసమారాధ్యా । హరితాం దిశాం పతయః మహేంద్రాదయః తైః సమ్యక్ శ్రద్ధాభక్తిపూర్వక మారాధితుం యోగ్యా । తద్విపక్షనిబర్హణే నేష్టప్రాపక త్వేన తత్త్వా దిత్యభిసంధిః ॥ ఓం హరిత్పతిసమారాధ్యాయై నమః ,

ఆం. వి. దిక్పాలకులైన యింద్రాది దేవతలచే విధి విహితముగా శ్రద్ధాభక్తిపురఃసరముగా ఆరాధింపబడునది; ఏలన, దేవతలకు శత్రువులైన రాక్షసులను నాశమొందించి పరదేవత, దేవతాభీష్టములను నెరవేర్చును. ఆ కారణముచేత పరమేశ్వరి 'హరిత్పతిసమారాధ్యా' యని ధ్యాతవ్య యగు చున్నది.

## ౭౬౮. హఠాత్కారహతాసురా

శం. భా. హఠాత్కారహతాసురా । హఠాత్కారేణ అతిశీఘ్రతయా హతాః పరాభూతాః అసురాః అసురపక్షాః మహిషాదయో యయా సా తథా; సమబలయోః కిల సామా ద్యుపాయః బలాబలవిచారణా చ భవతి । ప్రబలస్య తు దుర్బలేషు వైరిషు సింహస్య మేషేష్వివ తదయోగేన అతి

త్వరయా అవిచారేణైవ దేవలోకసుఖప్రదా ఇతి నామార్థ విచరణాయా మితరేషు కైముతికన్యాయేన తత్కారణత్వం ధ్వనిత మితి యోజనీయమ్ ॥ ఓం హాకారహతాసురాయై నమః ॥

ఆం. వి. అతి వేగముతో అసురపక్షమునకు చెందిన మహిషాసురాదులను హతమొనర్చినదగుట వలన దేవి 'హాకారహతాసురా' యని సంస్తవనీయ యగుచున్నది.

లోకమునందు సమానమైన బలము గలవారి విషయములో సామ దానాద్యుపాయములు, బలాబలముల విచారణ జరుగును. సింహము మేకల విషయములో బలాబల విచారణ చేయనట్లు, మహాబలవంతుడు అల్పబలము గలవాని విషయములో సామదానాద్యుపాయ విచారణగాని, బలాబల విచారణగాని చేయడు. కావున, పరమేశ్వరి అతి శీఘ్రముగా ముందు వెనుక లాలోచింపకయే దేవలోక సుఖము నొసగునది యని నామార్థమును విచారింపగా మహాబల సంపన్నులయిన మహిషాసురాదులే వెంటనే పరాశక్తిచే హతులు కాగా, ఇతరుల విషయములో నధికముగా చెప్పదగినదేమున్నది యని కైముతిక న్యాయముతో దేవలోక సుఖప్రదాన కారణమైన పరమేశ్వరి ధ్వనింపజేయబడినదని తెలియనగును.

శ్లో॥ హర్షప్రదా హవిర్భోక్త్రీ హార్దసంతమసాపహా ।
హల్లీసలాస్యసంతుష్టా హంసమంత్రార్థరూపిణీ ॥ 3_౨

## ౧౮౯. హర్షప్రదా

శం. భా. హర్షప్రదా । హర్షః ఆనందకారకః ముఖవికాసాది కార్యోన్నేయః స్వాత్మసంభావనేతర పరిభవనిమిత్త చిత్తవృత్తివిశేషః, కార్యస్య కారణావినాభావితయా తత్ప్రదానం తద్ధేతోరపి ఆక్షిపతీతి సుఖప్రదేత్యర్థః । ప్రదదాతీతి ప్రదా ।

అథవా, హర్షం ధనయౌవనాదిసుఖం పుత్రబంధువర్గాది రూపేణ పరిహృత్య ప్రకర్షేణ ద్యతి ఖండయతీతి వా తథా ॥
ఓం హర్షప్రదాయై నమః ॥

ఆం. వి. హర్షమనగా ఆనందహేతువు, ముఖవికాసాది వ్యాపారము చేత అభివ్యక్తీకరింపబడిన (ఉన్నేయమైన), ఆత్మగౌరవ, పరాభిభవనములకు నిమిత్తమైన చిత్తవృత్తివిశేషము కార్యము కారణము కలదై అవినాభూతమయిన దగుటవలన కార్యమైన హర్షము కారణమునందు గూడ ఆరోపింపబడును గాన, సుఖప్రద మని భావము. అట్టి యానందప్రదానము చేయునదిగాన, దేవి 'హర్షప్రదా' యని గానము చేయబడును.

అథవా, ధనయౌవనాదిరూపమైన హర్షమును - సుఖమును పుత్ర, బంధువర్గరూపముతో హరించి విశేషముగా ఖండించునదిగాన, జగన్మాత 'హర్షప్రదా'యని స్తుతింపబడును. సంసారవ్యామోహమును పోగొట్టి యనిర్వచనీయమైన బ్రహ్మానందానుభూతిని ప్రసాదించునని భావము.

## ౧౩౦. హవిర్భోక్త్రీ

శం. భా. హవిర్భోక్త్రీ। 'స బ్రహ్మా స శివః స హరిః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్' ఇతి శ్రుతేః వసు రుద్ర ఆదిత్యాకారేణ హవీంషి యజమానేన అగ్నౌ ప్రక్షిప్తాని స్వాహాముఖేన భుంక్తే ఇతి తథా।

యద్వా, హవీంషి కాలాంతర భావిఫలాని అదృష్టాత్మనా సూక్ష్మరూపాణి తత్తద్యజమానజీవగతాని భూత సూక్ష్మాభిధానాని సమష్టివ్యష్ట్యాత్మనా ఈశ్వరజీవోపాధి భూతాని మాయాఽవిద్యాశబ్దితాని ముక్తిపర్యంతం భునక్తి పాలయతీతి వా తథా। అన్యథా సంసారస్యానాదిత్వాభావేన ఆదిమ శరీరాద్యుత్పత్తౌ అంగీక్రియమాణాయాం ప్రపంచస్య ఆకస్మికత్వ మకృతాభ్యాగమప్రసంగశ్చ స్యాదితి భావః॥
ఓం హవిర్భోక్త్ర్యై నమః॥

ఆం. వి. 'స బ్రహ్మా స శివః' అనుచు, 'ఆ చైతన్యమే అక్షర పరబ్రహ్మ, ఆ చైతన్యమే సృష్టికర్తయైన బ్రహ్మ, అతడే లయకర్త యగు శివుడు, స్థితి కర్తయగు విష్ణువును ఆ చైతన్యరూపుడే, లోకపాలకుడైన యింద్రుడును ఆచైతన్యమే, ఆ చైతన్యమే అక్షరము, స్వయంప్రకాశము, పరమము నయిన తత్త్వము' అని శ్రుతి చెప్పుచున్నది. ఆ శ్రుతివచనము ననుసరించి పరమేశ్వరి వసురుద్ర ఆదిత్యరూపిణియై యజమాని

చేత అగ్నియందు హోమము చేయబడిన ఆజ్యాది హవిస్సులను స్వాహా ముఖముతో భుజించును గాన, జగజ్జనని 'హవిర్భోక్త్రీ' యను నామముతో ప్రసిద్ధినందెను.

అథవా, హవిస్సులు భవిష్యత్తులో కాలాంతరమునందు ఫలము నొసగునట్టివి; అదృష్ట (అపూర్వ) రూపముతో అతిసూక్ష్మములై ఆహవిస్సులను వ్రేల్చిన యాయా జీవులను అంటిపెట్టుకొని యుండును; అవి భూతసూక్ష్మము లను పేరు గలిగి హవిర్దాన మొసగిన యజమానుల యంతఃకరణమునందుండును; ఆ హవిస్సులు సమష్టి ఆత్మయైన యీశ్వరుని యొక్క ఉపాధియైన మాయారూపముతోను, వ్యష్ట్యాత్మయైన జీవుని యొక్క ఉపాధియని చెప్పబడే యవిద్యారూపముతోను ఉండును; తాదృశము లయిన హవిస్సులను జీవునకు స్వస్వరూపావగతి కలుగునంత వఱకు, అనగా, మోక్షోపలబ్ధి సిద్ధించునంతవఱకు అనుభవించుచుండును, లేక రక్షించుచుండును గాన, దేవి 'హవిర్భోక్త్రీ' యను నామముతో సంకీర్తనము చేయబడుచున్నది. ఆ రీతిగ కాకపోయిన, అనగా సంసారము అనాది యని యంగీకరించకపోయిన, ఆదిమ శరీరాదుల-హిరణ్యగర్భాదుల యుత్పత్తియంగీకరింపబడినచో, ప్రపంచమునకు హఠాదాగమనము, అకృతాభ్యాగమము, కృతప్రణాశము అను దోషములు ప్రసక్తములగునని భావము.

విశే :- అకృతాభ్యాగమ మనగా, చేయనికర్మఫలమును అనుభవించవలసిన స్థితి వచ్చుట. సంసారము అనాది కాని

పక్షమున, జీవుడు క్రొత్తగా ఉపాధిధారియై ఆకస్మికముగా ఈ ప్రపంచములో వచ్చియున్న యెడల, తాను చేయుని సుకృతదుష్కృతముల ఫలమును ఏ రీతిగ ననుభవించును ? ఆరీతిగ అనుభవించినచో ప్రపంచమునకు 'అకృతాభ్యాగమము' అను దోషము ఘటిల్లును. శరీరపాతానంతరము జీవుడు కాలాంతరములో మఱియొక శరీరమును ధరించి జన్మించక పోయినచో, అతడు చేసిన సుకృతదుష్కృతముల నాశమొంద వలసిన పరిస్థితియేర్పడును. కర్మ అవశ్యఫలోత్పాదన హేతువు గదా ! చేసిన కర్మకు ఫలము లేకుండుట యెట్లు ? కావున, సంసారము 'కృతప్రణాశ' దోషదుష్టమగును. ఆ కారణము చేత ప్రపంచమునకు అనాదిత్వము అవశ్య మంగీకరింపనగును. కాగా, యజమానదత్తమైన హవిస్సులను, పరమేశ్వరి గ్రహించి జీవగత సంస్కారములను యథాతథముగా రక్షించి తత్ఫలములను తత్తత్కర్మానుసారముగా జీవుల కొసగు చుండునని భావము.

## ౧౭౧. హార్దసంతమసాపహా

శం. భా. హార్దసంతమసాపహా । హృదయావచ్ఛిన్నః హార్దః 'యో వేద నిహితం గుహాయామ్' ఇతి శ్రుతేః । అస్మిన్ యత్సంతమసం ఆవారకత్వాత్ 'తమ ఆసీత్' ఇతి శ్రుత్యా చ ఆత్మవిషయకం తదాశ్రయ మజ్ఞాన మనర్థకర మవ్యాకృతా కాశ మిత్యుచ్యతే, మహావాక్యశ్రవణజన్య ధీవృత్తి ప్రతి

ఫలితాకారేణ అపహంతీతి సా తథా । 'నాహం బ్రహ్మాస్మి సంసారీ బ్రహ్మ నాస్తి న భాతి చ'-ఇత్యజ్ఞానస్య, 'సోఽహం బ్రహ్మాస్మి సచ్చిదానందలక్షణః' - ఇతి ఏకాకారవృత్తి బాధ్యత్వనియమేన బాధాధిష్ఠానమ్ 'నేహ నానా' ఇతి శ్రుతి సిద్ధ బ్రహ్మరూపేతి యావత్ ॥ ఓం హార్దసంతమసాపహాయై నమః ॥

ఆం. వి. హృదయావచ్ఛిన్నమైనది హార్దము; 'యో వేద నిహితం గుహాయామ్'-హృదయగుహ యందు నిహితమై యున్న వస్తువును తెలిసికొనినవారు బ్రహ్మవేత్త లగుదురని శ్రుతి చెప్పుచున్నది. కావున, హార్దమైన గుహాయందు ఆవారకమైన (హృదయగత చైతన్యమునుఆచ్ఛాదించునది) యే తమస్సు గలదో, 'తమ ఆసీత్' అను శ్రుతి ననుసరించి హృదయము నందలి యా తమస్సు ఆత్మవిషయకమైన, ఆత్మాశ్రయమైన యజ్ఞానము ఆ యజ్ఞానము అనర్థదాయకమైనది, అది యవ్యాకృతాకాశమని చెప్పబడును. వేదాంత మహావాక్య శ్రవణాదుల వలన కలుగునట్టి చిత్తవృత్తి యందు ప్రతిబింబించిన రూపముతో తమస్సును-అజ్ఞానమును పోగొట్టు నది గాన, త్రిపురసుందరి 'హార్దసంతమసాపహ' యని భక్తులచే నారాధనీయ యగుచున్నది. 'నేను బ్రహ్మను గాను, సంసారిని, 'ఆ బ్రహ్మ వస్తువు లేనేలేదు, భాసించుటలేదు' అనెడి యజ్ఞానము బ్రహ్మను నేను, సచ్చిదానంద లక్షణములుగల బ్రహ్మనై యున్నాను' అనెడి ఏకాకారవృత్తి చేత బాధింపబడు ననునియమము వలన దేవి బాధకు అధిష్ఠానమై యున్నది. 'నేహ

నానా' అను శ్రుతి 'ఇక్కడ యున్నది ఏకమైన సద్వస్తువే, నానాత్వము లేదని' ప్రతిపాదించుచున్నది; అట్టిశ్రుతి ప్రమాణ సిద్ధమైన బ్రహ్మస్వరూపము గలది పరమేశ్వరి యని భావము

## ౧౭౨. హల్లీసలాస్యసంతుష్టా

శం. భా. హల్లీసలాస్యసంతుష్టా। హల్లీసైః చిత్రదండైః కుమారికాభిః ఏకతాలాదియుక్తగీతపూర్వకం యల్లాస్యంనర్తనం తస్మిన్ సంతుష్టా ప్రీతిమతీత్యర్థః । 'నారీణాం మండలీ నృత్యం బుధా హల్లీసకం విదుః' ఇతి హారావలీకోశాత్ మండలాకారనృత్యసంతుష్టేత్యర్థః ॥ ఓం హల్లీస లాస్య సంతుష్టాయై నమః ॥

ఆం. వి. హల్లీసము లనగా చిత్రదండములు, కన్యకలు ఆ చిత్రదండములతో ఏకతాళాదియుక్తము, గీతిపూర్వకముగా చేయు నర్తనము చేత సంప్రీత యగును గాన, పరాశక్తి 'హల్లీసలాస్యసంతుష్టా' యని కీర్తింపబడుచుండును. 'నారీణాం మండలీనృత్యం బుధా హల్లీసకం విదుః'-స్త్రీలు మండలాకారముగా చేరి చేయు నృత్యమును 'హల్లీసక' మని తెలియవలయునని హారావలీకోశ వచనము చెప్పుచున్నది. అందువలన పరదేవత మండలాకార నృత్యము చేత సంతుష్టురాలగునది యని భావము.

## ౧౨౩. హంసమంత్రార్థరూపిణీ

శం. భా. హంసమంత్రార్థరూపిణీ। హంసైః ఉపాస్యో యో మంత్రః ప్రణవః తస్య శాస్త్రబోధిత తత్త్వార్థరూపిణీ। వాచ్యలక్ష్యార్థస్వరూపేణ జ్ఞాయమానేత్యర్థః।

అథవా, హంసమంత్రః అజపా। హంకారసకారా శోధిత తత్త్వంపదార్థా। హంకారస్య పరోక్షవాచినః సకారస్య తాదృశస్య చ భాగత్యాగలక్షణయా నిష్ప్రపంచ-నిత్య శుద్ధ-ముక్త-బుద్ధ-సచ్చిదానంద స్వరూపేత్యర్థః॥ ఓం హంస మంత్రార్థరూపిణ్యై నమః॥

ఆం. వి. పరమహంస పరివ్రాజకుల కుపాస్యము ప్రణవము, తత్ప్రణవ వాచ్యార్థము శాస్త్రోపదిష్టమైన తత్త్వార్థము, ఆ తత్త్వార్థమే స్వరూపముగా గలది గాన, బ్రహ్మ స్వరూపిణియైన జగజ్జనని 'హంసమంత్రార్థరూపిణి' యనుచు ఉపాసకులచే గానము చేయబడుచున్నది. పరమేశ్వరి ప్రణవము యొక్క వాచ్యార్థరూపము గాను, లక్ష్యార్థరూపము గాను, తెలియదగినదని భావము.

అథవా, హంస మంత్రమనగా అజపాగాయత్రి యని యర్థము. హంకార, సకారములు లక్షణావృత్తిచేత శోధితములయిన 'తత్, త్వం' పదార్థములు. పరోక్షవాచులైన హంకార సకారముల యొక్క భాగత్యాగలక్షణచేత పరమేశ్వరి

నిష్ప్రపంచము, నిత్యము, శుద్ధము, ముక్తము, బుద్ధము నగు సచ్చిదానందస్వరూపము గలదని యర్థము. హకార సకారము లందలి భాగత్యాగ లక్షణము చేత తత్, త్వం పదార్థముల ఐక్యమును వలె ఇట గూడ వస్త్వైక్యమును తెలిసికొనవల యును. భాగత్యాగలక్షణ స్వరూపము పూర్వము పరా మృష్టము.

విశే :- ప్రణవము అకార, ఉకార, మకార, అను నాద, విరామ రూపము వీనిచేత బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశాన, సదాశివులుచెప్పబడుదురు. అకార, ఉకార, మకారముల వెంట పోవు నాదము తురీయ మనబడును. నాద మెచట యాగి పోవునో, దానిని విరామ మందురు. అదియే యఖండ బ్రహ్మా కారమని తెలియవలయును. 'యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః । తస్య ప్రకృతిలీనస్య యః పర స్స మహేశ్వరః'-'వేదారంభమున ఏ స్వరము ఉచ్చరింపబడునో, వేదము యొక్క అంతమున ఏ స్వరము ప్రతిష్ఠింపబడి యున్నదో, ప్రకృతిలో లీనమై యున్న యా ప్రణవము కంటె అతీతమైనవాడు పరమేశ్వరుడు' అని శ్రుతి యాదేశించు చున్నది, ఈ రీతిగ, ప్రణవముయొక్క వాచ్యార్థ, లక్ష్యార్థము లను సాధకులు తమ యోగ్యత, అధికారము ననుసరించి తెలిసికొని, యుపాసించి కృతార్థులగుదురు గాక.

శ్లో॥ హానోపాదాననిర్ముక్తా హర్షిణీ హరిసోదరీ ।
హాహాహూహూముఖ స్తుత్యా హానివృద్ధివివర్జితా॥ 33

## ౧౭౪. హానోపాదాననిర్ముక్తా

శం. భా. హానోపాదాననిర్ముక్తా। అనిష్టసాధనే హానం పరిత్యాగక్రియా। ఇష్టసాధనే ఉపాదానం స్వీకారక్రియా' పరిజిహీర్షా ఆదిత్సా వా। 'అప్రాణో హ్యమనాః శుభ్రః। 'అకాయమ్', 'అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః' ఇతి బహుశ్రుతేః। అశరీరస్య బ్రహ్మణః అంతఃకరణాదిధర్మాణా మసంభవాత్ తాభ్యాం నిర్ముక్తా నిస్సంగే త్యర్థః, 'విముక్తశ్చ విముచ్యతే' ఇతిశ్రుతేః॥ ఓం హానోపాదాననిర్ముక్తాయై నమః ॥

ఆం. వి. అనిష్టమునకు సాధనము లయిన వస్తువులను పరిత్యజించుట 'హాన' మనబడును. ఇష్టసాధనములైన వస్తువులను స్వీకరించుట 'ఉపాదాన' మనబడును. పరిజిహీర్ష అనగా విడిచిపెట్టవలయునను. కోరిక గాని, ఆదిత్స యనగా గ్రహించవలయుననెడి యిచ్ఛ గాని లేనిది. 'అప్రాణో హ్యమనాః శుభ్రః' - 'ప్రాణము గానిది, మనస్సు గానిది, మాయా సంవలనము లేనిది పరమేశ్వర చైతన్య' మనియు, 'అకాయమ్' 'శరీరము కాని' దనియు, 'అశరీరం వావసంతం న ప్రియాప్రియే స్పృశతః' - 'శరీరము లేని సద్వస్తువును ప్రియాప్రియములు రెండును స్పృశించవు' అనుచు అనేక శ్రుతులు ఘంటాపథముగా చెప్పుచున్నవి. ఆ కారణము చేత అశరీరియైన బ్రహ్మకు అంతఃకరణాది ధర్మములు సంభవించవు గావున,

పరమేశ్వరి ప్రియాప్రియములు రెండింటిచేత విడువబడినది, 'అనగా, నిస్సంగ యని భావము. 'విముక్తశ్చ విముచ్యతే'- ప్రియాప్రియములను, ఇష్టానిష్టములను విడిచిపెట్టి, వానికి అతీతముగా నుండువాడు ముక్తుడగు' నని శ్రుతి చెప్పుచున్నందున దేవి హానోపాదానవినిర్ముక్తయైన సచ్చిదానందస్వరూపిణి యని భావము.

## ౧౮౭. హర్షిణీ

శం. భా. హర్షిణీ। 'ఏష హ్యేవానందయాతి' ఇతి శ్రుతేః హర్షయతి ఆనందయతీతి తథా ॥ ఓం హర్షిణ్యై నమః॥

ఆం. వి. 'ఏష హ్యేవానందయాతి' - 'ఈ పురుషుడే - బ్రహ్మయే సర్వలోకములను ఆనందింపజేయుచున్నాడు' అను శ్రుతివాక్యము వలన సర్వజీవులను ఆనందింప జేయువాడు, బ్రహ్మయని తెలియుచున్నది. పరమేశ్వరి బ్రహ్మాభిన్న గాన, సమస్తప్రాణి జాతమునకు ఆనందము కలుగజేయున దగుట వలన 'హర్షిణీ' యని స్తుతింపబడుచున్నది.

## ౧౮౮. హరిసోదరీ

శం. భా. హరిసోదరీ। హరిణా కృష్ణేన సమానం ఏకం ఉదరం ఉత్ ఈషత్ అరం భేదకం అవచ్ఛేదక మిత్యర్థః।

ఉచ్చైరరం కూటో వా అత్యల్పమిథ్యాభూతమాయో పాధిక చైతన్యావస్థావిశేషరూపా।

"అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో యయేదంధార్యతేజగత్॥"

"దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్"

ఇత్యాది స్మృతి శ్రుతిభ్యాం ఈశ్వరస్వరూపభేదవత్త్వావగమా దితి మంతవ్యమ్ ॥ ఓం హరిసోదర్యై నమః ॥

అం. వి. కృష్ణపరమాత్మతో సమానమైన - ఏకమైన ఉదరము గలది; ఉత్ + అరమ్ = ఉదరమ్, కొంచెము భేదము కలది, అవచ్ఛేదకమని భావము. హరికంటె ఈషద్భేదము గలది గాన, దేవి 'హరిసోదరి' యనబడును. మిక్కిలి కపటము (ఉచ్చైః అరమ్) గలది, అనగా అత్యల్పమిథ్యా భూతమైన మాయోపాధికచై తన్యావస్థావిశేషరూపము గలదని యర్థము.

'ఇది అపరాప్రకృతి (జడప్రకృతి), ఇంతకంటె అన్యము, జీవభూతమునయిన నాపరాప్రకృతిని తెలిసికొనుము. ఈపరా ప్రకృతిచేత ఈ ప్రపంచము ధరింపబడుచున్నది' అని శ్రీకృష్ణ భగవానుడు గీతలో స్వీయశక్తియైన పరాప్రకృతి తత్త్వమును వివరించినాడు.

"దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్' - 'తనకంటె భిన్నముగాని, సత్త్వగుణాదుల చేత అచ్ఛాదితము, దేవస్వరూ

పము నయిన యాత్మశక్తిని మునులు కనుగొనిరి' అని శ్రుతి వచనము. ఏవంవిధములయిన స్మృతి శ్రుతుల వలన ఈశ్వరుడు రూపభేదము గలవాడని తెలియుచున్నది. కావున, జగన్మాత, హరి కంటె కొలది భేదము గలదగుట వలన 'హరి సోదరీ' యని కీర్తింపబడుచున్నది.

## ౧౭౭. హాహాహూహూముఖస్తుతా

శం. భా. హాహాహూహూముఖస్తుత్యా । హాహా హూహూ నామక గంధర్వా ముఖ్యా యేషాం జనానాం తైస్తథా । స్తుత్యా గుణినిష్ఠ గుణాభిధానం స్తుతిః । తదాశ్రయత్వేన ప్రతిపాదనీయేత్యర్థః ॥ ఓం హాహాహూహూముఖస్తుత్యాయై నమః ॥

ఆం. వి. హాహాహూహూ అను పేరు గల ప్రధానులయిన గంధర్వుల చేత స్తోత్రము చేయబడునది. గుణవంతుని యందలి గుణములనుజెప్పుట స్తుతి యనబడును. (గుణినిష్ఠ గుణాభిధానం స్తుతిః) అట్టిగుణముల కాశ్రయభూతగాజ్ఞానులచేత ప్రతిపాదింపబడునది. 'హాహాహూహూముఖస్తుత్యా' యను నామము చేత పరమేశ్వరీనిష్ఠమైన స్తవనీయ గుణనికరము ప్రతిపాదింపబడుచున్నదని భావము.

## ౧౭౮. హానివృద్ధివివర్జితా

శం. భా. హానివృద్ధివివర్జితా । అవయవోపచయరూపా వృద్ధిః; తదపచయరూపా హానిః; తాభ్యాం వర్జితా, 'న

కర్మణా వర్ధతే నో కనీయాన్' ఇతి శ్రుతేః, ఉపలక్షణం షడ్భావవికారాణామ్ శరీరధర్మత్వేన కర్మనిమిత్తత్వాదీశ్వరే తదభావేన నిర్వికారేత్యర్థః ॥ ఓం హానివృద్ధివివర్జితాయై నమః ॥

అం. వి. అవయవోపచయము - అవయవములు పెరుగుట వృద్ధి యనబడును, అవయవాపచయము-అవయవములు కృశించిపోవుట హాని యనబడును, ఉపచయాపచయములు - వృద్ధి క్షయములు రెండును లేనిదిగాన, శ్రీ మహాభట్టారిక 'హానివృద్ధివివర్జితా' యని స్తోతవ్యురాలగుచున్నది. 'న కర్మణా వర్ధతే నో కనీయాన్' - 'కర్మచేత వృద్ధి పొందునది కాదు, క్షయము నొందునది కాదు' అని శ్రుతి చెప్పుచున్నందున సచ్చిదానంద స్వరూపిణియైన పరమేశ్వరికి ఉపచయ అపచయాదులు లేవని తెలియుచున్నది. ఇది యుపలక్షణము. షడ్భావ వికారములు శరీర ధర్మములు, కర్మనిమిత్తకములు. (అస్తి, జాయతే, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి- ఉండుట, పుట్టుట, వృద్ధి చెందుట, పరిణమించుట, అపక్షయమగుట, నశించుట - ఇవి షడ్భావ వికారములు. ఈ యారు వికారములు కర్మ వలన కలుగును. వీటికి కర్మహేతువు.) ఈశ్వరాభిన్నయగు పరమేశ్వరి యందు కర్మ లేకపోవుట వలన ఆ తల్లి శరీర ధర్మము లయిన షడ్భావ వికారములు లేని నిర్వికార స్వరూపిణి యని భావము.

శ్లో॥ హామ్యాంగపీనహృదయా హరిగోపారుణాంశుకా ।
లకారాఖ్యా లతాపూజ్యా లయస్థిత్యుద్భవేశ్వరీ॥ ౩౮

## ౧౭౯. హయ్యంగవీనహృదయా

శం. భా. హయ్యంగవీనహృదయా । హయ్యంగవీన వత్ నవనీతసదృశ విరల మృద్వవయవ పరిణామద్రవత్వ సాదృశ్యయోగి హృదయకృపారసరూప పరిణామవతీతి సా తథా । హృదయాభావేఽపి సర్వాత్మకతయా తద్వత్త్వమ్ । ఈక్షణాదివత్ మాయాపరిణామరూపా దయా వా హృదయ శబ్దేన ఉచ్యతే । 'అవాగమనాః' ఇతి శ్రుత్యా సర్వనిషేధాత్॥ ఓం హయ్యంగవీనహృదయాయై నమః ॥

ఆం. వి. **హయ్యంగవీనము** అనగా అప్పుడే పెరుగు చిలికి తీసిన వెన్నను కాచగా వచ్చిన నెయ్యి; హయ్యంగ వీనహృదయా యనగా, నవనీత సదృశమైన, అతి మృదువైన (కోమల) అవయవముల పరిణామమైన ద్రవత్వసాదృశ్యము గల హృదయము నందలి కృపారస పరిణామము గలది యని భావము. కావున, పరదేవత 'హయ్యంగవీనహృదయా' యని ధ్యాతి వ్యయగుచున్నది. అశరీరి యగుట వలన హృదయము లేకపోయినను, సర్వాత్మిక యగుటచేత పరమేశ్వరి కృపారస పూర్ణమైన హృదయము గలది యని చెప్పబడినది. 'స ఈక్షాంచక్రే' - ఆ పరమేశ్వరుడు సృష్టివిషయకమైన పర్యా లోచనచేసెను' అని శ్రుతివచనము. నిర్గుణము, నిష్క్రియమైన పరమాత్మకు గల ఈ లక్షణాదుల వలె మాయాపరిణామరూప మైన దయ హృదయశబ్దముచేత చెప్పబడును. 'అవాగమనాః' 'పరమేశ్వరతత్త్వము వాక్కు, మనస్సు లేని' దనుచు శ్రుతి

అంతరింద్రియ బహిరింద్రియ నిషేధముచెప్పుట వలన ఈక్షణా దులకు వలె హృదయశబ్దము చేత మాయాపరిణామమైన దయ చెప్పబడునని తెలియనగును.

## ౧౮౦. హరిగోపారుణాంశుకా

శం. భా. హరిగోపారుణాంశుకా । హరిగోపః ఇంద్ర గోపః ఆర్ద్రా మఘా నక్షత్రే వర్షాసు ఉద్భవః అష్టపాదాః రక్తవర్ణాః మృద్వంగాః కీటవిశేషాః; తథా శోణ మంశుక మంబరమ్, స్వార్థే కప్రత్యయః, కిరణాని వా యస్యాః సా తథా ॥ ఓం హరిగోపారుణాంశుకాయై నమః ॥

అం. వి. హరిగోప మనగా ఆరుద్ర పురుగు. దీనిని ఇంద్ర గోప మనికూడ అందురు. వర్షర్తువులలో ఆర్ద్రా మఘా నక్షత్రము లందు ఇవి పుట్టును. వీనికి ఎనిమిది పాదములుం డును, ఇవి యెఱ్ఱని కాంతితో మెరయుచుండును, వీని యవ యవములు మిక్కిలి మృదువుగా నుండును, ఆ ఆరుద్ర పురుగు రంగు వంటి యెఱ్ఱని వస్త్రము ధరించునది, లేక స్వార్థమునందు 'క' ప్రత్యయము చెప్పుకొనిన, ఎఱ్ఱని కాంతికిరణములు గాని గలదగుట వలన పరమేశ్వరి 'హరిగోపారుణాంశుకా' యని స్తవనీయ యగుచున్నది.

## ౧౮౧. లకారాఖ్యా

శం. భా. లకారాఖ్యా । లకారయుక్తః మూల మంత్రః ఆఖ్యా వాచకశబ్దః యస్యాః సా తథా । లకారస్య

శక్రబీజస్య వాఽర్థః; 'సేంద్రః' ఇతి శ్రుతేః। లకారయుక్తస్య మాయాబీజస్య వా, స్తబ్ధ మాయేత్యర్థః ॥ ఓం లకారాఖ్యాయై నమః ॥

ఆం. వి. 'ల' బీజయుక్తమైన పంచదశీమంత్రము వాచక శబ్దముగా గలదిగాన, శ్రీ మహాత్రిపురసుందరి 'లకారాఖ్యా' యని స్తుతింపబడుచున్నది.

ఇంద్ర బీజమైన లకారము యొక్క వాచ్యార్థముగాన, పరమేశ్వరి 'లకారాఖ్యా' యనబడును. 'సేంద్రః' యను శ్రుతి వలన 'ఆ బ్రహ్మయే యింద్రుడు' డని తెలియును. లకారవాచ్యుడయిన యింద్రుడే బ్రహ్మ యగుట వలన పరబ్రహ్మభిన్న యగు పరమేశ్వరి లకారవాచ్యార్థమైన ఇంద్రాభిన్నస్వరూపిణి యని గ్రహింపవలయును.

లకారయుక్తమైన మాయాబీజము (హ్లీం) యొక్క వాచ్యార్థ మగుటంజేసియు దేవి లకారాఖ్య, స్తబ్ధమాయ యని భావము.

ఈ 'ల' బీజము పంచదశీ మహామంత్రము నందలి ద్వితీయకూటస్థ పంచమ వర్ణము అని తెలియనగును.

## ౧౮౨. లతాపూజ్యా

శం. భా. లతాపూజ్యా। లపంతి వినమంతి అత్యంత నమ్రా భవంతీతి లతాః, పరమ పతివ్రతాః అరుంధత్యాదయః

స్త్రియః, తాభిః స్థిర మాంగల్యాయ స్వేష్టదేవతాత్వేన పూజ్యా పూజనీయా । తదుక్తమ్ - 'సమారాధ్య మహేశానీం భుక్తిం ముక్తిం చ విందతి' ఇతి ।

అథవా, కేదారాది గౌరీవిశేషమూర్తౌ లతాభిః ఉపలక్షణమ్ వన్యపూజోపకరణైః, పూజ్యా అలంకృతా । శబరీ వా వనదుర్గా వేతి భావః ॥ ఓం లతాపూజ్యాయై నమః ॥

ఆం. వి. అత్యంతము వినమితములు, నమ్రములుగాన, లత లనబడును, లతాసదృశలు, వినమ్రలు, పరమ పతివ్రతలు నగునట్టి యరుంధత్యాది స్త్రీలచేత స్థిరసౌమంగల్యమునకై తమ యిష్టదేవతారూపమున పూజింపబడునది గాన, శివుని యర్థాంగి యగు గౌరి 'లతాపూజ్యా' యని స్తోతవ్యయగుచున్నది. (నేటికిని మన గృహములలో వివాహిత స్త్రీలు మంగళగౌరీవ్రతము నాచరించుట యాచారములో నున్నది) 'సమారాధ్య మహేశానీం భుక్తిం ముక్తిం చ విందతి' - 'పరాశక్తిని ఆరాధించి జీవుడు ఐహికభోగమును, ఆముష్మికమైన మోక్షమును పొందుచున్నా' డని పురాణవచనము వలన తెలియుచున్నది.

అథవా, కేదారాది క్షేత్రములందుండు గౌరీ విశేష మూర్తి యందు లతలచేత అలంకరింపబడునది, లతలు వన్య పూజాసామగ్రికి ఉపలక్షణము, లేక శబరీ దుర్గ గాని, వన దుర్గగాని 'లతాపూజ్యా' యని స్తుతింపబడుచున్నది.

# ౧౮౩. లయస్థిత్యుద్భవేశ్వరీ

శం. భా. లయస్థిత్యుద్భవేశ్వరీ। నైషరీత్యేన విశేషణం యోజ్యమ్। ఉద్భవతీత్యుద్భవః కార్యాత్మనా అభివ్యక్తిః। స్థితిః జ్ఞానవిషయతాయోగ్య కాలావచ్ఛేదః అనుభవసత్తా వత్త్వమితి యావత్। లయః ఉత్పన్నకార్యస్య కారణాత్మనా అవస్థితిః వా చారంభణ యోగ్యతేత్యర్థః। తాసాం క్రియాణా మచేతనకార్యత్వాయోగేన ఘటాదికార్యే చేతనస్య నిమిత్తత్వాదర్శనాత్ ఏక తటస్థేశ్వరత్వం వా, గోపురాదౌ నానా చేతనదర్శనాత్ తాదృశనానేశ్వరత్వం వేతి విశయే, 'యతో వా ఇమాని భూతాని జాయంతే' ఇతి శ్రుతౌ 'యతః' ఇత్యేక వచనపంచమ్యా నానాత్వ తటస్థత్వే; 'జనికర్తుః ప్రకృతిః' ఇతి సూత్రమ్। జనికర్తుః కార్యస్య ప్రకృతిః ఉపాదాన మపాదానసంజ్ఞా స్యాత్। 'అపాదానే పంచమీ' ఇతి శాసనాత్ అభిన్ననిమిత్తోపాదానత్వ మీశ్వరత్వ మితి సిద్ధాంతః। తటస్థ లక్షణ మేతత్; జ్ఞాయమానస్య బ్రహ్మణః లక్షణప్రమాణ యోః అవశ్యవాచ్యత్వా దిత్యభిప్రాయః। ఆదౌ లయ శబ్దో పాదానేన అనాదిత్వం ప్రపంచస్య సూచితమ్। జగత ఇతి శబ్ద పూరణేన నామ యోజనీయమ్। తథా చ జగతః లయశ్చ స్థితిశ్చ ఉద్భవశ్చ తేషా మీశ్వరీ। కూటస్థ చైతన్యమాత్ర సచ్చిదానందాధాయకతయా వివర్తకారణ మిత్యర్థః॥ ఓం లయస్థిత్యుద్భవేశ్వర్యై నమః॥

శంకర. 12 - 35]

ఆం వి. లయ, స్థితి, ఉద్భవము లను విశేషణములను ఉద్భవ (సృష్టి) స్థితి, లయము లని భావింపనగును. ఉద్భవించు నదిగాన ఉద్భవము, అనగా కార్యాత్మగా అభివ్యక్తమగుట జ్ఞానమునకు విషయము కాదగిన కాలభేదము గలది, అనగా అనుభవరూపమైన సత్త గలది స్థితి. ఉత్పన్నమైన కార్య ప్రపంచము కారణాత్మగా ఉండుట లయ మనబడును, వాచా రంభణ యోగ్యత యని యర్థము. సృష్టిస్థితి లయ రూపకార్య త్రయమునకు అచేతన వస్తువు కారణముగా గల కార్యత్వము చెప్పుట పొసగదు, ఘటాపటాది కార్యముల యందు చేతను లగు కుంభకార (కుమ్మరి), తంతువాయులు నిమిత్త కారణ ముగా కన్పించుచున్నారు. అందువలన ఏకము, తటస్థము నయిన యీశ్వరత్వముగాని, గోపురాదుల యందు చేతను లయిన యనేక వ్యక్తులు నిమిత్తకారణముగా కనబడుట వలనతాదృశులయిన యీశ్వరులుండుటగాని, సంభవముగదా యని శంక కలుగనచ్చును. కాని, 'యతో వా ఇమాని భూతాని జాయంతే' అను శ్రుతి యందు 'యతః' (దేనివలన నయితే) అను పంచమీవిభక్తి యొక్క యేక వచనము చేత నానాత్వ, తటస్థత్వములు సంభవములు; 'జనికర్తుః ప్రకృతిః' అని పాణిని సూత్రము. అనగా జాయమానమగు కార్యము నకు హేతువు (ప్రకృతి) ఉపాదాన మనబడును. ఉత్పత్తికి ఆశ్రయమైన కార్యము యొక్క ప్రకృతి (హేతువు) యైన ఉపాదానము, అపాదాన సంజ్ఞ కలది యగును. 'అపాదానే

పంచమీ' అను పాణిని సూత్రము వలన అపాదానార్థము నందు పంచమీ విభక్తి వచ్చును. కాన, 'యతః' అను పంచ మ్యేకవచనాంతము వలన అభిన్న నిమిత్తోపాదాన కారణ త్వము ఈశ్వరత్వమని యద్వైత సిద్ధాంతము. ఇది తటస్థ లక్షణము; (శుద్ధసత్త్వ మాయోపాధిక చైతన్యము నిమిత్త కారణమనియు, అవిద్యోపాధికమైన (తమఃప్రధాన మైన) చైతన్యము ఉపాదాన కారణమనియు తెలియవలయును. కాగా, ఈశ్వరునకు అభిన్న నిమిత్తోపాదాన కారణత్వము సిద్ధించునని శ్రీ విద్యారణ్యస్వామి నిర్వచనము.) తటస్థ లక్ష ణముచే జ్ఞేయమగు లక్షణ ప్రమాణములు తప్పనిసరిగా చెప్ప దగి యున్నవని భావము.

సృష్టి, స్థితి, లయములలో లయ శబ్దము ఈ నామము నందు మొదటగా గ్రహించుట చేత ప్రపంచము యొక్క యనాదిత్వము సూచింపబడినది. 'జగతః' (ప్రపంచముయొక్క) అను శబ్దమును నామము యొక్క యాది యందు జేర్చి నామార్థము భావనీయ మగును. కాగా, పరమేశ్వరి జగత్తు యొక్క సృష్టి స్థితి లయములకు ఈశ్వరి (శాసనకర్త్రి) యని తెలియవలయును. కూటస్థచైతన్యమైన సచ్చిదానందము నాసగునది యగుట వలన పరమేశ్వరి యీ ప్రపంచమునకు వివర్తకారణమని యర్థము.

శ్లో॥ లాస్యదర్శనసంతుష్టా లాభాలాభవివర్జితా ।
లంఘ్యేతరాజ్ఞా లావణ్యశాలినీ లఘుసిద్ధిదా ॥ 3౫

## ౧౨౪. లాస్యదర్శనసంతుష్టా

శం. భా. లాస్యదర్శనసంతుష్టా । యథా రాజా సంపూర్ణకామః ప్రయోజన మనుద్దిశ్యాపి మృగయాదిలీలా విశేషాన్ పశ్యతి బాలకాదినృత్యం వా, తథా అజ్ఞానాం ఇష్టానిష్టమిశ్రోదాసీన చతుష్టయానుభవజన్య హర్ష శోకాది సంభవ న్మదోద్రేక శోకాతిరేక హేతుక విహితాది కరణాకరణరూప చరణాద్యంగపరిస్పందరూప నానావిధ ప్రాణికాయనికాయ జన్య లాస్యదర్శనేన అనుద్దిశ్యాపి ప్రయోజనం సంతుష్టా తత్తత్కర్మానుసారేణ ఫలప్రాపకేశ్వరతయా సర్వసమానత్వాత్, 'నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః' ఇతి భగవద్వచనాత్ । లాస్యం దేవతాదివారవనితాభిః క్రియమాణాం తాలగీతయుక్తం నృత్యం తద్దర్శనేన సంతుష్టా । తదీయ ఫలప్రదానోన్ముఖ కృపారసవతీత్యర్థః ॥ ఓం లాస్యదర్శనసంతుష్టాయై నమః ॥

ఆం. వి. పూర్ణకాముడైన రాజు ప్రయోజనమును అభిలషించకయే వేట మొదలగు లీలావిశేషములను, పిల్లలు చేయు నృత్యములను చూచుచుండును; ఆ రీతిగనే, ఇష్టము, అనిష్టము, ఇష్టానిష్టమిశ్రము, ఉదాసీనములను అనుభవచతుష్టయము వలన హర్షశోకాదులు జనించును, అట్టి హర్ష శోకాదుల వలన సంభవించెడి మదోద్రేక, శోకాతిరేకములకు హేతువులైనట్టివి, విహిత కర్మాచరణము, విహితకర్మల

అనాచరణములు; తద్రూపములైన పాదాద్యవయవముల పరిస్పంద (కదలుట) రూపము గల నానావిధ దేహధారుల శరీరావయవములైన కరచరణాదుల స్పందము - చలనము వలన జనించెడి లాస్యదర్శనముచేత ప్రయోజనమునుఅపేక్షింపకయే మహాసమ్రాజ్ఞియైన దేవి సంతుష్టురాలగును, ఆ విధముగ సంతుష్టయై యా యా జీవుల కర్మానుసారము సర్వసమానముగా ఫలప్రాపకయైన యీశ్వరి యగుటచే 'లాస్యదర్శన సంతుష్టా' యనుచు స్తవనీయ యగుచున్నది. 'నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః' - అనగా, విభువైన పరమేశ్వరుడు ఎవరి పాపమును గాని, ఎవరి పుణ్యమును గాని గ్రహించడు అని భావము. ఈ గీతావచనము వలన పరమేశ్వరి సాక్షిమాత్రయై జీవులకు వారివారి సుకృతదుష్కృత ఫలములను సమాన భావముతో అందించునని స్పష్టమగును. లాస్య మనగా, దేవతలచేత, వారవనితలచేత చేయబడునట్టి తాళగీతాది యుక్తమైన నృత్య విశేషము. తద్దర్శనము వలన మహానందస్వరూపిణియైన దేవి సంతుష్టురాలగును. పరమేశ్వరి ఆయా ప్రాణుల కర్మఫలముల నొసగుట యందు ఉన్ముఖమైన దయారసప్లావిత హృదయము గలది యని భావము.

## ౧౮౫. లాభాలాభవివర్జితా

శం. భా. లాభాలాభవివర్జితా। అప్రాప్తప్రాప్తి ర్లాభః। కృతేఽపి యత్నే తదప్రాప్తిరలాభః, 'నమే పార్థాస్తి కర్తవ్యం

త్రిషు లోకేషు కించన' ఇతి భగవద్వచనాత్ ॥ ఓం లాభా లాభవివర్జితాయై నమః ॥

ఆం. వి. అప్రాప్తప్రాప్తి అనగా లేనిది లభించుట, లాభము, ప్రయత్నము చేసినను అది లభించకపోవుట అలాభము. లాభాలాభములు రెండును లేనిది; ఏలన భగవతి పూర్ణకామ, నిత్యతృప్త. 'న మే పార్థాస్తి కర్తవ్యమ్' అనుచు గీతావచనము పరమేశ్వరునకు, పరమేశ్వరాభిన్న స్వరూపిణి యగు పరమేశ్వరికి ముల్లోకముల యందు చేయదగిన దేదియు లేదని చెప్పుచున్నది. అందువలన పరమేశ్వరికి కర్తవ్యకర్మ యనున దేదియు లేనందున ఆమెకు లాభాలాభప్రసక్తియే లేదు. కావున మహేశాని యందు 'లాభాలాభవివర్జితా' యను నామ మన్వర్థమై యలరారుచున్నది.

## ౧౭౬. లంఘ్యేతరాజ్ఞా

శం. భా. లంఘ్యేతరాజ్ఞా । ఇతరేషాం జీవభ్రాంతి కల్పితానాం గుణమూర్త్యాదీనాం ఉపాసనావిధిరూపా వా, కర్మవిధిరూపా వా ఆజ్ఞా ప్రేరణా లంఘ్యా అవిషయీకృతా యయా సా తథా । శుద్ధచైతన్యస్య విశిష్టక్రియాద్యాత్మక త్వాభావేన విధ్యవిషయకత్వాదితి యావత్ ।

అథవా, కింకరీత్వాభావేన ఇతరాసాం దేవతానామాజ్ఞా ప్రేరణా లంఘ్యా ఉపేక్షణీయా యయా సా తథా; 'సర్వ

స్యాధిపతిః సర్వస్యేశానః' ఇతి శ్రుతేః । ఈశ్వరస్య సర్వ నియంతృత్వేన స్వేతరానియమ్యత్వాదితి జ్ఞాతవ్యమ్ ॥ ఓం లంఘ్యేతరాజ్ఞాయై నమః ॥

ఆం. వి. ఇతరములు, జీవభ్రాంతికల్పితములు నయిన సగుణమూర్తులు మున్నగువాని యొక్క వివిధములయిన యుపాసన, విధి, లేక కర్మవిధి యొక్క ఆజ్ఞ-ప్రేరణ యెవరి చేత, విషయముగా జేయబడదో, ఆ తల్లి 'లంఘ్యేతరాజ్ఞా' యని స్తోతవ్య యగుచున్నది. శుద్ధచైతన్యము గుణ విశిష్ట క్రియోపాసనాదులకు విషయము కాకపోవుట వలన విధికి విషయము కాదని సునిశ్చితమైన యర్థము.

అథవా, పరమేశ్వరి యెవరికిని కింకరి - దాసి కాదు గావున, అన్య దేవతల యాజ్ఞ యామెకు ఉపేక్షణీయము. అందువలన ఆమె 'లంఘ్యేతరాజ్ఞా' యని కీర్తనీయ యగుచున్నది. 'సర్వస్యాధిపతిః సర్వస్యేశానః' యను శ్రుతివలన పరమేశ్వరుడు సర్వాధిపతి, సర్వేశ్వరుడని స్పష్టమగుచున్నది. ఈశ్వరుడు సర్వనియంతగాన, తనకంటె ఇతరులయిన వారిచేత నియమింపబడువాడు గాడని తెలియనగును. శ్రీచక్రనగర మహాసామ్రాజ్ఞి యగు శ్రీమహాత్రిపురసుందరియు తాదృశయే యని భావము.

## ౧౮౩. లావణ్యశాలినీ

శం. భా. లావణ్యశాలినీ । లావణ్యం సౌందర్యం పరమానందస్వరూపతయా అతిశయప్రీతివిషయత్వం శాలత ఇతి

తథా । సర్వావయవసాధారణ సుందరభావవతీతి వా ॥
ఓం లావణ్యశాలిన్యై నమః ॥

ఆం. వి. లావణ్య మనగా సౌందర్యము. పరమానంద స్వరూపము గలదగుటచేతను సర్వాతిశయప్రీతికి విషయమైన సౌందర్యముతో ప్రకాశించునదగుట చేతను, దేవి 'లావణ్యశాలినీ' యని ప్రస్తూయమాన యగుచున్నది. సర్వావయవ సాధారణమైన అనగా ముక్తాహారము నందలి ప్రతి ముత్యము లో ప్రకాశించునట్టి తళతళ కాంతివలె శరీరము నందలి ప్రత్యేకావయవము నందు వెలుగొందు తళతళ కాంతి స్ఫురణ మును లావణ్య మందురు. తాదృశమైన సుందర భావము గల దగుటంజేసియు మహామహేశ్వరి 'లావణ్యశాలినీ' యని కీర్తనీయురాలగుచున్నది.

## ౫౮౫. లఘుసిద్ధదా

శం భా. లఘుసిద్ధిదా । లఘునా ఉపాయేన సిద్ధిం వాంఛితార్థప్రాప్తిం దదాతీతి తథా ।

లఘుశబ్దః లక్షణయా లఘిమాసిద్ధిపరః, తథాచ లఘిమాద్యష్టైశ్వర్యప్రదేతి వా ।

అథవా, లఘూనాం అత్యంతాల్పజ్ఞాన భాగ్యశరీరరూప చరణవతా మప్యతినికృష్టానాం తిర్యగాదీనామపి సిద్ధిం ముక్తి యోగ్యతాహేతు జ్ఞానాదిసాధనసంపత్తిం తత్కార్య

మహిమాతిశయోన్నయాం దదాతీతి సా తథా॥ ఓం లఘు సిద్ధిదాయై నమః ॥

ఆం. వి. సులభోపాయము వలన భక్తులకు సిద్ధిని, అనగా అభీష్టార్థము నొసగునది గావున, పరాభట్టారిక 'లఘు సిద్ధిదా' యని స్తవనీయ గుణాన్వితయై విరాజిల్లుచున్నది.

లఘు శబ్దము లక్షణయా లఘిమాసిద్ధిపర మని గ్రహించవలయును. కాగా, భగవతి లఘిమాది అష్టఐశ్వర్య సిద్ధులను ప్రసాదించునదగుటంజేసి యామె 'లఘుసిద్ధిదా' యని ప్రఖ్యాతి నందెను. (అణిమా, మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తిః, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం - ఇవి యష్టసిద్ధులని యోగిజనానుభవము.)

అథవా, అత్యంతము అల్పజ్ఞానము, అల్ప భాగ్యము, అల్ప శరీరగూపచరణములు గలవారికి, అతి నికృష్టములైన తిర్యగాది పశుపక్ష్యాదులకు సయితము సిద్ధిని, అనగా ముక్తి యోగ్యతాహేతువైన జ్ఞానాది సాధన సంపత్తిని తత్కార్య మహిమాతిశయముచేత ఊహింపదగిన సిద్ధిని ప్రసాదించునది గాన శ్రీమహారాజ్ఞి 'లఘుసిద్ధిదా' యనికీర్తింపబడుచున్నది.

శ్లో॥ లాక్షారససవర్ణాభా లక్ష్మణాగ్రజపూజితా ।
లభ్యేతరా లబ్ధభక్తిసులభా లాంగలాయుధా ॥ 3౬

శంకర. 12 - 36]

## ౧౮౯. లాక్షారససవర్ణాభా

శం. భా. లాక్షారససవర్ణాభా । లాక్షారసేన లాక్షాద్రవేణ సమానో వర్ణో యస్యాః సా తథాభూతా శోభా కాంతిః యస్యాః సా తథా । అతిపాటలవిగ్రహప్రభేత్యర్థః ॥ ఓం లాక్షారససవర్ణాభాయై నమః ॥

ఆం. వి. పరమేశ్వరి లాక్షారసముతో అనగా లత్తుకతో సమానమైన యెఱ్ఱని వర్ణముతో నొప్పారు కాంతి గలది. అట్టి అతిపాటలమైన శరీరకాంతి గలదగుట వలన మహేశ్వరి 'లాక్షారససవర్ణాభా' యని భక్తగణముచే స్తవనీయ యగుచున్నది.

## ౧౯౦. లక్ష్మణాగ్రజపూజితా

శం. భా. లక్ష్మణాగ్రజపూజితా । అగ్రే జాయేతే త్యగ్రజౌ రామభరతౌ లక్ష్మణస్యాపి జ్యేష్ఠభూత రామాచారానుకారిత్వేన చతుర్భిరపి దాశరథిభిః పూజితేత్యర్థః । రామస్య శివలింగప్రతిష్ఠాతా - ఇతి నామవత్త్వాన్యథానుపపత్త్యా శివదంపతి పూజకత్వేన తద్వంశస్త్రీపురుషాణాం తత్సిద్ధిరితి ధ్వనితోఽర్థః ॥ ఓం లక్ష్మణాగ్రజపూజితాయై నమః ॥

ఆం. వి. ముందు పుట్టినవారు గావున అగ్రజులు, రామభరతులు లక్ష్మణునకు నయితము అగ్రజులు, జ్యేష్ఠుడయిన రాముని యొక్క యాచరణమును అనుకరించుట చేత దశరథ

పుత్త్రులైన నలుగురిచేతను పరాదేవి పూజింపబడ నదని భావము. శ్రీరామచంద్రుడు రామేశ్వరము నందు శివలింగ ప్రతిష్ఠ చేసెనని యైతిహ్యము. రాముడు శివలింగప్రతిష్ఠాత యను నామము ధరించి యుండుట అన్యథా అనుపపన్నము గాన, శివదంపతిపూజ చేయువారుగా రామచంద్రుని కంటె అన్యులయిన తద్వంశ స్త్రీ పురుషులకు శివోపాసకత్వము సిద్ధించినదని యీ నామముచే ధ్వనితమైన యర్థమని తెలియ వలయును. కావున 'లక్ష్మణాగ్రజపూజితా' యనుచు అర్చన ప్రీతమానస యైన పరమేశ్వరి సాధకులచే అర్చింపబడుచున్నది.

## ౧౯౧. లభ్యేతరా

శం. భా. లభ్యేతరా । లభ్యాని లబ్ధవ్యాని కర్మోపాసనావిశేషాణాం ఫలత్వేన సాధ్యాని భవ్యానీత్యర్థః । తేభ్య ఇతరా విలక్షణా । 'తత్సత్యం స ఆత్మా', 'నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్ తమాత్మస్థమ్' ఇతి, 'యత్సాక్షా దపరోక్షాద్బ్రహ్మ' ఇత్యాదిభిః శ్రుతిభిః ఆత్మనః నిత్యప్రాప్తస్వరూపత్వేన ప్రాప్తప్రాప్తవ్యరూపతయా మోక్షరూపత్వేన చతుర్విధ క్రియాఫలత్వాభావాదితి మంతవ్యమ్ ।

అథవా, ఇతరాణి ధర్మార్థకామరూప త్రివర్గరూపాణి ఫలాని లబ్ధవ్యాని ప్రాప్తవ్యాని యస్యాః సకాశాదితి సా తథా, ఉక్తశ్రుతేః ॥ ఓం లభ్యేతరాయై నమః ॥

ఆం. వి. లభ్యము లనగా పొందదగినవి. కర్మోపాసనా విశేషములచేత ఫలములుగా సాధింపదగినవి, అనగా శుభము లని యర్థము. కర్మోపాసనాది సాధ్యఫలముల కంటె ఇతర మైనది,-విలక్షణమైనదిగావున, శ్రీమహాభట్టారిక 'లభ్యేతరా' యను సార్థక నామముతో విరాజమాన యగుచుండును. 'తత్సత్యం స ఆత్మా' - 'ఆ బ్రహ్మ సత్యరూపమైనది, అది ఆత్మ' యనియు, 'నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం...' - 'నిత్యములలో నిత్యము, చేతనములలో చేతనము, ఏకము, అద్వితీయమై యుండి యనేక ప్రాణిసముదాయము యొక్క వాంఛితార్థముల నొసగునట్టి యా బ్రహ్మ యాత్మస్థ' మనియు, 'యత్సాక్షా దపరోక్షాద్బ్రహ్మ' - 'ఏది సాక్షాత్తు అపరోక్ష బ్రహ్మయో' యనియు శ్రుతులు చెప్పుచున్నవి. అందువలన ఆత్మ నిత్యప్రాప్తమై యున్న స్వరూపము గలదగుట చేతను, ప్రాప్తమైనది, ప్రాప్తవ్యమైనది, అనగా పొందబడదగినది యగుట చేతను, మోక్షరూప మగుటచేతను, ఉత్పాద్య, ఆప్య, వికార్య, సంస్కార్యరూప చతుర్విధ క్రియాఫలత్వము లేనిదగుట వలనను దేవికి 'లభ్యేతరా' యను నామమన్వర్థము.

అథవా, మోక్షేతరములైన ధర్మ, అర్థ, కామరూప త్రివర్గ ఫలములు పూర్వము ప్రతిపాదింపబడి శ్రుతివాక్యముల తాత్పర్యానుసారము ఆ పరమేశ్వరి వలన పొందదగియున్నవి గావున, జగన్మాత 'లభ్యేతరా' యని సంకీర్తితయగుచున్నది.

## ౧౯౨. లబ్ధభక్తిసులభా

శం. భా. లబ్ధభక్తిసులభా । భక్తిః సామాన్య విశేషాకారేణ ద్వివిధా । తత్ర ఆద్యా ఆర్తజిజ్ఞాస్వర్థార్థిభిః యైర్లబ్ధా తత్తత్ఫలోద్దేశేన సమయవిశేషేవిచ్ఛిద్య విచ్ఛిద్య ప్రాప్తా తేషాం సులభా తత్తత్ప్రారబ్ధానుసారేణ ఫలదానోన్ముఖస్వాత్మరూపతయా సంనిహితత్వాత్ । ద్వితీయా భక్తిస్తు బ్రహ్మసాక్షాత్కారతయా పురుషేణ యేనైకభక్తితయా లబ్ధా, 'ఏకభక్తి ర్విశిష్యతే' ఇతి స్మృతేః, తస్య సులభా, స్వాత్మరూపతయా సదా జ్ఞాయమానత్వాత్ । 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' ఇతి గీతాసు ।

అథవా, లబ్ధా ప్రాప్తా సత్యపి కంఠగత చామీకరవత్ లబ్ధభక్తీనాం సులభా సుఖేన అనాయాసేన కష్టేన వినా సాధ్యతయా లాభః ప్రాప్తిం యస్యాః సా తథా, 'భక్త్యా మామభిజానాతి' ఇతి స్మృతేః ॥ ఓం లబ్ధభక్తిసులభాయై నమః ॥

ఆం. వి. భక్తి సామాన్యభక్తి, విశేషభక్తి యని రెండు విధములు. మొదటిదైన సామాన్యభక్తి ఆర్తుడు, తత్త్వజిజ్ఞాసువు, ఫలాభిలాషి-వీరిచేత పొందబడునది. ఆయా ఫలములను ఉద్దేశించి కాలభేదముచేత ఖండఖండశః పొందబడునది, అట్టి భక్తులకు దేవి సులభముగా లభించునది. ఏలన, భక్తసులభమైన యీ తల్లి వారివారి ప్రారబ్ధకర్మానుసారము ఫలము నొసగుట కున్ముఖమైన స్వాత్మరూపముతో వారికి సంనిహితమై యుండును. రెండవదైన భక్తి బ్రహ్మ సాక్షా

త్సాకారము గల పురుషునిచేత ఏకభక్తిరూపముతో - ఏకత్వభజనరూపమైన భక్తితో పొందబడునది, 'ఏకభక్తిర్విశిష్యతే' అను గీతావచనము ఫలాభిసంధి యుక్తులయిన భక్తుల కంటె స్వస్వరూపావగతి గల బ్రహ్మనిష్ఠుడైన ఏకభక్తుడు విశిష్టుడని చెప్పుచున్నది. అట్టి యేకభక్తి గల జ్ఞానికి పరమేశ్వరి సులభురాలు; ఏలన, పరాభట్టారిక స్వాత్మరూపముగనే సదా అనుభూయమాన మగుచుండును. 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' - 'జ్ఞాని నా స్వరూపమే (ఆత్మయే) యని నా నిశ్చయము' అని గీతలో భగవద్వచనము. కావున, ఏకభక్తి గల జ్ఞాని యాత్మస్వరూపుడే యని భావము.

అథవా, కంఠమున ధరించియున్న సువర్ణాభరణమువలె లబ్ధమైనదయ్యు భక్తి గలవారికి సులభముగా, సుఖముగా, అనాయాసముగా, కష్టము లేకుండా సాధ్యమైన ప్రాప్తి - లాభము గలది గావున, దేవి 'లబ్ధభక్తిసులభా' యని గాయమాన యగుచున్నది. 'భక్త్యా మా మభిజానాతి' - 'భక్తితో నన్ను తెలిసికొనును' అని భగవద్వచనము.

కంఠము నందున్న హారమును విస్మరించి దానికై యన్వేషించుచున్నవానికి, ఎదటనున్నవ్యక్తి 'అదిగో, హారము నీ మెడలోనేయున్న' దని చెప్పినపుడు దానిని స్పృశించి స్వస్థత పొందును. ఆ రీతిగనే, అజ్ఞానము చేత ఆత్మవిస్మృతి పొందిన వానికి శ్రుతిస్మృతి పురాణేతిహాసాది వచనములచే ప్రబోధితుడై స్వస్వరూపావగతి కలుగును. ఏకభక్తి

నిష్ఠుడయిన జ్ఞానికి జగన్మాత ఆత్మస్వరూపముతో అనుభూయ మాన యగునని ఉక్త నామము యొక్క లక్ష్యార్థము.

## ౧౯౩. లాంగలాయుధా

శం. భా. లాంగలాయుధా । శేషరూపతయా హలా యుధేత్యర్థః; 'అనంతశ్చాస్మి నాగానామ్' ఇతి శ్రీభగవద్వచ నాత్ ॥ ఓం లాంగలాయుధాయై నమః ॥

ఆం. వి. ఆదిశేష స్వరూపిణి యగుటంజేసి మహా త్రిపురసుందరి 'హలాయుధా' యను నామముతో స్తవనీయ యగుచున్నది. గీతలో శ్రీ భగవానుడు 'అనంతశ్చాస్మి నాగానామ్' - 'సర్పములలో నేను అనంతుడను' అని చెప్పి కొనెను. అనంతుడనగా ఆదిశేషుడు. భగవంతుడు అనంత స్వరూపుడు గాన, భగవతియు అనంతస్వరూపిణియే యని గ్రహించవలయును.

'లాంగలాయుధా' యనుట వలన జగన్మాత స్వస్వ రూపముతో జగత్పాలనము చేయునది యని లక్షణయా తెలియనగును.

శ్లో॥ లగ్నచామరహస్త శ్రీ శారదాపరివీజితా ।
లజ్జాపదసమారాధ్యా లంపటా లకులేశ్వరీ ॥ 32

## ౧౯౪. లగ్నచామరహస్త శ్రీ శారదాపరివీజితా

శం. భా. లగ్నచామరహస్త శ్రీశారదాపరివీజితా। లగ్నౌ కరసంబద్ధౌ ధృతావిత్యర్థః; లగ్నౌ చామరౌ యయో

_స్తే శ్రీశ్చ మహాలక్ష్మీశ్చ శారదా చ తే, తాభ్యాం వీజితా పరివీజితా । అనాదికాలాదారభ్య పరిచర్యయా వీజ్యమానే త్యర్థః ॥ ఓం లగ్నచామరహస్త శ్రీశారదా పరివీజితాయై నమః ॥

ఆం. వి. హస్తము లందు వింజామరలు ధరించియున్న శ్రీ మహాలక్ష్మి, శ్రీ మహాసరస్వతులచేత వింజామరలతో విసరబడుచున్నది గాన శ్రీ మహాసామ్రాజ్ఞి 'లగ్నచామర హస్త శ్రీశారదా పరివీజితా' యని స్తుతింపబడుచున్నది. అనాదికాలము నుండి సేవారూపముగ లక్ష్మీ సరస్వతులు వింజామరలతో దేవిని వీచుచున్నారని భావము.

## ౯౯౫. లజ్జాపదసమారాధ్యా

శం. భా. లజ్జాపదసమారాధ్యా। లజ్జానామఅంతఃకరణ ధర్మః జుగుప్సాహేతుః గూహనసాధనమ్, ఉపలక్షణం మనో ధర్మాణామ్, తస్య పద మాశ్రయః; 'కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ' ఇతి శ్రుతేః । తస్మిన్ సమారాధ్యా చింత నీయేత్యర్థః, 'య ఆత్మని తిష్ఠన్నంతరో యమయతి', 'గుహా హితం గహ్వరేష్ఠం పురాణమ్', 'తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః' ఇత్యాదిశ్రుతిభ్యః ।

అథవా, లజ్జాపదం జీవచక్రమ్, తస్మిన్ తదధిష్ఠానానందా భివ్యక్తిహేతుతయా బహిర్యాగక్రమేణ పూజనీయేత్యర్థః॥

అం. వి. లజ్జ యనగా అంతఃకరణధర్మము, జుగుప్సా హేతువైన విషయమును గుప్త మొనర్చుకొనుటకు సాధన మైనది లజ్జ. లజ్జా పదము మనోధర్మము లన్నింటికి ఉప లక్షణము, అట్టి లజ్జకు ఆశ్రయమైనది 'లజ్జాపద' మనబడును. కామము, సంకల్పము, విచికిత్స (సందేహము), శ్రద్ధ, అశ్రద్ధ, ధృతి, అధృతి, హ్రీః (లజ్జ), ధీః (బుద్ధి), భీః (భయము)-ఇవి యన్నియు మనోధర్మము లని శ్రుతివచనము వలన తెలియు చున్నది. కావున, లజ్జాదులకు సమాశ్రయమైన యీ మనస్సు నందు పరమేశ్వరి సమారాధనీయురాలగుచున్నది. 'య ఆత్మని తిష్ఠన్నంతరో యమయతి' - 'పరమేశ్వరుడు ఆత్మ స్థితుడై, అంతర్యామియై శాసించుచున్నా' డనియు, 'గుహా హితం గహ్వరేష్ఠం పురాణమ్' - 'పరమేశ్వరుడు హృదయ గుహాయందు, అంతరాంతరమునందున్న పురాణపురుషు' డనియు, 'తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః' - 'ధీరులైన బ్రహ్మనిష్ఠులు ఆత్మయందు వ్యాపించియున్న యీ పరమేశ్వ రుని దర్శింతు' రనియు పెక్కు శ్రుతులు వాకొనుచున్నందున, పరమేశ్వరి లజ్జకు ఆశ్రయమైన యంతఃకరణము నందు వ్యాపించి యుండునని తెలియవలయును. అందువలన దేవికి 'లజ్జాపదసమారాధ్యా' యను నామము అన్వర్థము.

అథవా, లజ్జాపదమున కర్థము జీవసముదాయము. ఆ జీవజాతము నందు, ఆ జీవుల కధిష్ఠానమైన ఆనందాభివ్యక్తి

హేతువుగా బహిర్యాగ క్రమముతో పూజనీయ యని భావము.

విశే :- 'అంతర్యాగక్రమారాధ్యా' యని లలితా సహస్ర నామములో చెప్పబడినది; కాని, వెంటనే 'బహిర్యాగ సుదుర్లభా' యను నామము గలదు. అధికార తారతమ్యము ననుసరించి పరమేశ్వరి అంతర్యాగము, బహిర్యాగము- రెండు రీతులుగ గూడ అర్చింపదగునని తెలియవలయును.

అంతర్యాగ మనగా మనస్సుతో చేయు యజనము. ఈ యాగము నందు బుద్ధివృత్తిని స్రుక్కుగాను, మనస్సును ఆజ్యాది హవిస్సుగాను భావించి బుద్ధిరూపస్రుక్కుతో మనో రూపమైన యాజ్యమును గ్రహించి చిదగ్నికుండము నందు హోమము చేయుటను అంతర్యాగమందురు.

బహిర్యాగ మనగా, ఆగమ శాస్త్రానుసారము బాహ్యమైన శ్రీచక్రము నందలి నవావరణములను అర్చించుట. ఈ రీతిగ బహిర్యాగ క్రమముతో శ్రీచక్రార్చనము చేయు భక్తుడు పిండమును శ్రీచక్రముగా భావన చేయగల సంస్కార సంపన్నుడగును. అపుడతడు అంతర్యాగము చేసి పరమేశ్వరి యనుగ్రహమునకు పాత్రుడై తుదకు బ్రహ్మైక్యానుభూతి ననుభవించి జీవన్ముక్తుడగునని భావము.

## ౧౫౬. లంపటా

శం. భా. లంపటా । లమితి పృథివీవాచకబీజేన తదుప లక్షితం జగత్ లక్ష్యతే; పటశబ్దేన ఆవారకత్వధర్మవత్త్వయా

అవిద్యా లక్ష్యతే; లమః జగతః కారణీభూతా అవిద్యా యస్యాః సా తథా; 'మాయినం తు మహేశ్వరమ్', 'య ఏకో జాలవాన్' ఇతి శ్రుతేః, 'అజ్ఞానేనావృతం జ్ఞానమ్' ఇతి స్మృతేశ్చ ।

అథవా, లంపటో నామ తంద్రీఆలస్యమ్, కర్మోపాసనా బాహుళ్యేఽపి ప్రతిబంధకభూయస్త్వే ప్రభుతయా పరమేశ్వరస్య ఫలదానోన్ముఖతాయాం రాజాదివత్ చిరవిలంబిత సేవా ఫలదానస్యైవ ముఖ్యే తద్వత్త్వోపచారాత్; లంపటో యస్యాః సా తథా ।

అథవా, లంపటాదీనా మంతఃకరణధర్మాణా మధ్యాస వశేన తదవచ్ఛిన్నే చైతన్యే సత్త్వరజస్తమఃకార్యాణా ముపలబ్ధే స్తద్వత్త్వం వా ॥ ఓం లంపటాయై నమః ॥

ఆం. వి. 'లం' అనునది పృథివీబీజము, తద్వాచక బీజముచేత ఉపలక్షిత మయ్యెడి జగత్తు ఇట సూచితము. పటశబ్దము చేత ఆవారకధర్మము గల యవిద్య పరిలక్షిత మగును; జగత్తుకు కారణభూతురాలయిన యవిద్య గలది గాన, విద్యాస్వరూపిణియైన దేవి 'లంపటా' యని సంకీర్తితు రాలగుచుండును. 'మాయినం తు మహేశ్వరమ్' - 'పరమే శ్వరుడు మాయాయుక్తుడు' అనియు, 'య ఏకో జాలవాన్'- 'అద్వితీయుడయిన పరమేశ్వరుడు మాయగలవాడు (మాయా శబలిత బ్రహ్మ) అనియు శ్రుతులు చెప్పుచున్నవి. ఇంతియే

గాదు, 'అజ్ఞానేనావృతం జ్ఞానమ్' - 'అజ్ఞానరూపమైన బ్రహ్మ పదార్థము ఆవరణ, విక్షేపరూపమైన యవిద్యచేత ఆవృతమై యున్న' దని గీతావచనము వలన స్పష్టమగుచున్నది.

అథవా, లంపట మనగా నిద్రమత్తు, సోమరితనము. అధికముగా కర్మోపాసనలు చేసియున్నను, మోక్ష ప్రతిబంధక సామగ్రి యెక్కువగా ఉండవచ్చును; పరమేశ్వరుడు భక్తునకు ఫలము నొసగుట కున్ముఖుడై యుండవచ్చును; అయినను, తమ సేవకులకు సహాయము చేయువలయు నను కోరికగల ప్రభువులు వెంటనే ఫలము నొసగుటకు విముఖత్వము చూపుచుందురు; ఆ రీతిగనే, పరమేశ్వరుడు తమ భక్తులకు ప్రతిబంధక సామగ్రి వలన వెంటనే ఫలము నొసగుటలో ఒకవిధమగు ఆలస్యమును చూపును; తాదృశమైన లంపటము ఆలస్యము గలదగుట వలన దేవి 'లంపటా' యని స్తుతింపబడును.

అథవా, మనోధర్మములైన లంపటాదులు - ఆలస్యాదులు అధ్యాసవశము చేత తదవచ్ఛిన్నమైన చైతన్యమునందు దేవి యందు సత్త్వ, రజస్తమోగుణ కార్యములు ఉపలబ్ధము లగుచున్నవి గాన, జగన్మోహిని యగు త్రిపురసుందరి 'లంపటా' యని కీర్తింపబడుచున్నది.

## ౧౯౩. లకులేశ్వరీ

శం. భా. లకులేశ్వరీ । కుః పృథివ్యుపలక్షితజగత్ లీయతే అస్మిన్నితి కులమ్, మాయోపాధిక చైతన్యమ్,

ప్రలయాధిష్ఠానమ్ । 'యత్ప్రయం త్యభిసంవిశంతి' ఇతిశ్రుతేః। లీయమానం కులం లకులం నిరుపాధిక మిత్యర్థః । తచ్చ సా తథా ।

అథవా, లకులం స్థానవిశేషః స్వాధిష్ఠానం మణిపూరకం వా, తస్యేశ్వరీ, విష్ణురుద్రాత్మికేత్యర్థః; భూతసృష్టి శ్రుతౌ పృథివ్యా ఉదకే తస్య తేజసి తస్య పరమాత్మని లయశ్రవణాత్ । 'సదాయతనాః సత్ప్రతిష్ఠితాః' ఇతి । తస్యేశ్వరీ విభూతివిశేషో వా ॥ ఓం లకులేశ్వర్యై నమః ॥

ఆం. వి. 'కు' శబ్దము చేత ఉపలక్షితమగు జగత్తు దీనియందు లయమగుచున్నది గాన. 'కుల' మని యందురు. కుల మనగా మాయోపాధిక చైతన్యము, ప్రళయమున కధిష్ఠానమని భావము. 'యత్ప్రయం త్యభిసంవిశంతి' - 'దేనిని పొందుచున్నారో, దేని యందు లయమగు చున్నారో, అది బ్రహ్మ' యని శ్రుతివచనము వలన 'కుల' మనగా మాయోపాధిక చైతన్య మని స్పష్టమగును. లీయమానమైన కులము 'లకుల' మనబడును; అనగా, నిరుపాధిక శుద్ధ చైతన్య మని యర్థము. నిరుపాధిక చైతన్యస్వరూపిణి, యీశ్వరియు గావున పరదేవత 'లకులేశ్వరీ' యను నామముతో ప్రసిద్ధము.

అథవా, లకుల మనగా స్వాధిష్ఠాన, మణిపూరక నామక స్థానవిశేషము. స్వాధిష్ఠాన, మణిపూరకములకు ఈశ్వరిగాన, లకులేశ్వరి; విష్ణు, రుద్రాత్మిక యని భావము.

భూతసృష్టి ప్రతిపాదక శ్రుతి యందు పృథివి జలమునందు, జలము అగ్నియందు, అగ్ని పరమాత్మయందు లయము చెందుట శ్రూయమాణ మగుచున్నది. 'సదాయతనాః సత్ప్రతిష్ఠితాః' - 'సర్వ భూతములు సత్పదార్థమైన బ్రహ్మమే ఆయతనముగా - స్థానముగా గలవి, సద్రూపబ్రహ్మయందే ప్రతిష్ఠితములు' అని చెప్పబడినది. ఆ బ్రహ్మయొక్క విభూతి విశేష మగుటంజేసియు పరమేశ్వరికి 'లయ లేశ్వరీ' యను నామము స్వరసమే యని తెలియవలయును.

శ్లో॥ లబ్ధమానా లబ్ధరసా లబ్ధసంపత్సమున్నతిః ।
హ్రీంకారిణీ హ్రీంకారాద్యా హ్రీంమధ్యా
హ్రీంశిఖామణిః ॥ ౩౮

## ౧౯౮. లబ్ధమానా

శం. భా. లబ్ధమానా । సర్వైః ప్రాణిభిః లబ్ధః మానః అధ్యస్తాహంకారః; 'అభిమానాత్మక స్తద్వ దహంకారః ప్రకీర్త్యతే' - ఇతి స్మరణాత్ । అధ్యాసేనాహంకారాధిష్ఠానే త్యర్థః ।

అథవా, 'మాన పూజాయామ్' ఇతి స్మరణాత్ యై ర్యైః ప్రాణిభిః విద్యైశ్వర్య కుల సౌందర్యాతిశయాదివశాత్ పూజా లభ్యతే సుఖహేతుః సా తదంతర్యామినా పూర్వమేవ లబ్ధా, పూజాదిజన్యోపకారస్య సుఖాదేః స్వరూపతయా లబ్ధత్వాత్ ।

యద్వా, మానఃపరిమాణఃఅణుమహద్దీర్ఘహ్రస్వభేదేన ప్రసిద్ధః । 'స వా ఏష మహా నజ ఆత్మా మహాన్ ప్రభుర్వై పురుషః', 'అణోరణీయాన్ మహతో మహీయాన్' ఇత్యాది వేదవాక్యైః జల సూర్యాదివత్ ఉపాధిధర్మాణా ముపహితే గజ స్తంభ మత్కుణసర్పాదౌ ప్రతీయమానత్వాత్, లబ్ధః మానః ప్రమాణః ఉపహితతయా జగతః యయా సా తథా ॥

ఓం లబ్ధమానాయై నమః ॥

ఆం. వి. సర్వప్రాణుల చేత అధ్యస్తమైన యహంకారము 'లబ్ధమానః' యనబడును. 'అభిమానాత్మక స్తద్వహంకారః ప్రకీర్త్యతే' - 'అహంకారము అభిమానాత్మకము వంటిదని పేర్కొనబడుచున్న' దని స్మృతివచనము. కావున, అధ్యస్తమైన యహంకారమునకు అధిష్ఠాత్రి గావున దేవి 'లబ్ధమానా' యని కీర్తింపబడుచున్నది.

అథవా, 'మాన పూజాయామ్' - 'మానధాతువు పూజార్థక' మను వచనము వలన ఏ యే ప్రాణుల వలన విద్య, ఐశ్వర్య, కుల, సౌందర్యముల యతిశయ హేతువు చేత సుఖహేతువైన పూజ లభించుచున్నదో, ఆ పూజ ఆయా జీవుల యందు అంతర్యామియై యుండుటవలన పూర్వమే లబ్ధమై యున్నది; ఏలన పూజాదుల వలన కలుగు సుఖాద్యుపకారములు స్వస్వరూపముతో లబ్ధమై యున్నవి.

యద్వా, అణు, మహత్, దీర్ఘ, హ్రస్వ భేదముచేత ప్రసిద్ధమై యున్న పరిమాణము 'మాన' మను సంజ్ఞతో

వ్యవహరింపబడును. 'స వా ఏష మహా నజ ఆత్మా మహాన్ ప్రభుర్వై పురుషః' - 'ఆ యీ పురుషుడు (పరబ్రహ్మ చైతన్యము) మహాన్ (అపరిచ్ఛిన్నమైనవాడు), అజః - జన్మలేనివాడు, ఆత్మ, మహత్తుకంటె అతి మహత్వ సంపన్నుడు, ప్రభువు' అనియు, 'అణోరణీయాన్ మహతో మహీయాన్' - 'అణువు కంటె అణుతరము, మహత్తు కంటె మహత్తర' మని చెప్పునట్టి పెక్కు శ్రుతి వచనాదుల చేత జలములో ప్రతిఫలించు సూర్యచంద్రాదుల వలె ఉపాధిధర్మము లన్నియు ఉపహితము లయిన గజ, తృణఖండ, మత్కుణ (నల్లి) సర్వాదులయందు పై ప్రమాణములు (కొలతలు) ప్రతీయమానము లగును: కాని ఉపాధిగత పరతత్త్వమునకు పరిమాణమను నది లేదు. దృశ్యమానమగు పరిమాణము ఉపాధి వలన కలుగునట్టిదియే గాని, తత్త్వతః మూలవస్తువునకు లేదు. ఉపహితమైన జగత్తునకు పరిమాణము ఎవరిచేత లభించినదో, ఆ పరమేశ్వరి 'లబ్ధమానా' యను నామముతో భజనీయ యగుచున్నది.

## ౧౯౯. లబ్ధరసా

శం. భా. లబ్ధరసా । 'రసో వై సః' ఇతి శ్రుతేః రసవత్ రస్యతే సంబధ్యత ఇతి అత్యంతప్రీతివిషయః ఆనందః, సః స్వస్వరూపత్వేన లబ్ధో యయా సా తథా । శృంగార రసో వా; తద్వ్యంజక మంగలాభరణ పుష్పాలంకారవత్త్వాదితి

భాసః । శుద్ధసత్త్వప్రధాన మాయోపాధికతయా, 'రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః' ఇతి గీతా వచనాత్ నైవేద్యాదౌ కట్వామ్లలవణాదీనాం దేవాదివిషయే నిషేధాచ్చ ప్రీతివిషయత్వేన మధురరసో లబ్ధో యయేతి వా తథా ॥ ఓం లబ్ధరసాయై నమః ॥

ఆం. వి. 'రసో వై సః' - 'ఆ బ్రహ్మవస్తువు రస స్వరూపమైన' దను శ్రుతి వచనము వలన రసమువలె అనుభ వింపబడుచున్న, అత్యంత ప్రీతికి విషయమైన ఆనందము స్వస్వరూపముగా నెవరివలన ఉపలబ్ధ మగుచున్నదో, ఆ పర దేవత 'లబ్ధరసా' యని భజనీయ యగుచున్నది. రస మనగా శృంగారరస మనియు చెప్పవచ్చును; శృంగార రసాభివ్యంజ కములయిన మంగళకరాభరణములు, పుష్పాలంకరణాదులు గలదగుట వలన దేవి 'లబ్ధరసా' యని కీర్తింపబడుచున్నది. శుద్ధసత్త్వప్రధానమైన మాయోపాధి గలదగుటం జేసి, 'రస్య ములు (రుచ్యములు), స్నిగ్ధములు, స్థిరములు, హృద్యములు నయిన యాహారములుసాత్త్వికగుణసంపన్నులయిన వ్యక్తులకు ప్రియమైన యాహారము' లను గీతావచనము వలన నైవేద్యా దుల యందు కటు, ఆమ్ల, లవణాది రసములు దేవతానివేదన విషయములో నిషిద్ధము లగుట వలనను, ప్రీతివిషయ మైనదిగా మధురరసము భగవతిచే లభించుచున్నది గావున, జగన్మాత 'లబ్ధరసా' యని సంస్తవనీయ యగుచున్నది.

## ౨౦౦. లబ్ధసంపత్సమున్నతిః

శం. భా. లబ్ధసంపత్సమున్నతిః । లబ్ధాః స్వస్వరూప తయా స్వతః సిద్ధాః యాః సంపదః సత్యకామత్వాదయః సచ్చిదానందాదయో వా, తాభిః సమున్నతిః సర్వోత్కృష్టతా యస్యాః సేతి తథా । బ్రహ్మణః మాయామాత్రోపాధినా అభివ్యజ్యమానాః గుణాః కర్మానుద్భూతత్వాదనాకస్మికాః సంతః సర్వోత్కృష్టభావం బ్రహ్మణః జ్ఞాపయంతి ।

శ్లో॥ 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమం చ దైవతమ్ ।
పతిం పతీనాం పరమం పురస్తా
ద్విదామ దేవం భువనేశమీడ్యమ్ ॥'

'సత్యకామః సత్యసంకల్పః'

'ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యామ్యేష యోనిః సర్వస్య' ఇతి,

'గతిర్భర్తా ప్రభుః సాక్షీ'

ఇత్యాది శ్రుతిస్మృతిశతేభ్యః 'ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య' ఇతి ప్రసిద్ధ నిత్యోత్కర్షవత్త్వం బ్రహ్మస్వరూప మేవేతి నాత్ర విచారణీయం కించిదస్తీ త్యభిప్రాయః॥

ఓం లబ్ధసంపత్సమున్నత్యై నమః ॥

ఆం. వి. స్వస్వరూపముగా స్వతఃసిద్ధములైన సత్యకామత్వ, సత్యసంకల్పత్వాదులు గాని, సచ్చిదానందాదు

లయిన సంపదల చేత సర్వోత్కృష్టత్వము గలది గాన, దేవి 'లబ్ధసంపత్సమున్నతిః' యని ధ్యానింపబడుచున్నది.

మాయామాత్రోపాధి వలన అభివ్యజ్యమానములైన బ్రహ్మ సంబంధులయిన గుణములు కర్మజన్యములు కావు. అందువలన, అనాకస్మికములైన, అనగా సిద్ధమైన గుణములు బ్రహ్మ యందలి సర్వోత్కృష్టభావ జ్ఞాపకములుగా ఉన్నవి.

'పరమాత్మ ఈశానాది శక్తులు గల యీశ్వరులలో పరమ మహేశ్వరుడు దేవతలలో పరమదైవతము, ప్రభువులలో పరమ ప్రభువు, సకల భువనేశ్వరుడు, పూజనీయుడు నయిన దేవుని ప్రత్యక్షముగా తెలిసికొనుచున్నాము.

'పరమేశ్వరుడు సత్యకాముడు, సత్య సంకల్పుడు',

'ఈ పరమాత్మయే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, ఇతడే సర్వాంతర్యామి, ఈయనే సర్వప్రపంచమునకు కారణభూతు డయిన దేవుడు;

'ఈయనే సర్వులకు చేరదగినవాడు, సర్వప్రాణులభరణ పోషణములు చేయువాడు, ప్రభువు, సర్వసాక్షి' ఇత్యాది శ్రుతిస్మృతిశతము వలన 'ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య, - 'బ్రహ్మనిష్ఠుడయిన జ్ఞానికి నిత్యమైన మహిమ' అని శ్రుతిప్రసిద్ధ నిత్యోత్కర్షత్వము బ్రహ్మస్వరూపమే యని యనుటలో విచారణీయాంశము లేశమాత్రమైనను లేదని యభిప్రాయము.

## ౩౦౧. హ్రీంకారిణీ

శం. భా. హ్రీంకారిణీ । ద్వితీయఖండసమాప్త్యవయవతయా వాచ్యవాచకసంబంధేన అస్యా అస్తీతి తథా॥ ఓం హ్రీంకారిణ్యై నమః ॥

ఆం. వి. పంచదశీ మహామంత్రము నందలి ద్వితీయ కూటము యొక్క సమాప్తి యందున్న యంతిమ బీజాక్షరముగా వాచ్యవాచక సంబంధముతో దేవి యందు గలదుగాన, పరమేశ్వరి 'హ్రీంకారిణీ' యనిధ్యాతవ్య యగుచున్నది.

## ౩౦౨. హ్రీంకారాద్యా

శం. భా. హ్రీంకారాద్యా । అత్ర హ్రీంకారశబ్దేన తత్కార్యభూతాః వేదాః, తేషా మప్యర్థతయా కారణతయా వా ఆద్యా ఆదౌ భవా పూర్వభావినీత్యర్థః । శబ్దస్య అర్థవిషయత్వేన ప్రవృత్తేః శక్తిగ్రహదా కావ్యాదికృతౌ చ అర్థజ్ఞానపూర్వక శబ్దప్రయోగదర్శనా దర్థస్య పూర్వభావిత్వముక్తమితి భావః ॥ ఓం హ్రీంకారాద్యాయై నమః ॥

ఆం. వి. ఇచట హ్రీంకార శబ్దము చేత తత్కార్యభూతములైన వేదములు వివక్షితములగును. వేదావిర్భావము హ్రీంకారమని భావము. తద్వేదరాశికి అర్థరూపముతోను, కారణరూపముతోను ఆద్యా - మొదట పుట్టినది, అనగా పూర్వభావిని యని యర్థము. అర్థము విషయముగా గలిగి

శబ్దము ప్రవర్తించును, శబ్దశక్తి గ్రహాదుల యందు, కావ్యాదికృతుల యందును అర్థజ్ఞానపూర్వకముగా శబ్ద ప్రయోగము కన్పట్టుచున్నది. అందువలన, అర్థమునకు పూర్వ భావిత్వము చెప్పబడినదని భావము. కాన, 'హ్రీంకారాద్యా' యను నామము పరదేవత యందు అన్వర్థము.

## ౨౦౩. హ్రీంమధ్యా

శం. భా. హ్రీంమధ్యా। అస్య బీజస్య జగదభిన్న నిమిత్తోపాదానభూత మాయావిశిష్ట । చైతన్యవాచకతయా తత్ప్రతీకత్వేన తన్నిష్ఠ యావద్గుణవత్త్వం తదుపాసనాతి శయమహిమ్నాఽభివ్యజ్యతే। అన్యథా మంత్రపురశ్చర్యాసు ఇష్టసిద్ధ్యభావప్రసంగః స్యాత్। అవ్యవహిత పూర్వనామ్నాఽ నభివ్యక్త స్వరూపస్యాపి శబ్దజాలస్య ఏతద్బీజమాత్రాత్మనైవ అంకురిత బీజార్థవత్త్వయా పూర్వభావిత్వ ముక్తమ్। ఇదానీ మభివ్యక్తాత్మక స్వార్థకతయా వివర్తవాద మాశ్రిత్య వాచా రంభణాకారేణ నామరూపద్వయవత్త్వ ముచ్యతే। హ్రీంకార బీజః తేన శబ్దేన లక్ష్యతే। మధ్యే వ్యవహారకాలే హ్రీం యస్యాః సా తథా। ఘటాదిషు వస్తుషు సచ్చిదానంద ప్రతీత్యా వ్యవహారకాలేఽపి ప్రపంచకారణం బ్రహ్మను స్యూతతయా భాసమానం జగత్కారణ మితి సిద్ధాంతః। అనేన అచేతనపరిణామారంభాదివాదాః నిష్ప్రమాణతయా యుక్త్యాద్యాభాసకత్వేన నిరస్తాః వేదితవ్యాః॥ ఓం హ్రీం మధ్యాయై నమః॥

ఆం. వి. ఈ హ్రీం బీజము జగత్తునకు అభిన్ననిమిత్తోపాదాన కారణభూతమైన మాయావిశిష్ట చైతన్యవాచకము గాను, తత్ప్రతీకరూపముగాను, తచ్చైతన్యనిష్ఠమైన సర్వగుణ వత్త్వము ఆ హ్రీంకారోపాసనాతిశయమహిమ చేత అభివ్యంజిత మగుచున్నది. ఆ రీతిగా కాకపోయినచో, మంత్ర పురశ్చర్యాదుల యందు ఇష్టసిద్ధి కలుగకపోవుట ప్రసక్తము కావలసి యుండును, ఈ నామమునకు అవ్యవహిత పూర్వ నామముచేత అనభివ్యక్త స్వరూపము గల శబ్దజాలము నయితము ఈ హ్రీంబీజ స్వరూపమాత్రము చేతనే యంకు రించిన బీజార్థము గలదగుట చేత పూర్వభావిత్వము చెప్ప బడినది. ఇప్పుడు, ఈ నామమునందు అభివ్యక్త స్వరూపము గల యర్థము కలదగుటచేత వివర్తవాదము నాశ్రయించి వాచారంభణ రూపముతో నామరూపములు రెండును గలవని చెప్పబడుచున్నది. హ్రీంకార బీజార్థము ఆ హ్రీంశబ్దము చేత లక్షణయా చెప్పబడుచున్నది. మధ్యభాగము నందు, అనగా వ్యవహారకాలము నందు 'హ్రీం' అను నామము గలది గాన, పరదేవత 'హ్రీంమధ్యా' యని స్తోతవ్య యగుచున్నది. ఘట పటాది పదార్థములందు సచ్చిదానంద ప్రతీతి కలుగుటచేత వ్యవహారకాలమునందు నయితము ప్రపంచకారణమైన బ్రహ్మ అనుస్యూతముగా అంతట నిండియుండుటచేత జగత్కారణ ముగా భాసించుచున్నది బ్రహ్మయే యని సిద్ధాంతము ఈ రీతిగ చెప్పుటవలన అచేతన పరిణామవాద, ఆరంభవాదాదులు

ప్రమాణములు, యుక్త్యాభాసములు(యుక్తియుక్తములవలె భాసించునవి)నగుటచేతపరాస్తములయినవని తెలియవలయును.

## ౨౧౪. హ్రీంశిఖామణిః

శం. భా. హ్రీంశిఖామణిః । లోకే యథా చూడామణిః సర్వాంగరచితాభరణాపేక్షయా తద్విజాతీయ ప్రకాశసత్త్వాద్యాశ్రయవాన్ ఉత్తమాంగస్థానవిశేషే స్థాపితః మహైశ్వర్యాది తద్వతః పురుషస్య జ్ఞాపయతి, తథా సర్వశబ్దజాల తద్వాచ్యార్థభూత చిజ్జడసంబంధరూప ప్రపంచవాచక అతి సూక్ష్మ హ్రీంవర్ణాత్మక శ్రీవిద్యారాజబీజస్య సత్యజ్ఞానానందాత్మక లక్ష్యార్థభూతా సతీ హ్రీంబీజ జాపకానాం సర్వార్థప్రదానేన పారమైశ్వర్యం వ్యంజయతీతి గుణయోగకృత నామేదమ్ । తథా చ హ్రీమః శిఖామణిః పరమాత్మైశ్వర్యేణ జ్ఞాపయతీత్యర్థః ॥ ఓం హ్రీంశిఖామణయే నమః ॥

ఆం. వి. శిఖామణి యనగా శిరోభూషణము. సర్వావయవముల యందు ధరించునట్టి యాభరణముల కంటె, తద్విజాతీయ ప్రకాశసత్త్వాస్ఫూర్తికి ఆశ్రయమైనది చూడామణి ఉత్తమాంగమైన శిరస్సునందు ధరించబడినదై లోకమునందు మహాదైశ్వర్య సంపన్నుడయిన పురుషుని జ్ఞాపకము చేయుచుండును. అటులనే, సమస్త శబ్దసమూహము, తద్వాచ్యార్థభూతములయిన చిత్, జడముల సంబంధ రూపమైన ప్రపంచమును తెలియ జేయునట్టిది. అతిసూక్ష్మము, హ్రీంబీజాత్మకము

నయిన శ్రీ విద్యారాజబీజము యొక్క సత్యజ్ఞానానంద రూపమైన లక్ష్యార్థము కలదై 'హ్రీం' బీజమును జపించు వారలకు సర్వార్థముల నొసగుట ద్వారా పారమైశ్వర్యమును అభివ్యంజితము చేయునది. ఈ రీతిగా చెప్పుట వలన గుణ సంబంధముతో ఏర్పడిన నామమిది యని తెలియనగును. కాగా, 'హ్రీం' బీజము యొక్క శిరోమణిగా ఉండి పరమేశ్వరి పరమ తాత్పర్యముతో - స్వరూపముతో ప్రకాశింప జేయు నదని తాత్పర్యము.

శ్లో॥ హ్రీంకారకుండాగ్నిశిఖా హ్రీంకారశశిచంద్రికా ।
హ్రీంకారభాస్కరరుచి ర్హ్రీంకారాంభోదచంచలా॥౩౯

## ౨౦౫. హ్రీంకారకుండాగ్నిశిఖా

శం. భా. హ్రీంకారకుండాగ్నిశిఖా । హ్రీంకార ఏవ కుండం వాచ్యవాచకసంబంధేన పరబ్రహ్మావచ్ఛేదకతయా ఆహవనీయాదిసదృశమ్, తస్యాగ్నిశిఖా, 'ఉద్దీప్తేఽగ్నౌ జుహోతి' ఇతి ప్రమాణేన 'ఆహవనీయే జుహోతి' ఇతి విధి వాక్యావగత హోమాధారతాయాః కేవలాహవనీయస్యా యోగ్యతయా సాగ్నిజ్వాలస్య హోమాధారతాయాం జ్ఞాయ మానాయా మదృష్టద్వారా స్వర్గసంబంధేన స్వార్థకతయా తద్జ్ఞాపక వేదవాక్యస్యాపి పురుషార్థసంబంధిత్వ మాహవ నీయనిష్ఠ హోమాధికరణ దీప్తాగ్నిజ్వాలాస్వాధారభూత కుండ సార్థక్యసంపాదికేనాఽభాతి తథా స్వవాచకబీజస్యాపి

'మన్త్రై రుపాసీత' ఇతి విధిగత దేవతోపాసన కరణానాం మన్త్రాణామపి స్వవాచకతయాసార్థక్యసంపాదనా త్తథోచ్యతే॥
ఓం హ్రీంకారకుండాగ్నిశిఖాయై నమః ।

ఆం. వి. హ్రీంకారమే హోమకుండము, వాచ్యవాచక సంబంధముతో, పరబ్రహ్మనచ్ఛేదక రూపముతో ఆహవనీయాదికుండసదృశ మైనది; ఆ యగ్నికుండము నందలి యగ్ని జ్వాలారూపమైనది, 'ఉద్దీప్తేఽగ్నౌ జుహోతి' - 'ప్రజ్వలించుచున్న యగ్నియందు హోమము చేయును' అను ప్రమాణము చేత, 'ఆహవనీయే జుహోతి'-'ఆహవనీయమునందు హోమము చేయును' - అను విధివాక్యముచేత అవగతమైన హోమాధారత్వము కేవల ఆహవనీయ కుండమునకు యోగ్యము కాదు. ఆ కారణముచేత అగ్నిజ్వాలాయుక్తమైన కుండమే హోమమున కాధారమని తెలియబడుచున్నది. కాగా, పుణ్యకర్మానుష్ఠానము వలన సంపాదితమైన యదృష్టము ద్వారా స్వర్గసంబంధముతో చరితార్థ మగుచున్నది. అట్లగుటవలన ఆ రీతిగ స్వర్గసంబంధజ్ఞాపకమైన వేదవాక్యమునకు గూడ పురుషార్థ సంబంధిత్వము ఆహవనీయకుండనిష్ఠమైన హోమమునకు అధికరణమైన, ప్రజ్వలితాగ్నిజ్వాలకు ఆధారభూతమైన ఆహవనీయకుండమునకు సార్థకతాసంపాదకము వలె భాసించుచున్నది. ఆ రీతిగ, పరదేవతావాచకమైన బీజముః కూడ 'మన్త్రైరుపాసీత' - 'మంత్రములతో దేవతోపాసనము

చేయవలయును' -అని శ్రుతిచోదితమైన విధివాక్యానుసారము దేవతోపాసనమునకు సాధనభూతములయిన మంత్రములకు గూడ పరదేవతావాచకముగా సార్థకతను సంపాదించున దగుటంజేసి దేవి 'హ్రీంకారకుండాగ్నిశిఖా' యని కీర్తింపబడు చున్నది.

విశే :- దీప్తాగ్నియందు హోమము చేయుటవలన అగ్నికుండము సార్థకమయిన రీతిగా, మంత్రోపాసనము హ్రీం బీజయుక్తముగా జేయుట వలన మంత్రములు సార్థకములగు నని భావము. హ్రీంకారకుండ మనగాచిదగ్నికుండ మైన మూలాధారము. మూలాధారరూపమైన చిదగ్నికుండము నుండి యుద్భవించు యగ్నిశిఖయే కుండలినీశక్తి, ఆమెయే మహాత్రిపురసుందరి 'చిదగ్నికుండసంభూతా' యని భక్తులచేత పరమేశ్వరీ గుణగానము చేయబడుచున్నది.

## ౨౦౬. హ్రీంకారశశిచంద్రికా

శం. భా. హ్రీంకారశశిచంద్రికా। హ్రీంకార ఏవ శశీచంద్రః, తస్య స్వరూపాభేదభూత ప్రకాశచైతన్యం చంద్రికాపదేన ఉపమీయతే। యథా చంద్రస్వరూపభూతామృత ప్రసార భూతా జ్యోత్స్నా దేవాదిసర్వలోకానాం సంజీవకతయా ఉపకరోతి, తథా దృఢతర భక్తిపరవశ పురుషధౌరేయాణాం హ్రీంకారవాచ్యార్థతయా తదభిన్నత్వేఽపి జగత్కారణ తయా సచ్చిదానందాధాయకత్వేన సంజీవయతీతి భావః॥ ఓం హ్రీంకారశశిచంద్రికాయై నమః॥

ఆం. వి. హ్రీంకారమే చంద్రుడు, ఆ చంద్రునియొక్క-స్వరూపముతో అభేదముగా ఉన్న స్వయంప్రకాశ చైతన్యము చంద్రికా (వెన్నెల) పదముతో పోల్చబడినది. చంద్రస్వరూపభూత, అమృతస్రావభూతయు నయిన జ్యోత్స్న (వెన్నెల) దేవాది సర్వలోకములకు సంజీవకరూపముతో ఉపకరించుచున్నది; అటులనే, దృఢతర భక్తిపరవశులయిన పురుషశ్రేష్ఠులకు, హ్రీంకారవాచ్యమైన యర్థము స్వరూపముగ గలదగుటంజేసి తద్వాచ్యార్థముతో అభిన్నయయ్యు, ప్రపంచ వివర్తకారణముగా సచ్చిదానందసంధాయికయై భక్తులను జీవింప జేయుచున్నది. యని భావము. 'జ్యోత్స్నాయై చేందురూపిణ్యై శర్వాణ్యై తే నమోనమః' - యనుచు చండీ సప్తశతీ వచనము పరమేశ్వరి జ్యోత్స్నారూపిణి చంద్రరూపిణి యనియు చెప్పుచున్నది.

## ౨౦౭. హ్రీంకారభాస్కరరుచిః

శం. భా. హ్రీంకారభాస్కరరుచిః । భాసః కాంతీః కరోతి ప్రసారయతి లోకోపకారాయేతి తథా సూర్యః, తస్య రుచిః ప్రచండభానుః । యథా లోకే సూర్యః వర్షాసు అతిగాఢతర స్రవదుదకధారాసంవ్యాప్త దిగంతరాసు దివా విద్యమానోఽపి సూర్యః సాక్షాదయమితి చాక్షుషజ్ఞానగోచరో న భవతి, తదభావే శిష్టానాం భోజనాది సంజీవకవ్యవహారాభావేన తదుపాయాసిద్ధ్యా అప్రసన్నమనా భవంతి, తథా

జ్ఞానమార్గానధికారిణాం మోక్షమార్గోపాయభూతావిదిత దేవతారూప హ్రీంకారాణాం జనానాం బహుతరపుణ్య మహిమ్నా మహావాతేనేవ మేఘపటలా దూరీకృతాయాం చండభానురివ సుఖసాధనం గురుకృపాఽఽంగావలోకనరూప దీక్షావశేన ప్రతిబంధక దురితాపగమే పరదేవతారూపం హ్రీంకారః పురశ్చర్యయా సాక్షాద్వాచ్యార్థాపరోక్షజ్ఞాన హేతుర్భవతి। చిరకాల నైరంతర్యభావనాప్రకర్షేణ తస్మిన్నభిముఖే సతి తల్లక్ష్యార్థరూప పరమానందచిత్కలా స్వయమేవాభివ్యక్తా సత్యానందానుభవామృతేన సుఖయతీతి తథోచ్యతే ॥ ఓం హ్రీంకారభాస్కరరుచయే నమః॥

ఆం. వి. కాంతికిరణములను లోకోపకార నిమిత్తము ప్రసరింపజేయువాడు గాన, సూర్యుడు భాస్కర శబ్దముచే వ్యపదేశ్యుడగుచున్నాడు. భాస్కరరుచి యనగా ప్రచండ భానుడని యర్థము. లోకములో వర్షాకాలమునందు గాఢముగా జడివాన కురిసినపుడు జలధారలతో దిగంతములు నిండిపోవును. పగటిపూట సూర్యుడున్నను సాక్షాత్తు సూర్యుడితడే యని చక్షురింద్రియమునకు గోచరుడు కాడు. సూర్య దర్శనము లేకపోవుట చేత శిష్టాచారసంపన్నులయినవారు జీవనాధారములయిన భోజనాదులు చేయరు. అందుచేత భోజనాద్యుపాయము సిద్ధించనందున అప్రసన్నమనస్కులగుదురు, ఆ రీతిగనే జ్ఞానమార్గమునకు అధికారము లేనివారు, మోక్ష మార్గమునకు ఉపాయభూతమైన దేవతారూప హ్రీంకారము

తెలియని జనులకు పుణ్యమహిమాతిశయము చేత పెను
గాలిచే మేఘములు కొట్టుకొనిపోగా, ప్రకాశించు చండభానుని
వలె గురుకృపాకటాక్ష వీక్షణరూపమైన దీక్షచేత ప్రతిబంధక
ముగా ఉన్న దురితము క్షయించినంతనే, పరమసుఖసాధనము
పరదేవతారూపము నయిన హ్రీంకార వాచ్యార్థము యొక్క
యపరోక్ష జ్ఞానమునకు హేతువగును. చిరకాలము నిరంతర
భక్తిభావాతిశయము చేత సగుణ బ్రహ్మము అభిముఖమైన
దగుచుండ, ఆ హ్రీంకార లక్ష్యార్థమైన పరమానందరూప
చిత్కళ (జ్ఞానకళ) స్వయముగానే యభివ్యక్తమై, సత్య
ఆనందానుభవ మనెడి యమృతముతో ఆనందింప జేయునది
గావున, పరదేవత 'హ్రీంకారభాస్కరరుచిః' యనుచు
స్తోతవ్యురాలగుచున్నది.

'హృదయస్థా రవిప్రఖ్యా,' 'సూర్యాం హిరణ్మయీం
లక్ష్మీమ్' అను వచనము లిచట యనుసంధేయములు.

## ౨౦౮. హ్రీంకారాంభోదచంచలా

శం. భా. హ్రీంకారాంభోదచంచలా। అంభాంసి అమృతాని
దదాతీత్యంభోదాః, హ్రీంకారోఽపి కామవర్షత్వేన తైరుప
మీయతే। తేషు చంచలా విద్యుల్లతా విద్యమానా తదభిన్న
ప్రకాశమానా సతీ వర్షోదకద్వారా సస్యాద్యుత్పాదకత్వం
యథా వ్యనక్తి తథా హ్రీంకారవాచ్యతయా తద్భిన్నాఽపి
తత్స్వరూపవిచారణాయాం శుద్ధలక్ష్యార్థస్వరూపా సత్యపి

అనిర్వచనీయ స్వవాచక మంత్రప్రకాశిత దేవతాత్వేన స్వాభీష్ట పురుషార్థప్రాప్తిహేతుభూతేత్యభిసంధిః ॥ ఓం హ్రీంకారాంభోదచంచలాయై నమః ॥

ఆం. వి. అంభములను అనగా అమృతములను-జలమును ప్రసాదించుచున్నవి గాన, అంభోదములు. హ్రీంకారము గూడ కామములను వర్షించునది గావున, మేఘములతో ఉపమితమైనది. ఆ మేఘములందుండు విద్యుల్లత ఆ మేఘముల కంటె అభేదముగా ప్రకాశమాన యగుచు, వర్షోదకము ద్వారా సస్యాదుల యుత్పాదకత్వ, పోషకత్వము లను అభివ్యక్తీకరించుచుండును. అదేవిధముగా హ్రీంకార వాచ్యార్థమైతదభిన్నమై గూడ తత్స్వరూప విచారణము చేయు సమయమున, శుద్ధ లక్ష్యార్థమైన పరబ్రహ్మ స్వరూపిణియై యుండియు, అనిర్వచనీయమై, స్వవాచకమంత్ర (హ్రీం) ప్రకాశిత దేవతగా, ఉత్తమ సాధకునకు అభీష్టమైన పురుషార్థము యొక్క ప్రాప్తికి హేతుభూతురాలగుచున్నదని తాత్పర్యార్థము. కావున, మహామహేశ్వరి 'హ్రీంకారాంభోదచంచలా' యని స్తవనీయయై విరాజిల్లుచున్నది.

ఈ నామము చేత శివశక్తి మిథునము ఉపలక్షితమగుచున్నదని తెలియవలయును. 'చంచలా' యను పదము 'నీలతో యదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా' యను శ్రుతివచనమునకు జ్ఞాపకముగా ఉన్నది.

శ్లో॥ హ్రీంకారకందాంకురికా హ్రీంకారైకపరాయణా ।
హ్రీంకారదీర్ఘికా హంసీ హ్రీంకారోద్యాన కేకినీ ॥ ४०

## ౨౦౯. హ్రీంకారకందాంకురికా

శం. భా. హ్రీంకారకందాంకురికా । హ్రీంకార ఏవ కందం దృఢతరబీజభావః తస్య అంకురికా ఆదిప్రసవః నూతనాభివ్యక్తిరిత్యర్థః । యథా లోకే అంకురాదికం కందాదినిష్ఠ ఉత్పాదకశక్తిమనభూయైవ స్వయం స్కంధ శాఖా పత్ర పుష్ప ఫలాద్యాత్మనా యథా వివర్తమానం తత్సామర్థ్య ప్రకటనకారణం భవతి, తథా హ్రీంకారస్య వేదైకదేశత్వేన ఇతరప్రమాణానపేక్షతయా స్వవాచ్యార్థజ్ఞాపనేన స్వతః ప్రామాణ్యే స్థితేఽపి తజ్జన్య జ్ఞానవిషయతావచ్ఛేదక ధర్మరూప నానాప్రకార జగత్పరిణామహేతుత్వసాధక అఘటితఘటనాపటీయసీ మాయోపాధికత్వేన తదర్థద్వయరూపా సతీ తన్మాత్రప్రమాణవేద్యేత్యర్థః ॥ ఓం హ్రీంకారకందాంకురికాయై నమః ॥

ఆం. వి. హ్రీంకార మనే కందము, అనగా దృఢతర బీజభావము గల దుంప, ఆ దుంప యొక్క మొదటి మొలక అనగా నూతన ప్రకాశమని, నూతనాభివ్యక్తి యని యర్థము. లోకములో అంకురాదికము, అనగా మొలక మొదలైనవి కందాదుల (దుంప మొదలైనవాని) యందున్న యుత్పాదక శక్తిని తిరస్కరించకయే (నాశమొందించకయే) స్వయముగా

ప్రమానుగను, శాఖలుగను, పత్రములుగను, పుష్పఫలాదులుగను వివర్తమానమై (అధిష్ఠాన సత్తవికారమునొందక కార్యరూప పరిణామము చెందుట) తత్కందస్థమైన సామర్థ్యాభివ్యక్తికి కారణమగుచుండును. ఆరీతిగ, హ్రీంకారము వేదైకదేశము (వేదములో ఒకభాగము). అందువలన అన్యప్రమాణాపేక్ష లేకయే స్వవాచ్యార్థ జ్ఞాపకము (పరమేశ్వర జ్ఞాపకము) అగును. కావున, స్వతఃప్రామాణ్యము కలదైనను, తత్ప్రమాణ జన్యమైన జ్ఞానవిషయమునకు అవచ్ఛేదక (భేదసూచక) ధర్మరూపమైన, నానావిధ జగత్పరిణామ హేతుత్వసాధకము, అఘటితఘటనాపటీయసి (సంభవించని దానిని సంభవింప చేయునట్టి సామర్థ్యము గల) యైన మాయ ఉపాధిగా గలది. ఆ కారణము చేత పరమేశ్వరి రెండు అర్థములు (మాయోపాధిక చైతన్యము, నిరుపాధికశుద్ధచైతన్యము) గలదైతన్మాత్ర ప్రమాణముల చే వేద్యురాలని యర్థము.

విశే :- కంద శబ్దము మూలాధారద్యోతకము. మూలాధార స్థితయై యున్న కుండలినీశక్తి సాధకుని ప్రాణాయామాదుల చేత జాగరితయై ఊర్ధ్వోన్ముఖి యగుట 'కందాంకురికా' యను శబ్దముచే సూచితమగుచున్నది. 'మూలకందం ఫణాగ్రేణ దృష్ట్వా కమలకందవత్' అను వచనము వలన భుజంగాకారముతో ఉన్న కుండలినీ శక్తి మూలకందమును చూచునని తెలియుచున్నది.

'తేన కుండలినీ సుప్తా సంతప్తా ప్రబుధ్యతే ।
దండాహతభుజంగీవ నిఃశ్వస్య ఋజుతాం వ్రజేత్ ॥'

అను యోగకుండల్యుపనిషద్వచనము వలన సుప్తకుండలిని మేల్కాంచి ఋజుత్వమును పొందునని తెలియుచున్నది. ఇది 'హ్రీంకారకందాంకురికా' యనునామమును జ్ఞాపకము చేయు చున్నది.

## ౭౧. హ్రీంకారైకపరాయణా

శం. భా. హ్రీంకారైకపరాయణా । హ్రీంకార ఏవ ఏక మనితరసాధారణం చతుర్విధపురుషార్థ సాధకతయా పర మయనం జ్ఞాపకం ప్రమాణం యస్యాః సా తథా । అస్య బీజస్య వాచ్యార్థో మాయా, స నిరధిష్ఠానా న సిద్ధ్యతీతి తదాశ్రయత్వ విషయత్వాభ్యాం తద్రహితం తేన జ్ఞాప్యత ఇతి భావః ॥ ఓం హ్రీంకారైకపరాయణాయై నమః ॥

ఆం. వి. హ్రీంకారమే ముఖ్యము, అనితరసాధారణ మైనది; ఆ హ్రీంబీజము ధర్మ, అర్థ, కామ, మోక్షరూపమైన చతుర్విధ పురుషార్థసాధక రూపముతో ముఖ్యము, జ్ఞాపకము నయిన ప్రమాణము గలదగుటం జేసి భగవతి 'హ్రీంకారైక పరాయణా' యని స్తుతింపబడుచున్నది. ఈ హ్రీం బీజము యొక్క వాచ్యార్థము మాయ, ఆ మాయయు నిరవధిష్ఠానగా

ఉండదు; మాయకు విషయత్వ రూపమునగాని, యాశ్రయత్వ రూపమున గాని లేని హ్రీంకారము చేత తెలియబడుచున్న దగుట వలన దేవి 'హ్రీంకారైకపరాయణా' యను నామముతో ప్రసిద్ధి నొందియున్నది.

## ౨౧౫. హ్రీంకారదీర్ఘికాహంసీ

శం. భా. హ్రీంకారదీర్ఘికాహంసీ । హ్రీంకార ఏవ దీర్ఘికా రాజోద్యాన క్రీడావాపీ । సంసారకాననసంచారి లోకవిశ్రాంతికారణత్వేన హ్రీంకారః తయోపమీయతే, 'ఆరామ మస్య పశ్యంతి న తం పశ్యతి కశ్చన' ఇతి శ్రుతేః। ఆ సమంతాద్రమయ త్యస్మిన్ ఇత్యారామః అథవా జగత్ । తత్రోపాసనాదినా పరమానందప్రాపకతయా వా హ్రీంకారః। ఉపమీయతే । తస్మిన్ హంసీ (స్త్రీ) హంసః । యథా లోకే సారాసారవివేకి హంస్యా ఆధారసువర్ణకమలాదిమతీ వాపికా మహారాజసంబంధినీ విజ్ఞాప్యతే, తద్వద్వాచ్యార్థరూపతయా ప్రకాశమానా సతీ స్వసంబంధబీజస్య సుఖోత్పాదకత్వ మోక్షహేతుత్వం ద్యోతయతీత్యభిప్రాయః ॥ ఓం హ్రీంకారదీర్ఘికాహంస్యై నమః ॥

ఆం. వి. హ్రీంకారమే దీర్ఘిక. దీర్ఘిక యనగా, రాజులు విలాసముగా విహరించుటకు ఉద్యానవనములో నిర్మించిన కోనేరు; సంసార మను కాననములో సంచరించునట్టి జనుల విశ్రాంతికి కారణమగుట వలన హ్రీంకారము ఆ కోనేరుతో

పోల్చబడినది; 'ఆరామ మస్య పశ్యంతి న తం పశ్యతి కశ్చన' - 'ఈ పరమాత్మ యొక్క యుద్యానవనమును అందరు చూచుదురు గాని, యీ పరమాత్మను జూచువార లెవరును లేరు' అను శ్రుతివలన పరమేశ్వర సృష్టమైన జగత్తు యొక్క విలాసమునే జూతురుగాని, యీ పరమేశ్వరుని దర్శించుటకై యత్నించు వారెవరును లేరని భావము. దేని యందు సంపూర్ణముగా సుఖ మనుభవింతుమో, దానిని ఆరామమని, లేక జగత్తు అనిగాని యందురు. ఆ యారామము నందు, లేక జగత్తులో ఉపాసనాదులచేత పరమానందప్రాపక మగుట వలన హ్రీంకారము ఆరామముతో పోల్చబడినది. ఆ యుద్యానస్థవాపిక (కోనేరు) యందు సంచరించునట్టి శ్రీ -హంస. లోకములో సార అసారపదార్థములను-నీర క్షీరములను - జడ చేతనములను వివేచన చేయునట్టి శ్రీ హంస, దాని కావాసస్థానము సువర్ణ కమలాది పుష్పశోభితము, మహారాజ సంబంధితమునైన వాపిక చేత తెలియజేయబడును. ఆ రీతిగ, పరమేశ్వరి వాచ్యార్థరూపముతో ప్రకాశమాన యగుచు స్వస్వబంధియైన హ్రీం బీజమునకు సుఖ జనకత్వ రూపమైన మోక్ష హేతుత్వమును ద్యోతనము చేయునదని యభిప్రాయము.

## ౨౧౨. హ్రీంకారోద్యానకేకినీ

శం. భా. హ్రీంకారోద్యానకేకినీ । హ్రీంకార ఏవ ఉద్యానవత్ ఫలానుభావకత్వాత్ తథోచ్యతే, తస్య కేకినీ

మయూరీ। యథా లోకే బహుషు పక్షిషు ఆరణ్యకేషు సత్స్వపి తస్యాః రూపధ్వనిభ్యాం సుఖతయా దర్శనశ్రవణాది జన్య ప్రమోదసాధకతయా ఉద్యానాలంకరిష్ణుత్వమ్, తథా హ్రీంకారరూప దేవతాధ్వనేః సచ్చిదానందరూప తద్వాచ్యార్థస్య చ పరమపురుషార్థసాధకత్వేన అవిశిష్టత్వేఽపి బ్రహ్మవిష్ణురుద్రాదిమూర్తిషు ఉద్యానతరు వల్లి కక్ష గుల్మాదివత్ ఉత్తమనీ చ దేవ తిర్యఙ్మనుష్యాదిషు చ మయూరీవ స్వేచ్ఛయా సర్వవ్యాపకత్వేన తదాత్మరూపతయా శరీరేంద్రియ ప్రాణాద్యాధార పరమ ప్రేమాస్పద పరమానంద రూప ప్రత్యగ్గోచరాహంప్రత్తివ్యాపకతయా ఏతద్బీజ ప్రకాశ్యా భవతీత్యర్థః॥ ఓం హ్రీంకారోద్యాన కేకిన్యై నమః॥

అం. వి. హ్రీంకార మనెడి యుద్యానవనము నందలి ఆడు నెమలి గాన, దేవి 'హ్రీంకారోద్యాన కేకినీ' యని చెప్పబడును; ఉద్యానవనము ఫలముల నొసగునట్లు హ్రీంకారము గూడ ఉపాసకులకు సర్వ ఫలప్రాపక మగును. లోకములో అనేకము లయిన యారణ్యక పక్షులున్నను, కేకినీ (ఆడు నెమలి) రూప సౌందర్య, ధ్వనిమాధుర్యముల వలన సుఖాపాదకమగుటచేత దర్శనశ్రవణాదిజన్యమైన యానందమునకు సాధనమగుట వలన ఉద్యానము యొక్క అలంకరిష్ణుత్వము కేకినికి చెప్పబడును: అటులనే. హ్రీంకారరూప దేవతాధ్వని, సచ్చిదానంద రూపమైన హ్రీంబీజ వాచ్యార్థము పరమ పురుషార్థమోక్ష సాధకముగా భిన్నమైనది కాదు. అయినను

బ్రహ్మ, విష్ణు, రుద్రాది మూర్తుల యందును, ఉద్యాన వనము నందలి తరు లతా గుల్మాదుల వంటి ఉత్తమ, నీచ, దేవ, తిర్యఙ్మనుష్యాదుల యందును మయూరి వలె పరమేశ్వరి సర్వవ్యాపకురాలు. అందువలన స్వేచ్ఛతో తదాత్మక రూపముతో శరీరేంద్రియ ప్రాణాదుల కాధారము, పరమ ప్రేమాస్పదము, పరమానందరూపము, ప్రత్యగాత్మకు గోచరము, అహంవృత్తివ్యాప్యము నయినట్టి యీ హ్రీం బీజము చేత పరదేవత ప్రకాశమానయై వెలుగొందుచుండు నని భావము,

విశే :- ఉపాసకుడు మూలాధారస్థితమై యున్న కుండలినీ శక్తిని సంచాలితము చేసి సహస్రారమునకు గొనిపోవునపుడు పరావాక్ స్వరూపిణియైన యా శక్తి నుండి విభిన్న నాదములు వినవచ్చును. శక్తి సహస్రారస్థ శివ చైతన్యముతో సంయోజితమైనపుడు ఉపాసకుడు మధుర కేకినీ నాదానందము ననుభవించుచుండునని యుపాసకశ్రేష్ఠుల యనుభవము. 'బ్రహ్మరంధ్రగతో నాదః మాయూరో నాద ఉచ్యతే' - 'బ్రహ్మరంధ్ర- సహస్రారగత నాదము మయూర నాద' మని ప్రమాణవచనము వలన తెలియుచున్నది. కావున, హ్రీంకారమే మయూరనాదమని తెలియవలయును. సాధకోత్తముడు తన్నామశ్రవణము చేయుచు, తద్వాచ్యార్థమైన పారమేశ్వరతత్త్వముతో ఆత్మానుసంధానము చేయుచు సచ్చిదానందస్వరూపుడై యుండునని భావము.

శ్లో॥ హ్రీంకారారణ్యహరిణీ హ్రీంకారావాలపల్లవా
హ్రీంకారపంజరశుకీ హ్రీంకారాంగణదీపికా

## ౬౧౩. హ్రీంకారారణ్యహరిణీ

శం. భా. హ్రీంకారారణ్యహరిణీ । హ్రీంకారై
కదేశభూత మాయాఽవిద్యా తత్కార్యాణాం
తయా గహనే వ్యాఘ్రాదీనామివ భయహేతూనాం
వేన దుష్ప్రవేశత్వ ధర్మసామ్యేన హ్రీంకారస్య అ
ణ్యత్వమ్ । తథా చ అరణ్యమివ హ్రీంకార ఇతి
ఉపమోత్తరపదసమాసః । తత్ర విహరతి యథాఽ
పురుషస్య శీఘ్రం దృష్టిపథం గతా హరిణీ ఏణీ
దృష్టాపనశ్చయేన తదభిగమఫలప్రాప్తిసాధనతామవగ
శీరపురుషస్య, తథా నిరంతర భక్తిభజనపర ప్రాణి
ఉపాసనాపరిపాకమహిమ్నా అపరోక్షీకృతాజ్ఞాన
పూర్వకం భయాపకరణేనానందం ప్రాపయతీతి తయోః
భావః । 'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి' ఇతి ౹
ఓం హ్రీంకారారణ్యహరిణ్యై నమః ॥

ఆం. వి. హ్రీంకారవాచ్యార్థమునకు ఏకదే
శమైన మాయ, అవిద్య మఱియు తత్కార్యములు బం
ములు, ఆ కారణము చేత గహనారణ్యములు భయో
కములయిన వ్యాఘ్రాదుల యునికి వలన దుష్ప్రవేశము
ఉండును. అట్టి దుష్ప్రవేశరూప ధర్మసామ్యము చేత

కారమునకు అరణ్యోపమితత్వము చెప్పబడినది, అరణ్యముతో పోల్చబడినదని భావము. కాగా, అరణ్యము వంటి హ్రీంకారము-హ్రీంకారారణ్యమని సర్వత్ర ఉపమితోత్తర సమాసము భావనీయము. ఈ రీతిగ అర్థము చెప్పికొనగా, అరణ్యములో ప్రవేశించిన ధీర పురుషునకు వెంటనే హరిణి (లేడి) దృష్టి పథమునకు రాగా, వ్యాఘ్రాదులు అచట లేవను నిశ్చయము కలుగును, అట్టి నిశ్చయము కలిగినంతనే యా యరణ్యము ప్రవేశార్థరూపమైన ఫలప్రాప్తి సాధనత్వమును తెలియజేయును. ఆ రీతిగ నిరంతర భక్తిసేవాపరు లయిన ప్రాణులకు ఉపాసనా పరిపాక మహిమచేత అజ్ఞానము తొలగి అపరోక్ష జ్ఞానానుభవము వలన భయము నపాకరించుట (పోగొట్టుట) ద్వారా ఆనందానుభూతిని కలిగించునది గావున అరణ్యసంచారిణియైన పరమేశ్వరి పోల్చబడినదని భావము. 'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి' - 'ఆ బ్రహ్మవస్తువును తెలిసికొనినవాడు మృత్యువు నధిగమించిపోవుచున్నాడు' - అను శ్రుతివచనము వలన పరమేశ్వరి యొక్క అపరోక్ష సాక్షాత్కారము వలన జననమరణ రూప సంసారబంధము నుండి ముక్తుడై అమృతత్వమును - మోక్షమును పొందునని భావము.

## ౨౧౪. హ్రీంకారాలవల్లరీ

శం. భా. హ్రీంకారాలవాలవల్లరీ । హ్రీంకారమంత్ర వాచకతానిరూపిత వాచ్యతానామక సంబంధావచ్ఛిన్న పర

దేవతాస్వరూపత్వేన ?తదుపాసనావిషయ ఫలదానే సమర్థా
సతీ ఆవాలమాత్రప్రరోహాత్ వివృద్ధవల్లర్యా ఉపమీయతే ।
తథా చ తత్సంబధితయా హ్రీంకారః జపాదినా ఆవాల ఇవ
సర్వదా సంరక్షణీయ ఇతి తాత్పర్యార్థః పరినిష్పన్న ఇతి
యావత్ ॥ ఓం హ్రీంకారావాలవల్లర్యై నమః ॥

ఆం. వి. పరమేశ్వరి హ్రీంకార మంత్రము నందున్న
వాచకత్వము చేత నిరూపింపబడిన వాచ్యతానామక సంబంధ
ముతో అవచ్ఛిన్నమైనది. కావున, ఆ హ్రీంకారోపాసనము
చేయువారికి ఆయా ఫలముల నొసగుటకు సామర్థ్యము కల
దగుచు, హ్రీంకార మను చెట్టు పాదులో మొలచుట వలన
ప్రవృద్ధమైన లతతో ఉపమితమైనదని భావము. ఆ రీతిగ
కాగా, పరదేవతాసంబంధియైన హ్రీంకారము జపాదుల చేత
ఆవాలము వలె సర్వదా సంరక్షణీయమను తాత్పర్యార్థము
పరినిష్పన్నమైనదని నిశ్చయము.

## ౨౧౫. హ్రీంకారపంజరశుకీ

శం. భా. హ్రీంకారపంజరశుకీ । మందాధికారిణా
మపి ఉపాసనాకారణసాధారణ పార్వతీప్రతీకతయా హ్రీం
కారస్య బాలకాది లాలనవిషయత్వధర్మపురస్కారేణ పంజరో
పమా । తథా చ తత్రత్యా శుకీవ సంలాపాదినా మనుష్యాది
చిత్తరంజనీ । ఏవం తత్తదదృష్టానుసారేణ ఫలదాత్రీ సతీ
తదుపమితేతి ద్రష్టవ్యమ్ । హ్రీంకారః పంజరమివ తస్య

శుకీ తత్సార్థక్యకారిణీ త్యభిప్రాయః ॥ ఓం హ్రీంకారపంజర శుక్యై నమః ॥

అం. వి. పరదేవత హ్రీంకారమను నట్టి పంజరము లోని యాడు చిలుక వంటిది గాన, 'హ్రీంకారపంజరశుకీ' యని కీర్తింపబడును. మందాధికారులకు సయితము ఉపాసనా కాలము నందు సాధారణ కారణమైన పార్వతీదేవికి ప్రతీకగా హ్రీంకారము బాలకులను లాలించి, యాడించుటకు దగిన ధర్మ ప్రాధాన్యము గలదగుట చేత పంజరముతో పోలిక చెప్పబడినది. ఆ రీతిగ ఉపమితము కాగా, పంజరములో ఉన్న శుకి (ఆడ చిలుక) వలె సంలాపాదులతో మనుష్యాది సర్వజీవుల చిత్తమును రంజింప జేయునది. పంజరస్థమైన శుకము బాలకుల మనస్సును రంజింపజేసి యానందము కలిగించుచుండును. ఆ రీతిగనే, అజ్ఞానులకు హ్రీంకార పంజర శుకియైన పరమేశ్వరి యుపాస్యమానయై స్వస్వరూపావగతిని కలిగించి, అనిర్వచనీయానందహేతు వగునని భావము. హ్రీంకారము పంజరము వంటిది, ఆ పంజరము నందుండు శుకీస్వరూపిణి యైన పరదేవత యా పంజరమునకు (హ్రీంకారమునకు) సార్థక్యమును సంపాదించునదని భావము.

విశే :- ఓంకార హ్రీంకారములు రెండును పరబ్రహ్మ తత్త్వవాచకములే. అందువలన హ్రీంకారపంజరశుకియే

ఓంకారపంజరశుకి యని తెలియవలయును. కావుననే శ్రీ శంకరులు -

"ఓంకారపంజరశుకీం ఉపనిషదుద్యానకేళికలకంఠీమ్ ।
ఆగమవిపినమయూరీం ఆర్యామంతర్విభావయే గౌరీమ్ ॥"

అనుచు పరమేశ్వరీ స్తవము చేయుట గమనార్హము.

## ౨౧౬. హ్రీంకారాంగణదీపికా

శం. భా. హ్రీంకారాంగణదీపికా । అంగణవత్ సర్వసాధారణ విశ్రాంతిస్థానతయా హ్రీంకారస్య తదుపమా, తస్య దీపికా । యథా అంగణారోపిత దీపః బాహ్యాభ్యంతరవస్తుజాతం ప్రకాశయన్ తత్రత్య లోకానా మంధకారాదినివర్తన పూర్వక మభీష్టవ్యవహారహేతుతయా సర్వాన్ శ్లాఘయతి, స్వయమపి తైః సంరక్ష్యతే, తథా హ్రీంకారబీజార్థ శ్రవణ, మనన, నిదిధ్యాసన నిరంతరాభ్యాసాత్ అపరోక్షీకృత స్వయంప్రకాశానందరూపా సతీ స్వసేవకాన్ సర్వోత్కర్షయతీతి తదుపమితా సతీ తథోచ్యతే ॥ ఓం హ్రీంకారాంగణ దీపికాయై నమః ॥

ఆం. వి. అంగణము (ముంగిలిప్రదేశము) వలె సర్వసాధారణముగా విశ్రాంతిస్థాన మగుట వలన హ్రీంకారము అంగణముతో పోల్చబడినది. అట్టి హ్రీంకారమునకు దీపిక

గాన, దేవి 'హ్రీంకారాంగణదీపికా' యనబడును. ప్రాంగణము నందు ఉంచిన దీపము లోపల, వెలుపల ఉన్న వస్తుజాతమును ప్రకాశింపజేయుచు, అక్కడ ఉన్న జనులకు అంధకారాదులను నివర్తింపజేయును. తద్ద్వారా ఆయా జనుల కిష్టమైన వ్యవహార హేతువుగా సర్వులను ఆనందింప జేయుటయే గాక, తాను గూడ వారిచే సంరక్షింపబడుచున్నది. ఆ విధముగనే, హ్రీంకార బీజార్థమును శ్రవణ, మనన, నిదిధ్యాసనములతో నిరంతరము అభ్యాసము చేయుటవలన, అపరోక్ష సాక్షాత్కారము చేసికొనబడిన స్వయంప్రకాశానంద రూపిణియై స్వీయ భక్తులను సర్వోత్కృష్టులనుగా చేయును. అందువలన అంగణస్థ దీపికతో పోల్చబడినదై పరదేవత 'హ్రీంకారాంగణ దీపికా' యని ధ్యానింపబడుచున్నది.

శ్లో॥ హ్రీంకారకందరాసింహీ హ్రీంకారాంభోజభృంగికా ।
హ్రీంకారసుమనోమాధ్వీ హ్రీంకారతరుమంజరీ ॥ ౮_౧

## ౨౧౬. హ్రీంకారకందరాసింహీ

శం. భా. హ్రీంకారకందరాసింహీ । పర్వతశిఖాగ్ర వర్తిగుహా కందరా దరీత్యర్థః । వేదమౌళిపఠిత హ్రీంకారస్య గ్రామ్యవిషయలిప్సు ప్రాణిప్రవేశయోగ్యతావికలతయా కందరోపమా । తత్ర యథా సింహీ స్వేతర క్షుద్ర మృగప్రవేశ భయహేతు సటాదిస్వవ్యాప్యచిహ్నానుమితా తస్యాః స్వాశ్రయమాత్రతాం ధీరస్య తత్పరిసర నఖనిర్ఘాతముక్తా

ఫలాదిప్రాప్తిం చ నయతి, తథా మంద్రభక్తి తంద్రీ బుభుక్షాది కలుషిత పరిచ్ఛిన్నాభిమాన దేవతాంతరప్రతిపాదక బీజతయా స్వాద్వైతైకభావం కామితార్థం చ ప్రాపయతీతి సింహ్యుపమితా సతీ తథోచ్యతే ॥ ఓం హ్రీం కారకందరా సింహ్యై నమః ॥

ఆం. వి. పర్వత శిఖరాగ్రమందు ఉండునట్టి గుహకు 'కందరా' యని పేరు. వేదమౌళి (ఉపనిషత్) పవిత్రమైన హ్రీంకారము గ్రామ్యవిషయేచ్ఛతో సంచరించు ప్రాణులకు ప్రవేశించుటకు శక్యము కానందున, పర్వతగుహాఉప మానముగా చెప్పబడినది. ఆ గుహాలో ఉన్న యాడు సింహము తన జాతి కానట్టి క్షుద్ర మృగములు ఆ గుహలో ప్రవేశించుటకు భయకారణమైన సటాదుల చేత కేసరముల చేత-తనయందు వ్యాపించియున్న చిహ్నముల వలన ఆ గుహ తనకు ఆశ్రయ మాత్రముగా నుండుట, యూహింపబడును; తాదృశమైన యూహకు విషయమై ధీమంతుడైన వ్యక్తికి తద్గుహాపరిసర ప్రాంతము నందు నఖనిర్ఘాతములయిన ముక్తాఫల ప్రాప్తిని కలుగజేయును. ఆ రీతిగ, మందభక్తి, తంద్రీ, బుభుక్షాదుల చేత కలుషితము, పరిచ్ఛిన్నము నయిన దేవతాంతర ప్రతిపాదకమైన బీజరూపముతో స్వేష్టదేవతైకభావమును, కామితార్థమును ప్రసాదించునదగుట చేత స్త్రీజాతిసింహముతో పోల్చబడినదై పరదేవత 'హ్రీంకారకందరాసింహీ' యని భక్తుల చేత గుణసంకీర్తనము చేయబడుచున్నదని

భావము. "సింహీం సింహాముఖీం సఖీం భగవతః ప్రోత్ఫుల్ల నేత్రోజ్జ్వలామ్" అను వచన మిచట యనుసంధేయము.

## ౨౧౮. హ్రీంకారాంభోజభృంగికా

శం. భా. హ్రీంకారాంభోజభృంగికా । హ్రీంకారస్య అష్టైశ్వర్యాత్మక పురుషార్థసాధకనానాశక్తిమత్తయా నానా ప్రకార వర్ణాంతరఘటితత్వేన పరాగ పరిమళాదిమత్కమలోప మితత్వ మితి యోజనీయమ్ । కమలే యథా మధుమాత్ర సారగ్రాహిణీ భృంగీ రమతే సర్వపుష్పరస మధుపానస్వ భావేన సర్వసమాఽపి మధ్వాధిక్యవివిదిషయా ప్రభూత మధుమత్త్వేన చ తస్మిన్నేవ విశిష్యాసక్తిమతీ, తథా సర్వ మంత్రబీజవాచ్యదేవతాత్మనా సర్వానుగతాఽపి హ్రీంకారస్య విశిష్టగుణవత్త్వేన సర్వోపాదాన సగుణబ్రహ్మప్రతిపాదక తయా తదీయ స్వరూప తటస్థలక్షణవత్త్వేన తదభిన్నస్వరూప తయా సర్వశబ్దజాలప్రకృతిత్వేన చ రూఢ్యా లక్షణయా వా తత్సంబంధినీ సతీ తదుపాసకానాం తదధిష్ఠానతయా చ తైర్లక్ష్యత ఇతి భృంగ్యుపమయా వర్ణితేతి తాత్పర్యమ్ ॥
ఓం హ్రీంకారాంభోజభృంగికాయై నమః ॥

అం. వి. హ్రీంకారము అష్టైశ్వర్యరూపమైన పురు షార్థములను సాధించునట్టి నానావిధ శక్తులుగలది. ఆవిధముగా వివిధశక్తిసంపన్న మగుట చేత, నానాప్రకారము లయిన వర్ణాంతరములతో (అన్యాక్షరములతో), రంగులతో కూర్ప

బడినదగుట చేత పుష్పాడి, సుగంధము గల పద్మముతో హ్రీం కారము పోల్చబడినదని యోజనీయము. మకరందసారమును మాత్రమే యాస్వాదించునట్టి యాడు తుమ్మెద తామరపూవు నందు రమించుచుండును, క్రీడించుచుండును. సకలపుష్పరస మైన మధువును త్రాగు స్వభావము తుమ్మెదకు గలదు; అందువలన, సర్వ పుష్పముల యందు సమానమైన యభి మానము గలదయ్యు, మకరందమందలి మాధుర్యాతిశయ మును తెలిసికొనవలయు ననెడి యిచ్ఛతో అధిక మకరందము కలిగియుండుట వలన ఆ కమలమునందే విశేషమైన యాసక్తి కలిగియుండును. ఆ రీతిగా, సర్వబీజమంత్ర వాచ్యమైన దేవతాత్మగా పరదేవత సర్వానుగతయై యుండును. అయినను హ్రీంకారము విశిష్టగుణసంపన్నము; కావున, ఆ హ్రీం బీజము నిఖిల ప్రపంచమునకు ఉపాదానకారణమైన సగుణ బ్రహ్మను ప్రతిపాదించుచుండును, తన్మంత్రదేవత యొక్క స్వరూపలక్షణ, తటస్థ లక్షణములను చెప్పుచుండును, తదభిన్న స్వరూపము గలదై విరాజిల్లుచుండును. ఈ కారణముల వలన సకల శబ్దజాతమునకు ప్రకృతియై (మూలమై) - పరావాక్ స్వరూపిణియై) హ్రీంబీజము రూఢ్యా, లక్షణయా ఆ పరమే శ్వరితో సంబంధము గలిగియుండును. కావున, జాపకుల చేత తదధిష్ఠాన దేవతారూపముగా పరిలక్షిత యగుచున్నదగుటం జేసి పరమేశ్వరి భృంగికతో - ఆడు తుమ్మెదతో పోల్చబడిన దని తాత్పర్యము.

విశే :- పరమేశ్వరి భ్రామరీశక్తి యని చండీ సప్తశతి యందలి క్రింది వచనముల వలన తెలియవచ్చుచున్నది.

"యదాఽరుణాఖ్య స్త్రైలోక్యే మహాబాధాం కరిష్యతి।
తదాఽహం భ్రామరం రూపం కృత్వాఽసంఖ్యేయ షట్పదమ్ ॥
త్రైలోక్యస్య హితార్థాయ వధిష్యామి మహాసురమ్।
భ్రామరీతి చ మాం లోకా స్తదా స్తోష్యంతి సర్వతః॥"

కావున, 'హ్రీంకారాంభోజభృంగికా' యను నామము పరమేశ్వరి యొక్క భ్రామరీశక్తిని సూచించుచున్నదని భావనీయము.

## ౨౧౯. హ్రీంకారసుమనోమాధ్వీ

శం. భా. హ్రీంకారసుమనోమాధ్వీ । హ్రీంకారస్య వాంఛిత ఫలప్రదానసాధకతయా సుమనఃసాదృశ్యమ్ । అథవా, పుష్పాణి వ్యవహారసమయే బహుసావధానతయా వ్యవహర్తవ్యాని పరమ మార్దవాధికరణత్వేన బహుమాన్యత్వాత్, తథా హ్రీంకారోఽప్యుపాసనవేళాయాం పరబ్రహ్మవాచకత్వేన ప్రయత్నపూర్వక మేకాగ్రమనసా దేవతాభిన్నత్వేన ధ్యాతవ్య ఇతి నియమసంపాదనార్థం । పుష్పోపమ మితి విభావనీయమ్ । తథాచ వాయ్వాదినా శుష్కాణి పుష్పాణి నిర్గంధుత్వేన ఫలాని అజనయిత్వా పరిపతంతి ఫలజనకశక్తే

రభావేన; తదితరాణి తు తద్వ్యత్వేన తజ్జనకాని లోకే దృష్టాని; పుష్పరసశ్చ పృథివీకారణభూత ఉదక తన్మాత్రస్వరూప మధు రసాత్మకత్వాత్ పుష్పాణాం ఫలజనకశక్తిజ్ఞాపకో భవతి; తథా హ్రీంకారస్యాపి సర్వజనకతాశక్త్యాధాయక తదధిష్ఠాన సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపా సతీ తన్మంత్రప్రాప్త్యా యథోక్తఫలహేతుతయా తదర్థరూపేణ తద్వృత్తిర్భవతీతి మాధ్వీసమానధర్మసత్త్వ మస్యా ఉపపద్యత ఇతి వివేచనీయ మితి యావత్ ॥ ఓం హ్రీంకారసుమనోమాధ్వ్యై నమః ॥

అం. వి. వాంఛితములయిన ఫలముల నొసగు సాధన మగుటంజేసి 'హ్రీంకారమునకు పుష్పసాదృశ్యము చెప్పబడి నది. అథవా, వ్యావహారిక జగత్తులో పుష్పములు అత్యంత సుకుమారములు, మార్దవగుణాధిష్ఠానములు, మిక్కిలి ఆదర ణీయములు నగుట వలన అతిజాగరూకతతో వ్యవహరింపదగిన వనియు చెప్పనచ్చును. అటులనే, హ్రీంకారము గూడ ఉపా సనా సమయము నందు పరబ్రహ్మవాచకముగా, ప్రయత్న పూర్వకముగా చిత్తము నేకాగ్రమొనర్చి దేవతాభిన్నముగా ధ్యానసీయ మను నియమమును సంపాదించు నిమిత్తము పుష్పసాదృశ్యము చెప్పబడినదని భావనీయము. కాగా, వాయువు మొదలయినవానిచేత శుష్కము లయిన (వాడి పోయిన) పుష్పములు మకరందశూన్యము లగుటవలన, ఫలోత్పాదక శక్తిని కోల్పోవును. అందువలన, ఫలజనకములు కాకయే రాలిపోవుచుండును; తదితర పుష్పములు (వాడిపోని

పుష్పములు) మకరందయుక్తములగుటవలన ఫలోత్పాదకము లుగా లోకమున కానవచ్చుచున్నవి; పుష్పరసము (మక రందము) పృథివికి కారణభూతమైన జలతన్మాత్ర స్వరూపము గల మధురసాత్మకము. అందువలన మకరందము పుష్పముల యొక్క ఫలజనకశక్తిజ్ఞాపకమై యున్నది; ఆ విధముగా, హ్రీంకారము గూడ, సర్వప్రపంచసృష్టిజనకశక్తి సంపాదకము, తదధిష్ఠానమైన సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపము గలదై తన్మంత్రోపదేశము నొందిన వారికి శాస్త్రోక్తమైన ఫలప్రదా నము చేయునదగుట చేత, తదర్థరూపముతో తద్వృత్తి యగు చున్నది, అందువలన మాధ్వీ (మకరంద) సమానమైన ధర్మము పరదేవత యందు ఉపపన్నమగుచున్నదని వివేచన చేసి భావింపనగునని నిశ్చయార్థము.

## ౨౨౦. హ్రీంకారతరుమంజరీ

శం. భా. హ్రీంకారతరుమంజరీ । ఫలార్థినః స్వారాధ జనాన్ పతనాదిభ్యః ప్రతిబంధకేభ్య స్తారయతి పారం ప్రాప యతి ఫలలాభేన సంతోషయతీతి తరుః । హ్రీంకారస్య కల్పాదితరుః దృష్టాంతీకృతః। ప్రేక్షావతాం సంవాద్రిప్రవృత్తి జనకత్వేన శాఖోపశాఖాగ్రగతా పుష్పమంజరీ ఫలకారణ యోగ్యతాం జ్ఞాపయతీవ పురుషార్థార్థినాం అసంశయప్రవర్త కత్వేన ప్రత్యక్స్వరూపా సతీ గురూపదిష్ట మంత్రదేవతాత్మక

తయా మంత్రోపాసనాయా మభిముఖీకరణేన పురుషార్థాన్ ప్రాపయతీతి మంజరీసాదృశ్యం ప్రాప్తం పరదేవతాయా ఇతి వివేచనీయమ్ ॥ ఓం హ్రీంకారతరుమంజర్యై నమః ॥

ఆం. వి. తారయతీతి తరుఃతరింపజేయునది గాన, తరవు, అనగా వృక్షము; ఫలములనాశించి వృక్షాధిరోహణము చేయు జనులను చెట్టుపైకి ఎక్కుటలో ప్రతిబంధకములయిన పతనాదుల నుండి రక్షించునది, పారమును జేర్చునది, అనగా ఫలప్రాపకమై సంతుష్టులను జేయునది గాన, తరువని వ్యవహరింపబడును. హ్రీంకారమునకు కల్పవృక్షాదులతో దృష్టాంతము చెప్పబడినది. పండితులకు సంవాదప్రవృత్తిని కలిగించునదగుటచే శాఖోపశాఖలుగా వాదము సల్పుచున్న సమయమున, శాఖోపశాఖాగ్రము లందున్న పుష్పగుచ్ఛము ఫలకారణ యోగ్యతను జ్ఞాపకము చేయుచున్నదానివలె పరమ పురుషార్థమైన మోక్షార్థులను నిస్సంశయముగా ప్రవర్తింపజేయును. ఆ కారణముచేత ప్రత్యక్ బ్రహ్మస్వరూపిణియై గురూపదిష్టమైన మంత్ర దేవతాత్మక మంత్రోపాసన యందు భక్తులను అభిముఖులనుగా జేయుట ద్వారా పురుషార్థప్రాపకయగుచుండును; అందువలన పరదేవతకు మంజరీసాదృశ్యము ప్రాప్తమైనదని వివేచనీయముకావున, 'హ్రీంకారతరుమంజరీ' యను నామముతో శ్రీ లలితాత్రిపురసుందరి వెలుగొందుచున్నదని తెలియవలయును.

శ్లో॥ సకారాఖ్యా సమరసా సకలాగమ సంస్తుతా ॥
సర్వవేదాంతతాత్పర్యభూమిః సదసదాశ్రయా ॥ ४3

## ౨౨౧. సకారాఖ్యా

శం. భా. సకారాఖ్యా । సకారయుక్తా శ్రీవిద్యా నామికా ఆఖ్యా వాచకశబ్దః యస్యాః సా తథా ॥ ఓం సకారాఖ్యాయై నమః ॥

ఆం. వి. సకారయుక్తమైన శ్రీవిద్యయను నామము-వాచకశబ్దము గలది గాన, దేవి 'సకారాఖ్యా' యని స్తుతింపబడును.

ఈ 'స' బీజము పంచదశీ మహామంత్రములోని తృతీయ కూట ప్రథమ వర్ణమని తెలియనగును.

## ౨౨౨. సమరసా

శం. భా. సమరసా । సమః ఏకః రసః మధురాదిరసవత్ గుడపిండాదౌ ఏకరూపేణ కార్యవ్యవస్థితేత్యర్థః ।

అథవా, సంసారదశాయాంసర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాది విశేషణ భేదేనభిన్నరసవత్ భిన్నస్వభావవత్ ప్రతీయమానయో రీశ్వరజీవయో ర్వేదాంతశ్రవణాదినా జన్య అఖండాకారవృత్తి వ్యాప్త్యా 'అహం బ్రహ్మాస్మి' ఇత్యభేదానుభవదశాయా మేకరూపతయా సాక్షాత్క్రియత ఇతిసా తథోచ్యతే, 'రసో వై సః'

ఇతి శ్రుతేః, రసశబ్దార్థః పరబ్రహ్మ సమః అభిన్నం యస్యాః సా తథా ॥ ఓం సమరసాయై నమః ॥

ఆం. వి. 'సమరసః' అనగా ఏకరూపమైన రసము' గుడఖండము మొదలయిన వానియందు మధురాది రసముల వలె పరమేశ్వరి కార్యజాత మందంతట ఏకరూపముతో వ్యవస్థితయై యుండునని యర్థము.

అథవా, సంసారదశలో సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాది విశేషణభేదము వలన భిన్నమైన రసము (రుచి), స్వభావము గలవారి వలె గోచరించు జీవేశ్వరులకు వేదాంత మహావాక్య శ్రవణ మననాదుల చేత అఖండాకారవృత్తి కలుగును. తద్వ్యాప్తి చేత 'అహం బ్రహ్మాస్మి' యను నట్టి యభేదానుభూతి సిద్ధించును. ఆ స్థితిలో ఏకస్వరూపముతో సాక్షాత్కరించున దగుటచేత పరమేశ్వరి 'సమరసా' యని చెప్పబడుచున్నది. 'రసో వై సః' అను శ్రుతివాక్యము వలన రస శబ్దార్థమైన పరబ్రహ్మతత్త్వము అభిన్నముగా గలది గాన, దేవి 'సమరసా' యని సంకీర్తిత యగుచున్నది.

## ౨౨౩. సకలాగమసంస్తుతా

శం. భా. సకలాగమసంస్తుతా । ఆ సమంతాత్ గమయంతీతి త్యాగమాః, సకల పదార్థగోచర సవికల్పక ప్రమాజనక వేదాః ఇత్యర్థః । సకలై। రన్యూనానతిరేకేణ ఇతిహాస పురాణసహిత యావదంగోపాంగ రహస్యాదియోగిత్వం

సకలశబ్దార్థః। తైః సంస్తుతా సమ్యక్ నాతఃపరం కించిదస్తీతి నిశ్చయపూర్వకం స్తుతా గుణినిష్ఠ గుణాభిధానవిషయతయా తదుపజీవికేత్యర్థః। సర్వార్థప్రకాశకవేదానాం సర్వజ్ఞత్వేన ఐదంపర్యేణ తదీయ స్తుతివిషయతయా శుద్ధచైతన్యాత్మకతయా మోక్షకారణీభూత జ్ఞానస్వరూపత్వేన జిజ్ఞాస్యేతి ధ్వనితోఽర్థః ॥ ఓం సకలాగమసంస్తుతాయై నమః ॥

ఆం. వి. అంతట చేయనట్లు చేయునవిగాన, ఆగమములు, సమస్త పదార్థములలో గోచరమగు సవికల్పక (సగుణ) ప్రమాజనకము లయిన వేదములని యర్థము. (విరాట్ పురుషుని ప్రమాణమును చెప్పునట్టి వేదములని భావము.) సర్వజనులచేత అన్యూనాతిరిక్తముగా ఇతిహాస పురాణసహితమైన సాంగోపాంగ రహస్యాదులతో కలసి యుండుట 'సకల' శబ్దమున కర్థము. సాంగోపాంగరహస్యాదియుక్తము లయిన యా వేదముల చేత సంస్తుతయై, అనగా ఇంతకంటె ఎక్కువయైనది యేమియు లేదని చక్కగా, నిశ్చయపూర్వకముగా సంస్తుతింపబడి గుణినిష్ఠమైన (గుణవంతుల యందున్న గుణాభిధాన విషయమై తద్గుణి సముదాయమును ఉజ్జీవింప జేయునదని యర్థము. సకలమైన యర్థములను ప్రకాశింపజేయు వేదములు సర్వజ్ఞము లగుట వలన, 'ఈమె యిట్టిది' యను అర్థమే ప్రధానముగా గలవగుట చేత తత్పరదేవతాస్తుతి విషయము శుద్ధ చైతన్యాత్మకము, మోక్షకారణమైన జ్ఞానస్వరూపముగా శ్రవణ, మనన, నిదిధ్యాసనాదుల ద్వారా

జ్ఞేయమైనదని ధ్వని తార్థము. కావున పరాభట్టారిక 'సకలాగమసంస్తుతా' యనిధ్యాతవ్య యగుచున్నది.

## ౨౨౪. సర్వవేదాంతతాత్పర్యభూమిః

శం. భా. సర్వవేదాంతతాత్పర్యభూమిః । వేదానామంతః అవసానం తత్త్వమస్యాది మహావాక్యాని, తేషాం తాత్పర్యం సమన్వయః సామానాధికరణ్య మిత్యర్థః । తస్య భూమిః విషయః జ్ఞాప్య మితి యావత్ ।

"ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలమ్ ।
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే ॥"

ఇతి వచనోక్త తాత్పర్యనిర్ణాయక ప్రమాణబలేన అతీంద్రియ ధర్మాదిగోచరవాక్యవత్ సర్వేషాం వేదాంతానా ముపాసనాజ్ఞానవిధిం వినా కర్మశేషతయా అజ్ఞాతజ్ఞాపకత్వేన శంసనాదేవ శాస్త్రశబ్దవాచ్యానా మద్వైతే బ్రహ్మణి గతిసామాన్యేన కర్మోపాసనాకాండద్వయార్థోపకార్యత్వేన మోక్షహేతుజ్ఞాపకత్వేన పర్యవసాన మితి తాత్పర్యవిషయతా అఖండచైతన్యస్యేతి సిద్ధాంతార్థ ఇత్యభిసంధిః ।

"సామానాధికరణ్యం చ విశేషణ విశేష్యతా ।
లక్ష్యలక్షణభావశ్చ పదార్థప్రత్యగాత్మనామ్ ॥"

ఇతి న్యాయేన సంబంధత్రయేణ అఖండార్థం వేదాంతాః బోధయంతీతి 'తత్తు సమన్వయాత్' ఇత్యధికరణే ప్రతిష్ఠాపిత

మిత్యల మతివిస్తరేణ ॥ ఓం సర్వవేదాంతతాత్పర్యభూమయే నమః ॥

ఆం. వి. వేదముల చివరి భాగములయిన యుపనిషత్తుల లోని 'తత్త్వమసి' ఇత్యాది మహావాక్యములు వేదాంతము లనబడును; ఆ మహావాక్యముల యొక్క తాత్పర్యము, సమన్వయము, అనగా, 'తత్త్వమసి' మొదలైన మహావాక్యముల సామానాధికరణ్యమని యర్థము. తత్త్వమస్యాది మహావాక్యములకు భూమి, విషయము, జ్ఞాప్యమునైనది 'సర్వవేదాంత తాత్పర్య భూమిః' యని నిశ్చయార్థము.

'ఉపక్రమ, ఉపసంహార, అభ్యాస, అపూర్వతా, అర్థవాద, ఉపపత్తులు తాత్పర్య నిర్ణయము నందు ప్రమాణములు' అను వచనము నందు చెప్పబడిన తాత్పర్య నిర్ణాయక ప్రమాణ బలము చేత అతీంద్రియ ధర్మాది గోచరవాక్యము వలె సర్వ వేదాంతములు కర్మశేషము లేని యుపాసనావిధిని విధించుచు అజ్ఞాతజ్ఞాపకము లగుచున్నవి; అందువలననే శాస్త్ర శబ్దముచే చెప్పబడు విద్యలన్నిటికీ అద్వయ బ్రహ్మయందు సామాన్యముగా సమన్వయము ఉండుటచేత, కర్మోపాసనారూపకాండ ద్వయార్థములకు ఉపకార్యముగా మోక్షహేతుజ్ఞాన జనకముగా పర్యవసన్న మగు తాత్పర్య విషయత్వము అఖండ చైతన్యమునకు గలదని సిద్ధాంతార్థమని దృఢ నిశ్చయము.

సామానాధికరణ్యము, విశేషణ విశేష్యవిభావము, లక్ష్యలక్షణభావము-ఈ మూడును పదార్థమునకు, ప్రత్య

గాత్మకు గలవను న్యాయానుసారము సంబంధత్రయముతో వేదాంతములు అఖండార్థమును బోధించునని 'తత్తు సమన్వయాత్' అను బ్రహ్మసూత్రము నందలి సమన్వయాధికరణము నందు ప్రతిష్ఠాపింపబడినది. ఆ కారణము చేత విస్తరించి చెప్పుట యనావశ్యకమని విరమించు చున్నాము.

విశే :- "ఆమ్నాయస్య క్రియార్థత్వాదానర్థక్యమతదర్థానామ్" అని జైమిని సూత్రము. వేదములు కర్మబోధకములు. కావున, కర్మార్థబోధకములు కానట్టి యుపనిషద్వాక్యములు వ్యర్థములైనవని పూర్వమీమాంసా సిద్ధాంతము. కాని, వేదములు కర్మబోధకములుగాన, తత్కార్మార్థబోధకములు గానట్టి యుపనిషత్తులు అజ్ఞాత జ్ఞాపకరూపముతో బ్రహ్మబోధకము లని యీ సూత్రమున కర్థము చెప్పకపోయిన, ఉపనిషత్తులకు ఆనర్థక్యము సంభవించును. కావున, వేదములు అజ్ఞాత జ్ఞాపకములుగా బ్రహ్మబోధకములని యంగీకరించి తీరవలయును. అతీంద్రియ గోచరమగు స్వర్గాదులను చెప్పునట్టి కర్మకాండ ప్రతిపాదక శ్రుతివాక్యములు ప్రమాణమైన రీతిగా, అతీంద్రియ బ్రహ్మతత్త్వార్థబోధకములయిన ఉపనిషద్వాక్యములుగూడ ప్రమాణ భూతములే, సార్థకములే యని రూఢమైన యభిప్రాయము.

## ౨౨౫. సదసదాశ్రియా

శం. భా. సదసద్గాశ్రయా । అపరోక్షతయా సన్నితి ప్రతీతివిషయతయా వ్యవహ్రియమాణం సత్కార్యం ఘటాది

సత్తయా వ్యావహారికసత్తాశ్రయం పృథివ్యప్తేజోభూతత్రయం సదిత్యుచ్యతే। అసత్ సద్భిన్నతయా పరోక్షజ్ఞానగోచరం వాయ్వాకాశాది తత్కార్యం చ రూపాదిభిన్నగుణాశ్రయ ముచ్యత ఇత్యర్థః। తయో రాశ్రయా ఉపాదానత్వేన తదధిష్ఠానభూతేత్యర్థః । ఆరోపితస్యాధిష్ఠానసత్తాతిరిక్త సత్తాశూన్యతయా సత్తాస్ఫూర్తిప్రదత్వేన సర్వదా తదనుస్యూతేతి ధ్యేయమ్ ॥ ఓం సదసదాశ్రయాయై నమః ।

ఆం. వి. అపరోక్షముగా 'సన్ ఘటః, సన్ పటః' - ఘటము ఉన్నది, పటము ఉన్నది - అను ప్రతీతికి విషయ మగుట చేత వ్యవహారములో ఉన్న సత్ కార్యము రూపాదులు కలిగియుండును. అందుచేత వ్యావహారికమైన సత్తకు ఆశ్రయమైన పృథివీ, జల, తేజోభూతములు మూడును 'సత్' శబ్దముచే చెప్పబడును. అసత్ అనగా సత్ కంటె భిన్నముగా పరోక్షజ్ఞానమునకు గోచరమైన వాయు, ఆకాశములు, తత్కార్యమును రూపాదుల కంటె భిన్నములయిన గుణముల కాశ్రయమని చెప్పబడునని యర్థము. ఆ సదసత్తులు రెండింటికి ఉపాదానకారణ మనగా ఆశ్రయమై, తదధిష్ఠానభూతురాలని యర్థము. ఆరోపిత పదార్థము అధిష్ఠాన సత్తకంటె అతిరిక్తమైనసత్త లేనిది యగుటచేత, సత్తాస్ఫూర్తిప్రద మగుట వలన అధిష్ఠాన సత్తయొక్క ధర్మము సదా అనుస్యూతమై

యుండునదని భావింపనగును. కావున, 'సదసదాశ్రయా' యను సార్థక నామముతో పరదేవత ప్రకాశించుచున్నదని భావము.

శ్లో॥ సకలా సచ్చిదానందా సాధ్యా సద్గతిప్రదాయినీ ।
సనకాదిమునిధ్యేయా సదాశివకుటుంబినీ ॥ ౭౭

## ౨౨౮. సకలా

శం. భా. సకలా। ఆరోపిత కలాభిః ఉపాసనార్థం కల్పితాభిః జాబాలినా సత్యకామం ప్రతి ఉక్తషోడశకలాయుక్త పురుషోపాసనప్రతిపాదక ఛాందోగ్యవచనరీత్యా కలాశబ్దితావయవైః సహ వర్తత ఇతి సా తథా । చతుఃషష్టిచంద్రకలాభ్యాం వా సహితా ।

అథవా, కలాశబ్దః సుఖాది కాంతివచనః తయా సహితేతి వా ॥ ఓం సకలాయై నమః ॥

ఆం. వి. ఉపాసన కొఱకు ఆరోపితములు, కల్పితములు నయిన కళలతో విరాజిల్లుచున్నది గావున, దేవి 'సకలా' యనబడును. జాబాలి మహాముని సత్యకామునికి ఉపదేశించిన షోడశకళాయుక్త పురుషోపాసనము ప్రతిపాదించునట్టి ఛాందోగ్యోపనిషద్వచనము ననుసరించి కళాశబ్దముచే అభిహితము లయిన యవయవములతో విరాజిల్లునది గావున, పరదేవత 'సకలా' యని స్తూయమాన యగుచున్నది. అఱువదినాలుగు చంద్ర కళలలో విరాజమాన యగుటం జేసియు దేవికి 'సకలా' యను నామము అన్వర్థము.

అథవా, కలా శబ్దము సుఖాది కాంత్యర్థబోధకము; తాదృశ కలాసహిత యగుటంజేసియు మహాత్రిపురసుందరి 'సకలా' యని ధ్యాతవ్య యగుచున్నదని భావము.

విశే :- 'అన్నమయగ్ంహి సోమ్య మన ఆపోమయః
ప్రాణ స్తేజోమయీ వాగితి భూయ ఏవ మా
భగవాన్ విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి
హోవాచ।' - ఛాం. 6-6-5

హే సోమ్య ! మనస్సు అన్నమయము, ప్రాణము జలమయము, వాక్కు తేజోమయ మని యారుణి శ్వేతకేతువుకు నుపదేశించెను. (త్రిశతీ భాష్యము నందు జాబాలి సత్యకాముసకు చెప్పబడినట్లున్నది.) అంతట తిరిగి తెలియజెప్పుడని శ్వేతకేతువు ఆరుణిని అభ్యర్థించెను,

'షోడశకలః సోమ్యపురుషః పంచదశాహాని మాశీః
కామ మపః పిబాపోమయః ప్రాణో న పిబతో
విచ్ఛేత్స్యత ఇతి।" - ఛాం. 6-7-1

హే సోమ్య ! పురుషుడు షోడశకళాపూర్ణుడు, నీవు పదునైదు దినములు భుజించకుము, యథేచ్ఛగా జలమును మాత్రమే త్రాగుము. ప్రాణము ఆపోమయము, కావున జలపానము చేయుటవలన ప్రాణము పోదని యారుణి చెప్పెను. ఆ రీతిగ శ్వేతకేతువు పదునైదు దినములు నిరాహారియై యుండి మఱల

గుహూపసదనము చేసి 'నాకు ఋగ్యజుస్సామలు ప్రతిభాతము లగుట లేదని చెప్పెను. అంత, ఆరుణి

'.... షోడశానాం కలానా మేకా కలాఽతిశిష్టా స్యా
త్తయైతర్హి వేదా న్నానుభవస్యశనాథ మే
విజ్ఞాస్యసీతి ।' - ఛాం. 6-7-3

నీవు భుజించిన యన్నము వలన వృద్ధినొందిన పదునాఱు కళ లలో ఒక కళ మిగిలిపోయినది. అందువలన, వేదములు నీకు స్ఫురించలేదు. భోజనము చేసి రమ్ము. అప్పుడు నేను చెప్పు నట్టి విషయము తెలిసికొనగలవని చెప్పెను.

'ఏవగ్ం సోమ్య తే షోడశానాం కలానా మేకా
కలాతిఽశిష్టా భూత్సాన్నేనోపసమాహితా ప్రాజ్వాలీ
తయైతర్హి వేదా ననుభవసి' - ఛాం. 6-7-6

హే సోమ్య । పదునాఱు కళలలో నొకకళ మిగిలిపోయినది' ఈ కళ అన్నము చేత ఉపచిత మైనందున నీకు వేదములు ప్రతిభాసించునని చెప్పెను. కావున, సచ్చిదానంద రూపమైన బ్రహ్మతత్త్వమును బోధించునట్టి వేదములు షోడశీకళా పూర్ణమైన పరమేశ్వరి యొక్క యుపాసన వలన లబ్ధమైన యనుగ్రహముచే భాసించునని తెలియుచున్నది.

షోడశ కళాపూర్ణ పుసషాభిన్నయైన పరమేశ్వరియొక్క షోడశీ కళాస్వరూపమును బృహదారణ్యక శ్రుతి యిట్లు వివరించుచున్నది.

"స ఏష సంవత్సరః ప్రజాపతిః షోడశకల స్తస్య రాత్రయ ఏవ పంచదశ కలా ధ్రువైవాస్య షోడశీ కలాస రాత్రిభి రేవా చ పూర్యతేఽపిచ క్షీయతేసోఽమావా స్యాగ్ం రాత్రి మేతయా షోడశ్యా కలయా సర్వమిదం ప్రాణ భృ దనుప్రవిశ్య తతః ప్రాతర్జాయతే తస్మాదేతాగ్ం రాత్రిం ప్రాణభృతః ప్రాణం నవిచ్ఛింద్యా దపి కృకలాసస్యైతస్యా ఏవ దేవతాయా అపచిత్యై ॥" బృ. ఉ. 1-5-14 -

సంవత్సరాత్మక ప్రజాపతి షోడశకళాపురుషుడు. ఆ కాల పురుషుని పదునైదు రాత్రులే పంచదశ కళలు. ఈ కాల పురుషుని యొక్క పదునాఱవ కళ (షోడశీ కళ) ధ్రువాకళ యనబడును. ఆ షోడశీ కళ శుక్ల పక్షములో రాత్రులద్వారా వృద్ధి నొందును. కృష్ణ పక్షములో క్షయ మవుచుండును. అమావాస్య రాత్రి యందు ఆ కాలపురుషుడు (సంవత్స రాత్మక ప్రజాపతి) ఈ షోడశీ కళతో సర్వప్రాణుల యందు ప్రవేశించును. తిరిగి మఱునటి యదయమున ఉద్భవించును. కావున, అమావాస్య రాత్రియందు ఏ ప్రాణిని సంహరించ రాదని భావము.

కావున, ఈశ్వరాభిన్నుడైన జీవుడు షోడశకళా పూర్ణుడని తెలియుచున్నది. పరమేశ్వరీ పరమేశ్వరుల శీర్షము లందు గన్పట్టు చంద్రకళ షోడశీకళ యనియే భావింపవల యును. షోడశీకళావాచకమైన షోడశీమహామంత్రము సర్వ

మాన్యమై యుపాసక లోకమున ప్రసిద్ధి గాంచినదని తెలియ వలయును.

## ౨౨౫. సచ్చిదానందా

శం. భా. సచ్చిదానందా। సచ్చాసౌ చిచ్చ సచ్చిత్ సచ్చిచ్చాసౌఆనందశ్చ; కాలత్రయాబాధ్యత్వంసత్త్వమ్, స్వేతర ప్రకాశాప్రకాశత్వం చిత్త్వమ్, పరమప్రేమాస్పదత్వ మానంద త్వమ్, 'సత్యం జ్ఞాన మనంతమ్', 'విజ్ఞాన మానందమ్', సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్', 'ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ', 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్', 'ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన' ఇత్యాది శ్రుతిభ్యః। తే స్వరూ పం యస్యాః సా తథోక్తా। వేదాంతశాస్త్రోక్త బ్రహ్మ స్వరూపలక్షణలక్షితేత్యర్థః॥ ఓం సచ్చిదానందాయై నమః॥

ఆం. వి. సత్ చిత్తులు కలిసిన, సచ్చిత్తులగును. సచ్చిత్తులు ఆనందము, సమసించిన, సచ్చిదానందము లగును. త్రికాలాబాధ్యత్వము సత్త్వము, ఏది నిత్యమో యది సత్య మని భావము. తనకంటెఇతరమైన ప్రకాశముచేత ప్రకాశించక పోవుట, స్వయంప్రకాశమై యుండుట చిత్త్వ మనబడును పరమప్రేమాస్పదమై యుండుట యానందత్వము. 'సత్యం జ్ఞాన మనంతమ్' - 'బ్రహ్మ సత్య, జ్ఞాన, అనంతరూపమైనది', 'విజ్ఞాన మానందమ్' - 'విజ్ఞానస్వరూపము, ఆనందస్వరూ పము ఆనందస్వరూపమునైనది, బ్రహ్మ', 'సదేవ సోమ్యేద

మగ్ర ఆసీత్' - 'సృష్టికి పూర్వము ఈ ప్రపంచము సద్రూపము గనే యున్నది', 'ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ' - 'ప్రజ్ఞయే సర్వాధారము, ప్రజ్ఞానమే బ్రహ్మ', 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' - 'ఆనందమే బ్రహ్మ యని తెలిసికొనెను', 'ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన' - 'బ్రహ్మ యొక్క యానందమును, బ్రహ్మభిన్నమైన యానందమును (రాహోశ్శిరవత్ - రాహువు యొక్క శిరస్సు అనినట్లు) తెలిసికొనిన విద్వాంసుడు - జ్ఞాని దేనివలన భయము నొందడు' మొదలైన శ్రుతివచనముల వలన సచ్చిదానందములు బ్రహ్మస్వరూప లక్షణములని తెలియుచున్నది. స్వరూప బోధకము లయిన సచ్చిదానందములు గలది గాన, శ్రీమహా రాజ్ఞి 'సచ్చిదానందా' యని స్తవనీయ యగుచున్నది. వేదాంతశాస్త్రము నందు చెప్పబడిన బ్రహ్మస్వరూపలక్షణము లచేత తెలియబడునదని భావము.

## ౨౨౮. సాధ్వీ

శం. భా. సాధ్వీ । కర్మోపాసనాదిభిః మహావాక్య శ్రవణజన్య బ్రహ్మవిద్యాత్వేన సాధనచతుష్టయసంపన్నాధి కారిణా అపరోక్షతయా సాధితుం ప్రాప్తు మర్హా, ఫలస్వరూ పత్వాదిత్యర్థః । సాధ్వీతి వా పాఠే సాధ్వీ స్త్రీ, సత్త్వగుణ సంపన్నత్వాత్ సాధుః సకల విద్యాపారగత్వే సతి సదా చారసంపన్నః వైభవసంపత్తిమానిత్యర్థః । తదేకనిష్ఠా పరమ

పతివ్రతా సతీ స్త్రీణాం పాతివ్రత్యసంప్రదాయ ప్రవర్తికేతి యావత్ ॥ ఓం సాధ్వ్యై నమః ॥

ఆం. వి. కర్మోపాసనాదులచేత వేదాంత మహావాక్య శ్రవణజన్యమైన బ్రహ్మవిద్యగా సాధన చతుష్టయ సంపన్ను డయిన యధికారిపురుషుని చేత ఫలస్వరూప మగుట వలన అపరోక్షముగాపొందబడుటకుఅర్హ మైనదిగాన, దేవి 'సాధ్వి' యనబడును. సాధ్వీ యను పాఠమును స్వీకరించినపక్షములో సాధు పురుషుని యొక్క స్త్రీయగుటంజేసి సాధ్వీ యన బడును. సత్త్వగుణ సంపన్నుడగుట వలన సాధువనబడును. సకల విద్యాపారంగతుడగుచు సదాచార సంపన్నుడు, దైవీ సంపద గలవాడని యర్థము. ఆ బ్రహ్మయందే యేకనిష్ఠగల పరమ పతివ్రత యగుచు స్త్రీలకు పాతివ్రత్య సంప్రదాయ మును ప్రవర్తింప జేయునదని నిశ్చయార్థము.

## ౨౭౯. సద్గతిదాయినీ

శం. భా. సద్గతిదాయినీ । సమీచీనా పునరావృత్తి రహితా సుఖమాత్రరూపా గతిః, గమ్యతే జ్ఞాయతే ప్రాప్యతే ఇతి వా గతిః । యత్ జ్ఞాయతే తదేవ గతిః, తదన్యస్యాజ్ఞాత త్వాత్ గతిత్వానుపపత్తేః । జ్ఞాతే ఫలే ఇచ్ఛయా తత్సాధ నేషుపురుషః ప్రవర్తతే; న త్వజ్ఞాతఫలసాధనే - ఇత్యన్వయ వ్యతిరేకాభ్యామ్. 'బ్రహ్మవిదాప్నోతి పరమ్', 'బ్రహ్మ వేద

బ్రహ్మైవ భవతి', 'యో పూర్వం దేవా ఋషయశ్చ తద్విదుః తే తన్మయా అమృతా వై బభూవుః' ఇత్యాదిశ్రుత్యా చ పరదేవతాస్వరూపమేవ ముక్తిస్వరూపతయా సద్గతిః। తదా వారకాజ్ఞానాభిభవేన స్వరూపానంద మభివ్యంజయతీతి దాయినీ। అభేదేఽపి గతిదానయోః కర్మకర్తృప్రయోగః ఉపపద్యతే। 'తదాత్మానగ్ం స్వయ మకురుత' ఇత్యాదివ దిత్యర్థః। సతీం వా సత్త్వగుణయుక్తాం దేవయానాదిగతిం వా దదాతీతి సా తథా ॥ ఓం సద్గతిదాయిన్యై నమః ॥

ఆం. వి. సమీచీనము, పునరావృత్తి రహితము, కేవల సుఖస్వరూపమునగు గతి సద్గతి యనబడును. గమ్యతే తెలిసికొనబడుచున్నది, పొందబడుచున్నది యగుట చేతగాని 'గతి' యనబడును. ఏది తెలిసికొనబడుచున్నదో యదియే గతి, తదన్యము అజ్ఞాతమగుట వలన గతితపము అన్యాపన్న మగును. ఫలము జ్ఞాతమైనపుడు కోరికతో పురుషుడు తత్ఫల సాధనము లందు ప్రవర్తించును. అజ్ఞాత ఫలసాధనము లందు ప్రవర్తించడని యన్వయ వ్యతిరేక దృష్టాంతములతో తెలిసికొన నగును. 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' -'బ్రహ్మవేత్త యైనవాడు పరమగు బ్రహ్మవస్తువును పొందుచున్నాడు', 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' - 'బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మయే యగును', 'పూర్వము బ్రహ్మను తెలిసిన దేవతలు ఋషులును బ్రహ్మ స్వరూపులై యమృతులయిరి' - ఇత్యాది

శ్రుతుల వలనను పరదేవతాస్వరూపమే మోక్ష స్వరూపముగా సద్గతి యగును. తద్బ్రహ్మకు ఆవరకమైన యజ్ఞానము తిరస్కృతమగుట చేతను స్వరూపానందమును అభివ్యంజితము చేయునదగుట వలనను పరదేవత 'సద్గతిదాయినీ' యనబడును. గతికి, దానమునకు అభేదమున్నను కర్మకర్తృప్రయోగము ఉపపన్నమే యగును. 'తదాత్మానగ్ం స్వయ మకురుత'-'ఆ బ్రహ్మవస్తువు అభిన్ననిమిత్తోపాదానకారణ మగుట వలన తనను తానె అభివ్యక్తము చేసికొనెను' అనునట్లు యుక్తి సంగతమే యగును. సతినిగాని, సత్త్వగుణ సంపన్నమైన దేవయానాది గతిని గాని యిచ్చునది గాన, పరమేశ్వరి 'సద్గతిదాయినీ' యని ధ్యాతవ్యరాలగుచున్నది.

## ౨౩౦. సనకాదిమునిధ్యేయా

శం. భా. సనకాదిమునిధ్యేయా । మననశీలాః మునయః, మననశబ్దేన లక్షణయా తత్సాక్షాత్కారవంత ఇత్యర్థః, బ్రహ్మణః మానసికపుత్రాః జ్ఞానవైరాగ్యాది బహులాః మోక్షమార్గప్రవర్తకాః; సనకః ఆదిః యేషాం తే మునయః సనందన సనాతన సనత్కుమార ప్రముఖాః నిరీషణాః నిశ్చింతాః, తైః ధ్యేయా అత్యాదరేణ స్వాత్మాభేద జ్ఞానేన సర్వదా విషయీకృతేత్యర్థః; 'త్వం వా అహమస్మి భగవో దేవతే అహం వై త్వమసి', 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి', 'ఆత్మానం చే ద్విజానీయా దహ మస్మీతి పూరుషః',

'అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద యథా పశుః', 'మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' ఇత్యాది శ్రుతిస్మృతి శతేభ్యః ॥ ఓం సనకాది మునిధ్యేయాయై నమః ॥

ఆం. వి. మననము చేయువారు మునులు; మనన శబ్దము వలన లక్షణయా బ్రహ్మసాక్షాత్కారము గలవారని తెలియును, బ్రహ్మమానసపుత్రులు, అధికజ్ఞానవైరాగ్య సంపత్తి కలవారు, మోక్షమార్గప్రవర్తకులు సనకాదిమునులు, సనందనసనాతన సనత్కుమార ప్రముఖులు ఈషణారహితులు చింతారహితులు; తాదృశులయినసనకసనందనాది మునులచేత పరదేవత ధ్యాతవ్య, అనగా స్వాత్మాభేదజ్ఞానము చేత స్వస్వరూపజ్ఞానము చేత మిక్కిలియాదరముతో విషయముగా చేసికొనబడినదని యర్థము. 'త్వం వా అహ మస్మి భగవో దేవతే అహం వై త్వమసి' - 'ఓ పరదేవతా ! నీవే నేను, నేనే నువ్వు', 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి'- 'క్షేత్రజ్ఞుడనుగా కూడ నన్ను తెలిసికొనుము', 'ఆత్మానం చే ద్విజానీయా దహమస్మీతి పూరుషః'-'పురుషుడు నేనై యున్నానని సచ్చిదా నందస్వరూపమైన యాత్మను తెలిసికొనవలయును,' అథ యోఽన్యాం దేవతా ముపాస్తే ...' - 'ఇతడు వేరు, నేను వేరని తనకంటె భిన్నముగా దేవత నుపాసించువాడు పశువు వలె జ్ఞానశూన్యుడు', 'మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' - 'అజ్ఞానము వలన ఆత్మయందు

నానాత్వమును - భేదమును చూచువాడు మత్యుపరంపరను పొందుచున్నాడని శ్రుతిస్మృతి శతము వలన తెలియుచున్నది. కావున, పరదేవత ఆత్మాభిన్నముగా సనకసనందనాదులచే ధ్యానింపబడి 'సనకాదిమునిధ్యేయా' యనిసమాదరభావముతో స్తోత్రవ్యరాలగుచున్నది.

## ౨౩౧. సదాశివకుటుంబినీ

శం. భా. సదాశివకుటుంబినీ । సదాశివః కుటుంబమస్యా అస్తీతి తథా ॥ ఓం సదాశివకుటుంబిన్యై నమః ॥

ఆం. వి. సదాశివుడు కార్యకారణరూప నిఖిలప్రపంచము స్వరూపముగా గలవాడు, తత్స్వరూపమైన కుటుంబము గలది అనగా జగత్కుటుంబిని యగుటంజేసి శ్రీకామేశ్వరీదేవి 'సదాశివకుటుంబినీ' యను సార్థకనామముతో విభ్రాజమానురాలగుచున్నది.

శ్లో॥ సకలాధిష్ఠానరూపా సత్యరూపా సమాకృతిః ।
సర్వప్రపంచనిర్మాత్రీ సమానాధికవర్జితా ॥ ౭౫

## ౨౩౨. సకలాధిష్ఠానరూపా

శం. భా. సకలాధిష్ఠానరూపా । 'అథాత ఆదేశో నేతి', 'నేహ నానాఽస్తి కించన' ఇత్యాది నిషేధశ్రుతిభ్యః ప్రతిపన్నా । 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాది బాధాయాం సామానాధికరణ్య మవగమ్యతే । కార్యస్య కారణాభేద

జ్ఞానం బాధా । తద్భిన్నత్వాజ్ఞానస్య భ్రమరూపత్వాత్ । తథాచ శ్రుతినిషేధస్యాపేక్షాయాం ప్రకృత్యాదీనామపి తత్త్వజ్ఞానేన నివృత్తౌ భూతపూర్వగత్యా సర్వాధిష్ఠానత్వేన అనుభూయతే ఇతి భావః ॥ ఓం సకలాధిష్ఠానరూపాయై నమః॥

ఆం. వి. 'అథాత ఆదేశో నేతి'-'ఈ దృశ్యప్రపంచము బ్రహ్మకాదు,' 'నేహ నానాస్తి' - 'ఈ యాత్మ యందు నానాత్వము లేదు' మొదలయిన నిషేధశ్రుతుల వలన పరమేశ్వరి ప్రతిపాదిత యగుచున్నది. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'ఈ దృశ్య ప్రపంచమంతయు బ్రహ్మయే' ఇత్యాది బాధయందు సామానాధికరణ్యము తెలియుచున్నది. కార్యము కారణము కంటె అభిన్నమను జ్ఞానము 'బాధ' యనబడును. తద్భిన్నమైన జ్ఞానము భ్రాంతిరూపము. కాగా, శ్రుతిబోధిత నిషేధమున కవధి యపేక్షిత మగుచుండగా, ప్రకృతి మొదలైనవి తత్త్వజ్ఞానము వలన నివృత్తము లగుచున్నవి; కాగా, భూతపూర్వగతితో, అనగా అజ్ఞానావస్థలో భాసించిన సర్వమును గ్రహించి సర్వాధిష్ఠానముగా అనుభూయమానమగుచున్నదని భావము. కావున, పరదేవత 'సకలాధిష్ఠానరూపా' యని స్తుతింపబడుచున్నది.

## 233. సత్యరూపా

శం. భా. సత్యరూపా । సత్యం జడానృత పరిచ్ఛిన్నవ్యావృత్తం సచ్చిదానందరూపం యస్యాః సా తథా ।

పరిణామవాద మాశ్రిత్య సత్ అపరోక్షజ్ఞానయోగ్యాని పృథి వ్యప్తేజాంసి, త్యత్తు పరోక్షజ్ఞానవిషయాః నిత్యానుమేయా ఇత్యర్థః, 'సచ్చ త్యచ్చాభవత్' ఇతి శ్రుతేః। సత్యం రూపం యస్యాః సా తథా ॥ ఓం సత్యరూపాయై నమః ॥

ఆం. వి. సత్య మనగా, జపము, అనృతము, పరిచ్ఛి న్నము నయినదానికంటె భిన్నమైన రూపము. సచ్చిదానంద స్వరూపము గలదగుట వలన, దేవి 'సత్యరూపా' యని ధ్యేయ యగుచున్నది. పరిణామవాదము ననుసరించి అపరోక్షజ్ఞాన యోగ్యములయిన పృథివి, జలము, అగ్ని - ఈ మూడును 'సత్' అనబడును, పరోక్షజ్ఞాన విషయములు, నిత్యాను మేయము లయిన వాయ్వాకాశములు 'త్యత్' అనబడును. 'సచ్చ త్యచ్చాభవత్' అను శ్రుతివచనము వలన బ్రహ్మయే యపరోక్షము లయిన పృథివి, జలము, అగ్ని పరోక్షములైన వాయువు, ఆకాశము అనునవి 'సత్, త్యత్' రూపములుగా అభివ్యక్తమైనదని తెలియును. కావున, బ్రహ్మభిన్నయైన పరమేశ్వరియు తద్రూపముతో విరాజిల్లుచున్నదగుట వలన 'సత్యరూపా' యని సంకీర్తిత యగుచున్నది.

## ౭౩౪. సమాకృతిః

శం. భా. సమాకృతిః। సమా అభిన్నా సచ్చిదా నందరూపైకరసా ఆకృతిః మూర్తిః స్వరూపం యస్యాః సా తథోక్తా।

సమా అన్యూనాతిరిక్తా యథాశాస్త్రప్రమాణం మూర్తిర్విగ్రహో యస్యాః సేతి వా ।

సమా సదాశివేన గుణ సౌందర్య బల వీర్య యశో గాంభీర్య ధైర్యేంగితాది పరిజ్ఞాన సర్వజ్ఞత్వాది బహులధర్మ విశేషైః మూర్తిః యస్యాః సేతి వా ।

చతుర్విధ భూతగ్రామేషు తత్తత్ప్రారబ్ధానుసారేణ సమా తత్ర తత్ర నివాసయోగ్యా మూర్తి ర్యస్యాః సేతి వా।

కర్మాధ్యక్షతయా తత్తత్ఫల విశేషదానేషు సమా పక్ష పాతరహితా మూర్తిర్యస్యాః సా ।

సమా బాల్య స్థవిరత్వాది భావవికారవర్జితా ఏక ప్రకారా నిత్యయౌవనశాలినీ మూర్తి ర్యస్యాః సా ।

'సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్'

'అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా సదా జనానాం హృదయే సంనివిష్టః। '

ఇతి స్మృతిశ్రుతిభ్యా మేకరూపతత్వావగమా దిత్యాశయః ॥
ఓం సమాకృత్యై నమః ॥

ఆం. వి. అభిన్న సచ్చిదానందరూపముతో ఏకరసమైన యాకృతి-స్వరూపము గలదిగాన, పరదేవత 'సమాకృతిః' యనబడును.

సాముద్రికశాస్త్ర ప్రమాణానుసారము ఎక్కువ తక్కువ లేని సరియైన ప్రమాణముతో ఉన్న యవయవములతో ఒప్పారునట్టి యాకారవిశేషముగాన, 'సమాకృతిః' యనబడును.

సదాశివునితో సమానమైన గుణ, సౌందర్య బల, వీర్య, యశోగాంభీర్య, ధైర్య, ఇంగితాది పరిజ్ఞాన, సర్వజ్ఞత్వాది అనేక ధర్మములతో ఒప్పారునట్టి యాకృతివిశేషము గలదగుటం జేసి దేవి 'సమాకృతిః' యని స్తోతవ్య యగుచున్నది.

చతుర్విధ భూతసమూహము నందు వారివారి ప్రారబ్ధకర్మానుసారము వారియందు సమానమైన నివాసయోగ్యత గలదిగాన, 'సమాకృతిః' యను నామ మన్వర్థము.

కర్మాధ్యక్షురాలుగా ఆయా జీవులకు వారి కర్మానుసారము ఫలముల నొసగుట యందు పక్షపాతరహితమైన యాకృతి గలదగుట చేత పరదేవత 'సమాకృతిః' యని ధ్యాయనీయ.

బాల్య, స్థవిరత్వాది భావవికారములు లేని యేకవిధమైన నిత్యయౌవన సంపన్నమైన మూర్తి గలదగుటం జేసి పరాభట్టారిక 'సమాకృతిః' యనబడును.

'సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్' 'సర్వభూతముల యందు సమముగా ఉండి మదీయ పరమభక్తిని పొందుచున్న' దనియు,

అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదా జనానాం హృదయే సంనివిష్టః' - సర్వప్రాణుల హృదయము నందు పరమేశ్వరుడు అంగుష్ఠమాత్ర పురుషుడుగ సదా అంతర్యామి రూపముతో సంనివిష్టుడైయున్నా' డనియు చెప్పునట్టి స్మృతి శ్రుతివాక్యముల వలన పరదేవతకు ఏకరూపత్వము గలదని యాశయము.

## ౨౩౪. సర్వప్రపంచనిర్మాత్రీ

శం. భా. సర్వప్రపంచనిర్మాత్రీ। సంసారస్యానాదితయా మోక్షస్థాయిత్వేన చ భూతభవిష్యద్వర్తమానగత్వా సర్వ శబ్దవాచ్యత్వం ప్రపంచస్య: ప్రపంచ్యతే విస్తార్యతే వివర్తత ఇతి ప్రపంచః, 'ఏకం బీజం బహుధా యః కరోతి' ఇతిశ్రుతేః। తస్య నిర్మాత్రీ నిర్మాణ మభివ్యక్తిః తన్నిమిత్తతయా తత్ కర్తృత్వ ముపచర్యతే, దేవదత్తః పచతీతి వత్ ॥ ఓం సర్వ ప్రపంచనిర్మాత్ర్యై నమః ॥

ఆం. వి. సంసార మనాది, (అనాదిత్వం నామ జ్ఞాన నిరస్యత్వమ్) మోక్షపర్యంతము నుండునట్టిదియు నగుటచేత త్రికాలములయందు-భూతభవిష్యద్వర్తమాన కాలములందు వ్యాపించి యుండునది గాన, ప్రపంచమునకు సర్వశబ్ద వాచ్య త్వము సంగతము. 'విస్తరింప జేయబడుచున్నది, స్వరూప నాశనము లేకయే నానా నామరూపములతో వివర్తరూపమై

కనబడుచున్నది గాన, ప్రపంచ మనబడును. 'ఏకం బీజం బహుధా యః కరోతి' - 'పరమేశ్వరుడు ఒక విత్తనమును అనేకముగా చేయుచున్నా' డను శ్రుతివలన పరమేశ్వరి యేక స్వరూపము గలదయ్యు అనేక రూపములతో అభివ్యక్తమగు చున్నదని తెలియుచున్నది. పరదేవత తాదృశ ప్రపంచ నిర్మాత్రి; నిర్మాణ మనగా అభివ్యక్తి, తదభివ్యక్తికి కారణ మగుట వలన దేవదత్తుడు వండుచున్నాడను రీతిగా ప్రపంచ కర్తృత్వము పరమేశ్వరి యందారోపిత మగుచున్నది. కావున జగన్మాత 'సర్వప్రపంచనిర్మాత్రీ' యని భక్తులచేత సంకీర్తింప బడుచున్నది.

## ౨౩౬. సమానాధికవర్జితా

శం. భా. సమానాధికవర్జితా। కుల శీల జాతిగుణాదిభిః తుల్యః సమానః తైః శ్రేయా నధికః, తైర్వర్జితా । 'న తస్య ప్రమాఽస్తి', 'విశ్వాధికో రుద్రో మహర్షిః' ఇతి శ్రుతేః, 'సర్వాధిపత్యం కురుతే మహాత్మా' ఇతి 'ఏకమేవా ద్వితీయమ్', 'న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోక త్రయే' ఇత్యాదిశ్రుతిస్మృతిభ్యాం చేతి భావః । ఏతద్దృష్ట్యా సంమాననీయః సమానః పూజనీయోఽధికః తద్ద్వయేన వర్జితా । 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' ఇత్యాది శ్రుతేరితి వాఽర్థః ॥ ఓం సమానాధికవర్జితాయై నమః ॥ ః

ఆం. వి. కుల, శీల, జాతి, గుణాదుల చేత సమానమైన వాడు, ఆ కులశీలాదుల చేత అధిక శ్రేష్ఠమైనవాడు - ఈ

యిరువురి చేత విడువబడునది, పరమేశ్వరితో సమానులు గాని, యామెకంటె అధికులు గాని లేరని భావము. 'న తస్య ప్రతిమాఽస్తి' - 'ఆ పరమేశ్వరునితో పోల్చదగిన వస్తువు లేదు', 'విశ్వాధికో రుద్రో మహర్షిః'- 'రుద్రుడు విశ్వాధికుడు మహర్షి (స్వయంప్రతిభాత వేదస్వరూపుడు) యను శ్రుతి వాక్యముల వలన, 'సర్వాధిపత్యం కురుతే మహాత్మా' - 'అనంతమైన యాత్మ స్వరూపము సర్వ ప్రపంచాధిపత్యము చేయుచున్న' దనియు, 'ఏకమేవాద్వితీయమ్' - 'సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యమైన యాత్మపదార్థము ఏకము, అద్వితీయము అనియు, 'న త్వత్సమోఽభ్యస్త్యధికః ....' - 'నీతో సమానమైనవాడు, నీకంటె, అధికుడయినవాడు మఱియొకడు ముల్లోకములలో లేడు' అనియు చెప్పునట్టి శ్రుతిస్మృతుల చేత పరమేశ్వరి 'సమానాధిక వర్జితా' యని భావనీయురాలగుచున్నదని భావము. (పరమేశ్వర ప్రతిపాదక శ్రుతి వాక్యములన్నియు, తదభిన్న స్వరూపము గలవగుట వలన పరమేశ్వరీ ప్రతిపాదకములు నయి యుక్తిసహము లగు నని సర్వత్ర యనుసంధేయము.) ఈ దృష్టితో సంమాననీయుడయిన సమానుడు, పూజనీయుడయిన యధికుడు- వీరిరువురిచే విడువబడునది; 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' సజాతీయ, విజాతీయ, స్వగతభేదము లేని బ్రహ్మ ఏకము, అద్వితీయ' మని చెప్పునట్టి శ్రుతివలన గాని దేవి 'సమానాధిక వర్జితా' యని తెలియవలయునని భావము.

శ్లో॥ సర్వోత్తుంగా సంగహీనా సగుణా సకలేష్టదా ।
కకారిణీ కావ్యలోలా కామేశ్వరమనోహరా ॥ ౮౬

## ౨౩౬. సర్వోత్తుంగా

శం. భా. సర్వోత్తుంగా । కార్యాపేక్షయా కారణస్యాధికత్వాత్ సర్వాపేక్షయా ఉత్తుంగా ఉన్నతా, 'పాదోఽస్య విశ్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి' ఇతి శ్రుతేః ॥ ఓం సర్వోత్తుంగాయై నమః ॥

ఆం. వి. కార్యము కంటె కారణము గొప్పదగుటవలన పరమేశ్వరి సర్వ ప్రపంచరూప కార్యముకంటె ఉన్నతమైనది, మహనీయమైనది యని భావము. 'పాదోఽస్య విశ్వా భూతాని' యనుచుపురుషసూక్తముఅనంతకోటిబ్రహ్మాండము లందలి సమస్త భూతజాతము ఈ విరాట్పురుషుని యొక్క నాల్గవ పాదము, నాల్గవ వంతు అనియు, మిగిలిన మూడు భాగములు ఆకసము నందు మోక్షరూపముతో ఉన్నవనియు చెప్పుచున్నది. దీనిని త్రిపాద్విభూతి యని యందురు. ప్రాణి కర్తృసహితమైనభాగమువిరాట్పురుషుని ప్రథమపాదము, ప్రాణి రహితమైన తక్కిన మూడు భాగములు విరాట్ పురుషుని యొక్క మూడు పాదములనియు తెలియవలయును. కావున, శ్రీ లలితాత్రిపురసుందరి 'సర్వోత్తుంగా' యనుచు ధ్యానింపబడుచున్నది.

## ౨౩౮. సంగహీనా

శం. భా. సంగహీనా । నిరవయవత్వేన నిష్కారణత్వేన వా, నిర్గుణత్వేన వా, నిరాశ్రయత్వేన వా, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వరూపత్వేన సంబంధరహితా వా; 'అసంగో నహి సజ్జతే', 'నచాస్య కశ్చిజ్జనితా న చాధిపః' ఇత్యాది శ్రుతేరిత్యాశయః ॥ ఓం సంగహీనాయై నమః ॥

ఆం. వి. నిరవయవ, కారణరహిత, నిర్గుణ, నిరధిష్ఠాన, నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వరూపిణిగా సంబంధము లేనిదగుట వలన పరదేవత 'సంగహీనా' యనిసంకీర్తింపబడును. 'అసంగో నహి సజ్జతే'-'సంగము లేని పురుషుడు దేనియందును సక్తుడు గాడు', 'నచాస్య కశ్చిజ్జనితా న చాధిపః'-ఈబ్రహ్మపదార్థము నకు జనకుడు లేడు, శాసకుడును మఱియొకడు లేడు' అని చెప్పునట్టి శ్రుతుల వలన పరదేవత సంగహీన యని తెలియుచున్నదని భావము.

## ౨౩౯. సగుణా

శం. భా. సగుణా । సమాః ఏకప్రకారాః గుణాః సత్యకామత్వాదయః యస్యాః సా తథా । 'గుణీ సర్వవిద్యః', 'సత్యకామః సత్యసంకల్పః' ఇత్యాది శ్రుతేః । త్రిమూర్తి స్వరూపతయా సత్త్వరజస్తమోగుణైః సహ వర్తత ఇతి వా తథా ॥ ఓం సగుణాయై నమః ॥

ఆం. వి. సత్యకామత్వ, సత్య సంకల్పత్వాది గుణములు సమానముగా, ఏకవిధముగా గలదిగాన, దేవి 'సగుణా' యని కీర్తింపబడును. 'గుణీ సర్వవిద్యః'- భగవానుడు సర్వగుణ సంపన్నుడు, సర్వజ్ఞుడై యున్నాడు', 'సత్యకామః సత్యసంకల్పః' - పరమేశ్వరుడు సత్యకాముడు, సత్యసంకల్పుడు' అను శ్రుతుల వలన పరమేశ్వరి 'సగుణా' యని ధ్యాతవ్యయగుచున్నది. బ్రహ్మ, విష్ణు, రుద్రాత్మక త్రిమూర్తి స్వరూపిణిగా సత్త్వ రజస్తమోగుణ సంపన్నయై యుండుట చేతను శ్రీ మహారాజ్ఞి 'సగుణా' యను నామముతో వ్యపదేశ్యురాలగుచున్నది.

## ౨౮౦. సకలేష్టదా

శం. భా. సకలేష్టదా । ఇచ్ఛావిషయభూతాని ఇష్టాని కామ్యానీత్యర్థః; సకలాని చ తానీత్యభేదసమాసః; అన్యథా జీవాదివత్ కస్మింశ్చిద్విషయే అసామర్థ్యశంకా స్యాత్ । ఏకస్య పదార్థస్య బహూనా మిచ్ఛావిషయత్వదర్శనాత్, ఏకత్ర కామనాయామపి తత్సహభావిత్వేన సర్వప్రాపకత్వోక్తౌ పరదేవతాయాః బహుఫలప్రదాతృత్వేన అత్యంత విశ్వసనీయతమా అతిశయ ప్రతిభానాచ్చేత్యర్థః ।

అథవా, పరిచ్ఛిన్న పరిమిత భాగ్యవత్ప్రాణినః సర్వస్య సర్వత్ర ఇచ్ఛాయామపి, యాని సర్వాణి స్వబుద్ధ్యా శాస్త్ర

విరోధేనేష్టాని ఏషితవ్యానివాంఛితవ్యాని, తాన్యేవప్రయచ్ఛతి దదాతి; న తదధికాని, లోకేచ్ఛాయాః బహుప్రకారత్వేన దుష్పూరణీయత్వాదితి భావః । సర్వేషాం ప్రాణినా మిష్ట్యా ఇజ్యయా పూజయా విషయీకృతా, యజ్ఞేన వా సమారాధితా తస్య ఫలప్రదేత్యర్థః । 'అహం చ సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ', 'ఏష హ్యేవ సాధుకర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి' ఇతి స్మృతిశ్రుతిభ్యాం పరమేశ్వరార్పణబుద్ధ్యా క్రియమాణ స్యైవకర్మణః శుభఫలత్వాత్ ముక్తిహేతుత్వేన, కామ్యఫలార్థినాం జన్మమరణాది బంధకత్వేన స్వల్పఫలతయా అనాదరణీయత్వా దిత్యర్థః ।

అథవా, కలాభిః అవయవైః తరతమభావై రిత్యర్థః, తైః సహితాని ఇష్టాని ఫలాని మనుష్యానందాది బ్రహ్మానంద పర్యంతాని ఫలాని ఆనందస్వరూపాణి దదాతీతి తథా ॥ ఓం సకలేష్టదాయై నమః ॥

ఆం. వి. ఇచ్ఛకు విషయము లయినవి కామ్యములు; సకలమైన కామ్యములని యభేదసమాసము చెప్పినసకలేష్టములను రూపము నిష్పన్నమగును; తాదృశములైన సకలకామ్య ఫలముల నొసగునది గాన, 'సకలేష్టదా' యని చెప్పబమును. ఆ రీతిగ చెప్పకపోయినచో, సాధారణ జీవులు ఒకానొక విషయము నందు అసమర్థులయిన రీతిగా పరమేశ్వరి పట్ల గూడ అసామర్థ్యశంక కలుగవచ్చును. ఒక వస్తువు అనేక

ప్రాణుల యిచ్ఛకు విషయమగుట లోకములో కన్పడు చున్నది. అందువలన, ఒక వస్తువునందు సర్వులు కోరిక గలిగి యున్నను, ఆ కామన యీ పరదేవత వలన కలుగుచున్నది. ఆ కారణము చేత పరమేశ్వరి సర్వకామ్య ఫలముల నొసగు నదను వచనము, పరదేవత బహుఫలప్రదానము చేయున దగుట వలన అత్యంత విశ్వసనీయము. కావున, సకలేష్ట ప్రదాత్రిగా మిక్కిలి ప్రకాశించు నదగుటంజేసి జగన్మాత 'సకలేష్టదా' యని స్తుతింపబడుచున్నది.

అథవా, పరిచ్ఛిన్నము (భిన్నము), పరిమితము నయిన భాగ్యము గల సర్వజీవులకు సర్వ విషయములందు కోరిక లుండును. అట్టి సందర్భములో గూడ వాంఛనీయములైన యీ కోరికలనే పరదేవత శాస్త్రవిరోధములేకుండా స్వబుద్ధితో పర్యాలోచించి ప్రసాదించును; అంతకంటె అధికముగా నొసగదు. ఏలన, లోకుల కామనలు అనేక విధములు, దుష్పూరణీయములుగా ఉండును. అనగా, తీర్చుటకు యోగ్య మైనవిగా ఆ కోరికలు ఉండవు. సర్వప్రాణులయొక్క పూజ చేత (ఇష్ట్యా) విషయముగా చేయబడునది, అనగా పూజ నీయమైనది యగుట చేతగాని, యజ్ఞముచేత సమారాధిత యగుట వలనగాని, తత్పూజకు, యజ్ఞమునకు ఫలము నొసగు నదని యర్థము. 'అహంచ సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ'-'నేను సర్వయజ్ఞములకు భోక్తను, ప్రభువునై యున్నాను', 'ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య

'ఉన్నినీషతి' - ఈ పరమేశ్వరుడే సాధు (పుణ్య) కర్మను చేయించును, తత్కర్మానుష్ఠానము చేసినవానిని యమలోకములనుండి యూర్ధ్వలోకములకు గొనిపోవును' అని చెప్పునట్టి స్మృతిశ్రుతులవలన ఈశ్వరార్పణబుద్ధితో చేసినకర్మ శుభఫలప్రదము, ముక్తిహేతువు నగుచున్నది. అందువలన కామ్యకర్మ చేయువారల కర్మ జన్మ మరణరూప బంధహేతువు, అల్పఫలప్రదము నగుటవలన ఆదరణీయము కానందున పరదేవత యీశ్వరార్పణ బుద్ధితో వేదోక్త కర్మానుష్ఠానము చేయువారికి పరమపురుషార్థరూపమైన మోక్షఫలము నొసగునని భావము.

అథవా, కళలనగా తరతమ భావములు, ఆ తరతమ భావములతో గూడిన సకలేష్ట ఫలములను, మనుష్యానందము మొదలు బ్రహ్మానందము వరకు గల యానందస్వరూపములైన ఫలముల నొసంగునది గావున, శ్రీ మహామహేశ్వరి 'సకలేష్టదా'యని భజనీయ యగుచున్నది.

## ౨౪౧. కకారిణీ

శం. భా. కకారిణీ। తృతీయఖండ ద్వితీయ వర్ణరూపః కకారావయవః వాచకః అస్యా అస్తీతి తథా॥ ఓం కకారిణ్యై నమః॥

ఆం. వి. పంచదశీమహామంత్రములోని తృతీయకూట ద్వితీయవర్ణము కకారము, ఆ కకారము అవయవముగా గల

వాచకశబ్దము గలదిగాన, శ్రీ త్రిపురసుందరి 'క
యని యర్చనీయ యగుచున్నది.

## ౨౮౨. కావ్యలోలా

శం. భా. కావ్యలోలా। వాల్మీకి వేదవ్యా
కావ్యేషు లోలా వాచ్య లక్ష్యార్థభేదేన తత్ర సం

అథవా; కవిభిః కృతేషు స్తుతివిశేషేషు
త్యర్థః॥ ఓం కావ్యలోలాయై నమః॥

ఆం. వి. వాల్మీకి వేదవ్యాసాద మహాకవుల
బడిన కావ్యములయందు (వేదార్థోపబృంహణమున
యణ మహాభారతాదులు రచింపబడిన వగుటచే
గలది. వాచ్యార్థము, లక్ష్యార్థము అను భేదముతో
ముల యందు దేవి సంబద్ధయై యున్నదని భావము

అథవా, మహాకవులచే రచింపబడిన స్తో
యందు ప్రేమగలది. కావున పరదేవత 'కావ్యలో
గుణసంకీర్తనము చేయబడుచున్నది.

## ౨౮౩. కామేశ్వర మనోహరా

శం. భా. కామేశ్వరమనోహరా। కామేశ్వర
హరతీతి తథా॥ ఓం కామేశ్వరమనోహరాయై నమః

ఆం. వి. కామేశ్వరదేవుని మనస్సును ఆకర్షించునది గావున శ్రీ కామేశ్వరీదేవి 'కామేశ్వరమనోహరా' యని స్తవనీయ యగుచున్నది.

విశే :- 'నిరుపాధిక సంవిదేవ కామేశ్వరః'
'సదానందపూర్ణా స్వాత్మైవ పరదేవతా లలితా'

యనుచు భావనోపనిషత్తు నిరుపాధికసంవిద్రూపుడే కామేశ్వరుడనియు, సచ్చిదానందరూపిణియగు శ్రీ లలితాంబికయే స్వాత్మ యనియు చెప్పుట భావనీయము.

శ్లో॥ కామేశ్వరప్రాణనాడీ కామేశోత్సంగవాసినీ।
కామేశ్వరాలింగితాంగీ కామేశ్వరసుఖప్రదా॥ ४२

## ౨౪౪. కామేశ్వరప్రాణనాడీ

శం. భా. కామేశ్వరప్రాణనాడీ। కామేశ్వరస్య ప్రాణనాడీ యథా నాడ్యాః ప్రాణాః సంచరంతి సా తథా జీవనాడీ త్యర్థః 'ఇడయా తు బహిర్యాతి' ఇతి లయఖండవచనాత్। లోకే విశస్యమానే పశౌ హృదయం పుండరీకాకారం మాంసఖండాత్మక అంతఃసుషిరాష్టదళోపేత మంగుష్ఠపరిమాణ సుషిరయుక్త - అధోభాగ కర్ణికామధ్యం దృశ్యతే, తస్యాః కర్ణికాయాః కేసరాయమాణాః ఏకశతం నాడీనా మంకురాః

తద్వేష్టనపురీ తన్నామక నాడీసుషిర విన్యస్తమూలాః భవంతి। తత్ర సుషుమ్నానామక నాడీ మూలాధారా దారభ్య బ్రహ్మరంధ్రపర్యంతం గతా। తస్యాం షట్ చక్రాణి మూలాధారాదీని తత్తన్మాతృకావర్ణసహిత యోగశాస్త్రోక్త దళసంయుతాని వర్తంతే, తస్యా మూలే పృథ్వీదేవతా బిసతంతు తనీయసీ కుండలినీ అధోముఖావరణశక్తి ర్నిద్రాతి। తస్యాః దక్షిణభాగే ఇళానామ నాడీ భ్రూమధ్యపర్యంతం ప్రసృతా వామే పింగళా తథా। తథాచ జాగ్రదవస్థాయాం నేత్రయోః సంపత్త్యాత్మనా శ్రుతిప్రతిపాదితః, స్వప్నే మన ఉపాధికః సుషుప్తా వజ్ఞానోపాధికః; జాగ్రతి స్థూలశరీరాభిమానీ విశ్వ ఇత్యుచ్యతే। స్వప్నే సూక్ష్మాభిమానీ తైజసః, సుషుప్తౌ కారణాభిమానీ ప్రాజ్ఞః। సుషుప్తౌ కారణాత్మనా స్థితాని స్థూల సూక్ష్మ శరీరజన్య భోగసాధన ప్రారబ్ధకర్మవశేన పురీతద్ద్వారా నాడీమార్గేణ తత్తద్గోలకాని ప్రవిశంతి ఇంద్రియాణి। తదుపరమప్రారబ్ధోద్బోధే ఆందోళికాయాం విద్యమానో రాజా గృహాంతరే సోపానమార్గద్వారా ప్రాసాదే విహృత్య తదవచ్ఛిన్నాంతఃపురపర్యంకే శయాన ఇవ పురీతత్ప్రవిశ్య తదవచ్ఛిన్నహృదయోపాధికం పరమాత్మానం యదా ప్రవిశతి తదా సుప్త ఇత్యుచ్యతే। లింగ శరీరం కారణాత్మనా లీయతే। తథా ప్రాణాదివాయవః ప్రలీన వృత్తయః సంతః ఆయుస్స్వరూపేణ శరీరం రక్షంతి। తథాచ, భావి జాగ్రత్స్వప్న భోగానుకూల కర్మానుబంధ ప్రాణధారణం సుషుప్తౌ సోపాధికచైతన్యస్యైవ దృశ్యతే।

తత్సత్తయా చ నాడీనాం ప్రాణసంచారయోగ్యత్వాఽపి। ఏవం చ సతి—

"న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన।
ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతా వుపాశ్రితౌ॥"

ఇతి శ్రుత్యా 'జీవ ప్రాణధారణే' ఇతి ధాతుపాఠాచ్చ ప్రాణనాడీశబ్దస్య లక్షణయా పరామాత్మైవోచ్యతే। కామేశ్వరస్యైవం ప్రారబ్ధకర్మజన్య శరీరమాత్రాభావేఽపి ఘృతకాఠిన్యన్యాయేన మూర్తిమత్తయా తదంతర్యామిసంభావనయా ఏతన్నామ కామేశ్వరస్య ప్రాణనాడీ తదధిష్ఠానచైతన్యమితి ఫలితోఽర్థః॥ ఓం కామేశ్వరప్రాణనాడ్యై నమః॥

ఆం. వి. కామేశ్వరప్రాణనాడీ. కామేశ్వరుని జీవితమున కాధారమైన ప్రాణినాడి గాన, కామేశ్వరప్రాణనాడి. నాడిద్వారా ప్రాణసంచారము జరుగును. ఆరీతిగా కామేశ్వరి కామేశ్వర జీవనాడియై యుండునని యర్థము. 'ఇడయా తు బహిర్యాతి' – ఇడానాడిద్వారా ప్రాణశక్తి బయటకుపోవును' అని యఖండవచనము. లోకములో పశువిశంసనము (పశువును పట్టుట) జరుగునపుడు ఆ పశువునందు పద్మాకారములో ఉన్న హృదయము మాంసఖండాత్మకము, అంతః సుషిరములో (లోపలరంధ్రమున్న) అష్టదళయుక్తము, అంగుష్ఠపరిమాణముగల సుషిరోపేతము నయిన అధోభాగ కర్ణికామధ్యము కన్పడుచున్నది. ఆ కర్ణికకు (బొడ్డుకు)

కింజల్కములు వలె ఉండునట్టి నూటయొక్క నాడుల యంకురము లుండును. ఆ యంకురముల చుట్టును ఆవరింప బడియున్న 'పురీతత్' అను పేరు గల నాడీసుషిరమునందు (నాడియొక్క రంధ్రమునందు) విన్యస్తమూలములై - మూలమునందున్న యంకురములు గలవై యున్నవి. దాని యందు సుషుమ్నానాడి మూలాధారము మొదలుకొని బ్రహ్మరంధ్రము (సహస్రారము) వఱకు వ్యాపించియున్నది. ఆ సుషుమ్నానాడియందు మూలాధార, స్వాధిష్ఠాన, మణి పూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రము లను పేరు గల యారు చక్రములు గాని, వాని మాతృకావర్ణసంయుతములై, యోగశాస్త్రమునందు చెప్పబడిన దళములుగలవై యుండును. ఆ సుషుమ్నానాడియందు పృథివికి అధిష్ఠానదేవత, బిసతంతు తనీయసి (తామరతూడులోని దారమువలె అతిసూక్ష్మ రూపిణి); సార్ధత్రివలయ (మూడున్నరచుట్టలు చుట్టుకొని యున్న) దైన కుండలినీశక్తి (భుజంగిని) యావరణశక్తి రూపముతో అధోముఖియై త్రికోణమని చెప్పబడునట్టి పృథ్వీ శక్తియందు శిరస్సు ఉంచి, బ్రహ్మరంధ్రమునందు పుచ్ఛాగ్రము (తోకచివరిభాగము) ఉంచి నిద్రించుచుండును. ఆ కుండలినీశక్తికి కుడివైపున 'ఇడా' యను పేరు గల నాడి భ్రూమధ్యము వఱకు వ్యాపించియుండును, ఎడమవైపున 'పింగళా' యను నాడి భ్రూమధ్యము వఱకు వ్యాపించి యుండును (ఈ రెండు నాడులను గంగాయమునలని యనుట

యోగసంప్రదాయము. సుషుమ్నానాడి సహస్రారమువఱకు వ్యాపించియుండుట సిద్ధపురుషుల యనుభవము.)

కాగా, జాగ్రదవస్థలో జీవుడు నేత్రమునందు శివశక్తి మిథునీభావముతో దంపత్యాత్మకముగా ఉండునని శ్రుతి ప్రతిపాదించుచున్నది. స్వప్నావస్థలో చైతన్యము (జీవుడు) మనస్సు ఉపాధిగా గలిగియుండును. సుషుప్తియందు జీవుడు అజ్ఞానము ఉపాధిగ గలిగియుండును. ఆరీతిగా ఉన్న జీవచైతన్యము జాగ్రద్దశలో స్థూలశరీరాభిమానియై 'విశ్వ' సంజ్ఞతో వ్యవహరింపబడును, స్వప్నదశయందు సూక్ష్మశరీరాభిమానియై 'తైజస' మను పేరుతోను, సుషుప్తిస్థితిలో కారణశరీరాభిమానియైన 'ప్రాజ్ఞ' యను నామముతోను వ్యపదేశ్యమగుచుండును. (ఈ చైతన్యము అవస్థాభేదమువలన భిన్ననామములతో వ్యవహరింపబడుచున్నను, చైతన్యము మాత్రము అనుస్యూతముగా ఒకటియే యని, భిన్నము కాదని తెలియవలయును.)

సుషుప్తిలో అనగా గాఢనిద్రలో కారణాత్మరూపముతో ఉన్న యింద్రియములు స్థూలసూక్ష్మశరీరములవలన జనించునట్టియు, భోగసాధనమునైన ప్రారబ్ధకర్మవలన 'పురీతత్' అను నాడిద్వారా నాడీమార్గమున వానివాని గోళకములను ప్రవేశించును. ఊయలమీాద శయనించియున్న మహారాజు గృహాంతరమునందు సోపానమార్గముద్వారా

ప్రాసాదమున విహరించి పిమ్మట తదవచ్ఛిన్నమైన యంతఃపుర పర్యంకమునందు శయనించును. ఆరీతిగ శయనించు ప్రభువు వలె ఇంద్రియోపరమణరూపప్రారబ్ధము జాగృతమయినంతనే నాడులద్వారా 'పురీతత్'ను ప్రవేశించి, తదవచ్ఛిన్నమగు హృదయము ఉపాధిగాగలవాడునైన పరమాత్మను జేరినపుడు జీవుడు సుప్తుడని చెప్పబడును. అపుడు లింగశరీరము కారణాత్మతో విలీనమగును. అపుడు ప్రాణ, అపాన, వ్యానాదివాయువులు లయించిన వృత్తులు గలవై ఆయుస్స్వరూపముతో శరీరమును రక్షించుచుండును.

అట్లు కాగా, భావికాలమున రాబోవు జాగ్రత్, స్వాప్నావస్థలలో అనుభవయోగ్యమైన, కర్మానుబంధియైన ప్రాణమును ధరించుట సుషుప్తిలో సోపాధిక చైతన్యమునకే కనపట్టుచున్నది. ఆ చైతన్యసత్తచేతనే నాడులకుప్రాణసంచారయోగ్యతయు ప్రతీయమాన మగుచున్నది. ఈరీతిగ కాగా, "న ప్రాణేన నాపానేన..."యనుచు శ్రుతి 'ఏప్రాణియు ప్రాణ, అపానముల వలన జీవించుట లేదు, ప్రాణాపానముల కాశ్రయమైన చైతన్యమువలన ప్రాణులు జీవించుచున్నా'రని చెప్పుచుండుటవలన'జీవప్రాణధారణే' యని ధాతుపాఠమువలన ప్రాణనాడీశబ్దముచేత లక్షణయా పరమాత్మయే చెప్పబడుచున్నాడు. ఈవిధముగ కామేశ్వరునకు ప్రారబ్ధకర్మవలన కలుగునట్టి శరీరము లేకపోయినను, ఘృతకాఠిన్య (నెయ్యి పేరుకొనుట) న్యాయముతో శరీరముధరించినవాడగుటవలన

ఆయనయందు అంతర్యామిగా పరమేశ్వరి యుండుటచేత 'కామేశ్వరప్రాణనాడీ' యను నామము ప్రసక్తమైనది. కామేశ్వరప్రాణనాడి యనగా కామేశ్వరాధిష్ఠితచైతన్యము కామేశ్వరి యని పిండితార్థము.

విశే: మూలాధారాది షట్చక్రములు తత్తన్మాతృకా వర్ణశోభితములై, దళయుక్తములై యధిష్ఠాన దైవతములు గలిగి యుండు నసుట యోగసిద్ధుల యనుభవము. ఈ యారు చక్రములు పద్మములుగా దర్శనీయములు.

1) మూలాధారచక్రము- నాలుగు దళములు కలిగియుండును. వ, శ, ష, స యను వర్ణములు మాతృకలు వశిన్యాది శక్తులు గలిగి యుండును. పుష్టిశక్తియుతుడైన గణపతి యధిష్ఠానదైవము.

2) స్వాధిష్ఠాచక్రము-ఆరు దళములు గలిగి యుండును. మూలాధారమునకు బెత్తెడు పైన దీని స్థానము. బ, భ, మ, య, ర, ల అను వర్ణములు బందిన్యాదిశక్తులు కలిగియుండును. సరస్వతీబ్రహ్మలు అధిష్ఠానదైవతములు.

3) మణిపూరకచక్రము - పది దళములు కలిగి యుండును. దీనికి స్థానము నాభి. 'డ' నుండి 'ఫ' వరకు గల

వర్ణములు మాతృకలు, డాకిన్యాది శక్తులు కలిగియుండును. లక్ష్మీవిష్ణువులు అధిష్ఠాన దైవతములు.

4) అనాహతచక్రము – పన్నెండు దళములు గలిగి యుండును. దీనికి స్థానము హృదయము. 'క' నుండి 'ఠ' వరకు గల వర్ణములు మాతృకలు, కాళరాత్ర్యాది శక్తులు గలిగి యుండును. పార్వతీపరమేశ్వరులు అధిష్ఠానదైవతములు.

5) విశుద్ధచక్రము – పదునారు దళములు కలిగియుండును. దీనికి స్థానము కంఠము, 'అ' మొదలుకొని 'అః' వరకు గల వర్ణములు మాతృకలు, అమృతాదిశక్తులుకలిగి యుండును. ప్రాణశక్తిసహితుడైన జీవుడు అధిష్ఠాన దైవము.

6) ఆజ్ఞాచక్రము – రెండు దళములు కలిగియుండును. దీనికి స్థానము భ్రూమధ్యము. హ, క్ష వర్ణములు మాతృకలు, హంసవతి, క్షమావతి యను పేర్లు గల శక్తులు కలిగియుండును. ఇచ్ఛాశక్తిసహితుడైన యీశ్వరుడు అధిష్ఠానదైవము.

7) సహస్రారచక్రము - శీర్షస్థానమందు సహస్రారముండును. ఇది సహస్రదళకమలము. ఈ సహస్రారమునందు పైన యారు చక్రములలో పేర్కొనిన అకారాది క్షకారాంత వర్ణములు మాతృకలుగా ఉండును. సర్వశక్తులు ఈ సహస్రార కమలమునందు ఉండును. కామేశ్వరీకామేశ్వరులు దీని కధిష్ఠానదైవతములు.

"షట్చక్రనిరూపణ"మ్మను గ్రంథమునందు షట్చక్ర స్వరూపము చక్కగా వివరింపబడి యున్నది. జిజ్ఞాసువులైన సాధకులు ఆ గ్రంథమును పరిశీలింపనగును.

## ౨౪౫. కామేశోత్సంగవాసినీ

శం. భా. కామేశోత్సంగవాసినీ। కామేశస్య ఉత్సంగే వామాంకే వసతీతి తథా। 'అనేక మన్మథాకార కామేశో త్సంగవాసినీ' ఇతి లలితాతాపనీయే॥ ఓం కామేశోత్సంగ వాసిన్యై నమః॥

ఆం. వి. కామేశరుని యొక్క వామాంకమున అధిష్ఠించి యుండునది గావున, 'దేవి 'కామేశోత్సంగవాసినీ' యని ప్రసిద్ధురాలైనది. 'అనేక మన్మథాకార కామేశోత్సంగ వాసినీ' యని లలితాతాపనీయము చెప్పుచున్నది.

## ౨౪౬. కామేశ్వరాలింగితాంగీ

శం. భా. కామేశ్వరాలింగితాంగీ। తేన ఆలింగిత మంగీకృత మంగం యస్యాః సా తథా॥ ఓం॥ కామేశ్వరా లింగితాంగ్యై నమః॥

ఆం. వి. కామేశ్వరుని చేత అంగీకరింపబడిన శరీరము గలదగుటవలన కామేశ్వరి 'కామేశ్వరాలింగితాంగీ' యని యన్వర్థ నామముతో విరాజిల్లుచున్నది. అనగా, తనకు అంగముగానైన కామేశ్వరిశక్తిలో చైతన్యస్వరూపుడైన

కామేశ్వరుడు ప్రవేశించి లోకవ్యవహార ప్రవర్తకు డగు చున్నాడని యీ నామము వలన సూచితము.

విశే :- శివశక్తిమిథునము యొక్క, శివచక్ర, శక్తి చక్రముల యొక్క యవినాభావసంబంధ మీ నామముచే చెప్పబడినది.

"బైందవే బైందవం శ్లిష్టం అష్టారేఽష్టదళాంబుజమ్ ।
దశారయోః షోడశారం భూపురం భువనాశ్రకే॥

అని లలితాత్రిశతీ ఉత్తరపీఠికలోని శ్లోకము ఈ నామము యొక్క యర్థమునే చెప్పుచున్నది.

## ౨౪౭. కామేశ్వరసుఖప్రదా

శం. భా. కామేశ్వరసుఖప్రదా। కామేశ్వరాయ సుఖం ప్రదదాతీతి వా, కామేశ్వరస్య యత్సుఖం బ్రహ్మస్వరూప సచ్చిదానంద సాక్షాత్కారమ్, 'దేవో భూత్వా దేవా నప్యేతి' ఇతి శ్రుత్యుక్తన్యాయాత్ స్వకీయ భక్తానాం కామేశ్వరాభేదరూపం సచ్చిదానందఘనాత్మకం మోక్షం దదాతీత్యర్థః॥ ఓం కామేశ్వరసుఖప్రదాయై నమః॥

ఆం. వి. కామేశ్వరునకు ఆనందము నొసగునది గాన, కామేశ్వరి 'కామేశ్వరసుఖప్రదా' యని సంకీర్తితురాలగు చున్నది. బ్రహ్మస్వరూపము, సచ్చిదానందసాక్షాత్కార

రూపము నయిన యేసుఖము కామేశ్వరునకు గలదో, యట్టి సుఖమును పరమేశ్వరి ఒసంగునది. "దేవో భూత్వా దేవా నప్యేతి"- దేవస్వరూపుడై దేవతలను పొందును" అను శ్రుత్యుక్త న్యాయమువలన కామేశ్వరి తన భక్తులకు కామేశ్వరునితో అభేదస్వరూపముగా గల సచ్చిదానందఘనమైన మోక్షము నొసగునదని భావము.

శ్లో॥ కామేశ్వరప్రణయినీ కామేశ్వరవిలాసినీ।
కామేశ్వరతపస్సిద్ధిః కామేశ్వరమనఃప్రియా॥ ౭౮

## ౨౮౮. కామేశ్వరప్రణయినీ

శం. భా. కామేశ్వరప్రణయినీ। కామేశ్వరస్య స్వస్వరూపే పరమానందఘనే యా ప్రీతిః తద్విషయభూతేత్యర్థః॥ ఓం కామేశ్వరప్రణయిన్యై నమః॥

ఆం. వి. కామేశ్వరునికి పరమానందఘనమైన స్వస్వరూపమునందు ఏ ప్రీతి గలదో, ఆ ప్రేమకు విషయభూతురాలగుటవలన దేవి 'కామేశరప్రణయిని' యని సంస్తవనీయురాలగుచున్నది.

## ౨౮౯. కామేశ్వరవిలాసినీ

శం. భా. కామేశ్వరవిలాసినీ। కామేశ్వరస్య విలాసః కార్యాత్మనా వివర్తః అస్యా అస్తీతి తథా॥ ఓం కామేశ్వరవిలాసిన్యై నమః॥

ఆం. వి. కామేశ్వరుని యొక్క విలాసము, అనగా కార్యరూపప్రపంచముగా వివర్తపరిణామము చెందుట కామేశ్వరి యందు గలదు గాన, జగన్మాత "కామేశ్వర విలాసినీ" యని ప్రకీర్తితురాలగుచున్నది.

## ౨౫౨. కామేశ్వరతపస్సిద్ధిః

శం. భా. కామేశ్వరతపఃసిద్ధిః॥ కామేశ్వరస్య తపః జగదాలోచనాత్మకమ్, సిద్ధ్యత్యనయేతి సిద్ధిః, తపసః సాధన భూతేత్యర్థః। స్త్రీ పురుషాత్మనా కల్పితభేదవశాత్ జగత్సర్జనసాధనభూతేత్యర్థః॥ ఓం కామేశ్వరతపస్సిద్ధ్యై నమః॥

ఆం. వి. కామేశ్వరుని యొక్క జగత్సర్జనమునకు సంబంధించిన యాలోచనాత్మకమైన తపస్సు పరదేవత వలన సిద్ధించునదగుటవలనను, తపస్సునకు సాధనభూతురాలగుట వలనను దేవి "కామేశ్వరతపస్సిద్ధిః" యను నామముతో వ్యవహరింపబడును. పరమేశ్వరీపరమేశ్వరులు ఏకస్వరూపులయ్యు, కల్పితమైన స్త్రీ పురుష భేదమువలన జగన్మాత జగత్సృష్టికి సాధనభూతురాలని చెప్పబడినదని తెలియ వలయును.

## ౨౫౩. కామేశ్వరమనఃప్రియా

శం. భా. కామేశ్వరమనఃప్రియా। మనసః ప్రియా తథా, నిరవధిక ప్రేమాస్పదేత్యర్థః॥

ఆం. వి. కామేశ్వరుని మనస్సునకు ప్రియమును గలిగించున దగుటవలన దేవి "కామేశ్వరమనఃప్రియా"యని భక్తులచే స్తుతింపబడుచున్నది. పరమేశ్వరి నిరతిశయ ప్రేమాస్పదురాలని భావము.

శ్లో॥ కామేశ్వరప్రాణనాథా కామేశ్వరవిమోహినీ।
కామేశ్వరబ్రహ్మవిద్యా కామేశ్వరగృహేశ్వరీ॥ ౪౯

౨౯౨. కామేశ్వరప్రాణనాథా

శం. భా. కామేశ్వరప్రాణనాథా। కామేశ్వరస్య ప్రాణః హిరణ్యగర్భః తం నాథయతి పాలయతీతి తథా। కామేశ్వరః ప్రాణనాథో వల్లభో యస్యాః సేతి వా తథా॥ ఓం కామేశ్వరప్రాణనాథాయై నమః॥

ఆం. వి. కామేశ్వరుని ప్రాణమును, అనగా సూక్ష్మ శరీరాభిమానియైన హిరణ్యగర్భుని జగత్సర్జనసమర్థునిగా పాలించునది, శాసించునది యగుటంజేసి 'కామేశ్వరప్రాణనాథా' యని జగన్మాత స్తవనీయ యగుచున్నది. లేక కామేశ్వరుడు ప్రాణనాథుడుగా, ప్రేమాస్పదుడుగా గలది గాన, దేవి ఈ నామముతో ధ్యాతవ్య యగుచున్నది.

౨౯౩. కామేశ్వరవిమోహినీ

శం. భా. కామేశ్వరవిమోహినీ। విమోహయతి స్వయం భిన్నవిగ్రహవతీ సతీ ఆవాం దంపతీ-ఇతి ద్విప్రకారక

జ్ఞానవంతం కరోతీతి సా తథా। అభేదజ్ఞానవతః తద్విపరీత జ్ఞానవత్త్వం మోహః తత్కరోతీతి సా తథా॥

అథవా, మోహో నామ బుద్ధే రేకాలంబనతయా తదన్యవిషయకత్వమ్, పరమేశ్వరస్య స్వస్వరూప పరదేవతా పరమానంద సాక్షాత్కారేణ స్థాణువత్ నిశ్చలతయా ఉపచారేణ మోహవత్తయా తదితర-ప్రపంచాకార వృత్త్యాద్యాశ్రయతాదర్శనేన మోహయతీత్యుపచారనామ మోహవతీవేత్యర్థః। అంతఃపురగతం రాజానం స్త్రీయాఽఽసక్తమితివదిత్యర్థః॥ ఓం కామేశ్వరవిమోహిన్యై నమః॥

ఆం. వి. తాను స్వయముగా కామేశ్వరునికంటె భిన్నమైన శరీరము కలదై 'మన మిరువురము దంపతుల' మని ద్వివిధమైన జ్ఞానము కలవానినిగా చేయుచున్నది (కామేశ్వరుడు అద్వయ బ్రహ్మస్వరూపుడైనను, అపుడపుడు మాయాస్వరూపిణిగా ఆ బ్రహ్మస్వరూపము నుండి పృథగ్భూతురాలై కామేశ్వరుని గూడ మోహింపచేయునది.) గావున, 'కామేశ్వరవిమోహినీ' యని దేవి ధ్యాతవ్య యగును. అభేదజ్ఞానము గల పరమేశ్వరునకు తద్విపరీతజ్ఞానము కలుగుటే మోహము. అట్టి మోహము కలిగించున దగుటచేత దేవి 'కామేశ్వర విమోహినీ' యని స్తుతింపబడుచున్నది.

అథవా, బుద్ధి ఒక వస్తువును ఆలంబనముగా జేసికొని, తద్భిన్నమైనదానికి విషయ మగుటను మోహ మందురు.

పరమేశ్వరుని స్వస్వరూపమైన పరదేవతాపరమానందము యొక్క సాక్షాత్కారముచేత స్థాణువు వలె నిశ్చలముగా ఉన్న కామేశ్వరుడు మోహితుడుగా ఆరోపింపబడుచున్నాడు; కావున, ఆయనయందు తద్భిన్నమైన ప్రపంచకర్తృత్వాదులు కన్పడుచున్నవి. అందువలన ఆ కామేశ్వరుని కామేశ్వరి మోహింపజేయుచున్నదను ఆరోపితభావము ఈ నామము చేత సూచితము. మోహింపజేయుచున్నదానివలె ఉన్నదని యర్థము. అంతఃపురము నందున్న రాజును స్త్రీవ్యామోహితుడై యున్నాడని చెప్పినట్లు స్వస్వరూపస్థితుడై యున్న కామేశ్వరుడు కామేశ్వరీమోహితుడై యున్నాడని చెప్ప బడినదని తెలియవలయు నని భావము.

## ౨౫౮. కామేశ్వరబ్రహ్మవిద్యా

శం. భా. కామేశ్వరబ్రహ్మవిద్యా। కామేశ్వరస్య తత్త్వంపదార్థ సాక్షాత్కారభూతేత్యర్థః, 'యః సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ' 'ఇతి శ్రుతేః॥ ఓం కామేశ్వరబ్రహ్మవిద్యాయై నమః ॥

ఆం. వి. కామేశ్వరుని యొక్క బ్రహ్మవిద్య గాన, 'కామేశ్వరబ్రహ్మవిద్యా' యనబడును. అనగా తత్, త్వం, పదార్థముల యొక్క సాక్షాదపరోక్షానుభూతికి హేతుభూత మైన స్వరూపము గలది.'యః సాక్షా దపరోక్షాద్బ్రహ్మ'-

శంకర. 12 - 48]

సాక్షాత్తుగను, అపరోక్షముగను బ్రహ్మయే' యని శ్రుతి వచనతాత్పర్యము వలన పరమేశ్వరి కామేశ్వరాభిన్నయైన బ్రహ్మవిద్యాస్వరూపిణి యని భావము.

## ౨౫౫. కామేశ్వరగృహేశ్వరీ

శం. భా. కామేశ్వరగృహేశ్వరీ। గృహ్యత ఇతి గ్రహః సర్వజ్ఞానమ్. తస్య ఈశ్వరీ విషయాధిష్ఠానభూతత్వేన నియామికేత్యర్థః॥

అథవా, 'గృహిణీ గృహ ముచ్యతే' ఇతి న్యాయాత్ కామేశ్వరః గృహేశ్వరః స్వస్యాః అధిపతిః అస్యా అస్తీతి సా తథా॥ ఓం కామేశ్వరగృహేశ్వర్యై నమః॥

ఆం. వి. గ్రహింపబడుచున్నది గాన, గ్రహము, గ్రహ మనగా సర్వజ్ఞానము; పరమేశ్వరి, విషయములకు అధిష్ఠానభూతురాలై సమస్తజ్ఞానమును నియమించునదని యర్థము.

అథవా, 'గృహిణీ గృహ ముచ్యతే' – గృహిణి గృహ మని చెప్పబడు' నను వచనము ననుసరించి కామేశ్వరుడు గృహపతిగా, అనగా, తనకు అధిపతిగా గలదగుటంజేసి కామేశ్వరి, 'కామేశ్వరగృహేశ్వరీ' యని సంకీర్తిత యగుచున్నది.

శ్లో॥ కామేశ్వరాహ్లాదకరీ కామేశ్వరమహేశ్వరీ।
కామేశ్వరీ కామకోటినిలయా కాంక్షితార్థదా॥

## ౨౫౬. కామేశ్వరాహ్లాదకరీ

శం. భా. కామేశ్వరాహ్లాదకరీ। అహ్లాదః తృప్తిజన్యసుఖం పరమేశ్వరస్య నిత్యతృప్తత్వరూపా శక్తిః, పరదేవతాత్మకతయా తం కరోతీతి తథా॥ ఓం కామేశ్వరాహ్లాదకర్యై నమః॥

ఆం. వి. కామేశ్వరునకు ఆహ్లాదమును, అనగా తృప్తిజన్యమైన 'యానందమును కలిగించునది. ఆ యానందము పరమేశ్వరుని యొక్క నిత్యతృప్తత్వరూపమైన శక్తి, పరదేవతాత్మకమైన యా సుఖమును కామేశ్వరునకు కలిగించునట్టిది గావున, 'కామేశ్వరాహ్లాదకరీ' యని సంస్తుతి చేయబడుచున్నది.

## ౨౫౭. కామేశ్వరమహేశ్వరీ

శం. భా. కామేశ్వరమహేశ్వరీ। మహతీ చ సా ఈశ్వరీ నిరుపాధికైశ్వర్యవతీ, 'మహాన్ ప్రభుర్వై పురుషః' ఇతి శ్రుతేః। కామేశ్వరస్య మహదైశ్వర్యం అస్యాః అస్తీతి తథా, భగవతీత్యర్థః।

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః।
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా॥"
"తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్."
ఇతి శ్రుతేః॥

ఆం. వి. నిరుపాధికమైన ఐశ్వర్యము గలది గాన, శ్రీమహారాజ్ఞి మహేశ్వరి. 'పురుషుడు మహాప్రభు' వని శ్రుతి చెప్పుచున్నది. కామేశ్వరుని యొక్క మహదైశ్వర్యము గలదగుట వలన దేవి 'కామేశ్వరమహేశ్వరి' యనబడును, భగవతి యని భావము.

'సమగ్రమైన యైశ్వర్యము, వీర్యము, యశస్సు, సంపద, జ్ఞానము, వైరాగ్యము – ఈ యారింటికి భగ మని పేరు' అనియు 'ఈశ్వరునకు పరమ మహేశ్వరుడు' అనియు శ్రుతులు చెప్పుచుండుటవలన భగవతి 'కామేశ్వరమహేశ్వరీ' యని యర్చింపబడుచున్నది.

## ౨౫౮. కామేశ్వరీ

శం. భా. కామేశ్వరీ। మన్మథోపాసిత కాదివిద్యారూపేత్యర్థః॥ ఓం కామేశ్వర్యై నమః॥

ఆం. వి. మన్మథునిచేత ఉపాసింపబడిన కాది పంచదశీ విద్యాస్వరూపిణి యగుటవలన పరదేవత 'కామేశ్వరీ' యను నామముతో ప్రసిద్ధురాలని భావము.

## ౨౫౯. కామకోటినిలయా

శం. భా. కామకోటినిలయా। షణ్ణవతిపీఠేషు మధ్యే కామకోటిః శ్రీచక్ర మిత్యర్థః, నిలయం గృహం యస్యాః సా తథా॥ ఓం కామకోటినిలయాయై నమః॥

ఆం. వి. తొంబదియారు పీఠముల మధ్యభాగము నందున్న కామకోటి, అనగా శ్రీచక్రము తన యావాస గృహముగా కలది గాన, పరమేశ్వరి 'కామకోటినిలయా' యని భక్తగణముచేత సంకీర్తిత యగుచున్నది.

## ౨౬౦. కాంక్షితార్థదా

**శం. భా. కాంక్షితార్థదా। కాంక్షితాన్** కాంక్షావిషయీ భూతాన్; ప్రాప్త సజాతీయేచ్ఛా **కాంక్షా**; తద్గోచరాన్ పదార్థాన్ దదాతీతి తథా కాంక్షితా సతీ **ఉపాస్యదేవతా** మే ప్రసన్నా భూయా దితీచ్ఛయా చిరకాలోపాసితా సతీ పురుషార్థాన్ అప్రార్థయమానస్యాపి స్వయమేవ దదాతీత్యర్థః॥
ఓం కాంక్షితార్థదాయై నమః॥

ఆం. వి. కోరికకు విషయభూతములు గాన, కాంక్షితములు; ప్రాప్తమైన వస్తువుల యందు సజాతీయమైన యిచ్ఛ 'కాంక్ష' యనబడును. తత్కాంక్షాగోచరములైన వస్తువు నొసగునది గాన, 'కాంక్షితార్థదా' యని పరదేవత కీర్తింపబడును. ఉపాస్యదేవత ప్రసన్నురాలు కావలయు ననెడి యిచ్ఛతో చిరకాలము ఉపాసింపబడినదై ధర్మ, అర్థ, కామ, మోక్షరూప పురుషార్థములను అర్థించనివానికి సయితము స్వయముగా ఇచ్చునదని భావము. అనగా, పరమేశ్వరార్పణబుద్ధితో నిష్కామనయా ఉపాసించువారలకు

గూడ చతుర్విధ పురుషార్థములను పరదేవత యనుగ్రహించు నని తాత్పర్యము.

శ్లో॥ లకారిణీ లబ్ధరూపా లబ్ధధీ ర్లబ్ధవాంఛితా ।
లబ్ధపాపమనోదూరా లబ్ధాహంకారదుర్గమా॥ ౭౧

౨౬౧. లకారిణీ

శం. భా. లకారిణీ। తృతీయఖండ తృతీయవర్ణత్వేన వాచకతయా అస్యా అస్తీతి సా తథా॥ ఓం లకారిణ్యై నమః॥

ఆం. వి. పంచదశీమహామంత్రము నందలి తృతీయ కూట తృతీయవర్ణము పరదేవతావాచకముగా ఈ జగ న్మాతకు గలదు గాన, 'లకారరూపిణీ' యని పరదేవత యన్వర్థనామముతో నర్చనీయ యగుచున్నది.

౨౬౨. లబ్ధరూపా

శం. భా. లబ్ధరూపా। రూప్యతే జ్ఞాప్యతే ఏభిరితి రూపాణి లక్షణాని స్వరూప తటస్థభేదేన సగుణ నిర్గుణపరాణి, లబ్ధాని యయా సా తథా ।

రూప్యతే జ్ఞాప్యతే ఇతి రూపం అర్థః, ఉపలక్షణం నామ్నోఽపి, లబ్ధే నామరూపే యయా సా తథా। అదౌ స్వయం మాయోపాధినా శబ్దార్థభావ మాపద్య పశ్చాత్ వ్యాకరణ మకరోదితి భావః॥ ఓం లబ్ధరూపాయై నమః ॥

ఆం. వి. ఈ లక్షణముల చేత జ్ఞాపకము చేయబడు చున్నది గాన, రూపములు. స్వరూపలక్షణ, తటస్థలక్షణ భేదముతో సగుణ నిర్గుణరూపములు పొందియుండుట వలన శ్రీ జగన్మాత 'లబ్ధరూపా' యని స్తవనీయ యగుచున్నది.

దీనిచేత అర్థము జ్ఞాపకము చేయబడుచున్నది గాన, రూపము. ఇది నామమునకు కూడ ఉపలక్షణము: ఏ దేవి చేత నామరూపములు రెండును పొందబడి యున్నవో, యా మహేశ్వరి 'లబ్ధరూపా' యనబడును. మొట్టమొదట మాయోపాధిద్వారా శబ్దస్వరూపమును, అర్థస్వరూపమును పొంది, యనంతరము జగన్మాత నామరూపవిశేషాకృతి గల సృష్టిని చేసినదని భావము.

౨౬౩. లబ్ధధీః

శం. భా. లబ్ధధీః। నిశ్చయాత్మికాః సవికల్పనామకాః అంతఃకరణవృత్తయో ధియః, తా ఉపాధిత్వేన ప్రతిబింబాధిష్ఠానత్వేన లబ్ధా యయా సా తథా। వృత్త్యారూఢం చైతన్యం జ్ఞానమితి వా, చైతన్యవ్యాప్తా వృత్తిర్వేతి వేదాంతసిద్ధాంతః। జడానాం విషయాణాం గ్రహణే తాదృశీనాం వృత్తీనాం అసామర్థ్యే జగదాంధ్యప్రసంగేన స్వరూపచైతన్య మంతఃకరణాద్వ్యవహితం ఫలచైతన్యతయా ప్రకాశయతి। తథా చ 'బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తి రిహేష్యతే' ఇతి

న్యాయేన లబ్ధా ధీః తత్త్వమస్యాది మహావాక్యశ్రవణజన్యా వృత్తివ్యాప్తి ర్యయా సేత్యర్థః।

అథవా, ధీశబ్దేన సర్వజ్ఞత్వాదిక ముచ్యతే; తత్ లబ్ధం యయేతి వా, 'యః సర్వజ్ఞః సర్వవిత్' ఇతి శ్రుతేః॥ ఓం లబ్ధధియై నమః॥

ఆం. వి. నిశ్చయాత్మికములు, సవికల్పములు అను పేరు గల యంతఃకరణవృత్తులు ధీశబ్దవాచ్యములు. ఆ ధీవృత్తులు తన కుపాధిగా, స్వస్వరూపము ప్రతిఫలించుటకు ఆధారముగా దేవి కలిగియున్న దగుటవలన ఆమె 'లబ్ధధీః' యనబడును. వృత్త్యారూఢ చైతన్యము జ్ఞానమనిగాని, లేక చైతన్యవ్యాప్తమైన యంతఃకరణవృత్తి యని గాని యద్వైత వేదాంతసిద్ధాంతము. జడములైన విషయములను గ్రహించుటయందు ఆ వృత్తులు జడము లగుటవలన అసమర్థములు; అపుడు జగదాంధ్యము ప్రసక్తమగును; అందువలన అంతఃకరణాద్యుపహితమైన చైతన్యమును ఫలరూపచైతన్యముగా (చిదాభాసునిగా) ప్రకాశింపజేయుచున్నది. 'బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తి రపేక్ష్యతే'-'బ్రహ్మవిషయమునందు అజ్ఞానము ప్రసరించకుండుటకై వృత్తివ్యాప్తి యంగీకార్యము' అను న్యాయము చేత గురుసంనిధి యందు తత్త్వమస్యాది మహావాక్య శ్రవణము వలన కలిగిన వృత్తివ్యాప్తి పరమేశ్వరి వలన కలుగుచున్నది గావున, ఆమె 'లబ్ధధీః' యని యన్వర్థనామముతో వెలుగొందుచున్నది.

అథవా, ధీశబ్దము చేత సర్వజ్ఞత్వాదికము చెప్పబడును. దేవి యూ సర్వజ్ఞత్వాదికము కలదనియు 'యః సర్వజ్ఞః సర్వవిత్' అని శ్రుతిప్రమాణము ననుసరించి చెప్పవచ్చును.

విశే:- ప్రత్యగాత్మ పరమాత్మకంటె అభిన్నుడు. కాని, ప్రత్యగాత్మ అజ్ఞానావత్రుడై యుండును. తత్త్వ మస్యాది వేదాంత మహావాక్యశ్రవణాదుల వలన 'అహం బ్రహ్మాస్మి' యను బుద్ధివృత్తివ్యాప్తి ప్రత్యగాత్మయందు ఉండవలయును. ప్రత్యగాత్మ సహజముగా ప్రకాశస్వరూపుడు గాన, బ్రహ్మాకారకజ్ఞానము కలుగును. జడ, అనాత్మరూప ఘటాదుల జ్ఞానమునందు చిదాభాసుని వృత్తి, బుద్ధివృత్తి రెండును అపేక్షితము లగును. ప్రత్యగాత్మను ఆవరించి యున్న అజ్ఞాననాశమునకు బుద్ధివ్యాప్తి పర్యాప్తము. ప్రత్యగాత్మజ్ఞానమునకు ఉభయవిధవృత్తులు ఆవశ్యకములు కావని భావము.

## ౨౬౪. లబ్ధవాంఛితా

శం. భా. లబ్ధవాంఛితా। వాంఛాయా విషయీభూతం వాంఛిత మిష్టఫల మిత్యర్థః। లబ్ధం పూర్వమేవ ప్రాప్తం తద్యయేతి తథా। ఆప్తకామేతి యావత్॥ ఓం లబ్ధవాంఛితాయై నమః॥

శంకర. 12 - 49]

అం. వి. వాంఛకు విషయమైనది వాంఛితము, అభీష్ట ఫలమనియర్థము. వాంఛావిషయమైన వస్తువు ఈ వాంఛ కలుగక ముందే ఆ దేవియందు సిద్ధమైయున్నందున, ఆమె 'లబ్ధవాంఛితా' యని కీర్తింపబడుచున్నది పరదేవత యాప్తకామ యని తాత్పర్యము.

## 623. లబ్ధపాపమనోదూరా

శం. భా. లబ్ధపాపమనోదూరా ! పాపప్రధానాని చ తాని మనాంసి చ పాపమనాంసి, లబ్ధాని పాపమనాంసి యైస్తే। సదా పాపచింతకా ఇత్యర్థః । తేషాం దూరా అవేద్యేత్యర్థః, 'అన్యత్ర ధర్మాదన్యత్రా ధర్మా దన్యత్రాస్మాత్కృతా కృతాత్' ఇతి శ్రుతేః। తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి' ఇతి శ్రుత్యావిహితానాం తత్తద్వర్ణాశ్రమధర్మాణా మీశ్వరార్పణబుద్ధ్యా క్రియమాణానా మాత్మజ్ఞానసాధన తయా శ్రూయమాణత్వాత్ తదన్యేషాం దుఃఖప్రాప్తి సాధనత్వేన పాపవాసనాప్రధానత్వేన దురధిగమేత్యర్థః॥

ఓం లబ్ధపాపమనోదూరాయై నమః ॥

అం. వి. పాపము ప్రధానముగా గల మనస్సులు గలవారు, అనగా పాపచింతకు లని యర్థము. అట్టి పాప చింతకులకు దేవి దూరముగా నుండును; తెలియరానిదని యర్థము. 'అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మాత్' అనుచు శ్రుతి పరమేశ్వరచైతన్యము ... ధర్మముల కంటె, మనచేత చేయబడిన కర్మలు, ... గ్గ్లకంటె అతీతమైనదని

చెప్పుచున్నందున, పరదేవత 'పాపమనోదూరా' యనుట
యన్వర్థము. 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి'
ఏతాదృశమైన బ్రహ్మవస్తువును బ్రహ్మనిష్ఠులైనవారు వేదాను
వచనమువలన తెలిసికొనదలచుచున్నారు' అను శ్రుతివచనము
వలన తత్తద్వర్ణాశ్రమవిహిత ధర్మములు, ఈశ్వరార్పణ
బుద్ధితో చేయబడు కర్మలు జ్ఞానసాధనములుగా వినబడు
చున్నవి. అందువలన తద్భిన్నములైన కర్మలు, అనగా
వర్ణాశ్రమవిహితములు కాని, సకామనయా చేసిన కర్మలు
దుఃఖప్రాప్తిసాధనములు, పాపవాసనాప్రధానములు నగుట
వలన పరమేశ్వరి యా కర్మలచేత దురధిగమ. అనగా,
తెలిసికొనుటకు శక్యము గానిదని భావము.

## ౨౬౬. లబ్ధాహంకారదుర్గమా

శం. భా. లబ్ధాహంకారదుర్గమా। అహంకారోఽభి
మానః, ఉపలక్షణం తత్కార్యాణాం ఆసురసంపత్తివిశేషా
ణామ్। లబ్ధః అహంకారః రాజసతామసాత్మకః యైస్తైః
దుఃఖేనాప్యధికప్రయత్నేన క్రియమాణసాధనకలాపేన
అధిగంతుం జ్ఞాతుం అశక్యా। సత్త్వగుణాభావే దేహేంద్రి
యాదౌ సుఖప్రకాశావ్యాప్త్యా మనఃస్థైర్యాభావేన రజసః
ప్రవర్తకస్య విక్షేపకస్య తమసశ్చావరణప్రధానస్య వివేక
జ్ఞానప్రతిబంధకస్య నిద్రాలస్యాదిసముద్భవస్య కార్యేణ
జామిత్వాదిరూపేణ శ్రేయోమార్గసాధనానుష్ఠానే గురు

వేదయోః శ్రద్ధాక్షయే బాహ్యవిషయసంపాదనవ్యగ్రే మనసి లాభాలాభ హేతుక హర్షశోకజన్య రాగద్వేషపరతంత్రే అనాత్మజ్ఞాసురసంపత్తిమతాం చిత్తేన భాతీత్యాశయః । ప్రత్యుత జనన మరణ ప్రవాహరూప సంసారమేవాను భవంతి. 'తానహం ద్విషతః క్రూరాన్' ఇతి భగవద్వచనాత్ । అతో నిరభిమానరూపేణ స్వాభీష్టలాభాయ చిత్తే సదా చింతనీయేత్యర్థః । 'యతయః శుద్ధసత్త్వాః' ఇత్యాప్రమాణేభ్య ఇతి ద్రష్టవ్యమ్॥ ఓం లబ్ధాహంకారదుర్గమాయై నమః ॥

శం. భా. అహంకార మనగా అభిమానము. ఆ యభిమానము వలన జనించునట్టి తమోగుణప్రధానములైన ఆసుర సంపద్విశేషములకు అహంకారము ఉపలక్షణము. రజస్తమోగుణాత్మకమైన అహంకారము గలవారు లబ్ధాహంకారు లనబడుదురు. అట్టి యహంకారులచేత అధిక ప్రయత్నముతో చేయబడు సాధనకలాపము ద్వారా తెలిసికొనుటకు శక్యము కానిది గాన, పరదేవత 'లబ్ధాహంకార దుర్గమా' యని ప్రస్తుతింపబడును. సత్త్వగుణము లోపించినపుడు దేహేంద్రియాదులయందు సుఖప్రకాశము వ్యాపించనందున మానసిక స్థైర్యము నశించును. అందువలన రజోగుణ ప్రవర్తకమైన విక్షేపశక్తి, ఆవరణప్రధానమైన తమోగుణము, వివేకజ్ఞాన ప్రతిబంధకము, నిద్రాలస్యాది

సముద్భవము నైన దానియొక్క జామిత్వాదిరూపమైన (ఏమియుచేయక స్తబ్ధతతో నుండునట్టి) కార్యము వలన మోక్షమార్గసాధనములైన శ్రవణ మననాద్యనుష్ఠానము మీద, గురువుపైన, వేదములమీద శ్రద్ధ సన్నగిలును. ఆరీతిగ శ్రద్ధాక్షయము కాగా, బాహ్యవిషయసంపాదన యందు మనస్సు వ్యగ్రమై, లాభాలాభములు హేతువులుగా గల హర్షశోకముల వలన కలుగునట్టి రాగద్వేషములకు లోనగును. ఆవిధముగ మనస్సు రాగద్వేషపరవశము కాగా, ఆత్మజ్ఞానము లేని, తమోగుణప్రధానమైన ఆసుర సంపద గల మానవుల చిత్తమునందు పరదేవత భాసించదని యభిప్రాయము. అట్లు భాసించకపోగా, విశేషించి యా జనులు జనన, మరణ ప్రవాహరూపమైన సంసారమునే యనుభవింతురని 'తానహం ద్విషతః క్రూరాన్'-శ్రేయోమార్గమునకు శత్రువులైన యా యజ్ఞానులను సంసారసాగరముననే పడద్రోయుచున్నా'నని చెప్పునట్టి భగవద్వచనము వలన స్పష్టమగుచున్నది. కావున, అభిమానమును త్యజించిన ఉత్తమ సాధక పురుషునిచేత అతడభిలషించునట్టి సంసారబంధనివృత్తిపూర్వకము, స్వస్వరూపావగతిరూపము నగు మోక్షప్రాప్తికై చిత్తమునందు పరదేవత సదా చింతనీయ యని భావము. 'యతయః శుద్ధసత్త్వాః- అహంకార రహితులు, శుద్ధసత్త్వులు నయిన యతీశ్వరులు పరాంతకాలము నందు సంసారబంధము నుండి విముక్తులగుదురు' అని చెప్పు

నట్టి శ్రుతుల వలన పరమేశ్వరి లబ్ధాహంకారదుర్గమా' యని భావనీయురాలు.

శ్లో॥ లబ్ధశక్తి ర్లబ్ధదేహా లబ్ధైశ్వర్యసమున్నతిః ।
లబ్ధవృద్ధి ర్లబ్ధలీలా లబ్ధయౌవనశాలినీ ॥ ౧౨౧

## ౯౬౭. లబ్ధశక్తిః

శం. భా. లబ్ధశక్తిః। లబ్ధా శక్తిః సకలసామర్థ్యహేతుభూతా మాయాత్మికా యయా సా తథా, 'తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్' ఇతి శ్రుతేః । ఓం లబ్ధశక్త్యై నమః ॥

ఆం. వి. సకల సామర్థ్యములకు హేతుభూతమైన మాయాత్మికశక్తి గలదగుటంజేసి మహేశ్వరి 'లబ్ధశక్తిః'యని స్తుతింపబడుచున్నది. 'తే ధ్యానయోగానుగతా' యనుచు మహర్షులు ధ్యానయోగనిష్ఠులై సత్త్వరజస్తమోగుణముల చేత నిగూఢమైయున్న బ్రహ్మాత్మశక్తిని దర్శించి' రని శ్రుతి చెప్పుచున్నందున, పరదేవత సర్వసమర్థురాలైన మాయాత్మికశక్తి యని తెలియవలెనని భావము.

## ౯౬౮. లబ్ధదేహా

శం. భా. లబ్ధదేహా। లబ్ధాః దేహాః విగ్రహాః యయా సా తథా। స్వేచ్ఛావలంబితమూర్తిః స్మృతశాతిన్యాయేన

జీవత్వాభావేన కర్మాధీనత్వాభావాత్। తథా చ సతి అధ్యస్తమాయాశక్తేః భేదకత్వస్యాభావ్యేన 'పతిశ్చ పత్నీ చాభవతామ్' ఇతి శ్రుత్యా చ దంపతిమూర్తిమతీ బభూవే త్యభిప్రాయః॥ ఓం లబ్ధదేహాయై నమః।

ఆం. వి. కరచరణాదిరూప దేహము గలది గాన, దేవి 'లబ్ధదేహా' యని కీర్తింపబడుచుండును. ఘృతకాఠిన్య న్యాయము ననుసరించి జీవత్వ, కర్మాధీనత్వములు లేనందున తన యిచ్ఛామాత్రముతో శరీరమును ధరించిన దని భావము. కాగా, అధ్యస్త మాయాశక్తికి (భ్రాంతితో ఆరో పితమైన మాయాశక్తికి) భేదకత్వము సహజము. అందు వలన 'పతిశ్చ పత్నీ చాభవతామ్'-పతియు, పత్నియు నైన వారు' అను శ్రుతివలన గూడ దంపతీరూపమైన శరీరము ధరించినదాయె నని భావము.

## ౨౯౯. లబ్ధైశ్వర్యసమున్నతిః

శం. భా. లబ్ధైశ్వర్యసమున్నతిః। ఐశ్వర్యాణాం సము న్నతిః ఆధిక్యం పర్యవసాన మిత్యర్థః। లబ్ధా ఐశ్వర్యసమున్నతిః యయా సా తథా, 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్' ఇతి శ్రుతేః, 'నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప' ఇతి స్మృతేశ్చ, 'ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యామ్యేష యోనిః సర్వస్య' ఇతి శ్రుతౌ నిరుపాధిక

మహదైశ్వర్యసంపత్తేః తదుపాసకానా మగస్త్యాది మహర్షీణాం దర్శనాత్ తదీయ మహదైశ్వర్యస్య నిరవధికత్వమితి కిము వక్తవ్యమితి జ్ఞాయతే ఇత్యభిప్రాయః॥ ఓం లబ్ధైశ్వర్యసమున్నత్యై నమః॥

తా. వి. ఐశ్వర్యముల యాధిక్యము, పర్యవసానము ఐశ్వర్యసమున్నతి; ఐశ్వర్యసమున్నతి గలది గాన, శ్రీమహారాజ్ఞి 'లబ్ధైశ్వర్యసమున్నతిః' యని సంకీర్తింపబడును. 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరమ్'-ఈశ్వరులలో పరమ మహేశ్వరుని సేవింపు'మనియు, 'నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనామ్ పరంతప'-నా దివ్యానుభూతుల కంతము లే'దనియు శ్రుతిస్మృతుల వలన తెలియుచున్నది. 'ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞః' యనుచు 'ఈయన సర్వేశ్వరుడు, ఇతడు సర్వజ్ఞుడు; ఇతడు అంతర్యామి, ఇతడు సర్వకారణము' అని చెప్పునట్టి శ్రుతియందు నిరుపాధికమైన మహదైశ్వర్యసంపదుపాసన చేయునట్టి యగస్త్యాది మహర్షులకు తన్మహదైశ్వర్యసంపద కన్పడుచున్నది. అందువలన ఆ పరమేశ్వరి యొక్క మహదైశ్వర్యము నిరవధికమని విశేషించి యేమి చెప్పనగునని కైముత్యన్యాయముతో తెలియవలయునని యాశయము.

## ౨౭౦. లబ్ధవృద్ధిః

శం. భా. లబ్ధవృద్ధిః। వృద్ధిర్నామ వ్యాప్తిః పరిపూర్ణతేత్యర్థః; అవయవోపచయాత్మికా న, తస్యాః కర్మజన్యత్వేన వినాశహేతుత్వాత్; 'స వా ఏష మహా నజ ఆత్మా న వర్ధతే కర్మణా' ఇతి శ్రుతివచనాత్; 'నిష్క్రియం నిష్కలం' ఇతి అవయవమాత్రనిషేధాచ్చ; తథాచ లబ్ధవృద్ధిః సర్వవ్యాపకతా స్వస్వరూపైవ సతీ ఉపాధిభి ర్జన్యై స్తదాశ్రయభూతైః అభివ్యజ్యతే। నత్వవిద్యామానారోపితా ఇతి నిష్కర్షార్థః॥ ఓం లబ్ధవృద్ధ్యై నమః॥

ఆం. వి. వృద్ధి యనగా వ్యాప్తి, పరిపూర్ణత్వ మని యర్థము. అవయవవికాసరూపమైన పరిపూర్ణత్వము గాదు. ఏలన, తాదృశమైన యవయవవికాసము కర్మజన్య మగుట చేత వినాశహేతువగును. 'స వా ఏష మహా నజ ఆత్మా న వర్ధతే కర్మణా'- ఈ యాత్మ యతిశయమైనది, జన్మ లేనిది, కర్మవలన వృద్ధిపొందునది గాదు' అను శ్రుతి వలన, 'నిష్క్రియం నిష్కలమ్'-'ఆత్మ నిష్క్రియము, అవయవ విభాగము లేనిది' యనుచు అవయవమాత్రనిషేధము శ్రుతి చెప్పుచుండుటవలన; కాగా, పరదేవత సర్వవ్యాపకత్వ రూపమైనస్వస్వరూపమే కలదై యుపాధిజన్యములు, తదుపాధికి ఆశ్రయభూతములైన కరణముల (ఇంద్రియముల) ద్వారా

యభివ్యక్త యగుచున్నది. పరమేశ్వరీస్వరూపము అవిద్యమానము, ఆరోపితము నైన వృద్ధి కాదని సారభూతమైన భావము.

## ౨౭౧. లబ్ధలీలా

శం. భా. లబ్ధలీలా। లీలాః అన్యప్రయోజనార్థ వ్యాపారాః స్వహర్ష మాత్రహేతుకా వా తత్తత్కాలోచిత శృంగారాది నవరసాంగీకారసమయే తదుచిత భంగివిశేషా వా లబ్ధా యయా సా తథా॥ ఓం లబ్ధలీలాయై నమః॥

ఆం. వి. అన్యప్రాణుల ప్రయోజనము నిమిత్తము చేయు కార్యవిశేషములు, లేక కేవల స్వకీయానందమునకు హేతువులైన వ్యాపారములు లీలాశబవాచ్యము లగును ఆ యా కాలములకు తగిన శృంగారాది నవరసములను అంగీకరించు సమయమునందు ఆ యా రసముల కనుగుణమైన భంగివిశేషములు కలది గావున, దేవి 'లబలీలా' యని సంకీర్తితురా లగుచుండును.

## ౨౭౨. లబ్ధయౌవనశాలినీ

శం. భా. లబ్ధ యౌవనశాలినీ। అస్తిత్వ, జనన, వర్ధన భావవికారావస్థా బాల్యమ్; పరిణామః అపక్షయో నాశః ఉత్తరావస్థా జరా, దేహాభావేన తదుభయనిషేధే అర్థాత్ యౌవనమ్, యాతి గచ్ఛతీతి యువా దృఢబలవీర్యః, తస్య

భావః యౌవనం, తదుభయ వయోఽవస్థారాహిత్యేన ఏకైకస్వరూపతా; తల్లబ్ధం ప్రాప్తం యౌవనం యయా సా తథా; 'అజరోఽమృతోఽభయో బ్రహ్మ' ఇతి శ్రుతేః సర్వదా ఏకస్వరూపవతీతి భావః॥ ఓం లబ్ధయౌవనశాలిన్యై నమః॥

౨౦. వి. అస్తి, జాయతే, వర్ధతే-ఉన్నది, పుట్టుచున్నది, వృద్ధిపొందుచున్నది - ఏతద్రూపమైన భావవికారదశ బాల్యదశయనబడును; పరిణమతే, అపక్షీయతే, నశ్యతి-పరిణామము చెందుచున్నది, క్షయము నొందుచున్నది, నశించుచున్నది - ఏవంవిధమైన జీవితము యొక్క తరువాతి దశ వార్ధకము, పరమేశ్వరికి దేహము లేనందున, బాల్య, వార్ధకములు నిషిద్ధములు కాగా, అర్థాత్తు యౌవనము సిద్ధించుచున్నది. 'యాతి గచ్ఛతీతి యువా'-నడచుచున్నాడు గాన 'యువా' యనబడును; దృఢబలవీర్యసంపన్నుడని యర్థము. యువా ధర్మము యౌవనము. అది బాల్య, వార్ధకము లనెడి యవస్థా విశేషములు రెండును లేకపోవుటవలన సర్వదా ఏకస్వరూపముతో నిర్వికారముగా ఉండును; తాదృశమైన యౌవనము సదా త్రిపురసుందరి యందు గలదు. అనగా షడ్భావవికార రహితము, ఏకరూపము, సహజస్వరూపము నయిన యౌవనము గలది, 'అజరోఽమృతోఽభయో బ్రహ్మ' - బ్రహ్మ జరా రహితము, అమృతము (జన్మలేనిది గాన, అమృతము) భయ రహితము' అని శ్రుతి చెప్పుచున్నందున, పరబ్రహ్మాభిన్న

యైన పరమేశ్వరి ఏకస్వరూపశాలినియై విలసిత యగుచున్న దని భావము.

శ్లో॥ లబ్ధాతిశయసర్వాంగసౌందర్యా లబ్ధవిభ్రమా ।
లబ్ధరాగా లబ్ధపతి ర్లబ్ధనానాగమస్థితిః ॥

## ౨౭౩. లబ్ధాతిశయసర్వాంగసౌందర్యా

శం. భా. లబ్ధాతిశయసర్వాంగసౌందర్యా । సుందరో రుచిరః తస్య భావః సౌందర్యమ్, అవయవానాం సర్వేషాం సౌందర్య మతిశాయి, సర్వాంగేషు సర్వావయవేషు లబ్ధం యయా సా తథా; యథాశాస్త్రోక్తావయవ విన్యాసవి శేషత్వేన సర్వమనోహారమూర్తి మతిత్యర్థః, 'న తస్య ప్రతిమాఽస్తి' ఇతి శ్రుతేః॥ ఓం లబ్ధాతిశయసర్వాంగ సౌందర్యాయై నమః॥

ఆం. వి. సుందరము, రుచిరమైనదాని భావము సౌంద ర్యము, సర్వావయవములందలి సౌందర్య మతిశయించినది గాన, 'అతిశయసర్వాంగసౌందర్యా' యగును. సర్వాంగముల యందు సౌందర్యాతిశయము గలది గాన, శ్రీరాజరాజేశ్వరి 'లబ్ధాతిశయసర్వాంగసౌందర్యా' యనుచు స్తవనీయురాలగు చున్నది. సాముద్రికశాస్త్రములో చెప్పినరీతిగా అవయవ సంగఠనము కలదగుటంజేసి సర్వ మనోహరమూర్తి యని

భావము. 'న తస్య ప్రతిమాఽస్తి'-ఆ బ్రహ్మవస్తువు నిరుపమము' అను శ్రుతివచనము వలన పరమేశ్వరి ముగ్ధమోహన సౌందర్యము గలదని స్పష్టమగుచున్నది.

## 284. లబ్ధవిభ్రమా

శం. భా. లబ్ధవిభ్రమా। విభ్రమో బాలక్రీడా లబ్ధా యయా సా తథా; సర్వాత్మకతయా సర్వకర్తృత్వాదితి భావః॥ ఓం లబ్ధవిభ్రమాయై నమః॥

ఆం. వి. విభ్రమ మనగా, బాలక్రీడ; ఆ బాలక్రీడ దేవియందు గన్పట్టును. కావున, దేవి 'లబ్ధవిభ్రమా' యని ప్రకీర్తితురాలగుచున్నది. ఆ జనని సర్వాత్మిక, సర్వకర్త్రి యగుటవలన, బాలవిచేష్టితమైన క్రీడ గూడ మాతృస్వరూపమే యని భావము.

## 285. లబ్ధరాగా

శం. భా. లబ్ధరాగా। లబ్ధః సజాతీయో రాగః కామః, 'సోఽకామయత' ఇతి శ్రుత్యా జగత్సర్జనస్య కామనాపూర్వకత్వ ప్రతిపాదనాత్; లబ్ధో రాగో యయా సా తథా ఇత్యర్థః ॥ ఓం లబ్ధరాగాయై నమః॥

ఆం. వి. సజాతీయమైన రాగము - కామము గలది గాన, దేవి 'లబ్ధకామా' యని కీర్తింపబడును. 'సోఽకామ

యత' యను శ్రుతిచేత పరమేశ్వరుడు ఇచ్ఛాపూర్వకముగా ప్రపంచసృష్టి చేసెనని ప్రతిపాదింపబడుచున్నందున పరమేశ్వరి 'లబ్ధరాగా' యని ప్రస్తూయమాన యగుచున్నదని భావము.

౭౩౬. లబ్ధపతిః

శం. భా. లబ్ధపతిః। లబ్ధః స్వేచ్ఛయైవ స్వయంవరే పతిః కామేశ్వరో యయా సా తథా ॥

ఆం. వి. స్వయంవరమునందు తన యిచ్ఛానుసారము కామేశ్వరదేవుని వరించిన దగుటవలన కామేశ్వరి 'లబ్ధపతిః' యని గుణసంకీర్తనము చేయబడుచున్నది.

౭౩౭. లబ్ధనానాగమస్థితిః

శం. భా. లబ్ధనానాగమస్థితిః। ఆ సమంతాత్ నానా ప్రకారైః కర్మోపాసనా జ్ఞానకాండ తదంగత్వాదిభిః గమయంతి స్వార్థాన్ ప్రకాశయంతీత్యాగమాః వేదాః అనేకశాఖా ప్రభిన్నా నామాదయః తేషాం స్థితిః పరిపాలనం లబ్ధా యయా సా తథా।

నానాగమస్థితిః వేదచతుష్టయోక్త మర్యాదా కాండ త్రయవిషయా లబ్ధా యయా సేతి వా।

సంసారస్యానాదిత్వేన నిరపేక్ష ప్రమాణభూతాన్ వేదాన్ 'సర్వే వేదా యత్రైకం భవంతి' ఇతి శ్రుతేః

స్వస్వరూపభూతాన్ మహాప్రలయే సంరక్ష్య సర్గాదౌ జాయమాన హిరణ్యగర్భస్య అన్యూనా..తిరేకేణ తానేవ ప్రతిభాపయతి స్వయం దంపతీ భూత్వా తదుక్తధర్మా ననుష్ఠాయ సర్వేషా మప్యనుష్ఠాపయతీతి చ। 'వేదశాస్త్రే మమైవాజ్ఞే', 'వర్త ఏవ చ కర్మణి యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః। ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్॥' ఇత్యాది భగవద్వచనాదితి ద్రష్టవ్యమ్। ఓం లబ్ధనానాగమస్థిత్యై నమః॥

ఆం. వి. సమగ్రముగా నానావిధములైన కర్మ, ఉపాసనా, జ్ఞానరూప కాండత్రయము, తదంగభూతములు మున్నగువానిచేత తమ యర్థములను ప్రకాశింపజేయునవి గాన, ఆగమములు. అనేకశాఖలతో నొప్పారు సామాది వేదపరిపాలనము గలదగుటంజేసి సర్వజ్ఞయైన పరమేశ్వరి 'లబ్ధనానాగమస్థితిః' యని ధ్యాతవ్య యగుచున్నది.

అథవా, నానాగమస్థితిః అనగా ఋగ్యజు స్సామాథర్వణము లను నాలుగువేదములచేత ఉపదిష్టమైన కర్మ, ఉపాసనా, జ్ఞానరూపమైన కాండత్రయమునకు విషయభూతమైన మర్యాద గలదగుటంజేసియు '.బ్ధనానాగమస్థితిః' యను నామముతో ప్రఖ్యాతమైనది.

లేక, సంసారము అనాది యగుటవలన, 'సర్వే వేదా యత్రైకం భవంతి' – సర్వ శ్రుతులు బ్రహ్మావస్థనును

ప్రతిపాదించుటలో ఏక మగుచున్నవి' – అను శ్రుతి వలన ప్రమాణాంతరాపేక్ష లేని, స్వస్వరూపభూతములైన వేదములను మహాప్రళయకాలమున పరమేశ్వరుడు లేక పరమేశ్వరి రక్షించును; ఆ రీతిగ రక్షించి సృష్ట్యారంభమునందు ఆవిర్భవించనున్న హిరణ్యగర్భబ్రహ్మకు అన్యూనాతిరిక్తముగ – యథాతథముగ ప్రతిభాసింపజేయును; ఇంతియేగాక, స్వయముగ దంపతీభావము పొంది, వేదోక్తధర్మములను అనుష్ఠించి యితరులచే గూడ అనుష్ఠింపజేయునదియు నగుటవలన దేవి, పై నామముతో సంకీర్తింపబడును. 'వేదశాస్త్రాణి మమైవాజ్ఞా – వేదశాస్త్రములు నా యనుశాసనములు', 'వర్త ఏవ చ కర్మణి, నేను కర్మయందు ప్రవర్తించుచునేయున్నాను', 'నేను అలసుడనై కర్మయందు ప్రవర్తించకపోయిన, ఈ లోకము లన్నియు వినష్టములై పోవును' మున్నగు భగవద్వచనముల వలన పరమేశ్వరియు వేదచోదిత కర్మానుష్ఠానము చేయునని తెలియవలయును.

శ్లో॥ లబ్ధభోగా లబ్ధసుఖా లబ్ధహర్షాభిపూరితా ।
హ్రీంకారమూర్తి ర్హ్రీంకారసౌధశృంగకపోతికా ॥

౨౭౮. లబ్ధభోగా

శం. భా. లబ్ధభోగా । భోగః సుఖమాత్రానుభవః, దుఃఖానుభవే ఉచ్యమానే జీవావిశేషప్రసంగాత్ । లబ్ధః భోగః యయా సా తథా । జీవవత్ క్రమికేష్ట పదార్థ

భవానంతరకాలీనం సుఖం న భవతి, స్వస్యా ఆనందరూప త్వేన సిద్ధస్వరూపత్వాత్, సాధనభూతభోగోఽపి ఏత ద్విషయే సిద్ధ ఇత్యుపచర్యతే ఇతి లబ్ధభోగేత్యుచ్యతే॥ ఓం లబ్ధభోగాయై నమః॥

ఆం. వి. కేవల సుఖానుభవము భోగ మనబడును. దుఃఖానుభవముగూడ భోగ మని చెప్పిన, జీవసామాన్యము ప్రసక్తమగును. అందువలన సుఖమాత్రానుభవ మని చెప్ప బడినది. తాదృశమైన కేవల సుఖరూపము గలది గాన, పరదేవత 'లబ్ధభోగా' యని స్తుతింపబడుచున్నది. పరదేవత ఆనందస్వరూపిణిగా సిద్ధయై యుండుటవలన, సాధారణజీవు నకు వలె క్రమప్రాప్తమైన, తన కిష్టమైన పదార్థములను అనుభవించిన తరువాత కలిగెడి సుఖము కాదు, సుఖసాధన మైన భోగము కూడ పరమేశ్వరి యందు సిద్ధమై యున్నదని లక్షణయా తెలియనగును. ఆమె సహజసుఖస్వరూపిణి యని భావము.

## ౨౭౮. లబ్ధసుఖా

శం. భా. లబ్ధసుఖా। లబ్ధం సుఖం అనుకూలవేదనీయం స్వస్వరూపభూతం సుఖం తత్సాధనం చ ధర్మః యయా సా తథా। ఓం లబ్ధసుఖాయై నమః॥

శంకర. 12 - 51]

ఆం. వి. అనుకూలవేదనీయమైన, స్వస్వరూపభూత మైన సుఖము, (ఆనందము, విషయ జన్యసుఖము గాదు.) ఆ సుఖమునకు సాధనమైన ధర్మము పొందియున్నది గావున, శ్రీలలితాదేవి 'లబ్ధసుఖా' యని కీర్తింపబడును.

## ౨౮౦. లబ్ధహర్షాభిపూరితా

శం. భా. లబ్ధహర్షాభిపూరితా। లబ్ధః యో హర్షః తృప్తినిమిత్తకచిత్తోల్లాసవిశేషః ముఖప్రసాద శరీరపుష్ట్యాది కార్యోన్నేయః జగత్యాం స్వాభీష్టపదార్థానుభవాదిజన్యః సంతోష ఇతి ప్రసిద్ధః; తేనాభిపూరితా అభితః సమంతా దన్యూనానతిరేకేణ అవిచ్ఛిన్నతయా పూరితా భరితా। తద్విపరీత దుఃఖాద్యనుత్పాదేన తన్మాత్రసమాశ్రయా నిత్య ప్రసన్నముఖీత్యర్థః॥ ఓం లబ్ధహర్షాభిపూరితాయై నమః ॥

ఆం. వి. భోగము వలన తృప్తి కలిగినపుడు మనస్సుకు కలుగునట్టి వికాసాతిశయము హర్ష మనబడును; అది ముఖ వికాసము, శారీరకమైన పుష్టి మొదలగువానిచేత ఊహింప దగినది; ప్రపంచములో ఇష్టవస్తుభోగానుభవము వలన కలుగు సంతోషము; ఆ హర్షముతో – సంతోషముతో అన్యూనానతిరిక్తముగా, ఎక్కువ తక్కువలు లేకుండగా, అవిచ్ఛిన్నముగా నిండియున్నది. ఆ హర్షమునకు వ్యతిరిక్తము లయిన దుఃఖాదులు లేకపోవుటవలన కేవల హర్షమున

కాశ్రయభూతురాలు నిత్యప్రసన్నముఖి యగుటవలన జగన్మాత 'లబ్ధహర్షాభిపూరితా'యని భజనీయురాలగుచున్నది.

## ౨౮౧. హ్రీంకారమూర్తిః

శం. భా. హ్రీంకారమూర్తిః వాచ్యవాచకభేద సంబంధేన హ్రీంకారః మూర్తిః విగ్రహో యస్యాః సా తథా॥ ఓం హ్రీంకారమూర్త్యై నమః॥

ఆం. వి. హ్రీంబీజము పంచదశీమహామంత్రములోని తృతీయకూట చతుర్థవర్ణము. వాచ్యవాచకభేదముతో హ్రీంకారము శరీరముగా గలదగుటంజేసి శ్రీలలితాత్రిపుర సుందరి 'హ్రీంకారమూర్తిః' యని సాధక భక్తులచేత సంకీర్తింపబడుచున్నది.

## ౨౮౨. హ్రీంకారసౌధశృంగకపోతికా

శం. భా. హ్రీంకారసౌధశృంగకపోతికా। సుధామయం సౌధమ్, సుధావికారః అట్టాలికేత్యర్థః। తస్య శృంగం శిఖరం చంద్రశాలాది భిత్త్యుపరిభాగః; నిరుపాధిక విశ్రాంతిజన్య సుఖానుభవహేతుతయా హ్రీంకారస్య సౌధోపమా; తత్ర హకారస్య శ్వేతవర్ణతయా అట్టాలికాసాదృశ్యమ్; రేఫస్య లోహితరూపతయా ఇష్టకాదికృత అధోభిత్త్యుపమా; హకారోపరి ఈకారస్య శృంగోపమా ఊర్ధ్వగత్వసామ్యాత్,

తదుపరితన బిందుః సర్వప్రకృతిభూత శబ్దార్థాత్మకతయా తదవయవత్వేన విచిత్రస్వరూపోఽపి సూక్ష్మతయా అపవరకగత కపోతకాంతేవ జాగరూకః దృశ్యత ఇతి తదర్థత్వేన పరదేవతోపమానశబ్దేన అభిధీయత ఇతి భావః॥ ఓం హ్రీంకారసౌధశృంగకపోతికాయై నమః॥

ఆం. వి. సుధ యనగా అమృతము, సున్నము. సుధము (సున్నముతో) కట్టబడినది సౌధము. అనగా గోపుర మని యర్థము. ఆ సౌధముయొక్క శిఖరము చంద్రశాలాదుల యొక్క గోడ పైభాగము. ఉపాధిరహితమైన విశ్రాంతి వలన కలుగునట్టి సుఖానుభవమునకు హేతు వగుటచేత హ్రీంకారము సౌధముతో పోల్చబడినది. ఆ హ్రీంకారము లోని 'హ' కారము శ్వేతవర్ణము గలదగుటవలన అట్టాలికతో సాదృశ్యము చెప్పబడినది. 'ర' కారము ఎఱ్ఱని రంగు గల దగుటచేత ఇటుకలతో నిర్మింపబడిన క్రింది గోడతో ఉపమితమైనది. హాకారము పై నున్న ఈకారము పైకి వ్యాపించి యుండుట యను సామ్యము వలన శిఖరముతో పోలిక చెప్పబడినది. ఆ ఈకారము మీద ఉన్న బిందువు (౦) సర్వప్రకృతికి నిమిత్తమైన శబ్దార్థములు స్వరూపముగా గలది, శబ్దార్థముల కవయవభూతమైనది. తాదృశమైన బిందువు సౌధోపరి కుడ్యచ్ఛిద్రము (రంధ్రము) నందుండు కపోతకాంత (ఆడుపావురము) వలె విచిత్ర స్వరూపము గలదయ్యు సూక్ష్మ

రూపముతో నిత్యజాగరూకమై కన్పట్టునని తదర్థప్రతిపాదకమైన పరదేవతకు సంబంధించిన ఉపమానశబ్దముగా చెప్పబడుచున్నదని భావము.

విశే :- కపోతకాంతతో పోల్చబడిన బిందువు లేక అనుస్వారము పరమేశ్వరీస్వరూపమని తెలియవలయును. అనుస్వారము ప్రాణరూపము, సౌధోపరి కుడ్యాగతమైన ఛిద్రము (రంధ్రము) తత్రస్థయైన కపోతికను చెప్పుటతో బాటు, చిత్రభిత్తిపై నిలబడియున్న సౌధమునంతటికి పరిచాయకముగా ఉండును. ఆరీతిగనే హ్రీం బీజమునందలి బిందువు హాకార, రేఫ, ఈకారవాచ్యమైన యావదర్థమును తెలియజేయుచుండు నని భావము, సుధావికారము సౌధముగాన, సౌధశబ్దము సహస్రారస్థమైన యమృతమునకు వాచకమనియు, హ్రీంకారసౌధశృంగ మనగా బ్రహ్మరంధ్ర మనియు ఉపాసకశ్రేష్ఠుల యనుభవము. ఆ శృంగాగ్రమునందు 'శివేన సహ మోదతే' యనినట్లు సదాశివునితో ఆనందస్వరూపిణియై యుండు సదాశివకుటుంబినియే 'హ్రీంకారసౌధశృంగకపోతికా' యని భక్తజనులచేత నిరంతరము ధ్యాయమాన యగుచున్నదని భావము.

శ్లో॥ హ్రీంకారదుగ్ధాబ్ధిసుధా హ్రీంకారకమలేందిరా।
హ్రీంకారమణిదీపార్చి ర్హ్రీంకారతరుశారికా॥ ౨౩

శం. భా. హ్రీంకారదుగ్ధాబ్ధిసుధా। దోహో స్మిష్పన్నం దుగ్ధమ్। స్తనగతస్య పయసః స్వీయతాపాదన హస్తక్రియా విశేషో దోహః। ఉపలక్షణం చూషణాదీనామ్, తథాచ ప్రదీపాలంకారః సిద్ధః। అనంతోదకప్రసారిత నిమ్నభూప్రదేశః అబ్ధి రుచ్యతే। ఆపః ధీయంతే అస్మిన్నితి తథా। తస్మిన్ సంజీవకత్వం ధర్మః, డింభకసంజీవనే స్తన్యాదౌ దర్శనాత్। హ్రీంకారస్యాపి హకారయుక్తతయా శ్వేతవర్ణత్వా దమృత హేతోశ్చ తత్సాదృశ్యమ్। తస్య సుధేవ సుధా తదభి వ్యక్తత్వావిశేషాత్ తత్సేవకానాం నిత్యత్వే సతి బహువిధ మహిమశాలితయా దర్శనాదితి భావః॥ ఓం హ్రీంకార దుగ్ధాబ్ధిసుధాయై నమః॥

ఆం. వి. దోహనము వలన లభించునది గాన దుగ్ధము. అనగా క్షీరము. స్తనగతమైన క్షీరమును పొందుటకై చేయ బడు హస్తక్రియావిశేషమును దోహన మందురు. చూష ణాదులకు (పాలు కుడుచుటకు) గూడ ఇది యుపలక్షణము; కాగా, ప్రదీపాలంకారము సిద్ధమైనది.

అనంతజలప్రసారితమైన నిమ్నభూభాగమును 'అబ్ధి' యందురు. జలము దీని యందు నిండియుండును గాన, ఇది యబ్ధి (సాగరము) యనబడును. శిశుసంజీవక (శిశువును పోషించునట్టి) ధర్మము స్తన్యాదులందు గన్పట్టుచున్నది; అటులనే యీ జలరాశియందును తన నాశ్రయించినవారిని

జీవింపజేయునట్టి ధర్మమున్నది. హ్రీంకారము గూడ హాకార యుక్తము, ధవళిమ గలదగుటవలన, మోక్షరూపమైన యమృతప్రాప్తికి హేతువు నగుటవలన క్షీరసాగరముతో పోల్చబడినది: క్షీరసాగరమును మథించగా అమృత మావిర్భవించినది. ఆరీతిగనే, హ్రీంకార నిరంతరజపము, తదర్థ మననము వలన సుధావిశేషముగ పరమేశ్వరి యభివ్యక్తయై భక్తులకు అమృతత్వసిద్ధిని ప్రసాదించును; అందుచేత భక్తుల యందు నిత్యమైన బహువిధమహిమశాలిత్వము కన్పడుచున్న దని భావము. ఏవంవిధమైన సుధాస్వరూపిణి గాన, జగజ్జనని 'హ్రీంకారదుగ్ధాబ్ధిసుధా' యనుచు భక్తులచే గానము చేయ బడుచున్నది.

శం. భా. హ్రీంకారకమలేందిరా। హ్రీంకారబీజస్య విచిత్రవర్ణతయా పరమప్రీతివిషయతయా చ కమలోపమా। తస్య వాచ్యార్థతయా తదుపరితనత్వేన సర్వపురుషార్థ ప్రదాతృత్వాచ్చ కమలశబ్దేన అభిధీయతే। తస్యాః పద్మాలయత్వాత్ హ్రీంకారకమలస్య ఇందిరా తదధీన బ్రహ్మవిద్యేత్యర్థః ॥ ఓం హ్రీంకారకమలేందిరాయై నమః ॥

ఆం. వి హ్రీంకారము విచిత్రవర్ణశోభితము, పరమ ప్రేమకు - పరమభక్తికి విషయము నగుటచేత కమలముతో పోల్చబడినది. హ్రీంబీజము యొక్క వాచ్యార్థము స్వరూపముగా గల పరదేవత యా హ్రీం బీజమును అధిష్ఠించి

సర్వపురుషార్థములను ఒసగు మహాలక్ష్మీస్వరూపిణి యగుట చేత ఆ హ్రీంబీజము కమల మని చెప్పబడును. ఆ పరమేశ్వరి, పద్మము ఆవాసస్థానముగా గలదగుటంజేసి యామె హ్రీంకారకమలమునకు లక్ష్మి, అనగా హ్రీంకారాధీనమైన బ్రహ్మవిద్యాస్వరూపిణి యని భావము. కావున, ఉపాసకులు 'హ్రీంకారకమలేందిరా' యని యానందపరవశులై నామ సంకీర్తనము చేయుచుందురు.

## ౨౮౫. హ్రీంకారమణిదీపార్చిః

శం. భా. హ్రీంకారమణిదీపార్చిః। ఆధిదైవికాద్యుపద్రవానభిభూతత్వే సతి చిరకాలావస్థాయిత్వం మణిదీపసాదృశ్యం హ్రీంకారస్య। తస్య ప్రకాశః అనితరసాధారణ మహాతిశయవత్త్వేన అనర్ఘత్వమావేదయతి। తదుపాసకస్య నిరవధిక మహత్త్వాపాదక హ్రీంకారవాచ్యతయా తత్ప్రకాశకేత్యర్థః। తథాచ నిరంతర తమోఽపాకరణేన స్వేష్టపదార్థాపాదనేన చ సుఖయతీతి ఫలితోఽర్థః॥ ఓం హ్రీంకారమణిదీపార్చిషే నమః॥

ఆం. వి. ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికములైన యుపద్రవములచేత అభిభూతము (తిరస్కృతము) కాక, చిరకాలము ఏకరూపముతో నుండుటవలన హ్రీంకారమునకు మణిదీపసాదృశ్యము చెప్పబడినది. ఆ మణిదీపము యొక్క ప్రకాశము అనితరసాధారణమైన మహత్త్వాతిశయము గల

దగుటచేత అమూల్య మని తెలియవలయును. తాదృశ మహిమోపేతమైన హ్రీంకారమును ఉపాసించువారలకు నిరవధిక (అపరిమిత) మహత్త్వమును చేకూర్చునట్టి హ్రీంకారవాచ్యార్థము స్వరూపముగా గలదగుటచేత పరదేవత తదర్థమును ప్రకాశింపజేయుచుండునని యర్థము. కాగా, నిరంతరము ఆవరించియున్న యజ్ఞానాంధకారమును తొలగించుట ద్వారా భగవతి భక్తుల కభీష్టపదార్థమైన మోక్షరూపఫలము నొసగి నిరతిశయానందసంధాయిక యని సారాంశము. కావున, 'హ్రీంకారమణిదీపార్చిః' యను సార్థకనామముతో శ్రీలలితాపరాభట్టారిక భక్తులచే స్తూయమాన యగుచున్నది.

## ౨౮౬. హ్రీంకారతరుశారికా

శం. భా. హ్రీంకారతరుశారికా। తారయతి ఫలార్థినః స్వారూఢాన్ పతనాదేః రక్షతీతి తరుః, తస్య శారికా పింగతుండ నేత్ర చరణా శారికా అభ్యాసాతిశయేన మనుష్యభాషాయామపి భాషతే। భూత భవిష్యద్వర్తమాన లోకయాత్రాపరిజ్ఞాత్రీ సతీ శుభాశుభఫలప్రాప్తించ స్వభావయా వదతి। అస్య బీజస్య వాచ్యార్థతయా తత్సంబంధినీ సతీ వేదవాచా సర్వంప్రకాశయతీత్యర్థః ॥ ఓం హ్రీంకారతరుశారికాయై నమః ॥

ఆం. వి. ఫలాభిలాషతో వృక్షము నెక్కినవారిని క్రిందపడకుండునట్లు కొమ్మల ద్వారా రక్షించునది గాన, తరువు (తారయతీతి తరుః) అనబడును. హ్రీంకార మనెడి తరువుపై - వృక్షముమీద అధివసించియుండు పింగ (పసుపు పచ్చని) తుండము (ముక్కు), నేత్రములు, పాదములు గల శారిక (పరమేశ్వరి) యభ్యాసాతిశయముచేత మానవభాషలో సయితము మాట్లాడుచుండును. భూత భవిష్యద్వర్తమాన కాలముల యొక్క జీవయాత్రాపరిజ్ఞానము కలదై పరమేశ్వరి సర్వజ్ఞ గాన, జీవులకు శుభాశుభ ఫలములను తన భాషలో పలుకును. ఈ హ్రీంబీజమునకు వాచ్యార్థ స్వరూపిణియై తత్సంబంధము గలదై (వాచ్య వాచక సంబంధము కలదై, అనగా వాగర్థస్వరూపిణియై) పరదేవత వేదవాక్కుద్వారా సర్వమును ప్రకాశింపజేయునని భావము.

శ్లో॥ హ్రీంకారపేటకమణి ర్హ్రీంకారాదర్శ బింబితా ।
హ్రీంకారకోశాసిలతా హ్రీంకారాస్థాననర్తకీ ॥

౭౮౭. హ్రీంకారపేటకమణిః

శం. భా. హ్రీంకారపేటకమణిః। గూహనసాధనతయా హ్రీంకారః దృష్టాంతీక్రియతే। తస్య మణిః వైడూర్య మిత్యర్థః। యథా హీరాదిమణిః పేటకాదౌ గోపితోఽపి స్వకాంత్యా బాహ్యాభ్యంతరం తస్య ప్రకాశయన్ ఇతర పేటకేభ్యః తం వ్యావర్తయతి, తథేదమపి బీజం స్వవాచక

తయా ఇతర వర్ణేభ్యః నిరతిశయమహిమ్నా భేదయతీతి భావః ॥ ఓం హ్రీంకారపేటకమణయే నమః॥

ఆం. వి. గుప్తముగా ఉంచుటకు సాధనమైనదగుట చేత హ్రీంకారము పెట్టెతో పోల్చబడినది. దేవి ఆ మంజూషిక యందలి మణి, అనగా వైడూర్యమణి యని అర్థము. వజ్రవైడూర్యాది మణులు పేటిక మున్నగువానియందు గుప్తముగా దాచి యుంచినను, తమ ప్రభాదీప్తులచేత ఆ పేటికయొక్క లోపలి భాగమును, వెలుపలి భాగమును భాసుర మొనర్చుచు, మణిరహితములైన పేటికలకంటె తమకు నెలవుగా నున్న మంజూషికను భిన్నముగా ప్రకాశింప జేయుచుండును; ఆరీతిగనే, పరమేశ్వరి యసమాన ప్రభాభాసురయై స్వవాచకమైన హ్రీంకారమును నిరతిశయ మహిమోపేత మొనర్చి, మిగిలిన యక్షరముల నుండి వేఱు జేసి ప్రకాశింపజేయుచుండును. హ్రీంకారవాసినియైన మహాసమ్రాజ్ఞి స్వవాచకమైన హ్రీంబీజమును చైతన్యదీప్తము చేసి నిరతిశయ మహిమాతిశయసంపన్న మొనర్చి భక్తులకు ఉపాసనయోగ్యముగా చేయుచున్నదని భావము.

౨౮౮. హ్రీంకారదర్పణబింబితా

శం. భా. హ్రీంకారాదర్శబింబితా। అస్య బీజస్య ఇతర ప్రమాణానపేక్షవేదాంతర్గతయా నిర్దోషత్వా దాదర్శసామ్యమ్ తస్మిన్ బింబితా ప్రతిబింబితా, మాయాప్రతిబింబచైతన్య

స్యైవ జగత్కారణతయా సర్వత్ర దర్పణే ముఖమివ ప్రతి ఫలతీతి తాత్పర్యార్థః ॥ ఓం హ్రీంకారాదర్శప్రతిబింబితాయై **నమః** ॥

ఆం. వి. ఈ హ్రీంబీజము అన్యప్రమాణాపేక్ష లేని వేదములలో అంతర్భూత మగుటవలన, దోషరహితమై నిర్మలమైనదగుటవలన ఆదర్శముతో, అనగా దర్పణముతో పోల్చబడినది, హ్రీంకార మను దర్పణములో (అద్దములో) ప్రతిబింబించుచున్నది గావున, పరమేశ్వరి 'హ్రీంకారాదర్శ ప్రతిబింబితా' యని ధ్యాయమాన యగుచున్నది. దర్పణము నందు ముఖము ప్రతిబింబించినరీతిగా మాయాప్రతిబింబిత చైతన్యమే జగత్కారణముగా సర్వత్ర ప్రతిఫలించుచున్నదని ఫలితార్థము.

## ౭౮౯. హ్రీంకారకోశాసిలతా

శం. భా. హ్రీంకారకోశాసిలతా। హ్రీంకార ఏవ కోశః తస్య అసిలతా దీర్ఘఖడ్గ మిత్యర్థః। సర్వవైర్యాదిజన్య దుఃఖనివర్తకత్వ మసిలతాయా ఇవ పరదేవతాయా అపి తథాత్వేన బహిఃప్రకటనాయోగ్యతాసాదృశ్యేన ఆచ్ఛాద కాపేక్షయా హ్రీంకారస్య వాచకశబ్దతయా అర్థావారక త్వాపత్త్యాత్ అసికోశతుల్యతా। తథాచ హ్రీంకారకోశే విద్యమానా అసిలతేవ దుఃఖనివారకత్వే సతి భక్తాభయకరీతి భావః। సర్వేషా మాయుధవిశేషాణాం అసిపద ముపలక్షణమ్।

'మహద్భయం వజ్ర ముద్యతమ్', 'భీషాఽస్మాద్వాతః పవతే' ఇత్యాది శ్రుతేః ॥ ఓం హ్రీంకారకోశాసిలతాయై నమః ॥

ఆం. వి. హ్రీంకారమే ఖడ్గకోశము (ఖడ్గమున కాశ్రయమైన ఒర), ఆ ఒరయందుండు లతవంటి పొడవైన ఖడ్గము 'హ్రీంకార కోశాసిలతా' యనబడును. సర్వవైరముల వలన కలుగునట్టి దుఃఖమును పోగొట్టుట ఖడ్గలత యొక్క లక్షణము. ఆరీతిగానే, హ్రీంకార కోశాంతర్గతయైన పరమేశ్వరి యందు గూడ భక్తుల సర్వదుఃఖనివర్తకత్వ మనెడి ధర్మమున్నది దేవి, తాదృశ లక్షణోపేతురాలు. అందువలన, బయటకు ప్రకటించుటకు యోగ్యము కాదు. కావున, ఆచ్ఛాదించునట్టి వస్తువు అపేక్షిత మగును. ఆ కారణముచే పరమేశ్వరీవాచక శబ్దముగా అర్థమును ఆచ్ఛాదించునట్టి ధర్మసామ్య మున్నది. గావున, హ్రీంకారమునకు ఖడ్గకోశసాదృశ్యము చెప్పబడినది. కాగా, హ్రీంకారకోశాంతర్వర్తిని యైన పరదేవత ఖడ్గలత వలె దుఃఖనివారిణి యగుచు, భక్తులకభయదాన మొసగుచున్నదని భావము. పరమేశ్వరి ధరించునట్టి సమస్తమైన యాయుధవిశేషములకు అసిపదము - ఖడ్గశబ్దము ఉపలక్షణము. 'మహద్భయం వజ్ర ముద్యతమ్'-పైకెత్తిన వజ్రాయుధము వలె పరమేశ్వరుడు భయస్వరూపము గలవాడు, 'భీషాఽస్మాద్వాతః పవతే'-'ఆపరమేశ్వరుని వలన భయభీతమై వాయువు వీచుచున్నది' మున్నగు శ్రుతుల వలన భూత భౌతిక సృష్టి యంతయు భయముతో భగవచ్ఛాసనము

ననుసరించి కర్తవ్యనిర్వహణము చేయుచున్నదని తెలియును. కావున, 'హ్రీంకారకోశాసిలతా' యను నామము పరమేశ్వరి యందన్వర్థము. కావుననే, భక్తులు పరదేవతా శక్తియొక్క గుణగానము పై నామముతో చేయుచుందురు.

## ౨౯౦. హ్రీంకారాస్థాననర్తకీ

శం. భా. హ్రీంకారాస్థాననర్తకీ। హ్రీంకార ఏవ ఆస్థానం సభామండపః సర్వాశ్రయత్వాత్। తస్య నర్తకీ నటనసంబంధ భూసంయోగ చరణవిన్యాసోపలక్షిత తాలాను సారి హస్తాద్యంగచేష్టా నర్తనమ్, తత్కర్త్రీ నర్తకీ। హ్రీంకారవాచ్యార్థతయా మాయాది సంబంధాసంబంధ నిమిత్తక విచిత్రతరకార్యోత్పాదన వ్యాపారానుకారి వికార్య వికారిస్వరూపవత్తయా ద్రష్టృలోకమనోవృత్తి భేదేన తీవ్ర మంద మందతర ప్రీతిరూప భక్తివిషతయాఽభివ్యక్తానభివ్యక్త ఇష్టఫలసాధనతయా స్వకీయ పుణ్యాదితారతమ్యేన బుద్ధిశుద్ధి భేదాత్ ప్రతిభాతేత్యర్థః ॥ ఓం హ్రీంకారాస్థాననర్తక్యై నమః ॥

ఆం. వి. హ్రీంకారమే ఆస్థానము - సభామండపము, హ్రీంకారస్థానము. ఆ సభామండపము సర్వులకును ఆశ్రయ స్థానము. ఆ సభామండపమునందు నృత్యము చేయునదిగాన, దేవి హ్రీంకారస్థాననర్తకి. నర్తన మనగా, నాట్యమునకు

సంబంధించిన, భూసంయోగము గల పదవిన్యాసము (అడుగులు వేయుట) చేత ఉపలక్షిత మగునట్టియు, తాళానుసారియు నైన హస్తాద్యవయవ సంచాలనము. తాదృశమైన నర్తనము చేయు (స్త్రీ) నర్తకి యనబడును. పరమేశ్వరి హ్రీంకార వాచ్యార్థస్వరూపిణి యగుటచేత, మాయాదులతో సంబంధ ముండుట, లేకపోవుట నిమిత్తముగా గల అతివిచిత్ర కార్యోత్పాదన వ్యాపారమునకు (ప్రపంచసృష్టిరూప వ్యాపారమునకు) అనురూపమైన వికారి, అవికారి స్వరూపము గలది; ఆ కారణము చేత పరదేవత ద్రష్టృలోకము (చూచుజనులు) యొక్క మానసిక వృత్తి భేదము చేత తీవ్ర, మంద, మందతర ప్రీతిరూపమైన భక్తికి విషయ మగుచుండును; అందు వలన జగన్మాత భక్తుల భక్తి తారతమ్యమునుబట్టి అభివ్యక్త అనభివ్యక్త ఇష్టఫలసాధన మగుచుండును; కావున, పుణ్యాదుల తారతమ్యమునుబట్టి, బుద్ధినైర్మల్యభేదమును బట్టి భాసించుచున్నదని భావము.

విశే :- ఈ ప్రపంచము పరమేశ్వరియొక్క నర్తనశాల. నామరూపాత్మకమైన జగద్రూప నర్తనశాలలో నర్తించు నర్తకి యీ పరమేశ్వరి. నర్తకి సంగీతతాళనృత్యలయంగత యయ్యు, శిరసుపై నున్న కుంభపరిరక్షణము నందు చిత్తము లగ్నము చేసి సామాజికులను ఆనందపరవశులను చేయుచుండును. ఆరీతిగనే నటరాజసుందరి యగు పరమేశ్వరి జగన్నాటకశాలలో నర్తించుచు నిస్సంగురాలై,

కేవల సాక్షిభూతురాలై జీవులకు వారి వారి భక్తిశ్రద్ధ ననుసరించి అంతఃకరణనైర్మల్యము ననుసరించి తత్తదుచితములైన అభీష్టఫలముల నొసంగుచుండు నని భావము.

శ్లో॥ హ్రీంకారశుక్తికాముక్తామణి ర్హ్రీంకారబోధితా।
హ్రీంకారమయసౌవర్ణస్తంభవిద్రుమపుత్రికా॥ ౫౭

## ౫౯౧. హ్రీంకారశుక్తికాముక్తామణిః

శం. భా. హ్రీంకారశుక్తికాముక్తామణిః। హ్రీంకార ఏవ శుక్తికా నీలపృష్ఠత్రికోణాత్మకాకారా, తస్యాః ముక్తికేవ ముక్తాఫలమివ అభివ్యజ్యమానా - యథా స్వాతీమహానక్షత్రే సర్వదేశేషు మేఘసంఘాత్ పతజ్జలబిందుః శుక్తికాంతఃపతితః సముద్రదేశవిశేషే ముక్తాఽఽకారేణ పరిణమతే తథా సత్త్వరజస్తమోగుణాత్మక హ్రీంబీజావచ్ఛేదేన మనోహర వాచామగోచర సుందరతర పరదేవతామూర్త్యా సర్వగతమపి చైతన్యం విశిష్య అభివ్యజ్యతే। తథాచ ముక్తికార్థినాం శుక్త్యుపాదానవత్. పరదేవతాసాక్షాత్కారేప్సూనాం హ్రీంకారోపాదాన మావశ్యకమితి భావః॥ ఓం హ్రీంకారశుక్తికాముక్తామణయే నమః॥

ఆం. వి. హ్రీంకారమే శుక్తిక-ముత్యపుచిప్ప, ఆ ముత్యపుచిప్ప యొక్క వెనుక భాగము నల్లగా ముక్కోణము

లతో నుండును. ఆ శుక్తికయందలి ముక్తాఫలము వలె పరమేశ్వరి యభివ్యక్తమై యుండును. స్వాతికార్తెలో అన్ని ప్రదేశములయందు మేఘసమూహము వలన వర్షించిన జలబిందువులు ముత్తెపుచిప్పలో పడి సాగరములో ముత్యము యొక్క యాకారముగా పరిణామ మొందును. ఆరీతిగ చైతన్యము సర్వగతమైనను, సత్త్వరజస్తమోగుణాత్మకము హ్రీంబీజావచ్ఛిన్నము, మనోహరము, వాచామగోచరము, అత్యంతసుందరము నయిన పరమేశ్వరీరూపముతో విశేషముగా అభివ్యక్త మగును. ముత్యములను గోరువారు ముత్తెపు చిప్పను సాధనముగా గ్రహింతురు, శుక్తికాగ్రహణము వలననే ముక్తాఫలములు లభించును; ఆరీతిగ పరదేవతాసాక్షాత్కారము నభిలషించువారికి హ్రీంకారగ్రహణము – హ్రీంకారజపము ఆవశ్యక మని భావము. కావున, పరదేవత 'హ్రీంకారశుక్తికాముక్తామణిః' యనుచు భక్తులచేత అర్చింపబడుచుండును.

విశే:– హ్రీంబీజము నందలి హకార, రేఫ ఈకారములు సత్త్వ రజస్తమోగుణములకు ప్రతీక లనియు, వాని వర్ణములు (రంగులు) శ్వేత, లోహిత, నీలవర్ణము లనియు సంప్రదాయము. కావుననే, హ్రీంకారము శుక్తికతో పోల్చబడినది. ఏలన, శుక్తికాపృష్ఠభాగము మూడు కొనలు

శంకర. 12 – 53]

తెలియుండును. ఆ మూడు కోణములు సత్త్వరజస్తమో గుణములకు ప్రతీకలుగా మహర్షులు దర్శించియున్నారు. శుక్తికయందు గన్పట్టు వర్ణములు గూడ సత్త్వ, రజస్తమో గుణములకు ప్రతీకలై భాసించును. శుక్తిక యందు పడిన జలబిందువు ఘనీభవించి ముత్తెము అయినట్లు సచ్చిదానంద స్వరూపమైన చైతన్యము హ్రీంరూపమైన యుపాధిని పొంది ఘనీభూతమై పరదేవతామూర్తిగ అభివ్యక్తమగును. కావున సచ్చిదానందరూప ముక్తాఫలమును (మోక్షఫలమును) అభిలషించువారలకు హ్రీంబీజోపాసనము అవశ్యము ఉపాదేయ మని భావము.

## ౨౯౨. హ్రీంకారబోధితా

శం. భా. హ్రీంకారబోధితా। సిద్ధే పదార్థే ఇంద్రియాదిసంబంధే సతి స్వత ఏవ జ్ఞానోత్పత్తిదర్శనాత్ స జ్ఞానే విధిరపేక్షితః, క్రియాఫలత్వాభావాత్। తర్హి నిత్యాపరోక్షధర్మాదిజ్ఞానవత్ శుద్ధబ్రహ్మభేదః వేద్యైకదేశ హ్రీంకారేణైవ బోధ్యతే, అజ్ఞాతజ్ఞాపకత్వేన వేదస్య స్వతః-ప్రామాణ్యాభ్యుపగమాత్, పరచైతన్యస్య చ జ్ఞాయమానస్య పరమానందస్వరూపతయా పురుషార్థరూపత్వాత్। అతః హ్రీంకారేణైవ మూలమంత్రాత్మనా బోధితా జ్ఞాపితా। హకారరేఫేకారణాంవ్యస్తత్వదశాయాం భిన్నభిన్నార్థకానాం మేలనే హ్రీంకారాత్మనా పరిణామే సచ్చిదానందస్వరూప

శ్రీ త్రిపురసుందర్యాః తదర్థత్వేన అద్వైతస్వరూపతయా ప్రతిభానాత్ 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా', 'ఇదం సర్వం యదయమాత్మా', 'ఏక ఏవ తు భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః "ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్॥"

ఇత్యాదిశ్రుతేః। 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః', 'తద్విజిజ్ఞాసస్వ', 'ఆత్మానం పశ్యేత్' ఇత్యాది లిఙ్ లోట్ తవ్యప్రత్యయానా మజ్ఞాతార్థకతయా న విధిత్వ మితి సిద్ధాంతః॥ ఓం హ్రీంకార బోధితాయై నమః ॥

ఆం. వి. సిద్ధమై యున్న పదార్థవిషయములో ఇంద్రియాదుల సంనికర్ష వలన స్వయముగానే పదార్థజ్ఞానము కలుగుట యనుభవసిద్ధము. అందువలన, జ్ఞానవిషయమై విధి యపేక్షితము గాదు; ఏలన, జ్ఞానవిషయము క్రియాఫలము గాదు. (కర్మకాండవిషయములో విధిశాస్త్ర మపేక్షిత మగును గాని, జ్ఞానకాండవిషయములో విధిశాస్త్రము ప్రసక్తము కాదని భావము.) ఆ పక్షములో నిత్య, అపరోక్ష ధర్మాది జ్ఞానము వలె శుద్ధబ్రహ్మభేదము వేదైకదేశమైన హ్రీంకారము చేతనే బోధింపబడును. వేదము స్వతఃప్రమాణ మనెడి యభ్యుపగమము వలన వేదము అజ్ఞాతజ్ఞాపకము, అనగా, ప్రత్యక్ష, అనుమానాది ప్రమాణములచేత తెలియబడని యుపాయమును వేదము బోధించునని భావము.

జ్ఞేయమైన పరబ్రహ్మచైతన్యము పరమానందరూప మగుట
చేత అది మోక్షరూప పురుషార్థ మవుమన్నది. కావున,
మూలమంత్రమైన హ్రీంకారముచేతనే పరమేశ్వరీస్వరూపము
జ్ఞాపిత మగుచున్నది. హకార, రేఫ, ఈకారములు వ్యస్త
ములుగా - వేఱువేఱుగా ఉన్నప్పుడు భిన్నార్థకములై
యుండును; భిన్నార్థములు గల యీ వర్ణములు కలసి
హ్రీంకారముగా పరిణామము చెందినపుడు సచ్చిదానంద
స్వరూపిణియైన శ్రీ మహాత్రిపురసుందరి హ్రీంబీజవాచ్యార్థమై
యద్వైతరూపముతో భాసమాన యగును. 'నాన్యోఽతోఽస్తి
ద్రష్టా' - జ్ఞేయమైన యీ బ్రహ్మపదార్థము కంటె ద్రష్ట
యైనవాడు మఱియొకడు లేడు', 'ఇదం సర్వం యదయ
మాత్మా'- దృశ్యమాన మవుచున్న యీ ప్రపంచమంతయు
ఆత్మరూపమే యై యున్నది,' 'భూతాత్మయైన ఒక్క బ్రహ్మ
వస్తువే ప్రతి భూతమునందు (జీవునియందు) వ్యాపించి
యున్నాడు. ఆకాశమునందున్న చంద్రుడు ఒక్కడే యయ్యు
కూప తటాకాదులయందు ప్రతిబింబించినపుడు అనేకములుగా
కన్పడును. ఆరీతిగా, పరమేశ్వరచైతన్యము స్వస్వరూపముతో
ఒక్కటిగను, ఉపాధిభేదమువలన అనేకముగను కన్పట్టును'
అను శ్రుతుల వలన పరమేశ్వరి శుద్ధచైతన్యస్వరూపిణి యని
తెలియవలయును; 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః' - ఆత్మయే
దర్శింపదగినది.' 'తద్విజిజ్ఞాసస్వ'- ఆ యాత్మతత్త్వమును
తెలిసికొనుము', ''ఆత్మానం పశ్యేత్'- ఆత్మను దర్శింప

నగును' - ఇత్యాది శ్రుతుల యందలి విజ్, లోట్, తవ్యప్రత్యయములు అర్హార్థములు గలవగుట వలన విధిబోధకములు గావని యద్వైత సిద్ధాంతము. ఈ ప్రత్యయములు కర్మకాండలో వలె జ్ఞానకాండయందు విధిబోధకములు గావని తాత్పర్యము.

## ౨౬౩. హ్రీంకారమయ సౌవర్ణస్తంభవిద్రుమ పుత్రికా

శం. భా. హ్రీంకారమయ సౌవర్ణస్తంభవిద్రుమ పుత్రికా। పింగలపృథ్వీరేణుః సువర్ణ మిత్యుచ్యతే। అనుచ్ఛిద్యమానద్రవత్వస్య నైమిత్తికత్వేఽపి తైజసాంతరే ప్రదీపప్రభాదావదర్శనాత్ పదార్థాంతరసంయోగే రజతాదివత్ అతితేజఃసంయోగాత్ భస్మభావాపత్తేశ్చ హీరమణౌ లోహాలేఖ్యత్వాభావత్వేఽపి పార్థివత్వవత్ అత్ర పార్థివత్వే బాధాభావాత్ ద్రవ్యత్వస్య ఉదకస్వభావత్వేన తత్కార్యపృథివ్యామపి ఉపలంభోపపత్తేశ్చ। తద్వికారః, సౌవర్ణశ్చాసౌ స్తంభశ్చ। సౌవర్ణస్తంభస్య నవరత్నమండపభారవాహిత్వే సతి తదభిన్నత్వేన తదలంకారభూతత్వస్యేవ సాధర్మ్యస్య హ్రీంకారేఽపి జగదాశ్రయత్వే సతి తత్కారణత్వేసతి తదంతర్భూతత్వే సతి పరమానందజనకత్వస్య సత్త్వేన హ్రీంకారమయ ఇత్యభేదోపచారః ప్రదీపాలంకారద్యోతనార్థ ఇతి జ్ఞాతవ్యమ్। హ్రీంకారే ఉపమేయే మయ

శబ్దేన ఉపమానాభేదకల్పనాత్। తస్మిన్ విచిత్ర పింగ ప్రధాన రూపే తత్సంబంధితయా విద్రుమపుత్రికేవ ప్రతీయమానా విద్రుమమేన ప్రవాళేన కృతా పుత్రికా సాలభంజికా। సౌవర్ణ స్తంభశబ్దః ఉపలక్షణం భిత్త్యాదీనాం, ప్రాయస్త్వదర్శనాత్ తదుపాదానం స్వతః మనోజ్ఞస్య స్తంభస్య అతిశయ దర్శనీయ తాద్యై దుర్లభతర ప్రవాళపుత్రికా స్తంభమంటపం తత్స్థా యిన తద్దేశం చ ప్రకృష్టీకరోతి। తథా శ్రీ పరదేవతాఽపి రూఢ్యా ఏతద్బీజార్థతయా తదవచ్ఛిన్నా సతీ తదాదీన్ సర్వాన్ భూషయతి సఫలీకరోతీత్యర్థః ॥ ఓం హ్రీంకారమయ సౌవర్ణస్తంభవిద్రుమపుత్రికాయై నమః ॥

అం. వి. పచ్చగా ఉన్న భూ పరాగము సువర్ణ మనబడును, అనుచ్ఛిద్యమాన (విచ్ఛేదము లేని) ద్రవత్వము, అనగా తీసివేయని ద్రవలక్షణము. నైమిత్తిక, తైజసపదార్థాం తరమైన దీపకాంతి మున్నగువానియందు కనబడుట లేదు; అందువలన పృథ్వీరేణువు సువర్ణ మని చెప్పబడినది. ముద్దగా నున్న బంగారమునందు అంతర్నిహితమై యున్న ద్రవత్వము నైమిత్తికములైన దీపకాంతులందు గన్పట్టదని భావము. మఱియొక పదార్థముతో సంబంధము కలిగినపుడు రజతము మున్నగువానివలె అత్యంత తేజస్సంబంధము వలన భస్మ మగుచున్నందున, వజ్రమణియందు లోహావిద్ధత్వము లేకపోయినను, పార్థివత్వ ముపపన్న మగుచున్నది. ఆరీతిగ సువర్ణమునకు పార్థివత్వము (భూసంబంధము) చెప్పుటలో

బాధ లేనందున, బంగారము భూ పరాగమని చెప్పబడినది. ద్రవత్వము జలస్వభావ మగుటచే జలకార్యమైన పృథ్వి యందు గూడ ద్రవత్వోపలబ్ధి యుపపన్నము. పార్థివమైన సువర్ణము యొక్క వికారము సౌవర్ణము, సౌవర్ణస్తంభ మనగా బంగారపు స్తంభము, సౌవర్ణ స్తంభము నవరత్న జడిత మండపభారము మోయుచున్నదై, ఆ మంటపము కంటె అభిన్నముగా నవరత్నమంటపమునకు అలంకారముగా ఉండును. సువర్ణవికారమైన యీ స్తంభము వలె హ్రీంకా రము గూడ ప్రపంచమున కాశ్రయమగుచు, ఆ జగత్తుకు కారణ మవుచు ఆ జగత్తులో అంతర్భావము చెంది పరమా నందమును కలిగించుట యను సువర్ణస్తంభ సాధర్మ్యముతో ఒప్పారుచుండును; తాదృశమైన పరమానందజనకత్వము హ్రీంకారమునందు ఉండుట వలన 'హ్రీంకారమయ' మని యభేదముగా ఆరోపించుట ప్రదీపాలంకారద్యోతక మని తెలియవలయును. ఉపమేయమైన హ్రీంకారమునందు 'మయట్' శబ్దము చేత ఉపమానమున కభేదము ఆరోపిత మైనందున ప్రదీపాలంకారము ద్యోతక మగును. ప్రధాన ముగా విచిత్ర పింగళ వర్ణము గల యీ సువర్ణస్తంభము నందు, (హ్రీంకారమయ సౌవర్ణస్తంభమునందు) తత్సంబంధి యగుటచేత పరమేశ్వరి విద్రుమపుత్రిక వలె విరాజిల్లు చుండును. అనగా పగడములతో రచింపబడిన సాలభంజిక వలె భాసమాన యగుచుండును. సౌవర్ణ స్తంభ శబ్దము

గోడలు మొదలైనవాటికి ఉపలక్షణము. తరచుగా కనబడని పగడపు సాలభంజికను గ్రహించుట న్యాయముగా మనోహరమైన స్తంభముయొక్క సౌందర్యాతిశయ ప్రదర్శనార్థ మని తెలియవలయును. అతిదుర్లభమైన ప్రవాళసాలభంజిక తదాశ్రయమైన స్తంభమును, మంటపమును, తత్ప్రభువును, తత్ప్రదేశమును ప్రకృష్టమైనవానినిగా జేయుచుండును; ఆరీతిగా, శ్రీ పరదేవత గూడ హ్రీంకారబీజమునకు రూఢ్యర్థయై, హ్రీంకారావచ్ఛిన్నయై హ్రీంకారాదిబీజముల నన్నిటిని అలంకరించుచుండును; అనగా సఫలము చేయుచుండు నని భావము. కావున, ఉపాసకశ్రేష్ఠులు భక్తినిర్భర హృదయముతో 'హ్రీంకారమయ సౌవర్ణస్తంభ విద్రుమ పుత్రికా' యనుచు శివకామిని యగు శ్రీ మహాత్రిపుర సుందరి యొక్క సౌందర్యాతిశయ సంకీర్తనము చేయుచుందురు.

విశే :- సువర్ణము తేజోద్రవ్యమని తార్కికులందురు. కాని, వేదాంతులు సువర్ణము పార్థివద్రవ్య మని యందురు. సువర్ణము పార్థివద్రవ్యమని చెప్పుటలో గల యుపపత్తిని గ్రహించుటకు పంచీకరణ మిట యనుసంధేయము.

మొట్టమొదట నిత్య శుద్ధ బుద్ధ ముక్త బ్రహ్మమే యున్నది. ఆ పరబ్రహ్మ స్వీయ మాయాసంబంధముచేత అవ్యాకృత మని చెప్పబడు నామరూపాత్మక జగద్బీజ మాయెను. ఆ బీజమునుండి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ

తన్మాత్రలైన ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథ్వు లనెడి సూక్ష్మభూతము లావిర్భవించినవి. పూర్వ పూర్వ భూత గుణములు ఉత్తరోత్తర భూతములయందు సంక్రమించినవి. ఆకాశాది భూతసూక్ష్మములను రెండు భాగములుగా విభజించి, ఒక్కొక్క భాగమును గైకొని మఱల నాలుగు భాగములతో ఒక్కొక్కదానిని ఒక్కొక్క భూతమునందు కలుపవలయును, అట్లు చేయగా, ఆకాశాది భూతములు ఇతర భూతాంశములతో జేరి స్థూల పంచభూతము లేర్పడును. పంచీకృతములైన భూతములు, తత్కార్యభూతమైన ప్రపంచము నామరూపరహితము, శుద్ధచైతన్యస్వరూపము నయిన పరమాత్మ యొక్క విరాడ్రూప మని, స్థూలశరీర మని చెప్పుదురు.

పూర్వ పూర్వ భూతములు ఉత్తరోత్తరభూతములకు కారణములని చెప్పుదురు. కారణగుణములు కార్యమునందు సంక్రమించుట యనుభవసిద్ధము. కావున, పృథ్వీభూతము నందు స్వీయ లక్షణమైన పార్థివలక్షణము సాబాలును, మిగిలిన సాబాలు ఆకాశ, వాయు, అగ్ని, జల లక్షణములు నుండును. కావున, అగ్నిలక్షణమైన రూపము (తేజస్సు), జలలక్షణమైన ద్రవత్వము పార్థివమైన సువర్ణమునందు అను

గతమై యుండును, కేవల తేజోద్రవ్య మని చెప్పినచో, అగ్నితప్తమైన సువర్ణమునందు ద్రవత్వ ముండుట పొసగదు. అదియును గాక, తేజోద్రవ్యములైన దీపాదులయందు ద్రవత్వము కనపట్టుట లేదు. కావున సువర్ణము తేజస్సంబంధి యని చెప్పుట యుక్తిసహము గాదు, అనుభవదూరముగూడ. సువర్ణమునందు పార్థివ లక్షణము సాబాలు ఉండుటవలన భాష్యమునందు 'పింగళపృథ్వీరేణుః సువర్ణమ్' అని చెప్పుట సర్వథా శాస్త్రసమ్మత మని భావనీయము.

శ్లో॥ హ్రీంకారవేదోపనిషద్ హ్రీంకారాధ్వరదక్షిణా ।
హ్రీంకారనందనారామ నవకల్పకవల్లరీ ॥

## ౨౯౪. హ్రీంకారవేదోపనిషత్

శం.భా. హ్రీంకారవేదోపనిషత్। వేద్యంతే జ్ఞాయంతే సర్వే పదార్థా అనేనేతి వేదః జాత్యేకవచనమ్। హ్రీంకార ఏవ వేదః జ్ఞాపకత్వావిశేషాత్; తస్య ఉపనిషత్ వేదాంత భాగః లక్ష్యార్థో వా, తద్బ్రహ్మోపనిషత్పర మితి శ్రుతేః। కర్మోపాసనాజ్ఞానకాండభేదేన చత్వారోఽపి వేదాః త్రిప్రకారాః 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి' ఇతి వాక్యేన జ్ఞానసాధనతయా కర్మోపాసనయోః వినియుక్తత్వాత్,

"అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యా ముపాసతే।
తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం
రతాః ॥"

ఇతి శ్రుత్యా తదుభయోః సంసారఫలకత్వేన నిందితత్వాచ్చ;

"ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః।
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్ ॥"

'ఆత్మకామ ఆప్తకామః' ఇత్యాది శ్రుతిభ్యః అద్వైతజ్ఞానో త్పాదక వేదభాగస్య ఉపనిషచ్ఛబ్దవాచ్యస్య మోక్షఫల కత్వేన ఫలప్రతిపాదనాత్ తదుభయప్రతిపాదక వేదభాగా పేక్షయా శ్రేష్ఠత్వమ్, లోకే సాధనాపేక్షయా ఫలస్య శ్రేష్ఠత్వేన ఉత్తమత్వప్రసిద్ధేః। తథాచ పూర్వకాండద్వయా ర్థస్య జన్యతయా తత్ప్రతిపాదక వేదభాగస్య ఉపనిషచ్ఛేష త్వవత్ హ్రీంకారస్యాపి పరదేవతాప్రకాశకత్వేన తచ్ఛేష త్వాత్ తస్యాః ప్రాధాన్య ముక్త మితి ద్రష్టవ్యమ్ వేదాం తేషు ఉపనిషచ్ఛబ్దః తజ్జన్యతారూప శక్యసంబంధేన ప్రవర్తతే ముఖ్యయా వృత్త్యా బ్రహ్మవిద్యాయా మేవ తదాహి - ఉప శబ్దః సమీపశబ్దార్థకః బ్రహ్మణి అధ్యస్త మాయాసమీపదేశక తత్పూర్ణార్థప్రతిబింబిత మవిద్యోపాధిక చైతన్యం జీవశబ్దవాచ్య ముపశబ్దార్థః లక్షణయా ప్రతిపాద్యతే ని - శబ్దః షద్ ఇతి పదస్య విశేషణమ్ సత్ ఇతి పదం

సదన గత్యవసాదనేషు భవతి। తథాచ ఉపశబ్దవాచ్యో జీవః అవిద్యాం నిహత్య త్యక్త్వా బ్రహ్మశబ్దేన నిషీదతి వర్తత ఇతి ఉపనిషదిత్యేకోఽర్థః। జీవః బ్రహ్మస్వరూపత్వేన నిగచ్ఛతి జానాతీత్యన్యోఽర్థః। జీవః బ్రహ్మస్వరూపేణ అవసీదతి పరిసమాప్నోతీతి తృతీయోఽర్థః। ఏవ ముపనిష చ్ఛబ్దస్య బ్రహ్మవిద్యావాచకత్వేన ప్రసిద్ధస్య తద్వాచక వేదభాగే లక్షణవత్త్వేఽపి ఉపనిషచ్ఛబ్దవాచ్యో భవతి। తథాచ హ్రీంకార ఏవ వేదః, తస్య ఉపనిషత్ప్రధానభూతా బ్రహ్మవిద్యేత్యర్థః॥ ఓం హ్రీంకారవేదోపనిషదే నమః॥

ఆం. వి. సర్వపదార్థములు దేనివలన తెలియబడు చున్నవో, అది వేద మనబడును. 'వేదః' అను పదము జాత్యేకవచనము. వేదము వలె అజ్ఞాతజ్ఞాపకము గాన, హ్రీంకారమే వేదము, వేదరూపమైన ఆ హ్రీంకారము యొక్క వేదాంతభాగముగాని, లక్ష్యార్థముగాని 'హ్రీంకార వేదోపనిషత్' అనబడును. 'తత్ బ్రహ్మోపనిషత్పరమ్' - ఆ బ్రహ్మ ఉపనిషత్పర' మని శ్రుతి చెప్పుచున్నది. నాలుగు వేదములు కర్మ, ఉపాసన, జ్ఞానములను బోధించుచు మూడు విధములుగా ఉండును. 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి'- ఆ యీ బ్రహ్మను వేదానువచనము చేత బ్రహ్మనిష్ఠులైనవారు తెలిసికొనదలచుచున్నారు' అను శ్రుతి వాక్యము చేత కర్మోపాసనలు జ్ఞానసాధనములుగా వినియుక్తములైనవి; 'అంధం తమః ప్రవిశంతి' యనుచు

ఈశావాస్యశ్రుతి 'ఎవరు అవిద్యను అనగా కర్మకాండను, లోకవ్యవహారము నిమిత్తము ఉపాసింతురో, వారు అహంమమాభిమాన రూపమైన (నేను, నాది యనునట్టి యభిమాన రూపమైన) గాఢాంధకారమును ప్రవేశింతురు, ఎవరు వైదిక కర్మానుష్ఠానమును త్యజించి కేవల దేవతోపాసన చేయుచు, బ్రహ్మజ్ఞానము లేనివారైఉందురో, వారలఅహంమమాభిమాన రూపమైన గాఢ తామిస్రమును ప్రవేశించుచున్నారు' అని చెప్పుచున్నందున, కర్మోపాసనలు - విద్య - అవిద్య- రెండును సంసారమే గలవగుటవలన, శ్రుతిచేత నిందింపబడినవి. 'ఆత్మానం చే ద్విజానీయాత్' - పురుషుడు - శరీరమునం దున్నవాడు 'ఈ ఆత్మనేను' అని ఆత్మను చక్కగ తెలిసికొనినచో, ఏమి కోరి, ఎవరి కొఱకు శరీరము ననుసరించి సంతాపము చెందును? 'ఆత్మకామః ఆప్తకామః' ఆత్మకాముడు ఆప్తకాముడు' (నిరంతరము ఆత్మజ్ఞానేచ్ఛ గలవాడు ఆప్తకాముడనబడును. అనగా ఏ కోరికయు లేని పూర్ణకాముడై యుండునని భావము.) అని శ్రుతులు చెప్పుచున్నవి; కావున, అఖండ బ్రహ్మైకత్వరూపమైన అద్వైత జ్ఞానము కలిగించునట్టి ఉపనిషచ్ఛబ్దవాచ్యమైన వేదభాగమునకు మోక్షఫలకముగా ఫలమును ప్రతిపాదించుటవలనను, లోకములో సాధనము కంటె ఫలమునకు శ్రేష్ఠత్వప్రసిద్ధి యున్నందునను, మోక్షసాధనభూతములైన కర్మోపాసనలను ప్రతిపాదించునట్టి వేదభాగము కంటె అద్వైతజ్ఞానబోధకమైన

ఉపనిషద్భాగమునకు శ్రేష్ఠత్వము చెప్పనగును. కాగా, పూర్వకాండలైన కర్మ, ఉపాసనాకాండలు రెండింటియొక్క అర్థము (ఫలము) జన్య మగుటచేత, అనగా కర్మోపాసనా నుష్ఠానము వలన పుట్టున దగుటచేత కర్మోపాసనలను ప్రతిపా దించునట్టి వేదభాగమునకు ఉపనిషత్ శేషమైనరీతిగా హ్రీంకారము గూడ పరదేవతా ప్రకాశకముగా ఆ పరదేవతకు శేషభూత మగుటచేత, ఆ పరదేవతకు ప్రాధాన్య మని తెలియవలయును. వేదాంతముల యందు ఉపనిషచ్ఛబ్దము తజ్జన్యతారూపమైన శక్యసంబంధముతో ప్రవర్తించును. ముఖ్యమైన వృత్తితో బ్రహ్మవిద్యయందే ఆ ఉపనిష చ్ఛబ్దము బ్రహ్మవిద్యారూపమైన యర్థమునందు ప్రవర్తిం చుట యుక్తమే. 'ఉపనిషత్' అను శబ్దము (ఉపసర్గ) సమీపదేశము అనెడి యర్థమును చెప్పును. బ్రహ్మయందు అధ్యస్తమైన మాయాసమీపదేశమునందున్న, 'తత్' ప్రతిబింబితము, అవిద్య ఉపాధిగాగల చైతన్యము, జీవశబ్ద వాచ్యము నైనది 'ఉప' శబ్దార్థముచేత లక్షణయా చెప్ప బడును. 'ని' అను పదము 'షద్' అను పదమునకు విశేష ణము. (ని చాసౌ సచ్చ అని కర్మధారయ సమాసము చెప్పగా, 'నిషత్' అగును.) 'సత్' అను ధాతువు సదన, గతి, అవసాదనరూపములైన యర్థములను చెప్పును. కాగా, ఉపనిషత్ శబ్దమునకు —

1) 'ఉప' శబ్దవాచ్యుడైన జీవుడు అవిద్యను త్యజించి బ్రహ్మస్వరూపుడై యుండునని ఒక యర్థము.

2) జీవుడు బ్రహ్మను స్వస్వరూపముగా తెలిసికొను చున్నాడని మఱియొక యర్థము.

3) జీవుడు బ్రహ్మస్వరూపుడుగా అవసానము నొందు చున్నాడని మూడవ యర్థము.

ఈరీతిగ బ్రహ్మవిద్యావాచ్యముగ ప్రసిద్ధమైన ఉపనిషచ్ఛబ్దము తద్వాచకమైన వేదభాగమునందు లక్షణావృత్తిచే గూడ ఉపనిషచ్ఛబ్దవాచ్య మగును; కాగా, హ్రీంకారమే వేదము, ఉపనిషద్రూపమైన యా హ్రీంకారమునకు పరమేశ్వరి ఉపనిషత్ప్రధానభూతమైన బ్రహ్మవిద్య యని అర్థము. కావున, సచ్చిదానందస్వరూపిణి యగు మహామహేశ్వరి 'హ్రీంకారవేదోపనిషత్' అని భక్తులచే స్తుతింపబడుచున్నది.

## ౨౮౫. హ్రీంకారాధ్వరదక్షిణా

శం. భా. హ్రీంకారాధ్వరదక్షిణా। హ్రీంకార ఏవ అధ్వరః యజ్ఞః తస్య దక్షిణా సమాప్తిసాధనమ్, దక్షిణాయాం దత్తాయాం యజ్ఞసమాప్తిదర్శనాత్। హ్రీంకారస్యాపి జపః యజనాత్మకతయా అధ్వానం రాతి గచ్ఛతీ త్యధ్వరః మార్గసాధక ఇత్యర్థః। దక్షిణాపదం ఫలవాచి ఋత్విగ్

వ్యాపారాణాం దక్షిణాఫలత్వదర్శనాత్। హ్రీంకారాధ్వరస్య హ్రీంకార జపయజ్ఞస్య దక్షిణా ఫలసాధనీభూత పురుషార్థరూపా।

అథవా, హ్రీంకారాధ్వరస్య దక్షిణా పత్నీ 'మఖస్య దక్షిణా పత్నీ' ఇతి వచనాత్, 'జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టః స్యా మితి మే మతిః' ఇతి భగవద్వచనాత్ హ్రీంకారం జ్ఞాత్వార్థ జ్ఞానమేవ హ్రీంకారాధ్వరః హ్రీంకారజ్ఞానయజ్ఞః, 'ప్రధానం దక్షిణా మఖే' ఇతి వచనాత్ దక్షిణావత్ఫలభూతత్వేన ప్రధానభూతేతి వా।

దేవతోద్దేశేన ద్రవ్యత్యాగో యాగ ఇత్యుచ్యతే। త్యక్త ద్రవ్యస్య అగ్నౌ ప్రక్షేపః హోమః। ఋత్విగుద్దేశేన వేద్యా మర్థవిభాగో దక్షిణా। అర్థిభ్యః వేదిబహిర్దేశేఽర్థ విభాగో దానమితి తేషాం భేదః॥ ఓం హ్రీంకారాధ్వర దక్షిణాయై నమః॥

ఆం. వి. హ్రీంకారమే అధ్వరము - యజ్ఞము, ఆ హ్రీంకారాధ్వరమునకు దక్షిణ, అనగా సమాప్తి సాధనము, దక్షిణ యివ్వబడగానే యజ్ఞసమాప్తి కనబడుచున్నది. హ్రీంకారజపము గూడ అధ్వరరూపమైన దగుటచేత మార్గ సాధక మని యర్థము. 'అధ్వానం రాతి గచ్ఛతీతి అధ్వరః'- మార్గమును సూచించునది గాన, అధ్వర మనబడును.

యజ్ఞము మార్గసాధక మని భావము. ఋత్విక్కులు చేయు వ్యాపారములకు దక్షిణయే ఫలముగా కన్పట్టుచున్నందున, దక్షిణాపదము ఫలవాచకమని తెలియవలయును. హ్రీంకార జపయజ్ఞమునకు దక్షిణ, అనగా పరమపురుషార్థమైన మోక్ష రూప ఫలమునకు సాధనభూతురాలు గాన, పరదేవత 'హ్రీంకారాధ్వరదక్షిణా' యని ధ్యాతవ్య యగుచున్నది.

అథవా, హ్రీంకార మను అధ్వరముయొక్క దక్షిణా అనగా, పత్ని గాన, పరదేవత 'హ్రీంకారాధ్వరదక్షిణా' యను నామముతో తేజరిల్లుచుండును. 'మఖస్య దక్షిణా పత్నీ' యను వచనము వలన ఈ విషయము అవగత మగును. 'జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టః స్యా మితి మే మతిః'– జ్ఞానయజ్ఞము చేత నేను సేవింపబడుచున్నా నని నా నిశ్చయము' అను భగవద్వచనము వలన హ్రీంకారలక్ష్యార్థమైన జ్ఞానమే హ్రీంకారాధ్వరమని, జ్ఞానయజ్ఞమని స్పష్ట మగుచున్నది, 'ప్రధానం దక్షిణా మఖే'– యజ్ఞమునందు దక్షిణయే ప్రధాన' మని చెప్పునట్టి వచనము వలన దక్షిణ వలె ఫలభూత మగుటచేత పరమేశ్వరి ప్రధానురాలు గాన, 'హ్రీంకారాధ్వర దక్షిణా' యను నామము పరమేశ్వరి యందు అన్వర్థము. 'దేవతను ఉద్దేశించి చేయు ద్రవ్యత్యాగమే యాగ మని చెప్పబడును. త్యాగము చేసిన ద్రవ్యమును అగ్నియందుంచుట

హోమమనబడును. ఋత్విక్కులను ఉద్దేశించి వేది(యజ్ఞవేదిక) యందు చేయు అర్థవిభాగమే – ధనమును ఆ యా యధికారులకు శాస్త్రవిహితముగా పంచి యిచ్చుటయే దక్షిణ యనబడును. యజ్ఞవేదికకు బహిః ప్రదేశమునందు యాచకులకు ధనమును పంచియిచ్చుటయే దాన మన బడు నని యాగ, హోమ, దక్షిణా, దాన భేదములను గ్రహించవలయును. వీనిలో దక్షిణ, ప్రధానమైనది గాన, శ్రీ పరాభట్టారిక 'హ్రీంకారాధ్వర దక్షిణా' యని ప్రస్తూయమాన యగుచున్నది.'

## ౨౯౩. హ్రీంకార నందనారామ నవకల్పకవల్లరీ

శం. భా. హ్రీంకార నందనారామ నవకల్పకవల్లరీ। నందయ త్యానందయతీతి నందనః స చాసౌ ఆరామశ్చ తథా, దేవేంద్రోద్యానం విచిత్రస్వరూపతయా విజాతీయార్థకత్వాత్। హ్రీంకార ఏవ నందనారామః సుఖకర్తృవిశ్రామభూమిః, తస్య నవా నూతనా అతికోమలేత్యర్థః। కల్పయతీతి కల్పకా, కల్పకా చ సా వల్లరీ చేతి తథా। దేవోద్యానే విద్యమానానాం వృక్షగుల్మలతాతృణాదీనా మేతల్లోకాతిశాయి పుష్పఫలాదిమత్త్వేఽపి న సర్వోత్తమతాప్రసిద్ధిః। కల్పవల్ల్యాస్తు యథాకర్మ యథాసేవ ముపాసకానాం సర్వార్థప్రదానశక్తిమత్త్వేన సర్వోత్కృష్టతా। తథా బ్రహ్మవిష్ణురుద్రాణాం తద్వాసిః ర్వభేదానాం అన్యోన్య సంబంధతయా

ఏకత్రప్రతీయమానత్వేన చిరంజీవిత్వఫలాదిప్రదానేన ఆనంద దాయకతయా సంసారతాపశామకత్వేన చ హ్రీంకారస్య నంద నోపమా। తత్ర సర్వార్థప్రదాతృత్వేన కామేశ్వరాలింగిత కోమలతర సుందరమూర్త్యా విశిష్టపురుషార్థచతుష్టయకల్పనేన సగుణ నిర్గుణోపాసకానాం తద్దేవతాత్మనా ప్రాధాన్యేన సమష్టిరూపతయా సాదృశ్యేన నవకల్పకవల్లరీత్యుచ్యతే ఇతి భావః ॥ ఓం హ్రీంకారనందనారామ నవకల్పకవల్లర్యై నమః

ఆం. వి. ఆనందింపజేయునది గాన, నందనము. నందన మైన ఆరామము నందనారామము; దేవేంద్రోద్యానమైన నందనారామము విచిత్రమైన స్వరూపముతో ఇతర ఉద్యాన ములకంటె విజాతీయముగా - విభిన్నముగా ఉండును. హ్రీంకారమే నందనారామము. ఏలన, ఆ బీజము ఆనంద ప్రదమైన విశ్రాంతిభూమి, అందరి కోరికలను తీర్చునది గాన, కల్పక మనబడును. హ్రీంకారమనెడి నందనోద్యానముయొక్క నూతనమైన, అనగా కోమలమైన కల్పకవల్లరి (కల్పలత) గాన, దేవి 'హ్రీంకారనందనారామ నవకల్పకవల్లరీ' యను నామముతో విరాజిల్లుచుండును. నందనోద్యానమునందలి వృక్ష, గుల్మ, లతా, తృణాదులకు ఈ భూలోకము కంటె అధికమైన పుష్పఫలాదిమత్త్వ మున్నను, సర్వోత్తమత్వ ప్రసిద్ధి లేదు. కల్పవల్లికి భక్తులు చేయు కర్మ ననుసరించి, సేవ - ఉపాసనము ననుసరించి వారికి సర్వార్థముల నొసగు శక్తి యుండుటవలన సర్వోత్కృష్టత్వము చెప్పబడును.

ఆరీతిగ, బ్రహ్మ, విష్ణు, రుద్రవాచకములైన భిన్నాక్షరములు అన్యోన్యసంబాధముతో ఒకచోట, అనగా హ్రీంబీజమునందు ప్రతీయమాన మవుటవలన చిరంజీవిత్వాది ఫలప్రదానము దానియందు ఉండుటచేత, ఆనందప్రదమై సంసారతాపోపశామకము నగుటవలన హ్రీంకారమునకు నందనోద్యానముతో ఉపమానము చెప్పబడినది. ఆ నందనోద్యానము సర్వార్థప్రదము. కామేశ్వరాలింగితమైన శరీరము గల పరమేశ్వరి ధర్మ, అర్థ, కామ, మోక్షరూప చతుర్విధ పురుషార్థముల నొసగునట్టిది. అందువలన, సగుణ, నిర్గుణోపాసన చేయువారికి తద్దేవతాత్మగా ప్రాధాన్య ముండుటచేత, సమష్టిరూపముగా సాదృశ్య ముండుటచేత పరమేశ్వరి నవకల్పకవల్లరీ యని చెప్పబడునని భావము.

శ్లో॥ హ్రీంకారహిమవద్గంగా హ్రీంకారార్ణవకౌస్తుభా ।
హ్రీంకారమంత్రసర్వస్వా హ్రీంకారపరసౌఖ్యదా ॥

## ౨౯౭. హ్రీంకారహిమవద్గంగా

శం. భా. హ్రీంకారహిమవద్గంగా। హిమాని అస్మిన్ సంతీతి హిమవాన్ శీతల పర్వతరాజః హ్రీంకారస్య అమృతాదిసాధకతయా శీతలతా బోధ్యా। తస్మాత్ గంగేవ పావనీ సర్వపురుషార్థప్రదా మంత్రదేవతాత్మనా అభివ్యక్తేత్యర్థః ॥

ఆం. వి. హిమఖండములు దీనియందున్నవి గాన, శీతల పర్వతరాజమైన హిమవత్పర్వత మనబడును. అమృత సాధకముగా హ్రీంకారము శీతలత్వబోధకము. అందువలన పరదేవత పర్వతరాజము నుండి బయల్దేరిన గంగవలె పావనిగా, సర్వపురుషార్థప్రదాయినిగా, మంత్రదేవతాత్మగా అభివ్యక్తమైనది గాన, 'హ్రీంకారహిమవద్గంగా' యని స్తుతింపబడుచున్నది.

## ౨౮౮. హ్రీంకారార్ణవకౌస్తుభా

శం. భా. హ్రీంకారార్ణవ కౌస్తుభా। కౌస్తుభః క్షీరాబ్ధిజన్మసు చతుర్దశరత్నేషు యథా శ్రేష్ఠః సర్వాధిక ప్రకాశాదిగుణతయా, తథా పరదేవతాఽపి అపారమహిమా పరిచ్ఛిన్న హ్రీంకారమంత్రవేద్యత్వేన తన్నిష్పన్నా సతీ 'అత్రాయం పురుషః స్వయంజ్యోతిః' ఇతి శ్రుతేః స్వయం ప్రకాశతయా విద్యోతత ఇత్యర్థః। అత్ర కౌస్తుభహృదయస్య లక్ష్మీపతిత్వ సర్వదేవోత్తమత్వ సకలసుందరతమత్వాగుణా ఇవ విష్ణోః హ్రీంకారార్ణవవిద్యోతమాన హ్రీంకారదేవతో పాసకస్యాపి నారాయణాభేదేన శ్రీకాంతత్వాదిధర్మాః స్వతఏవ సిద్ధ్యంతీతి కౌస్తుభపదేన ధ్వనితమితి ద్రష్టవ్యమ్॥ ఓం హ్రీంకారార్ణవకౌస్తుభాయై నమః॥

ఆం. వి. క్షీరసాగరమునుండి యుద్భవించిన పదు నాలుగు మణులలో కౌస్తుభమణి అన్నిమణుల కంటె అధిక

మైన ప్రకాశాది గుణముల వలన శ్రేష్ఠము; ఆరీతిగా, పర దేవత గూడ, అపార మహిమతో అపరిచ్ఛిన్నమైన హ్రీంకార మంత్రము చేత తెలిసికొనదగినదిగా హ్రీంకారమంత్రనిష్పన్న యగుచు 'ఆత్మాయం పురుషః స్వయంజ్యోతిః'-ఈ తత్త్వములలో ఈ పురుషుడు-పరమేశ్వరుడు స్వయంజ్యోతీరూపుడు' -అను శ్రుతిననుసరించిస్వయంప్రకాశరూపిణియై వెలుగొందుచుండు నని భావము. ఈ కౌస్తుభమణిని హృదయమునందు ధరించిన శ్రీమహావిష్ణువు యొక్క లక్ష్మీపతిత్వము, సర్వదేవతల కంటె ఉత్తమత్వము, సకలసుందరత్వము లనెడి గుణములవలె, హ్రీంకారార్ణవమునందు (హ్రీంకార మనెడి సాగరమునందు ప్రకాశించునట్టి హ్రీంకారదేవతోపాసకునకు గూడ నారాయణాభేదముతో సర్వోత్తమత్వ, సకల సుందరత్వాదిగుణములు సహజముగనే సిద్ధించునని కౌస్తుభ పదము చేత ధ్వనిత మగుచున్నదని ద్రష్టవ్యము. కావున, ఉపాసకులు 'హ్రీంకారార్ణవ కౌస్తుభా' యనుచు పరమేశ్వరి ప్రకాశాతిశయత్వము యొక్క గుణసంకీర్తనము చేయుచుందురు.

## ౨౯౯. హ్రీంకారమంత్రసర్వస్వా

శం. భా. హ్రీంకారమంత్రసర్వస్వా। సర్వాణి చ తాని స్వాని చ ధనాని అణిమాద్యష్టైశ్వర్యజనకత్వాదీని తాని తథా। హ్రీంకారఘటితో హ్రీంకారో వా తేషాం సర్వస్వా

సకల సంపత్ సర్వార్థసాధకశక్తి రిత్యర్థః॥ ఓం హ్రీంకార మంత్రసర్వస్వాయై నమః॥

ఆం. వి. సకలమైన అణిమాద్యష్టైశ్వర్య ప్రదానశ్రుత్వ సంపద గలది 'సర్వస్వా' యనబడును; హ్రీంకారయుక్తమైన మంత్రము గాని, హ్రీంకారముగాని ఆ యణిమాదిసిద్ధులకు సర్వస్వమును, సకలసంపదను, సర్వపురుషార్థములను, సాధించి పెట్టు శక్తి యని భావము. కావున, 'హ్రీంకారమంత్ర సర్వస్వా' యనుచు పరదేవత ధ్యాయమాన యగుచున్నది.

## ౩౦౦. హ్రీంకారపరసౌఖ్యదా

శం. భా. హ్రీంకారపరసౌఖ్యదా। హ్రీంకారపరాః హ్రీంకారమంత్రజపపరాః హ్రీంకారఘటిత శ్రీవిద్యాజపపరా వా తేషాం సౌఖ్యం చతుర్విధ పురుషార్థప్రాప్తిజన్యానందః తత్ దదాతీతి తథా। హ్రీంకారాణాం వ్యష్టిరూపేణ వాచ్యార్థానాం త్రిమూర్తీనాం పరం సౌఖ్యం సామరస్యసుఖః ఏకీభావానందం దదాతీతి వాఽర్థః।

'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా, యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణో త్యన్యద్విజా నాతి తదల్పమ్।''

'నాల్పే సుఖ మస్తి' ఇతి,

"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి"
"యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే అథ సోఽభయం గతో భవతి।"

"విజ్ఞాన మానందం బ్రహ్మ" "రాతిర్దాతుః పరాయణమ్" ఇత్యాది బహుశ్రుతిభ్యః అఖండ సచ్చిదానందబ్రహ్మస్వరూపతయా సైవఫలం భవతి, అన్యజ్ఞానా దన్యఫలప్రాప్తేరయోగాత్।

"బ్రహ్మ వేద బ్రహ్మైవభవతి"
"తరతి శోక మాత్మవిత్"
"యేన మా ముపయాంతి తే
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్"
"బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి"

ఇత్యాది శ్రుతిస్మృతిశతేభ్యః స్వస్వరూపప్రాప్తేరేవ పురుషార్థస్య ప్రదాతృత్వం సిద్ధమ్॥ ఓం హ్రీంకారపరసౌఖ్యదాయై నమః

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యస్య
శ్రీ గోవిందభగవత్పూజ్యపాదశిష్యస్య
శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ
శ్రీలలితాత్రిశతీభాష్యం
సంపూర్ణమ్॥

## ౩౦౦. హ్రీంకారపరసౌఖ్యదా

ఆం. వి. హ్రీంకారపరసౌఖ్యదా। హ్రీంకారపరులనగా హ్రీంకారమంత్రజపపరాయణులని గాని, హ్రీంకారఘటితమైన శ్రీవిద్యాజపపరులని గాని యర్థము. అట్టి శ్రీవిద్యోపాసకులకు సుఖమును, అనగా ధర్మ, అర్థ, కామ మోక్షరూప పురుషార్థప్రాప్తి వలన కలిగెడి యానందము నొసగునది గావున పరదేవత 'హ్రీంకారపరసౌఖ్యదా' యని కీర్తింపబడుచున్నది. వ్యష్టిగా హ్రీంకారవాచ్యార్థములైన త్రిమూర్తులకు - బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు సామరస్యరూపమైన పరసౌఖ్యమును, అనగా ఏకీభావానందమును - అద్వయానందమును అనుగ్రహించున దగుటం జేసియు పరమేశ్వరి 'హ్రీంకారపరసౌఖ్యదా' యనునట్టి అన్వర్థనామముతో విరాజిల్లుచుండును.

'యత్ర నాన్యత్ పశ్యతి' యనుచు 'సాధకుడు ఎక్కడ బ్రహ్మకంటె అన్యమైనదాని చూడడో, అన్యవస్తువును వినడో, అన్యమును తెలిసికొనడో, అది భూమ - సర్వాతిశయమైనది, ఎచట సాధకుడు బ్రహ్మకంటె భిన్నమైనదానిని చూచునో, అన్యమును వినునో, అన్యమును తెలిసికొనునో అది అల్పము' అని శ్రుతి చెప్పుచున్నది.

శంకర. 12 - 56]

'నాల్పే సుఖ మస్తి' - అల్పమైన వస్తువునందు సుఖము - ఆనందము లేదనియు,

'ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన'- బ్రహ్మాభిన్నమైన ఆనందమును తెలిసినవాడు దేనివలనను భయపడ' డనియు,

'యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యే ...'-ఈ జీవుడు నేత్రేంద్రియగోచరము కాని, శరీరము లేని, నిర్వచించుటకు వీలులేని, అన్యాశ్రయ మపేక్షించని, అనగా సర్వాశ్రయ భూతమైన పరమాత్మయందు నిర్భయమైన స్థితిని పొందినపుడు, నిర్భయపదమును అనగా మోక్షపదమును పొందు' ననియు,

'విజ్ఞాన మానందం బ్రహ్మ' - విజ్ఞానము ఆనంద స్వరూపమైన బ్రహ్మ' యనియు, 'బ్రహ్మమే ధనమునకు, దాతకు పరాయణమనియు చెప్పునట్టి అనేక శ్రుతివచనముల వలన, ఒక్క జ్ఞానము వలన తద్భిన్నమైన ఫలప్రాప్తి సంగతము కాదు గావున, అఖండ సచ్చిదానందపరబ్రహ్మ స్వరూపిణిగా పరమేశ్వరియే బ్రహ్మావగతిరూపమైన ఫల మగును.

'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి'- బ్రహ్మవేత్త సాక్షాత్తు బ్రహ్మయే యగును.'

'తరతి శోక మాత్మవిత్' - ఆత్మవేత్త సంసారరూప మైన శోకసాగరమును దాటును,'

'యేన మా ముపయాంతి ...' - జ్ఞానులు ఏ మార్గము ద్వారా నన్ను చేరుచున్నారో ఆ మార్గమును నీకు వివరించి చెప్పెదను, నన్ను సేవించినవారిని మృత్యురూప సంసార సాగరము నుండి సముద్ధరించుచున్నాను,

'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' - ఆత్మజ్ఞానము వలన బ్రహ్మనిష్ఠుడై యున్నవాడే బ్రహ్మాత్మానుభూతి పొందును' మొదలైన వందలాది శ్రుతిస్మృతుల వలన స్వస్వరూపావ స్థానమే పరమ పురుషార్థము యొక్క ఫల మని సిద్ధాంతము.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యులు,
గోవిందభగవత్పూజ్యపాదశిష్యులు నయిన
శ్రీ శంకరభగవత్పాదుల కృతియగు
శ్రీ లలితాత్రిశతీభాష్యమునకు
ఆంధ్రవివరణము సమాప్తము.
ఇతి శమ్.

# ఉత్తరపీఠికా

శ్లో॥ ఇత్యేవం మయాఽఽఖ్యాతం దేవ్యా నామశతత్రయమ్॥
రహస్యాతిరహస్యత్వా ద్గోపనీయం త్వయా మునే॥ ౧

తా॥ ఓ మునిపుంగవా ! పూర్వము చెప్పబడినరీతిగా శ్రీ మహాత్రిపురసుందరి యొక్క నామశతత్రయము నాచే చెప్పబడినది. ఈ త్రిశతీవిద్య రహస్యాతిరహస్యమైనది. కావున, నీవు ఈ సర్వసంపూర్తికరీవిద్యను గోపనీయముగా నుంచవలయునని హయగ్రీవుడు అగస్త్యునితో చెప్పెను.

శ్లో॥ శివవర్ణాని నామాని శ్రీదేవ్యా కథితాని హి।
శక్త్యక్షరాణి నామాని కామేశకథితాని చ॥ ౨

తా॥ ఈ నామశతత్రయములోని శివబీజ సంపుటితములైన నామములు శ్రీకామేశ్వరీదేవి చేత చెప్పబడినవి. శక్తిబీజ సంవలితములైన నామములు శ్రీకామేశ్వర ప్రోక్తములని తెలియుము.

శ్లో॥ ఉభయాక్షరనామాని హ్యుభాభ్యాం కథితాని వై।
తదన్యైర్గ్రథితం స్తోత్ర మేతస్య సదృశం కిము॥ ౩

తా॥ శివశక్త్యాత్మకములైన బీజాక్షరములతో గూడిన నామములు శ్రీ కామేశ్వరీ కామేశ్వరు లిరువురిచేత చెప్ప

బడినది, వారికంటె అన్యులచేత గ్రథితమైన స్తోత్ర మేదియు ఈ త్రిశతీస్తోత్రమునకు సాటి గాదు.

శ్లో॥ నానేన సదృశం స్తోత్రం శ్రీదేవీప్రీతిదాయకమ్ ।
లోకత్రయేఽపి కల్యాణం సంభవే న్నాత్ర సంశయః। ४

తా॥ శ్రీ పరాభట్టారికాప్రీతిదాయకము, కళ్యాణప్రదము నయిన యీ త్రిశతీస్తోత్రమునకు సదృశమైనది ముల్లోకములయందును లభించదనుట నిస్సంశయము.

శ్లో॥ ఇతి హయముఖగీతం స్తోత్రరాజం నిశమ్య
ప్రగలితకలుషోఽభూ చ్చిత్తపర్యాప్తి మేత్య ।
నిజగురు మథ నత్వా కుంభజన్మా తదుక్తం
పున రధికరహస్యం జ్ఞాతు మేవం జగాద ॥ ౫

తా॥ ఈ విధముగ హయగ్రీవుడు శ్రీ లలితాత్రిశతీ స్తోత్రరాజమును గానము చేయగా విని, అగస్త్యమహాముని విగతకల్మషుడై చిత్తమునందు సంతృప్తినొందెను. అనంతరము తన గురువైన హయగ్రీవునకు ప్రణమిల్లి, అగస్త్యుడు ఇంకను అధికముగ రహస్యమును తెలియగోరి యిట్లు పలికెను.

అగస్త్య ఉవాచ -

శ్లో॥ అశ్వానన మహాభాగ రహస్యమపి మే వద ।
శివవర్ణాని కాన్యత్ర శక్తివర్ణాని కాని హి॥ ౬

తా॥ హే హయగ్రీవ! మహాభాగ! ఈ రహస్యమును గూడ నాకు చెప్పుడు. వీనిలో శివవర్ణము లేవి? శక్తివర్ణము లేవి? యని యగస్త్యుడు ప్రశ్నించెను.

శ్లో॥ ఉభయోరపి వర్ణాని కాని వా వద దేశిక ।
ఇతి పృష్టః కుంభజేన హయగ్రీవోఽవదత్పునః ॥ ౭

తా॥ హే దేశికేంద్ర! కామేశ్వరీ కామేశ్వరు లిరువురు చెప్పిన శివశక్త్యాత్మక వర్ణము లెవ్వి? యని యగస్త్యుడు పరిప్రశ్నచేయగా హయగ్రీవుడు మఱల యిట్లు చెప్పెను.

శ్లో॥ తవ గోప్యం కిము స్తీహ సాక్షా దంబానుశాసనాత్ ।
ఇదం త్వతిరహస్యం తే వక్ష్యామి శృణు కుంభజ॥ ౮

తా॥ హే కుంభజ! నీకు దాచదగినది యిందేమి గలదు? సాక్షాత్తు శ్రీ మహాత్రిపురసుందరి యాదేశాను సారము ఈ యతిగోప్యమైన రహస్యమును నీకు చెప్పెదను, వినుము.

శ్లో॥ ఏతద్విజ్ఞానమాత్రేణ శ్రీవిద్యా సిద్ధిదా భవేత్ ।
కత్రయం హద్వయం చైవ శైవో భాగః ప్రకీర్తితః॥ ౯

తా॥ సర్వసంపూర్తికరమైన యీ త్రిశతిని తెలిసినంత మాత్రమున, శ్రీవిద్య సిద్ధిప్రద యగును. పంచదశీమంత్రము

నందలి కత్రయము(మూడు కవర్ణములు),హద్వయము(రెండు హాకారములు) శివకథితములైన భాగములని ప్రకీర్తితములు.

శ్లో॥ శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ఉభయాత్మకః।
ఏవం విభాగ మజ్ఞాత్వా యే విద్యాజపశాలినః॥ ౧౦
న తేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతైరపి।

**తా॥** మిగిలిన వర్ణములు శక్త్యక్షరములు, హ్రీంకారములు శివశక్త్యాత్మకములు. ఈ రీతిగ విభాగమును తెలియక శ్రీవిద్యాజపశీలురైనవారికి కల్పకోటిశతములకైనను శ్రీవిద్య సిద్ధించనేరదు.

శ్లో॥ చతుర్భిః శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః॥ ౧౧
నవచక్రైశ్చ సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః।

తా॥ నాలుగు శివచక్రములు, ఐదు శక్తిచక్రములు ఈ తొమ్మిది చక్రములతో రూపొందిన శ్రీచక్రము శ్రీ కామేశ్వరీ కామేశ్వరుల శరీరమని భావనీయము.

శ్లో॥ త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా॥ ౧౨
చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ చ।

బిందుశ్చాష్టదలం పద్మం షోడశపత్రకమ్॥ ౧౩
చతురశ్రం చ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్।

తా॥ త్రికోణము, అష్టకోణము, రెండు దశకోణములు, చతుర్దశారము - ఈ అయిదును శక్తిచక్రములని తెలియ వలయును. బిందువు, అష్టదళపద్మము, షోడశదళపద్మము, చతురశ్రము - ఈ నాలుగును శివచక్రములని భావించ వలయును.

శ్లో॥ త్రికోణే బైందవం శ్లిష్టం అష్టారేఽష్టదలాంబుజమ్॥ ౧౮

దశారయోః షోడశారం భూగృహం భువనాశ్రకే।
శైవానామపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్॥ ౧౯

అవినాభావసంబంధం యో జానాతి స చక్రవిత్।
త్రికోణరూపిణీ శక్తిః బిందురూపపరః శివః॥ ౨౦

తా॥ త్రికోణమునందు బిందువు సంశ్లిష్టమై యున్న దనియు, అట్లే, అష్టకోణమునందు అష్టదళపద్మము, దశకోణ ద్వయమునందు షోడశారము, భువనాశ్రకమునందు (చతుర్ద శారమునందు) భూగృహము (భూపురము) సంశ్లిష్టములై యున్నవనియు తెలియనగును. శైవచక్రములకు శాక్తచక్ర ములకు పరస్పరము గల యవినాభావసంబంధము తెలిసిన వాడు శ్రీచక్రవిదుడగును. శక్తి, త్రికోణరూపిణి యని శివుడు బిందురూపపరుడని తెలియవలయును.

శ్లో॥ అవినాభావసంబంధం తస్మాద్బిందుత్రికోణయోః ।
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీచక్రం యః
సమర్చయేత్ ॥ ౧౭

న తత్ఫల మవాప్నోతి లలితాంబా న తుష్యతి ।

తా॥ కావున, బిందుత్రికోణములకు అవినాభావ సంబంధము గలదు. శివశక్త్యాత్మక బీజాక్షరవిభాగము నెఱుగక, శ్రీచక్రార్చనము చేయువాడు శ్రీచక్రార్చన ఫలము నొందడు, దానివలన శ్రీలలితాపరాభట్టారిక సంతుష్టురాలు కాదు.

శ్లో॥ యే చ జానంతి లోకేఽస్మిన్ శ్రీవిద్యాచక్రవేదినః॥ ౧౮

సామాన్యవేదిన స్సర్వే విశేషజ్ఞోఽతిదుర్లభః ।
స్వయం విద్యావిశేషజ్ఞో విశేషజ్ఞం సమర్చయేత్ ॥ ౧౯

తా॥ ఈ లోకమునందు శ్రీవిద్యాచక్రవేత్తలైన వారందరు సామాన్యముగ తెలిసినవారే. విశేషజ్ఞుడైన శ్రీవిద్యాచక్రవేత్త యతిదుర్లభుడు. స్వయం శ్రీవిద్యా రహస్యవేత్త యయిన యుపాసకుడు శ్రీచక్రసంకేతము నెఱిగిన విశేషజ్ఞునినే యర్చింపవలయును.

శ్లో॥ తస్మై దేయం తతో గ్రాహ్యా మశక్త స్తస్య
దాపయేత్ ।

అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యాం సముపాసతే॥ ౨౦

శంకర. 12 - 57]

ఇతి శ్రుతి రపాహైతా నవిద్యోపాసకాన్పునః ।
విద్యాన్యోపాసకానేవ నిందం త్యారుణికీ శ్రుతిః॥ ౨౧

తా॥ ఈరీతిగ శ్రీచక్రవిభాగజ్ఞానము గల విశిష్ట వ్యక్తికే ఈ విద్య నుపదేశించవలయును. అట్టి శ్రీవిద్యావేత్త నుండియే శ్రీవిద్యను గైకొనవలయును. శ్రీవిద్యోపదేశము చేయుటకు శక్తి లేకున్న, తాదృశ విశిష్ట వ్యక్తులచే నిప్పించ వలయును. అవిద్య నుపాసించువారు అంధతామిస్రమును ప్రవేశింతురని ఆరుణికశ్రుతి యుద్ఘోషించుచున్నది. ఈ శ్రుతి వచనము అన్యవిద్యోపాసకులనే నిందించుచున్నది గాని, శ్రీవిద్యోపాసకులను గాదని తెలియనగును.

శ్లో॥ అశ్రుతాస శ్శ్రుతాసశ్చ యజ్వానో యేఽప్యయజ్వానః।
స్వర్యంతో నాప్యపేక్షంతే ఇంద్ర మగ్నిం చ
యే విదుః॥ ౨౨

సికతా ఇవ సంయంతి రశ్మిభిః సముదీరితాః।
అస్మాల్లోకా దముష్మాచ్చే త్యాహ చారణ్యకశ్రుతిః॥ ౨౩

తా॥ విద్వాంసులు, అవిద్వాంసులు, యజనము చేసిన యజ్వలు, చేయని అయజ్వలు, ఇంద్రాగ్నులను తెలిసినవారు- వీరందరు స్వర్గమునకు బోవుచు ఈ శ్రీవిద్య నపేక్షించరు. అట్టివారు సూర్యకిరణములచే ప్రేరితములైన యిసుక రేణు వుల వలె ఇహలోకమునుండి పరలోకమునకు, అటనుండి

పూజల యిహలోకమునకు గమన - ఆగమనములు చేయు చుందురని యారుణికశ్రుతి చెప్పినది.

శ్లో॥ యస్య నో పశ్చిమం జన్మ యది వా శంకరః స్వయమ్।
తేనైవ లభ్యతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీ॥ ౨౮

ఎవరు పునర్జన్మరహితుడో, ఎవరు స్వయం శంకర స్వరూపుడో, అతనికే శ్రీమత్పంచదశాక్షరీవిద్య లభించును.

శ్లో॥ ఇతి మంత్రేషు బహుధా విద్యాయా మహిమోచ్యతే।
మోక్షైకహేతువిద్యా తు శ్రీవిద్యా నాత్ర
సంశయః ॥ ౨౯

తా॥ పైన చెప్పినరీతిగా మంత్రములందు అనేక విధములుగా శ్రీవిద్యామహిమ సంకీర్తితమైనది. మోక్షైక హేతువైన విద్య శ్రీవిద్యయే యని చెప్పుటలో సంశయము లేదు.

శ్లో॥ న శిల్పాదిజ్ఞానయుక్తే విద్వచ్ఛబ్దః ప్రయుజ్యతే ।
మోక్షైకహేతువిద్యా సా శ్రీవిద్యైవ న సంశయః॥ ౩౦

తా॥ శిల్పాదిజ్ఞానము కలవానిని విద్వాంసుడని వ్యవహరించరు. ఏలన, శిల్పాదులు మోక్షహేతువులయిన విద్యలు గావు. శ్రీవిద్యమాత్రమే మోక్షైకహేతువైన విద్య యని చెప్పుటలో సందియము లేదు.

శ్లో॥ తస్మాద్విద్యావిదేవాత్ర విద్వాన్విద్వానితీర్యతే।
స్వయంవిద్యావిదే దద్యాత్ ఖ్యాపయే త్తద్గుణాన్సుధీః॥

తా॥ కావున, శ్రీవిద్యారహస్యవేత్తయే విద్వాంసుడని చెప్పబడును. బుద్ధిమంతుడయినవాడు శ్రీవిద్యావేత్తకే యివ్వవలయును. ఆ విద్వాంసుని గుణసంకీర్తనము చేయవలయును.

శ్లో॥ స్వయంవిద్యారహస్యజ్ఞో విద్యామాహాత్మ్యవేద్యపి।
విద్యావిదం నార్చయేచ్చే త్కోఒవా తం
పూజయేజ్జనః॥ ౨౮

తా॥ స్వయముగా శ్రీవిద్యారహస్యజ్ఞుడు, శ్రీవిద్యామాహాత్మ్యము నెఱింగినవాడు గూడ, శ్రీవిద్యావేత్తను పూజింపకున్న, మఱియెవరు ఆ విద్యావేత్తను పూజింతురు?

శ్లో॥ ప్రసంగాదిద ముక్తంతే ప్రకృతం శృణు కుంభజ।
యః కీర్తయే త్సకృద్భక్త్యా దివ్యనామశతత్రయమ్॥ ౨౯

తస్య పుణ్య మహం వక్ష్యే శృణు త్వం కుంభసంభవ।
రహస్యనామసాహస్రపాఠే యత్ఫల మీరితమ్॥ ౩౦

తత్ఫలం కోటిగుణిత మేకనామజపాద్భవేత్।
కామేశ్వరీకామేశాభ్యాం కృతం నామశతత్రయమ్॥ ౩౧

తా॥ హే అగస్త్య! ఇదంతయు ప్రసంగవశమున, చెప్పితిని. ఇక ప్రకృత విషయమును వినుము. శ్రీలలితానామ శతత్రయమును భక్తితో సంకీర్తనము చేసినవాని పుణ్యమెట్టిదో, చెప్పెదను; నీవు వినుము. శ్రీలలితారహస్య నామసహస్రపాఠమునందు చెప్పబడిన ఫలముకంటె కోటి గుణితముగ ఈ సర్వసంపూర్తికరీవిద్యయైన నామశతత్రయము నందలి ఒక్కనామమును పఠించుట వలన ఫలము లభించును. ఈ నామశతత్రయము స్వయముగా శ్రీ కామేశ్వరీ కామేశ్వరులచేత సంకీర్తితమైనది గదా. కావున, దీని మహాత్త్వము అసమానమని భావము.

శ్లో॥ నాన్యేన తులయే దేతత్స్తోత్రేణాన్యకృతేన చ।
శ్రియఃపరంపరా భావి వా చోత్తరోత్తరమ్ ॥ ౩౨

తా॥ అన్యకృతమైన స్తోత్రముతో ఈ త్రిశతీస్తోత్రమును పోల్చుటకు వీలులేదు. ఈ త్రిశతీస్తోత్రసంకీర్తనము వలన భవిష్యత్తులో ఉత్తరోత్తరము అధికమైన శ్రియఃపరంపర లభించును.

తేనైవ లభ్యతే చైత పశ్చాచ్ఛ్రేయః పరీక్షయేత్।
అస్యానామ్నాం త్రిశత్యాస్తు మహిమా కేన
వర్ణ్యతే ॥ ౩౩

తా॥ కావున, ఈ విద్యనే సంపాదించి, అనంతరము లభించునట్టి శ్రేయస్సును పరీక్షింపనగును. ఈ త్రిశతీనామ మహిమ యెవరికిని వర్ణింప నలవిగానిది.

యా స్వయం శివయోర్వక్త్రపద్మాభ్యాం పరినిస్సృతా ।
నిత్యం షోడశసంఖ్యాకాన్ విప్రానాదౌ తు
భోజయేత్ ॥ ౩౪

తా॥ పరమ శివాశివుల ముఖకమలములనుండి సాక్షాత్తుగ వినిస్సృతమైన ఏతన్నామ మహిమ అవర్ణనీయము, అనిర్వచనీయము, మొదట పదునాఱుగురు బ్రాహ్మణులను నిత్యము భుజింపచేయవలయును.

అభ్యక్తాం స్తిలతైలేన స్నాతానుష్ణేన వారిణా ।
అభ్యర్చ్య గంధపుష్పాద్యైః కామేశ్వర్యాదినామభిః॥ ౩౫

తా॥ ఆ బ్రాహ్మణులకు తిలతైలముచే నభ్యంగనము చేసి, వారిని ఉష్ణోదకస్నానము చేయించవలయును. అటు పిమ్మట, గంధపుష్పాదులతోను, కామేశ్వర్యాదినామముల తోను అర్చింపవలయును.

సూపాపూపైః శర్కరాద్యైః పాయసైః ఫలసంయుతైః ।
విద్యావిదో విశేషేణ భోజయేత్ షోడశద్విజాన్ ॥ ౩౬

తా॥ సూపమిశ్రితములైన అపూపములతోను శర్కరా, పాయస, ఫలసమృద్ధమయిన భోజనము శ్రీవిద్యావేత్తయైనవాడు పదునాఱుమంది బ్రాహ్మణులకు నొసంగవలయును.

ఏవం నిత్యార్చనం కుర్యాదాదౌ బ్రాహ్మణభోజనమ్ ।
త్రిశతీనామభిః పశ్చాద్బ్రాహ్మణాన్
క్రమశోఽర్చయేత్ ॥ 32

తా॥ ఈరీతిగ, మొదట నిత్యార్చనము, బ్రాహ్మణ భోజనము చేయనగును. తరువాత, శ్రీలలితాత్రిశతీనామములతో క్రమముగా బ్రాహ్మణుల నర్చింపవలయును.

తైలాభ్యంగాదికం దత్వా విభవే సతి భక్తితః ।
శుక్లప్రతిపదారభ్య పౌర్ణమాస్యవధిక్రమాత్ ॥ 33

దివసే దివసే విప్రా భోజ్యాః వింశతిసంఖ్యయా ।
దశభిః పంచభిర్వాఽపి త్రిభి రేకేన వా దినైః॥ 34

త్రింశత్షష్టిః శతం విప్రాః సంభోజ్యా స్త్రిశతం క్రమాత్ ।
ఏవం యః కురుతే భక్త్యా జన్మమధ్యే సకృన్నరాః॥ 40

తా॥ వైభవము కొలది, భక్తితో తైలాభ్యంగనము చేయించి, శుక్లపాడ్యమి నుండి పూర్ణిమ వఱకు క్రమముగా ప్రతిదినము ఇరువదిమంది బ్రాహ్మణులకు చక్కగా భోజనము పెట్టవలయును. పది దినములకుగాని, ఐదు దినములకుగాని, మూడు రోజులకు గాని, ఒక్క దినమున గాని, ముప్పది మంది, అరువదిమంది, నూరుగురు, మూడువందలమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును. ఈవిధముగ జన్మ మధ్యలో ఒక్కమారైనను భక్తితో బ్రాహ్మణులకు భోజనము పెట్టవలయును.

తస్యైవ సఫలం జన్మ ముక్తి స్తస్య కరే స్థితా।
రహస్యనామసాహస్రభోజనేఽప్యేవ మేవ హి॥ ४౧

తా॥ పైన చెప్పిన విధముగా విప్రులకు భోజనము నొసగువాని జన్మయే సఫలమైన జన్మ యనియు, మోక్షము వానికి హస్తగతమగు ననియు తెలియవలయును. లలితా రహస్యనామసహస్రవిషయమున గూడ ఇదేవిధముగ చేయ నగును.

ఆదౌ నిత్యబలిం కుర్యాత్ పశ్చాద్బ్రాహ్మణ
భోజనమ్।
రహస్యనామసహస్రమహిమా యో మయోదితః॥ ४౨

సశీకరాణు రత్నైకనామ్నో మహిమవారిధేః।
వాగ్దేవీరచితే నామసహస్రే యద్యదీరితమ్ ॥ ४౩

తా॥ లలితారహస్యనామసహస్రవిషయమున మొదట నిత్యబలి, అటుపిమ్మట విప్రభోజనము ఆచరణీయము. ఇంతకు ముందు రహస్యనామసాహస్రమహిమ నేను చెప్పి యుంటిని. వాగ్దేవతలచే చెప్పబడిన రహస్యనామసహస్ర మహిమ, యీ త్రిశతీనామ మహిమాంబుధిలో గల జలశీకరము నందలి యణువువంటిదని తెలియుము.

తత్ఫలం కోటిగుణితం నామ్నోఽప్యేకస్య కీర్తనాత్।
ఏతదన్యైర్జపైః స్తోత్రై రర్చనై ర్యత్ఫలం భవేత్॥४४

తత్ఫలం కోటిగుణితం భవే న్నామశతత్రయాత్ ।
వాగ్దేవీరచితే స్తోత్రే తాదృశో మహిమా యది॥ ౪౫

సాక్షాత్కామేశకామేశీకృతేఽస్మి న్గృహ్యతామితి ।
సకృత్సంకీర్తనాదేవ నామ్నా మస్మిం శతత్రయే॥ ౪౬

భవేచ్చిత్తస్య పర్యాప్తి ర్న్యూన మన్యానపేక్షిణీ ।
న జ్ఞాతవ్య మితోఽప్యన్య న్న జప్తవ్యం చ

కుంభజ ॥ ౪౭

తా॥ నామసాహస్రపారాయణము కంటె త్రిశతి యందలి యొక్క నామసంకీర్తనము చేయుట వలన కోటి గుణితముగ ఫలము లభించును. లలితాత్రిశతీనామములకంటె భిన్నమైన జపములు, స్తోత్రములు, అర్చనముల వలన లభించు ఫలము కంటె త్రిశతీనామపారాయణము వలన కోటి గుణితముగ ఫలసిద్ధి కలుగును. వాగ్దేవీరచితమైన లలితా సహస్రనామముల కంతటి ఫలముండగా, సాక్షాత్తు కామేశ్వరీ కామేశ్వరముఖవినిస్సృతమైన త్రిశతీనామ మహిమను ఎంత యని వర్ణించగలము! ఈ త్రిశతీనామ పారాయణము ఒక్కమారు చేసిన, నిరపేక్షమైన చిత్త సంతృప్తి కలుగునని నిశ్చయము. ఓ అగస్త్యమహామునీ ఈ త్రిశతి కంటె తెలిసికొనదగినది గాని, జపింపదగినదిగాని మఱేదియు లేదనుట నిస్సంశయము.

యద్యత్సాధ్యతమం కార్యం తత్తదర్థమిదం జపేత్।
తత్తత్ఫలమవాప్నోతి పశ్చాత్కార్యం
పరీక్షయేత్ ॥ ౪౯

తా॥ ఏదైన కార్యమును సాధింపదలచినవారు తత్సిద్ధికై యీ త్రిశతిని జపించినచో, ఆ కార్యము సిద్ధించును. అటుపిమ్మట నా కార్యము సఫలమైనదా, లేదా యని పరీక్షింపనగును.

యే యే ప్రయోగా స్తంత్రేషు తైస్తై ర త్ర్యాధ్యతే
ఫలమ్।
తత్సర్వం సిధ్యతి క్షిప్రం నామత్రిశతకీర్తనాత్॥ ౫౦

తా॥ తంత్రశాస్త్రములందు పేర్కొనబడిన ప్రయోగము లన్నియు త్రిశతీ నామపారాయణము వలన వెంటనే ఫలప్రదములై సిద్ధించును.

ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్।
విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వప్రదాయకమ్॥ ౫౧

సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్।
సర్వాభీష్టదం చైవ దేవ్యా నామశతత్రయమ్॥ ౫౨

తా॥ ఈ లలితా త్రిశతి ఆయుష్కరము, పుష్టిదాయకము, పుత్రప్రదము, సర్వవశ్యకరము, విద్యాప్రదము కీర్తి

దాయకము, సుకవిత్వప్రదము, సర్వసంపత్కరము, సమస్త భోగదాయకము, సర్వసౌఖ్యప్రదము, సర్వాభీష్టదాయకమునై యొప్పారునట్టిది.

ఏతజ్జపపరో భూయా న్నాన్యదిచ్ఛేత్ కదాచన ।
ఏతత్కీర్తనసంతుష్టా శ్రీదేవీలలితాంబికా ॥ ౨౨

భక్తస్య యద్యదిష్టం స్యాత్ తత్ పూరయతే ధ్రువమ్।
తస్మాత్ కుంభోద్భవమునే కీర్తయ త్వమిదం సదా॥ ౨౩

తా॥ కావున, శ్రీవిద్యోపాసకుడు లలితాత్రిశతీనామ జపపరాయణుడై యుండవలయును. ఎన్నడును ఏతద్భిన్నమైన దానిని కోరజనదు. త్రిశతీనామసంతుష్టురాలైన శ్రీలలితా పరాభట్టారిక తన భక్తుని అభీష్టమును సఫలమొనర్చును. కావున, హే అగస్త్యమహామునే! నీవు సదా లలితాత్రిశతీ నామసంకీర్తనము చేయుచుండుము.

నాపరం కించిదపి తే బోద్ధవ్య మవశిష్యతే ।
ఇతి తే కథితం స్తోత్రం లలితాప్రీతిదాయకమ్ ॥ ౨౪

తా॥ ఓ అగస్త్యా! నీ కింక చెప్పవలసిన దేదియు లేదు. శ్రీ లలితాదేవికి ప్రీతిదాయకమైన స్తోత్రమును చెప్పితిని.

నావిద్యావేదినే బ్రూయా న్నాభక్తాయ కదాచన ।
న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్ ॥ ౨౫

తా॥ శ్రీవిద్యావేత్త కానివానికి, భక్తిశూన్యుడ
శఠునకు, దుష్టునకు, విశ్వాసము లేనివానికి ఈ స
సంపూర్తికకీవిద్యను ఎన్నడు చెప్పరాదు.

యో బ్రూయాత్త్రిశతీం నామ్నాం తస్యానర్థో
మహాన్ భవే
ఇత్యాజ్ఞా శాంకరీ ప్రోక్తా తస్మాద్గోప్య మిదం
త్వయా ॥

తా॥ పైన పేర్కొననివారికి త్రిశతిని చెప్పిన, గొ
అనర్థము వాటిల్లునని శాంకరి యాజ్ఞ. కావున, ఈ త్రిశతి
గోప్యముగ నుంచుము.

లలితాప్రేరితేనైవ మయోక్తం స్తోత్ర ముత్తమమ్।
రహస్యనామసాహస్రాదపి గోప్య మిదం మునే॥ ౫౩

తా॥ శ్రీలలితాపరాభట్టారిక ప్రేరణము వలన
నేను నీకు ఈ త్రిశతీనామస్తోత్రము చెప్పితిని. హేమునే!
త్రిశతి శ్రీలలితాసహస్రనామస్తోత్రము కంటె ఎక్కు
గోప్యముగా నుంచదగినది.

ఏవ ముక్త్వా హయగ్రీవః కుంభజం తాపసోత్తమమ్।
స్తోత్రేణానేన లలితాం స్తుత్వా త్రిపురసుందరీమ్।
ఆనందలహరీమగ్నమానసః సమవర్తత ॥ ౫౪

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే ఉత్తరఖండే
హయగ్రీవాగస్త్యసంవాదే
లలితాత్రిశతీస్తోత్రం సంపూర్ణమ్॥

తా॥ ఈ విధముగా హయగ్రీవుడు తాపసోత్తముడైన అగస్త్యమహామునికి చెప్పి యీ త్రిశతీనామస్తోత్రముతో మహాత్రిపురసుందరి యగు శ్రీలలితాదేవిని స్తుతించి బ్రహ్మానందసాగర మగ్నమానసుడై యుండెను.

బ్రహ్మాండపురాణాంతర్గతమగు నుత్తరఖండమందలి
హయగ్రీవాగస్త్య సంవాదరూపమైన
లలితాత్రిశతీస్తోత్రము సంపూర్ణము.
"సా హి శ్రీ రమృతా సతామ్"



# ఈకారాదినామానుక్రమణికా

## శంకర గ్రంథ రత్నావళి

1. ప్రథమ సంపుటము 40 ప్రకరణ గ్రంథములు — రు. 7-00
   అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వామి
2. ద్వితీయ సంపుటము : 5 ప్రకరణ గ్రంథములు. — రు. 8-00
   అనువాదకులు : శతావధానులు : శ్రీ వేలూరి శివరామశాస్త్రి.
3. తృతీయ సంపుటము : 5 ప్రకరణ గ్రంథములు — రు. 20-00
   అనువాదకులు : శ్రీహరి సాంబశివశాస్త్రి, యం. ఏ.
4. చతుర్థ సంపుటము : సర్వవేదాంత సిద్ధాంతసార (అచ్చులో)
   సంగ్రహము. 1,000 శ్లోకములు
   అనువాదకులు : శ్రీ సర్వా శివరామకృష్ణశాస్త్రి
5. పంచమ సంపుటము : సౌందర్యలహరి (అచ్చులో)
   ఆనందలహరి వివరణ 100 యంత్రములతో
   అనువాదకులు : శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మ
6. షష్ఠ సంపుటము : వివేకచూడామణి — రు. 15-00
   అనువాదకులు : శ్రీ వేమూరి సీతారామశాస్త్రి
7. సప్తమసంపుటము : విష్ణుసహస్రనామ స్తోత్రము, భాష్యముతో — రు. 20-00
   అనువాదకులు : బాలవ్యాస : శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి
8. అష్టమ సంపుటము : శంకరుల స్తోత్రములు 31 — రు. 8-00
   అనువాదకులు : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి
9. నవమ సంపుటము : శంకరుల స్తోత్రములు 30 — రు. 12-00
   అనువాదకులు : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి
10. దశమ సంపుటము . శివానందలహరి, కనకదుర్గానందలహరి
    అనువాదకులు : డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి — రు. 8-00
11. ఏకాదశ సంపుటము : శంకరుల స్తోత్రములు-8 — రు. 12-00
    అనువాదకులు : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి

---

**సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201**